శ్రీ

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy)**


| | | |
|---|---|---|
| సంపుటము. ౨౨ | శ్రీముఖనామసంవత్సరము.<br>చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧. |








కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1933.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౨. | శ్రీముఖనామసంవత్సరము చైత్రవైశాఖమాసములు. | సంచిక ౧. |
| --- | --- | --- |

# రాజమహేంద్రవరమున జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్సభాహ్వాన సంఘాధ్యక్షుని యుపన్యాసము.

ఆహ్వానసంఘాధ్యక్షులు.

శ్రీ రాజా కాంద్రేగుల శ్రీనివాసజగన్నాథరావు బహదరుగారు.

---

1. శ్రీముఖవత్సర పరిషత్సభాసమావేశ మీపురవరంబున జరుగు మహాభాగ్యము లభించుటచే నేతత్పౌరుల మెల్లరముఁ గడుంగడు ధన్యులము. ఈపురభాగ్య మెట్టిదియో కాని, రాజరాజనరేంద్రాది మహారాజ పరిపాలితంబై, నన్నయాది సత్కవీంద్రుల కునికిపట్టై, ఖండఖండాంతరముల నెల్ల సుప్రసిద్ధంబై వన్నెకెక్కి మహావైభవమున నలరారు మహాసౌభాగ్యమును జిరకాలమునుండియుఁ గాంచుచునేయున్నది. నేఁటికిని ప్రాచీనాంధ్రరాజుల నామావళిచే నలరారెడి యదృష్టము ననుభవించుచున్నయది. ఓపురరాజమా! హృద్యానవద్య గద్య పద్య రచనా శేముషీమంతులును, నిగమాగమ పురాణేతిహాసవిదులును, పట్టభద్రాది బిరుదాంకితులు నైన హూణవిద్యా గరిష్ఠుల నిచ్చటి కీతఱి నాహ్వానించి వారిసందర్శనంబున నేత్రంబుల కపూర్వపర్వం

బొనరించి వారి వాగమృతధారల మాకుఁ గర్ణరసాయనంబుఁ గావింపనెంచితివా? మమ్ముల నెల్ల నానందరసాబ్ధి నోలలాడింప నుద్యమించితివా! ఇదియంతయు నీ పురవాసుల ప్రాక్తనజన్మఫలంబుగాక మఱి యేమున్నది?

2. గౌతమీవాహిన్యమృతధౌళితాఖిలాఘులై, రాజరాజనరేంద్రపాలనావిధాన సంతుష్టాంతరంగులై, ప్రాగల్భ్యనన్నయకవీంద్ర కవితాకుమారికా వచనామృతపానమత్తచిత్తులై, యిహలోకంబుననే స్వర్గలోకసుఖంబుల ననుభవించు మహాసౌభాగ్య మీ పౌరులు మున్నొకతఱి నందియుండిరి. నాఁటి యుచ్చస్థితిఁ దలఁచుకొనిన నేఁటికిని మేన గగుర్పాటు జనించు. మహాప్రాభవంబున విలసిల్లిన యీపురీమతల్లిపైఁగల నిర్వ్యాజప్రేమ మెయి మీ రంద ఱీ శ్రీముఖవత్సరంబున నీపరిషత్సమావేశ మీయెడ జరిపింప నెంచినందులకు కృతజ్ఞతాపూర్వక వందనశతంబుల నర్పించుచున్నాఁడను. ఓ విద్వద్రాజ శిఖామణులారా! వాని నెల్ల సాదరాహ్లాద చిత్తముల నందికొన మిమ్మెంతయుఁ బ్రార్థించుచున్నాఁడను.

3. ఇట్టి మండువేసవిని యడుగుఁ దీసి యడుగిడఁ గాళ్లు బొబ్బలెక్కు తీక్ష్ణాతపంబునకుఁ గొంకక ప్రయాణవ్యయప్రయాసభారంబుల కోర్చి యేతెంచు మిమ్మును, మీ ముఖకమలములను గాంచుకొలఁదిని మీ దృఢ నిశ్చయము, మీ పరిషత్కార్యదీక్షా పరతంత్రతయుఁ దేటతెల్లంబుగఁ దెలియుచునే యున్నవి. బాపురే! భవన్ముఖేందు బింబనిర్గతస్వచ్ఛవిద్యాతేజం బీ సభాస్థలి నెట్లు ప్రకాశింపఁ జేయుచున్నదో! ఇట్టి మహాపురుషు లొక్కచోఁ గూడినఁ జేయరాని కర్జంబు లెందైన నుండునే? తలంచిన మాత్రంబున సంకల్పంబులు ఫలసిద్ధిం బొందకుండునే?

4. మహాశయులార! నన్నయ కవీంద్రుని కన్నియయై, రాజరాజనరేంద్రాది మహారాజుల మన్ననలకు గుఱియై, పెఱబాసవెలందులకుఁ గన్నుగుట్టై నానాసుకావ్యాలంకారశోభితయై విలసిల్లిన యాంధ్రవాణి యీనడుమ నయోమయాలంకారముల ధరింపవలసివచ్చునాయని భీతిజనించె. అకటా! దుర్దినము లింతకు మించికలవే? "మహిమున్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు తన్మహనీయస్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్, మహామహులై సోముఁడు, భాస్కరుండు వెలయింపన్" సొంపు దీపించునని కవీంద్రులచేఁ బొగడ్తలఁగనిన యీ బహుళాంధ్రోక్తిమయప్రపంచకము కాలవశమున

నో, దైవ వశముననో పారావారోత్తుంగభంగనిమగ్న మై రూపుమాయు దినములు కూడ వచ్చునేమోయని భీతి జనించినది.

5 మహాశయులారా! సోమకాసుర హస్తగతములై కుయ్యిడు వేదముల నుద్ధరించిన పరమకరుణామయమూర్తి—గాక్తేయు, కాపాలికాది పాషండకల్పిత విపరీతార్థంబు లడంప నాదిశంకరుఁ బుత్తెంచిన ప్రేమైకస్వరూపుండు—సర్వహృదంతరాళముల విలసిల్లు చిన్మయుండు—ఆనఘుఁడు నాయాంధ్రవాణి యనుభవింపఁబోయిన దుర్దశాసూచనలం బాప సమకట్టి మీయట్టి భాషాభిమానుల సృజించి యెల్లర నిట సమకూర్చి తొల్లింటి యౌన్నత్య మాపెకుఁ బ్రసాదింపఁగదాయని నాడెంద మానందరసాబ్ధి నోలలాడుచున్నయది. "పరిత్రాణాయసాధూనాం । వినాశాయచ దుష్కృతామ్॥"అను గీతావచనము భగవానుఁ డేల మఱచును ?

6. అట్టితఱి యీయాంధ్రపరిషత్తుదయించుటచే మీవంటి భాషాభిమానులు, దృఢ కార్యదీక్షాపరతంత్రులు నగు మహానుభావుల ప్రజ్ఞావిశేషంబులచే నాగండము గడచినది. త్రిలిఙ్గ భాషామతల్లిని యిట్టి యిక్కట్టులఁ బడనీయక, దీనానను గానీయక, బిట్టు గుందనీయక యామె వదనమున మగుడ నవనవోన్మేషదరహాసచంద్రికల వెల్లివిరియింప స్థిరబుద్ధి సృద్ధకంకణులై కార్యరంగమునకు ముందంజ వేయు మీవంటి సత్పురుషులను, సూరిశిఖామణులను మాతృభాషాసేవాపరతంత్రుల నెట్లభివందింపవలయునో, యెట్టు లాహ్వానింపవలయునో, యెట్టి యాతిథ్యంబుల నాదరింపవలయునో, యించుకయు నెఱుంగకున్నాఁడ. మీకు స్వాగతమొసంగనిలిచియుఁ బలుకుల కందక పరువు లెత్తు తలంపుల యలజడి వారించుకొనఁ జాలక యింతదనుకఁ దత్ప్రసక్తిం జనని నానేరము క్షమింపుఁడు.

7. సభాసదులార! మఱియొక చిన్న మనవి.

నేఁటి యాంధ్రలోకమున నాంధ్రవాణి కొక యపూర్వతేజము చేకూరినది. స్త్రీ సమాజమందును బెక్కురు కవయిత్రీమతల్లు లుద్భవించి, త్రిలింగ వాగ్దేవిపాదారవిందముల వివిధకావ్య కుసుమముల నలంకరించుచుండిరి. వీరి కింకను దగు నూఁత నొసంగి, యిట్టి సాహిత్య పరిషత్సభలకు వారలం గూడ నాహ్వానింపుచు, భావ్యాంధ్రభారతీసేవ యిబ్బడిగ జరుగుటకై యాంధ్రకాంతామణులఁ బ్రోత్సహింప నీసభవారు మున్ముందు నింతకంటె నెక్కుడుగఁ

బూనుదురని నాకోరిక. మఱియుఁ గేవలము భావప్రధానముగఁ గవనమల్లుచు ననేక యువకులిపుడు తెలుఁగు తల్లికిఁ గ్రొంగ్రొత్తపోకడలు చూపుచున్నారు. భాష యేదైనను భావమే ప్రధానము కనుక వీరి యభిప్రాయములకు భిన్నము గాకుండునటులును, వీరు నిరుత్సాహవంతులయి తమ కార్యమునుండి విరమింపకుండుటకునై, యీసభవారిని నఖిలాంధ్రప్రపంచమును, భావకవులకుఁ గూడ నిందు తగు స్థానమొసంగి ప్రోత్సహింపఁగోరుచున్నాను. ఇట్లుభయ పక్షము లొకటిగాఁ గూడినచో నాంధ్రవాణికి నితోధికముగ సేవ యొనరించి నవారము గాఁగలము! "తృణైర్గుణత్వమాపన్నై ర్బధ్యంతే మత్తదంతినః"అను ప్రాజ్ఞలోకపునుడి యెంతయు మనకిప్పు డనుసరణీయము.

8 సభ్యులార! ప్రాచీనకవీంద్ర కల్పితంబులగు నుద్గ్రంథంబులు కాలగర్భమునఁ బడి జీర్ణింప నక్కటికమునఁ బెక్కుఁజిక్కులకు లోనయ్యు వానిని సంపాదించి వెలువరించుచుఁ, దన్మూలకంబుగ నాంధ్రభారతి నలంకరించుచుండిన మీప్రజ్ఞావిశేషములు శ్లాఘాపాత్రములు! ఇట్లు భాషకును, దేశమునకును, బ్రాచీనకవీంద్రులకు నమూల్యంబగు నలంకారముల నందఁజేయు భవాదృశమహనీయుల కాపరమేశ్వరుఁ డాయురారోగ్యభాగ్యముల నొసంగఁ బ్రార్థింపుచు విరమించుచున్నాను.

విద్వద్రాజ శిఖామణులార! స్వాగతము!!
ఆంధ్రసాహిత్యపరిషత్సభ్యులార! స్వాగతము!!
ఆంధ్ర వాఙ్మయోద్ధరణదీక్షాకంకణబద్ధహస్తులార! స్వాగతము!!

---

# 21, 22 వ ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభ.

రాజమహేంద్రవరము.

అధ్యక్షులగు వడ్డాది సుబ్బరాయఁడుగారి ప్రారంభోపన్యాసము.

---

శా. ఆరంభంబుల కెల్ల జీవము మహాత్మా! నీవ కావే? భవ
త్కారుణ్యామృతవృష్టి నొందు ఫలముల్ గార్యంబు; లేనిపయిన్
భారంబంతయు వైచి పౌరుషము యావచ్ఛక్తిఁ గావింతుఁ బ్రా
పై రక్షింపవె సత్ప్రియత్నములు; దేవా! భక్తచింతామణీ!

మహాశయులారా!

ఆంధ్రసాహిత్యపరిషత్తుయొక్క యీవార్షికోత్సవమున నగ్రాసనాధిపత్యము వహించి కార్యక్రమ మంతయు నడుపు మని నన్ను మీరు నియోగించినందుకు మీ కందఱకు నేను మిక్కిలి కృతజ్ఞుఁడను. అఱువదివత్సరముల కంటె నధికకాలమునుండి నే నాంధ్రవాఙ్మయప్రపంచమున నించుకసేవ చేయుచుండుటచేతను, మీలోఁ బెక్కురకంటె వయోవృద్ధుఁడ నగుటచేతను, నన్ను మన్నించునుద్దేశముతో మీ రీగొప్పపదవి నాకు దయచేసియుందురు. కాని, గంభీరముగాఁ బ్రసంగముఁ జేయుటకు నాటంకముగాఁ గంఠమునకును, వ్రాయుటకుఁ బ్రతిబంధకముగా హస్తమునకును వణఁకు ప్రాప్తించినది. పరిచితులను బోల్పలేనంత నేత్రావరోధముఁగూడ సంభవించినది. నడకకు వీలు లేకుండఁ బాదములు తేలిపోవుచున్నవి. ఇట్టి దుస్థితికి నా యేఁడుసంవత్సరములకు మునుపే నేను లోనయినాఁడను. వినుఁడు:—

"మ. గళమాధుర్యము హస్తకౌశలముతోఁ గంపంబునం జాఱెఁ; బే
రలలం దూఁగెడు నావతేవ నొడ లూఁగాడం గడంగెన్ నడన్;
బాలయున్ గొంతెడఁగాఁ, గనుల్ పరిచితుం బోల్పంగ లేకుండె; వీ
నుల కింకన్ జరగాలి సోఁక దటు; రెండుండెబ్బదయ్యెన్ సమల్."

భక్తచింతామణియు, నాపదుద్ధారకుఁడు, నార్తరక్షామణియు నగు పరమేశ్వరుని నిర్హేతుకజాయమానకటాక్షముచేత నేను దినములు పుచ్చుచున్నాఁడనే గాని యుపన్యాసము వ్రాయుటకుఁ, జదువుటకు, విద్వచ్ఛిఖామణులచే నలంకరింపఁబడిన యిట్టిమహాసభ నడుపుటకు సామర్థ్యము గలవాఁడను గాను.

అందుచేత నాప్రసంగము లోటుపాటులతోఁగూడి మీ కాశాభంగము గలి గింపవచ్చును. కాన మీరు నాయందుఁ గరుణించి నాకుఁ దోడుపడి సభ జయప్రదముగా జరుపవలయు నని వేఁడుకొనుచున్నాను.

ఈసభ మును పొకసారి యీపట్టణమున 1913 సం॥రమున జరిగెను. ఆసభకు గీర్తిశేషులైన శ్రీరాజా పానుగంటి రామారాయనింగా రధ్యక్షత వహించి దానిని మిక్కిలి జయప్రదముగా జరిపిరి. ఈసమావేశము రాజమ హేంద్రవరమున జరుగుటకిది రెండవపర్యాయము. రాజమహేంద్రవరముపేరు విన్నచో మతాసక్తియు నాంధ్రసారస్వతానురక్తియుఁ గల ప్రతిమనుష్యునిహృద యము సంతోషమున నుప్పొంగక మానదు. ఏలయనఁ బితృవాక్యపాలనదీ క్షితుఁ డయిన రఘువరేణ్యుఁడు రామచంద్రుఁ డేమహానదీతీరమునఁ బర్ణశాల నిర్మించుకొని తనయారణ్యవాసదీక్షను నిర్విఘ్నముగాఁ గొనసాగించెనో, కళ త్రవియోగ మైనకాలమునఁ జల్లని యేయేటినీరములలో స్నానముఁ జేసి తన విరహసంతాపము గొంతవఱకు కుపశమింపఁ జేసికొనెనో, పరమపతివ్రతాతిల కమైన సీతామహాదేవి స్నానపానములచేత నేనదీజలము పవిత్ర మయ్యెనో, యట్టి పావనగోదావరీనది యీపట్టణమునకుఁ బశ్చిమభాగంబునఁ బ్రవహిం చియేగదా లక్షలకొలఁది తైర్థికులఁ బవిత్రులఁ జేయుచున్నది. ప్రథమాంధ్ర మహాకవియనియు, వాగనుశాసనుఁ డనియు సుప్రసిద్ధబిరుదములు వహించిన నన్నయభట్టారకుని కవితారసము, తద్గాతమీప్రవాహసదృశ మై, యనర్గళ మై, సర్వరసజ్ఞాస్వాద్యమై, మనోరంజకమై వెలసినది యీనగరమందే గదా ? అనేకసువర్ణాలంకారములతో, మృదుసుందరపదవిన్యాసములతో, బహుళార్థ కల్పనాచమత్కృతులతో, నిరుపమానరమణీయభావములతో, మధురతరధ్వ నులతో, ముదిమి నెఱుఁగక నేఁటికిని పరాఙ్గసౌష్ఠవము గలిగి విరాజిల్లు చున్న శ్రీనాథమహాకవికవితాకన్యక యీనగరవీథులయందేగదా మనోహర గానము గావించినది ? చాళుక్యసామ్రాజ్యలక్ష్మికిఁ బట్టుఁగొమ్మయై, రెడ్డిరాజుల మహావైభవమునకు నిలయమై వేఁగీవిషయమునకు నాయకమణియై యీపట్ట ణమేగదా చిరకీర్తి గడించినది ? చాళుక్యవంశాలంకారుఁడు, నాంధ్రమహా భారతకృతిపతి, నన్నయభట్టనారాయణభట్టప్రముఖుల కాశ్రయుఁడు, శూర శిఖామణి, రాజశేఖరుఁడు నయినరాజరాజున కీనగరమేగదా రాజధాని యై నది ? చీఁకటియుఁ, గళింగయు, సింహాచలముఁ, జిల్లాసముద్రము మున్నగు

దుంరస్థానములవఱకుఁ దమరాజ్యమును వ్యాపింపఁజేసి, జయస్తంభములు నిలిపి, శ్రీనాథాదిమహాకవుల కాశ్రయులై, 'జగనొబ్బగండ' బిరుదుగల బెండపూఁడి యన్నయమంత్రి మొదలగు నమాత్యప్రముఖుల కేలికలై, స్మరణీయులయిన వీరభద్రేశ వేమపృథ్వీపాలురకు నీపురమే గదా యునికిపట్టయినది? శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధాది కావ్యములను, రాజశేఖరచరిత్రము మున్నగు గద్యకావ్యములను, నాంధ్రసరస్వతి కపూర్వాలంకారమైన యాంధ్రకవులచరిత్రము మున్నగు శతాధిక గ్రంథములను రచియించి మేటికీర్తి గాంచిన నామిత్రులు కందుకూరి వీరేశలింగకవిగారికిని, భాషాత్రయవేత్తయై యుత్తరరామచరిత్రము, మృచ్ఛకటికము మొదలయిన మహానాటకముల నాంధ్రీకరించి ప్రఖ్యాతిగాంచి యానాఁటి రాజమహేంద్రవరకవిత్రయములో నొకరైన వావిలాల వాసుదేవశాస్త్రిగారికిని నివాసస్థానమైన దీపట్టణమే గదా? ఇంతటి యీనగరప్రాశస్త్యము నామనమున దృఢముగ నాటుకొనుటచేతనే కాకినాడపురమును మొట్టమొదట సందర్శించినప్పుడును, బదపడి రాజరాజనరేంద్ర పట్టాభిషేకస్మారకమహోత్సవము బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారి షష్టిపూర్తిమహము నిట జరిగినసందర్భములను నే నీపట్టణమహిమను గూర్చి యీ క్రిందిపద్యములు మూఁడును రచించి మదీయచాటుప్రబంధమునఁ జేర్చుట గలిగినది. వీనియం దతిశయోక్తి లేశమును లేదు. మూఁడవపద్యము పునర్ముద్రణమునఁ గానఁబడును.

గీ. ఈడునకుఁ జిన్నదై కాకినాడనగరి, యెమ్మెలనుమీఱు రాజమహేంద్రపురిని
పడుచుబోగముచానకుఁబనలుమెండు, ముసలిముత్తైదువకునింతపసుపుబొందు.

మ. కురువంశాంకుర మేముహూర్తమున శంకుస్థాపనం జేసెనో
పురముం గట్టను రాజమహేంద్రుఁడు, మహేమూర్తంబునం గావ్యముల్
విరచింపం గవినన్నభట్టు పసుపుంబిల్లారిఁ బూజించెనో,
సిరియున్ వాణి, వసింత్రు నేఁడుఁజెలిమిన్ శ్రీరాజమహేంద్రంబునన్. 2

శా. శ్రీమన్నన్నయ రాజమహేంద్రమున వేసెన్ బంచమామ్నాయస
న్నామంపుం గృతిమొల్క తెల్గునకు నేనాఁ, డాయె వేయేండ్లు; గో
దామాహాత్మ్యమొ, భూమిసారమొ, యటన్ దద్వృత్తమూలాన, నె
ట్వేమిన్ లేకయె, ప్రస్ఫురద్రసములై యిప్డున్ ఫలించుం గృతుల్.

అత్తకోడండ్రయిన లక్ష్మీసరస్వతులు పరస్పరకలహంబులు లేక యీపురమునఁ గలసి మెలసి యున్న తెలుంగున నాంధ్రదేశమున మఱియొకతావున

నెక్కడ లేరనుట నిర్వివాదాంశము. పూర్వోక్తము లయినకారణములచేతఁ బరిషద్వార్షికసభ మరల నీవత్సర మిచ్చటికి వచ్చుట, యాంధ్రభాషాయోషా మణి పుట్టినింటిసొబగు తాను మఱియొకమాఱు చూడఁగోరి యని నేను భావించెదను.

సర్వవిధముల మనము సంతోషింపవలసిన యీమహోత్సవ సమయమున నతివిషాదకరమయినయొకవిషయము మీ స్మరణమునకుఁ దేవలసివచ్చినందులకై నేను మిక్కిలి చింతించుచున్నాను. అభినవకృష్ణరాయఁ డనియు, నధునాతనాంధ్రభోజరా జనియు నన్వర్థబిరుదములు దాల్చిన శ్రీ పిఠాపుర మహారాజుగారికి శ్రీ రాజా వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారికి ధర్మపత్నీవియోగరూపమున గొప్పకష్టము సంభవించిన దని మీరందఱు వినియుందురు. ఈకష్ట మారాజకుటుంబమునకే గాక యాంధ్రదేశమున కంతకు—నొక్క యాంధ్రదేశమున కనేల—దక్షిణహిందూస్థానమున కంతకు సంభవించిన కష్టమని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. 'ఇచ్చెనాయేనుఁగుపాఁడి' యని విజయవిలాసములోఁ జెప్పినట్లు శ్రీ సూర్యారాయమహారాజుగారు చేతి కెముక యే లేదన్నట్టు లెన్నోధర్మసంస్థలకు లక్షలకొలఁది విరాళము లిచ్చి పోషించిరి. 1915 సం॥రమున బళ్ళారిలో జరిగిన పరిషత్సభకు నేను రచియించి యంపినపద్యములలోని యీక్రిందిసీసమువలన వారియౌదార్యాదులు వ్యక్త పడఁగలవు,

సీ. గ్రామ్యసంపర్కదౌర్భాగ్య మాంధ్రమునకు, బడలఁ జేకుఱనిష్టపడనిసుమతి
రాజమహేంద్రమున విభ్రాజితసౌధంబు, గట్టించి, బడి కిచ్చినట్టిదాత
కాకినాడను బీఠికాపురంబునఁ దనకాలేజి హైస్కూలు గలవలంతి
యనదబిడ్డలకు విద్యాబుద్ధు లబ్బఁగా, శరణాలయం బిడ్డ సదయహృదయుఁ,
డాంధ్రసాహిత్యపరిషదధ్యక్షుఁ, డాంధ్రకోశరచనాదికప్రేరకుండు, రావు
వేంకటకుమారమహిపసూర్యాంకుఁ డెట్లు, కృష్ణరాయప్రశంసస్ఫురింపకుండు?
(వసురాయచాటుప్రబంధము.)

ఈ యాంధ్రసాహిత్యపరిషత్తు ప్రారంభించిన నిఘంటువునకు లక్షరూప్యములు విరాళ మిచ్చిన మహాదాత యు, ననేక కవుల ను విద్వాంసుల ను వేతనములిచ్చి నిల్పి గ్రంథముల రచింపఁజేసి, వాఙ్మయసేవాపరుఁడైన పండిత పక్షపాతియు, నాంధ్రసాహిత్యపరిషత్తునకుఁ బోషకుఁడునైన ఘనుఁ డీమహా

రాజేగదా ! ఇట్టి ప్రభువునకు నిటువంటి గొప్పకష్టము సంభవించుట మిక్కిలి శోచనీయమని వేఱుగాఁ జెప్పనేల ? దుఃఖమహాసముద్రమున మునిఁగియున్న యామహారాజుగారికిని, వారి కుమారులకును, కుటుంబమునకును, నీసాహిత్య పరిషత్పక్షమునను, మీయందఱపక్షమునను దుఃఖోపశమనార్థమై సానుభూతి వెల్లడించుచున్నాఁడను. ఈదుఃఖసాగరమును దరించుటకుఁ బరమదయాళుఁ డగుపరమేశ్వరుఁడు తగిన మనోధైర్యమును శ్రీవారికిని, వారిపుత్రీపుత్రవర్గ మునకును బ్రసాదించుఁగాక ! పరమసాధ్వీశిరోరత్నమైన యాదేవియాత్మకు సర్వేశ్వరుఁడు శాంతి ననుగ్రహించుఁగాక !

ఆంధ్రసాహిత్యపరిషత్తులో సభ్యులుగా నుండి దీనిమీఁద నత్యంతాభిమానము గలిగి, నిరుటివార్షికసభ బరంపురములో జరుపనిశ్చయించి, యచ్చటికీపరిషత్తు నాహ్వానించిన బ్ర॥ శ్రీ నేమాని నరసింహశాస్త్రులవారాకస్మికముగాఁ బాఠశాలలోఁ బాఠముఁ జెప్పుచు స్వర్గస్థులైరని మీకు విన్నవింప వలసి వచ్చినందులకుఁ జాల విచారించుచుఁ బరిషత్పక్షమున వారికుటుంబమునకు మనసానుభూతి దెలియఁజేయుచున్నాను.

పరిషద్విషయమున నే నీసందర్భమున నొకమనవి చేయఁదలఁచుచున్నాఁడను. వంగమహారాష్ట్రాదిదేశములలో స్వస్వదేశభాషాభివృద్ధి నిమిత్తము పరిషత్తులు బైలుదేఱి, తత్తద్వాఙ్మయములను బెంపొందించుచున్న కాలమున, 2,20,00,000 లు జనులుగల యాంధ్రదేశమున, సారస్వతసేవార్థము నెలకొల్పఁబడిన ప్రతిష్ఠాపన మొక్కటియుండ లేకపోవుటకు విషాదమునొంది చెన్నపురిలోఁ బ్రెసిడెన్సీ మేజస్ట్రేటుగా నుండి, యెన్నో పనితొందరలు గలిగియు నందులోనే తీఱికఁజేసికొని "యాంధ్రసాహిత్యపరిషత్తు" స్థాపించి, యనేక మహారాజులను దానికిఁ బోషకులుగా నేర్పఱిచి, స్వార్థపరత్వ మొంతమాత్రములేక తమకాలమును దమపలుకుబడిని బరిషత్తునిమిత్తమే యుపయోగించుచుఁ బరిషద్వృద్ధియే ప్రధానకార్యముగా నవలంబించి, వృద్ధులయ్యు శ్వాసకాసములవల్ల బాధపడుచుండియు వానిని సరకుగొనక సంవత్సరమున కొక్కొక్కతావున నాంధ్రదేశమునందలి యన్నిమండలములలోను సభలు జరుపుచు, నాయాసభల కరిగి జయప్రదముగా వానిని సాగించుచు దేశసేవయు వాఙ్మయసేవయుఁ దన్మూలమున నాంధ్రమహాజనసేవయు నిరంతరాయముగఁ జేయుచున్న దేశాభిమానికి శ్రీజయంతి రామయ్యపంతులుగారికి మనయాంధ్రసాహిత్యపరి

షత్తు మనఃపూర్వకముగాఁ గృతజ్ఞత గనఁబఱుపవలసియున్నది. ఉపకారవేతనము వందలకొలఁది రూప్యములు నెలనెలకు నందుకొనుచు, నేవిధమైన లోకసేవయు లేక కుటుంబపోషణమాత్రముఁ జేసికొనుచు హాయిగాఁ గాలక్షేపముసేయుచుండు వారివలెఁగాక, శ్రీరామయ్యపంతులుగారు పైరీతిగా మాతృదేశసేవఁ జేయుచున్నందుకు మన మందఱము వారి కభివందనశతంబులు సమర్పింపవలయును.

ఇఁక మీఁద నన్నయతిక్కనాది ప్రాచీనమహాకవులకును, నాధునిక విద్వత్కవులకును నమస్కరించి, యీయాంధ్రపరిషత్తువలన మనకు, మనదేశమునకుఁ గలుగులాభముల నించుక యుగ్గడించుచున్నాఁడ.

(1) పరిశుద్ధమై సులక్షణమై విచక్షణగ్రాహ్యమై యలరారుభాష గ్రంథములయం దుండవలె ననునదే యీపరిషత్తుయొక్క యుత్తమసంకల్పముగుటఁ గడుంగడు శ్లాఘనీయము. కాలానుసారముగా జనసామాన్యమున కుపయోగించుగ్రంథము లన్నియుఁ బైనియమములం బాటించి సాధ్యమైనంతసులభశైలిని రచియించుట యీనాఁటిరచయితలంద ఱాదర్శముగా నిలుపుకొనుట మంచిది. లాక్షణికమైనభాషాప్రయోగములకై పరిషత్తు ప్రయత్నము చేయుచుండుట ప్రశంసనీయము. ఈప్రయత్నము సముచిత మని తలంచియేగదా పాఠశాలలలో లక్షణవిరుద్ధమైనభాషనుపయోగింపఁగూడ దని యధికారులు శాసించిరి!

(2) తంజాపురము, చెన్నపురము మొదలగునగరములలోను దెనుఁగుదేశమునందలి బహుగ్రామములలోను గలపురాతనకవిరచితగ్రంథములు చెదపురుగులపాలఁబడి నశింపకుండఁ, జివికి చినిగి నిష్ప్రయోజనములు గాకుండ, వానిం దెప్పించి నిజభాండాగారమున నిలిపి యాంధ్రసారస్వతమున పరిషత్తు చేయుచున్న మహోపకార మింతింత యని చెప్పఁగలది గాదు. కొన్నివేలగ్రంథములు పరిషద్గ్రంథాలయమున సేకరింపఁబడియున్న వని విని మిక్కిలి సంతసించుచున్నాను. ఈపరిషత్తు లేకపోయినయెడల నెన్నోయమూల్యగ్రంథములు క్రిమిదష్టములై నామరూపములు లేక నాశనమొందియుండునుగదా. అట్టికష్టమును దొలగించుటచే నాంధ్రవాఙ్మయమున కీపరిషత్తు మహోపకారక మని తలంపవలయును.

(3) ఈపరిషత్తు పత్త్రిక నొకదానిని బ్రకటించుచుండుటగూడ మహోత్కృష్టకార్యము. కేవలభాషావిషయములు, సారస్వతవిషయములుఁ బ్రత్యేక

ముగా లాక్షణికభాషలోఁ బ్రకటించుపత్రిక యాంధ్రదేశమున నిప్పుడు లేదు ఆగొప్ప వెలితి యీపత్రికవలనఁ దీఱినదనుట నిస్సంశయము. ఇందుఁ బ్రకటింపఁబడువిమర్శనములు, వాఙ్మయసంబంధమైనవ్యాసములు నమూల్యము లని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఈపత్రిక ప్రతిమాసము ప్రకటింపఁబడక రెండేసి నెలలకొకసారి ప్రకటింపఁబడుట శోచనీయము దీనికి ధనాభావమే కారణ మని తోఁచుచున్నది. వాఙ్మయాభిమానముగల యుదారధనికులు తగినప్రోత్సాహ మొసఁగి మాతృభాషాసేవఁజేయఁ గంకణముగట్టుకొన్న యీపత్రికాలలామమును బ్రతిమాసము స్ఫురద్రూపముతో వెడలి యాంధ్రులకెల్ల హృదయానందము గలిగించునట్లు చేయుదురుగాక !

(4) ఆంధ్రభాషయందలి తత్సమ తద్భవ దేశ్యశబ్దములకన్నింటికిని సరియైనయర్థములఁ దెలుపుసంపూర్ణనిఘంటువు మనభాషలో నింతవఱకు లేదు. ప్రప్రథమమున బ్రౌణ్యనిఘంటు దీనివెలితిఁ గొంత దీర్చినది. వైదేశికులయ్యు బ్రౌనుదొరగారు మనభాషయం దత్యంతాభిమానము గలవారై తాళపత్రలిఖితములయిన యనేక మహాగ్రంథములకు వ్యాఖ్యానములు వ్రాయించి వానిని ముద్రింపించుటయేగాక యాంధ్రాంగ్లేయనిఘంటువు, నాంగ్లేయాంధ్రనిఘంటువు నను రెండుగ్రంథములు బహుపండితసాహాయ్యమున రచియించి మనకుఁ జేసినమేలును మన మెన్నటికిని మఱవఁజాలము. అటుతరువాత మహాపండితులయిన పరవస్తు చిన్నయసూరిగా రాంధ్రభాషాభిలాషుల కత్యంతోపయుక్తమైన బాలవ్యాకరణమును, నీతిచంద్రికను రచియించి యాంధ్రశబ్దములకు నుత్కృష్టనిఘంటువు నొకదానిని గూడ నిర్మింపఁబూని యది పూర్తిగాక మునుపే యాంధ్రులభాగ్యహీనతచేఁ బరమపదించిరి. పిమ్మట బ్రహ్మశ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు సూరిగారిపూనికను గొనసాగింపఁ దలఁచి సారస్వతసముద్రమును దరిచి చిరకాలపరిశ్రమముఁజేసి తమపరిశ్రమమునకు ఫలితముగ శబ్దరత్నాకర మను నొకనిఘంటువును రచియించి యాంధ్రలోకము [illegible]కృతజ్ఞతకుఁ బాత్రులై కీర్తిశేషులైరి. భాషాభిమానులగు మనదొరతనమువా రాగ్రంథమును బ్రకటించి మనకు మహోపకారముఁ జేసిరి. బ్రౌణ్యనిఘంటువునందును, శబ్దరత్నాకరమునందును లేనిపదము లనేకము లింకను గానవచ్చుచున్నవి. పూర్వోక్తనిఘంటుకర్తలకు లభింపని యనేకప్రాచీనగ్రంథములు నేఁటికాలమునఁ బరిషత్తునకు లభించుచుండుటచే సంపూర్ణనిఘంటు

నిప్పుడు లిఖించుట కవకాశము గలుగుచున్నది. తదవకాశమును బురస్కరించుకొని శ్రీజయంతి రామయ్యపంతులుగారు సంపూర్ణనిఘంటు నిర్మాణము పరిషత్తుయొక్క ప్రథమకర్తవ్యముగాఁ బరిగణించి, దానికి వలయు ప్రయత్నములఁ జేయఁగా శ్రీ శ్రీ శ్రీ పిఠాపురమహారాజుగారు నిఘంటురచనమునకు, ముద్రణమునకు లక్షరూప్యముల విరాళము వాగ్దానముఁ జేసిరి. రమారమి యిరువది సంవత్సరములనుండి నిఘంటురచనము జరుగుచునేయున్నది. కాని, యాంధ్రమహాజనులకనులపండువుగా నింతవఱకొక సంపుటమైనఁ బ్రకటింపఁబడకపోవుట శోచనీయము. అయిన నింతమాత్రముచేత మనము నిరుత్సాహపడఁగూడదు. మహాకార్యములు కొనసాగుటకుఁ జిరకాలము పట్టునన్న మాట మనము జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలెను. ఆరంభమున వాడుకొనఁదగిన సర్వతత్సమపదములును, వైకృతములకుఁ బ్రకృతిరూపములును. శక్యమైనంతవఱకు దేశ్యపదములకుత్పత్త్యర్థములు, సావిభక్తికములకు ద్వితీయాదివిభక్తులయం దెస్తానికైన నుభయవచనములకు సాధుప్రయోగములును, దగునుత్తమనిఘంటువునఁ గాననయ్యెడునని నేను దలంచుచున్నాను. నిఘంటుకార్యస్థానము పిఠాపురమునకు మార్పఁబడినది మొదలుకొని నిర్విఘ్నమయ్యై యంతరాయము లేనికృషి జరుగుచున్నది. మహాపండితులు పలువురు వారియావచ్ఛక్తి వినియోగించి సత్వరముగ దానిని ముగింపఁ బ్రయత్నించుచున్నారు. రామయ్యపంతులుగారును దమచిరమనోరథము కార్యరూపముగాఁ బరిణమించి యాంధ్రలోకమున కానందముగలిగించు సమయ మెప్పుడు వచ్చునాయని యువ్విళ్ళూరుచున్నారు. ప్రథమసంపుటము విజయవాడలో ముద్రిత మగుచున్న దని విని యెంతయు సంతసించుచున్నాఁడను. పరిషత్తు చేయుచున్న కార్యము లన్నిటిలో నిఘంటునిర్మాణము మహోన్నతమైనది. ఆంధ్రసరస్వతి కీనిఘంటువు నవరత్నఖచితమైన కిరీటమని చెప్పవచ్చును. ఇట్టి రత్నఖచితసువర్ణమకుటము నాంధ్రసరస్వతికి సమర్పించుచున్న శ్రీపిఠాపురమహారాజుగారు మనయందలి కృతజ్ఞతకుఁ బాత్రు లని మఱి యొకసారి యిచ్చటఁ బ్రశంసించుట యప్రస్తుతము గాదని మనవిచేయుచున్నాను.

(5) పరిషత్తువలనఁ గలుగుచున్నలాభములలోఁ గట్టకడపటిదియుఁ, గడపటిదయ్యు ముఖ్యమైనదియు నగునది మఱియొకటి గలదు. అదియే దన ? ఆంధ్రదేశముయొక్క నానాభాగములనుండి సారస్వతసేవాపరతంత్రులగుమహానీయు లనేకులు ప్రతిసంవత్సరమొక్కచోఁ జేరి పరస్పరదర్శనసంభాషణసౌఖ్య

ననుభవించుచు మహోపన్యాసములు చేసి, వ్యాసములు వ్రాసి చదివి విని యానందముతో రెండు దినములు గడపుటయె. ఇట్టి సమ్మేళనములవలనఁ గలుగులాభము లెక్కించి కాని, తూఁచి కాని, కొలిచి కాని యింతని చెప్పుటకు శక్యముగాదు. ఆంధ్రవాఙ్మయవిషయమున, నవ్వాన దేశమునఁ గలిగిన సంచలనమును, జనులకుఁ గలిగిన వాఙ్మయసేవాసక్తియుఁ దలంచినపక్షమునఁ దత్ప్రయోజన మింత యని మన మూహించుకొనవచ్చును. నేఁటికాలమున సలక్షణాంధ్రగ్రంథపఠనమునందుఁ బురుషులకు, స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు మునుపటికన్న నెన్నిమడుంగులో యుత్సాహము హెచ్చినది. ఇది యంతయు మన పరిషత్తు చేసిన మహోపకారమె. పూర్వోదాహృతములైన ప్రయోజనములే గాక యీపరిషత్తువలన నింకననేకప్రయోజనములు గలవు. వానినెల్ల నేనిచ్చట నుగ్గడింపఁజాలను అనుభవైకవేద్యములగుటచే వానిని మీరే తెలిసికొనవచ్చును.

ఇంక మనపరిషత్తు చేయవలసినకార్యములంగూర్చి యించుక ముచ్చటింప ననుజ్ఞ వేఁడెద ఎటువంటిమహాపురుషులు సభ్యులుగానుండి, యెటువంటిపరిషత్తుల నడుపుచున్నను లక్షలకొలంది మూలధనముండిననం గాని యాపరిషత్తులు నెఱవేర్పవలసిన కృత్యము లన్నియు సంపూర్ణముగా నిర్వహింపఁబడవు. 'ధనమూల మిదం జగ' త్తనుమాట యన్నివిషయములలోను సత్యమే మహారాజు లనేకులు ధనసాహాయ్యముం జేసి దీనిని సంరక్షించుచున్నను, నీపరిషత్తు ధనాభావముచేత బిక్కుబిక్కు యంగసౌష్ఠవము లేక యున్నదని యెల్లవారు నిర్వివాదముగా నొప్పుకొనక తప్పదు పరిషత్పత్రిక ప్రతిమాసముఁ బ్రకటింపఁబడక సంవత్సరమున కాఱుసారులె ప్రకటింపఁబడుటయే యందులకుఁ బ్రథమనిదర్శనము. మన సారస్వత మింకను వేయిమడుంగులు వృద్ధికావలయును. సంస్కృతవాఙ్మయమునందున్న గ్రంథములలో భారతభాగవతరామాయణములును, కొన్నిపురాణములు మాత్రమే యాంధ్రీకరింపఁబడినవి గాని, యావాఙ్మయమునందున్న యనేకగ్రంథములు నేఁటికిని మనభాషలోనికి రాకయున్నవి. పాశ్చాత్యపండితు లనేకులు సంస్కృతవాఙ్మయపరిచయముఁ జేసికొని యాసారస్వత మంతయు మథించి వేదాదిసమస్తగ్రంథములను దమభాషలలోనికి మార్చుకొనిరి. వేదకాలనిర్ణయములనుగూర్చి కాని, యార్యుల ప్రథమనివాసస్థానమునుగూర్చి కాని, హిందువుల ప్రాచీననాగరకతఁ

గూర్చి కాని, వేదశాస్త్రముల ప్రాశస్త్యమునుగూర్చి కాని మనము తెలిసికొనవలయు నన్నపక్షమునఁ బరదేశీయపండితుల గ్రంథములె స్థాయికముగా నిప్పుడు మనకు ముఖ్యాధారములుగదా! ఈవిషయమున మనభాషయొక్క దారిద్ర్యమును గాంచిన నెవనిమనస్సు విషాదపూరితముగాదు? మనము గమ్యస్థానమున కెంతోదూరముననుంటి మని యెవ్వరు నిర్ణయింపక విడువరు? ఇంతవఱకు వేదముల నెవ్వరు నాంధ్రీకరింపలేదు. ఆంధ్రభాషలో సంస్కృత వ్యాకరణము నెవ్వరుఁ బూర్ణముగ వ్రాయలేదు. షడ్దర్శనములు, గృహ్యాది సూత్రములు, మన్వాది స్మృతులు, బ్రహ్మజ్ఞానసముద్రము లని చెప్పఁదగినయుపనిషత్తులు, నివియనియనవేల? సంస్కృతమునందలి వాఙ్మయమంతయు నాంధ్రమున నవతరించుట యత్యావశ్యక మని తలంచుచున్నాను. ఈనాయభిప్రాయము దరిద్రునిమనోరథముగాకపోవుగాక! రమారమి యేఁబదిసంవత్సరములక్రిందట శ్రీమన్నవ బుచ్చయ్యపంతులుగారు ఋగ్వేదప్రథమమండలమునకు, ద్వాదశోపనిషత్తులకును, గొన్ని స్మృతులకు నాంధ్రటీకాతాత్పర్యములు వ్రాయించి ప్రకటించి యీవిషయమున మెచ్చఁదగినకృషి చేసియుండిరి. కాని, యాగ్రంథములు పునర్ముద్రణము లేక నామావశిష్టములైయున్నవి. శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితమయిన బ్రహ్మసూత్రభాష్యమును, "శ్రీమదాంధ్రశారీరక" మనునామముతో 1889 దవ సంవత్సరమున సగమును, 1899 దవ సంవత్సరమున సగమునుగా, నాలుగధ్యాయములును గీర్తిశేషులు, రావుబహద్దరు, బ్రహ్మశ్రీ వల్లూరి జగన్నాథరావుగారు (డిప్టీకలక్టరు) పద్యగద్యరూపమునఁ జక్కఁగఁ దెనిఁగించి రెండు సంపుటములుగా ముద్రింపించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయిరి. తద్భాష్యమునే 1918, 1919, 1921 సంవత్సరములలో శ్రీపిఠాపురమహారాజుగారు, కీర్తిశేషులైన శ్రీపురాణపండ మల్లయ్యశాస్త్రులవారిచేతఁ దేటతెల్లముగ వచనమునఁ దెనిఁగింపఁజేసి నాల్గుసంపుటములుగఁ బ్రకటించి వాసి గాంచిరి తక్కినభాష్యములు గూడ మనభాషలోనికి మార్పఁబడుసత్కాల మెప్పుడు వచ్చునోగదా! మఱియు నితరభాషలన్నింటినుండిగూడ శాస్త్రగ్రంథములు, మతగ్రంథములు మనభాషలోనికి రావలసినవి. డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు మహమ్మదీయుల వేదగ్రంథమైన ఖురాను దెనిఁగించుట ప్రశంసనీయమైనకార్యము. మహోదారు లగు శ్రీమునగాల రాజాగారగు శ్రీనాయని వెంకటరంగారావుగారియొక్కయుఁ,

కీర్తిశేషులగు శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారియొక్కయుఁ బ్రోత్సాహ ప్రయత్నములవలన నాంగ్లేయభాషనుండి ప్రకృతిశాస్త్రగ్రంథములనెన్నిటినో తెనిఁగించి విజ్ఞానచంద్రికామండలి చేసిన సేవ యెంతయు శ్లాఘనీయము. లక్ష్మణరావుగారు కీర్తిశేషులగుటచే నిప్పుడప్పని నిలిచిపోయినది ఇది మిక్కిలి శోచనీయము. దేశచరిత్రములుగూడ మనసారస్వతమున మిక్కిలి తక్కువగానున్నవి. ఈసందర్భమున బ్ర॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు చేసినసేవ కడుంగడు మెచ్చఁదగినది. వారు వెనుక వ్రాసినచరిత్రముల సంస్కరించి మరలసంపుటములుగా ముద్రింపవలయు నని గతసంవత్సరమునఁ జెన్నపట్టణమున నొకసభ సమకూర్పఁ బడినది. ఆసభయొక్క ప్రయత్న మచిరకాలములోనే సఫలమగుఁగాక! మనభాషలోఁ బ్రకటింపఁబడునట్టి పత్రికలుగూడ మితసంఖ్యగలవై యున్నవి. పత్రికాసంపాదనవిషయమున దేశస్థులలో శ్రీకాశినాథుని నాగేశ్వరరావుగా రగ్రస్థానము వహించిరి. వారు బహువ్యయప్రయాసములకు లోనై ప్రకటించుచున్న యాంధ్రదినపత్రిక దేశమందలి సర్వభాగములకు నరిగి మతసాంఘిక రాజ్యాంగసారస్వతాది సర్వవిషయములలోను జనులకు నూతనాదర్శములఁ బ్రదర్శించి, లోకమందలి సమస్తవృత్తాంతములఁ గరతలామలకము గావించుచున్నది శ్రీనాగేశ్వరరావుగారు దినపత్రికతోఁ దనివి నొందక వాఙ్మయవిషయములు, విమర్శనములుఁ బ్రకటించుటకై భారతి యనుమాసపత్రిక స్థాపించియున్నారు. అది దినదినాభివృద్ధినొంది పూర్ణచంద్రచంద్రికవలెఁ గళాపరిపూర్ణయై నెలకొకసారి దర్శన మిచ్చి కువలయానందముం జేయుచున్నదని యుగ్గడించుట పొగడ్త గాదు. వారపత్రికలలోఁ గృష్ణాపత్రికయు, సమదర్శినియు, దేశసేవయుఁ, ద్రిలింగయు జనాదరణముఁ బడయుచున్నవి. స్త్రీలయుపయోగమునిమిత్తము చెన్నపురమునఁ బ్రకటింపఁబడుచున్న గృహలక్ష్మి తన కృత్యమును సామర్థ్యముతో నిర్వహించుట చాలసంతోషదాయకము. పరిషత్పత్రికవంటి వింక ననేకములు బైలుదేఱి నూతన వాఙ్మయసృష్టిఁ జేయవలయును. మనభాషలో విమర్శనములు కొంతకాలమునుండి బయలుదేఱుచున్నవి. ఇందులోఁ బెక్కు విమర్శనములు వ్యక్తిదూషణములతో నిండియుండుటే గాని, విషయవిమర్శనముఁ జేయుటయందు గట్టిపూనిక గనఁబడదు. అట్టి విమర్శనములు చాలించి విమర్శకులు సత్యాన్వేషణపరులై పరస్పరదూషణములు మాని, తమవిమర్శనము లాదర్శప్రాయములై యుండునట్లు కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారివలె వ్రాయుదురుగాక!

నవలలు, నాటకములు, ప్రహసనములు మొదలగునవి మితిమీఱి ప్రతిసంవత్సరముఁ బ్రకటింపఁబడుచున్నవి. స్వకపోలకల్పితములైన తత్తద్గ్రంథములలో నేవో కొన్నితప్పఁ బెక్కులు వాఙ్మయమునందుఁ జిరకాలము నిలుచునవికావు. ఈవిధ మగుసారస్వతమునకిది శైశవావస్థయగుటచేతఁ గాఁబోలుఁ దద్రచన మంతతృప్తికరముగా లేదు. ఆధునికులు సర్వజనహృదయంగమములైనగ్రంథముల రచియించి యాంధ్రసరస్వతీపూజ సేయుదురుగాక ! ఈసందర్భమున రెండు ముఖ్యవిషయములు మీకు విన్నవింపవలసియున్నవి. అందు మొదటిది పాఠశాలలలోఁ గళాశాలలలో నేఁటికాలమున నాంధ్రవాఙ్మయమున కియ్యఁబడుస్థానము : 1910 సం॥రము మొదలుకొని యనఁగా విశ్వవిద్యాలయముయొక్క యాదర్శము మాఱినదిమొదలుకొని మొన్న మొన్నఁటివఱకుఁ గళాశాలలలో మాతృభాషకు స్థానము లేనేలేదని చెప్పవచ్చును. దైవానుగ్రహమున నాంధ్రవిశ్వవిద్యాలయము వచ్చినతరువాత నాంధ్రవాఙ్మయము 'నేను నొకవాఙ్మయమునే' యని మరలఁ దలయెత్తుచున్నది. ఇంతమాత్రముతో మనము తనివిఁజెంది యుండఁగూడదు. మధ్యమపాఠశాలలలోను, నున్నతపాఠశాలలలోను, గళాశాలలలోను మాతృభాషాగ్రంథములఁ జదువువిద్యార్థులు పరీక్షలం దెట్టెటో కృతార్థులగుటయె ప్రయోజనముగాఁ బాఠ్యగ్రంథములు చదివి, పనితీఱినవెంటనే చదివినది మఱచి వైదేశికులవలె నాంగ్లేయముతోడనే కాలక్షేపము సేయుచుందురు. ఇట్టి యాచారము ప్రాయికముగా నాంధ్రవిద్యార్థులయందే గానవచ్చుచున్నది. ఇది మిక్కిలి విచారకరమైనస్థితి. ఈస్థితి మార్పుచేయుట కొకటిరెండుమార్గము లున్నవి. పరీక్షలలో నాంగ్లేయభాష నైచ్ఛికభాగముగఁ జేసి చరిత్రలు, భూగోళము, ప్రకృతిశాస్త్రము, గణితము మున్నగుభాగము లన్నియు మాతృభాషలోనే నేర్చికొన్నపక్షమున విద్యార్థులకు స్వదేశాభిమానము మాతృభాషాభిమానము దప్పక గలుగును. ఈపద్ధతి కళాశాలలలోఁ బ్రవేశపెట్టుటకుఁ గొంతయాలస్యమైనను మధ్యమోన్నతపాఠశాలలలో వెంటనే ప్రవేశపెట్టఁబడినపక్షమున నచిరకాలములో నెంతో లాభము సమకూడును. ఈవిషయమున మనవా రందఱు గాఢ మయినకృషి చేసినయెడల దొరతనమువారును, విశ్వవిద్యాలయాధికారులును దీనిని గమనింపకపోరు. రెండవవిషయ మిది:—ఉన్నతపాఠశాలలలోను, మనకళాశాలలలోను నాంధ్రగీర్వాణాదిభాషాధ్యాపకులైన పండితులయవస్థ మిక్కిలి శోచ

నీయముగా నున్నది. శాస్త్రబ్రహ్మచారులు (బి. ఏ.) ను, సర్వకళాప్రవీణులు (ఎమ్. ఏ.) ను నగు నాంగ్లేయపండితులకు వందలకొలఁది జీతము లుండఁగాఁ బూర్వోక్త పండితులకుఁ గళాశాలలలో రు 75 లు మొదలు రు 95 ల వఱకు మాత్రమే జీత మున్నది. ఉన్నతపాఠశాలలలో రు 60 ల కంటె నెక్కువ జీతములు లేవు. కళాశాలలలో నుభయభాషాప్రవీణ శిరోమణిప్రముఖకఠినతమపరీక్షలయందుఁ గృతార్థులై ప్రసిద్ధికెక్కిన మహావిద్వాంసులకుఁ గూడ డెబ్బదియైదు మొదలుకొని తొంబదియైదురూప్యములవఱకే జీతము. రెండం కెలనేగాని జీతములో మూఁడంకెలను జూచుభాగ్యము వారి కబ్బుచుండుట లేదు. ఆంధ్రగీర్వాణాదులుమాత్రము భాషలు గావా? అహోరాత్రము కృషిచేసి చదువకుండ నావిద్య లూరక వచ్చినవా? ఈభాషల నేర్పునట్టి యుపాధ్యాయుల వేతనములవిషయమై తగినట్లు సవరింపవలయు నని విజ్ఞాపనములు దొరతనమువారికి వెళ్ళినవి. కాని, యవియన్నియు నిరర్థకములైనవి. కళాశాలలలోని యధ్యాపకులకు రు 150 లు మొదలుకొని రు 250 లు వఱకు, నున్నతపాఠశాలలలో నధమపక్షము నఱువది మొదలెనుబదివఱకును జీతము లుండవలెను. విద్యార్థులకు మాతృభాషాసక్తి వర్ధిల్లుటకుఁ బూర్వోక్తాంశములు మేటిసాధనములు. సాహిత్యపరిషత్తీవిషయములోఁగూడఁ దగినకృషిచేసి దేశమున నాందోళనము గావింపవలయును.

విద్వచ్ఛిఖామణులారా! యీవిధముగా నాకుఁ దోఁచినపోలికను వాఙ్మయాభివృద్ధికై స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నిసూచనలు చేసితిని. ఇంక నెన్నోవిషయము లుండవచ్చును. బుద్ధిమంతులుఁ, గార్యదక్షులు, లోకజ్ఞులు, భాషాభిమానులు, దేశాభిమానులు నయినమీరందఱుఁ గలసి సమాలోచనఁ జేసి 'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యని యాంధ్రనాయకదేవునిచే బిరుదమునంది—

మ. జయలక్ష్మీక్షితిభారతుల్, ప్రియత పర్యాంతస్వయంగ్రాహ త
 న్మయసాఖ్యామృతసాగరోర్మిచయసమ్యక్కేలనవ్యాపృతా
 శయుఁ గావించినకృష్ణరాయనిబిడౌజఃకాంతిపైదుమ్య ధు
 ర్యయశస్సాంద్రుఁడు, పాలితద్రవిడకర్ణాటాంధ్రుఁ డింద్రుండిలన్.

సీ. ప్రబలించెనాంధ్రసామ్రాజ్య, మప్రతిమప్రతాపంబురిపుపురోద్దాహకముగ;
 నెగడించె నవకావ్యనిర్మాణ, మాస్థాన, మష్టదిగ్గజముల కాశ్రయముగఁ;

గేలనందెఁ బ్రశస్తకృతులు, కీర్తులు హైమ డోలికాందోళికాలాలితులుగ;
ఘటియించెఁ బటుమహాకావ్య సుమ్మృతకల్ప నములోకశాస్త్రవిజ్ఞానదముగ;
నేలెఁ బుడమికన్న నెక్కుడుగా భాష, "నాంధ్రభోజుఁ డీతఁ" డన నెవండు
గంగతోడ ముజ్జగములఁ గ్రేళ్ళుఱుకుఁ దన, కృష్ణదేవరాయకీర్తిలహరి.

అని పొగడ్తగాంచిన శ్రీకృష్ణరాయమహాప్రభావుప్రాపున నపూర్వరూపవిభ్రమ విశేషశోభితయయిన యాంధ్రసరస్వతి, పూర్వకాలపు భూషణములకుఁ దోడుగా ననేకనూతనాలంకారములు ధరించి, యాంధ్రదేశమునఁ బ్రతిపట్టణమందుఁ బ్రతిపల్లియందుఁ బ్రతిగృహమందు జగన్మోహనాకృతితోఁ గనులపండువుగా, వీనులవిందుగా, మనోరంజకముగా నృత్యము చేయునట్లును, లోకములోని సారస్వతములలో నాంధ్రసారస్వత మగ్రస్థానముగాని, కనీసము సమానస్థానము గానియలంకరించునట్లును జేయు భాషాభిమానులగు మీరు ప్రయత్నింతురుగాక యనియు, మీ ప్రయత్నములఁ బరమేశ్వరుఁడు ఫలింపఁజేయుఁగాత మనియుఁ బ్రార్థించుచు, నేతద్గౌతమీతీరపురాతనపుణ్యపట్టణమున శ్రీరామనవమీమహోత్సవపరంపరానంతరమున జరుగు నీయాంధ్రసాహిత్యపరిషద్వార్షికసభను గావించు నాప్రారంభోపన్యాస మీక్రిందిపద్యములతో విరమించుచున్నాను.

మ. తలిదండ్రుల్ గలబిడ్డలుంబలెను భక్తవ్రాతముల్ భార మా
దల లేశంబును లేక లోకమున సీతామాత నీ విర్వురుఁ
గల రన్నమ్మిక నోలలాడుచు మహానందాబ్ధి, జీవించుచుం
డ్రలజళ్ళన్న నెఱుంగ రెల్లపుడు; రామా! యార్తరక్షామణీ.

# ఆంధ్రభారతీవాంఛ.

—శ్రీపతి త్ర్యంబకరావుగారు- బెజవాడ.—

—॥ నవరత్నములు ॥—

ఉ. కృత్రిమభూషణమ్ములు ధరింపఁగ మానసమందు నొల్లనే
మాత్రము మామకీనసుకుమారులు గాఁగలవారుఁగాన నా
పాత్రత నెంచి; నైజరసభావమనోజ్ఞవిలాసభూషణో
ద్గాత్రినిగాఁ బొనర్చి ననుఁ గైకొనుఁ డీసు మదాశిషమ్ములన్. ౧

ఉ తిక్కన, పల్కుక్రొవ్వెఱ్ఱరుల తేనియ పాకము నింపఁజేసి న
వ్యాక్షరకాంబరంబులు, సముజ్జ్వలసర్గసువర్ణభూష లిం
పెక్కఁగఁ గాన్కబెట్టె నపుడేకద నామహనీయరేఖ న
ల్దిక్కులఁ బ్రాఁకిపోయె సవలీలఁగ నీపురికోటదాఁటుచున్. ౨

సీ అడిగితినా సముద్రాంతరాళచిరత్న రత్నమ్ము లొసఁగుపుత్రకులుఁగలరు
సూచింతునా వియచ్ఛ్రోతస్వినీపద్మమకరందమిడు కుమారకులుఁగలరు
వాంఛింతునా నిరవద్యభూర్యంగద వ్రాతమ్ముఁ గూర్చుకుఱ్ఱలునుగలరు
ఆసింతునా సుపర్వారామసౌఖ్యసంపదలీయఁజాలు నాత్మజులుఁగలరు
సెలవునిచ్చితినేని నిస్తులమనోజ్ఞ, భారతీకీరముం దెచ్చు వారుఁగలరు
తలఁచితినయేని నాదునందనులధాక, మైపులకరించు శొక్కాకమాటునాకు.

ఉ. నాయనలార ! కష్టపడినం దమపుత్రకు గోర్తురొక్కొ తా
మేయెడనేని దల్లులటులే మిముఁగూఱిచి పొక్కుచుంటి న
త్యాయతమామకీనపదతామరసమ్ములఁ బూజసల్పఁగా
జేయుచునున్నవారు శ్రమఁ జిత్తములందగు దీక్షఁబూనుచున్. ౪

శా. కానీ, చెప్పెదనొక్కమాట యలుగంగాఁబోకుఁడో యన్నలా
రా ! నాకాముది మేగుదెంచెను జిరత్నామేయసౌవర్ణభూ
షానీకమ్ములభార మొంచెను మెయి న్నల్లాట నాడెందమిం
పూనెన్ నైజమనోహరప్రకృతికన్యోదారసీమల్ కనన్. ౫

సీ. చెలువీను లేఁతపచ్చికలందు హిమకణప్రసవమ్ము లేరఁ దలంపుఁడయ్య
కొదమతుమ్మెదగాలి కొదుగని నెత్తమ్మి రేకులవేది నిర్మింపుఁడయ్య

సంజకెంజాయహాస్యమొనర్చు మావికెంజివురాకుఁబుట్టముల్ సేయుఁడయ్యె
యరవిచ్చినట్టి క్రొవ్విరిఁబోండ్లకడకేగి యచ్చంపుఁబువుదేనె లడుగరయ్యె
పిలువఁడీయుఁకఁగోయి ఁపేరటాండ్ర, నవ్యమను మాఁవవాసరాంతరములందుఁ
గవికుమారులు పెరిమస్సుగడలుకొనఁగ, నీజరఠమాతఁబూజింప నెంతుగేని.

చ ముసలినాటఁ గోరికలు పుట్టుటకున్ సమయమ్మిదాట చే
నెదఁగల వాంఛ నీగతి వచించితి మీరు కళావిశారదా
స్పదులగువారు కావున భవత్సహజావరపోష్యఁ జేసి మీ
ముసలితల్లిఁ గామకొనఁ బోలదొకో చిరజీవిఁ జేయుచున్. ౭

చ అలతిగ నన్నుఁ జూడఁదగవా! సరిబాసనెలంతుకల్ మన
మ్ములఁ బొగులం బ్రబంధయుగపుంగవులెల్లరిఁ గృష్ణరాడ్ధరా
తలపతి పెంపొనర్పఁ గవితాసతి! నాకనుసన్నచాయలన్
మెలఁగఁగ నేనుబొందిన యనిర్వచనీయవిభూతి నెంచుఁడీ. ౮

మ. మును పెద్దోట నఖండగౌరవయశమ్ముల్ కల్గి రాణించి యుం
టినొ యానీడులయందె నేఁడు తనయానీకమ్ము నర్థించుచుం
టిని గ్రొంగ్రొత్తమెఱుంగుసొమ్ములకు నేనే యాంధ్రభాషాంగనా
మణినా? కాన? వచింపు కాలము భవన్మాహాత్మ్యముల్ చిత్రముల్. ౯

# ఆర్తరక్షామణి.

—( వడ్డాది సుబ్బారాయుఁడుగారు )—

---

మ. శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు, దారుల్ మంచివై మర్త్యసం
తతికిం జూపు హితోక్తులన్; నడచి తన్మార్గంబులందున్, మను
ష్యత ధన్యం బొనరించుకొంట కుపదేశం బీయఁ గష్టాలకుం
బ్రతుకీవంతయు ధార వోసితివి; రామా! యార్తరక్షామణీ. ౨౬

మ. పడుగుం గుఱ్ఱఁడవై వసిష్ఠజనకుల్ పంపంగ, సైదోడు వెం
బడిరాఁ, గౌశికుసల్పుజన్నమును గావం బోయి, మారీచునిన్
జడధిన్ వ్రాల్చి సుబాహుఁ గూల్చితివి, తన్మౌని ప్రసాదంబునం
బడయం గాంచి మహాస్త్రశస్త్రములు; రామా! యార్తరక్షామణీ. ౨౭

మ. పదధూళిన్ శిల భామ యయ్యెఁ; బ్రబలుల్ పైకెత్తశక్యంబు గా
నిది విల్లెక్కిడుచోఁ దునింగె; నృపులన్ వెన్నాడి ముయ్యేడు మా
ర్లు దలల్ గొట్టినదిట్ట, నీయెదురఁ గేల్మోడ్చెన్; జరిత్రంబు నీ
యది, చిత్రం బతిమానుషంబు గద; రామా! యార్తరక్షామణీ. ౨౮

మ. వనితం జంపిన, నగ్గి శూరతకు లోపం బంచు, దుశ్శీల శూ
ర్పణఖం బుచ్చితి చెక్కి ముక్కు సెవు; లుగ్రం దాటకన్, బ్రహ్మఘా
తిని గానన్, గురు నానతిం గెడపి, ఖ్యాతిం గాంచి "తా బాల్యమ
త్యనఘశ్లాఘ్యగుణాకరుండ" వని; రామా! యార్తరక్షామణీ. ౨౯

మ. తలదంష్ట్రాగ్ర మంత పిండినఫణీంద్రంబుం బలెం, బుచ్ఛముం
దలిము ల్లాడ్చినమంద్రగబ్బవలె, హస్తంబందు బిగింపఁ గొ
డ్డలి గన్పట్టెడురాముఁ డొప్పె, విలుత్రోడం జేతఁ దత్తేజ మీ
వలనాఁ డధ్వమునందు నాఁచికొన; రామా! యార్తరక్షామణీ. ౩౦

మ. భవుఁ డేమేఁ దలపెట్టెనే నిజధనుర్భంగప్రసంగంబు, భా
ర్గవరాముండు మహాభిమానమున మార్గంబం దెదుర్కొ నినున్,
"శివశిష్యుండ" నటంచు, నందునకు నీచేఁ గాంచె నాతండు త
ద్గవమానంబును, గర్వభంగమును; రామా! యార్తరక్షామణీ. ౩౧

మ. పునుకల్ పేర్చి భూమినుండి దివికిం బోఁ బన్నుపెన్నిచ్చెనం
దునుకల్ చేసెను, వీఁక నెక్కిడినసీతూ పొందు, ద్వీపస్థులై

తినుచున్ మర్త్యులఁ ద్రుళ్లిపల్లదుల మ్రందించెన్ మఱొండుం, దమున్
మదుపన్ భార్గవుఁ, డబ్ధి, వేఁడ నిను; రామా! యార్తరక్షామణీ. ౩౨

శా. కైకం దూఱుట నీమచిత్తమునకుం గష్టంబుగాఁ దోఁచినన్,
లోకుల్ మానరు; తల్లి కెక్కుడుగఁ దన్నుం గాంచుచోఁ, దొత్తునా
కాకర్ణించి, నిజేశు గోడ్పఱిచి, నీ కారణ్యవాసంబుఁ దా
నాకాంక్షించి వరంబుగాఁ బడసె; రామా! యార్తరక్షామణీ. ౩౩

మ. భవదీయానుజలక్ష్మణుండు, మును నీపాన్పైన పెన్పాఁపతే
నవతారం బనిపించె బుణ్యని, యతం డాతండ్రిపైఁ, గైకపై,
హావిచే నగ్గియుఁ బోలె మండి వనవాసాజ్ఞాస్మృతిన్, వీఁకమై;
నవినాభావము నీకు నాతనికి; రామా! యార్తరక్షామణీ. ౩౪

మ. మణిసింహాసన మెక్కు పాదములకుం బాటిల్లె శైలాధిరో
హణ; మూనెన్ మఱిపాల్జడల్ మకుటసాహాయ్యాంగకం; బుత్తర
క్షణమం దాన దెఱుంగ రెవ్వరు; భవత్సంసిద్ధపట్టోత్సవం
బణఁగారెన్ క్షణదాంత మానసరికి; రామా! యార్తరక్షామణీ. ౩౫

మ. నది దాఁటించె గుహుండు మున్; శబరి పండ్లం బెట్టెఁ దర్వాత; న
ప్పిదపన్ భానుజుతోడ నేస్తమును గల్పించెన్ హనూమంతుఁ; డే
య్యది యిమ్మోఁటికి సాటి రాను త్వదరణ్యావాసవృత్తంబులం;
దది, యు, ద్దయ్యది, భక్తిపూతసులు; రామా! యార్తరక్షామణీ. ౩౬

మ. తలవాకింటి నెఱుంగనట్టిసతి, కాంతారంబులన్ మెట్టఁగా
వలసెన్; బేర్వని బెగ్గడిల్లుచెలి, నిల్వం బాటిలెం దచ్చరా
రులమధ్యంబున; హా! విధిం గడవనేరుం జాల; రంతఃపురిన్
మలయం బుట్టినసీత కిట్టిగతి; రామా! యార్తరక్షామణీ. ౩౭

శా. ప్రాసాదోద్ఘము పర్ణశాల, పరివారం బుగ్రసత్త్వౌఘముల్,
ఘాసంబుం జొరుపాకుఁ బట్టెఁబఱపుల్, కందాది రాజాన్న, మా
వాసంబున్ వని, వల్కలంబులు జరీవస్త్రంబులున్ నీకుఁ గా,
హా! సీతాయుతిఁ బుచ్చితేం ట్లిటులు? రామా! యార్తరక్షామణీ. ౩౮

శా. చేతం జాపము, మేన వల్కలములున్, శీర్షంబునందుం జడల్,
సీతాలక్ష్మణు లుండ ముందు వెనుకన్, జెల్లింపఁ బిత్రాజ్ఞ, దు
ర్దైతేయోగ్రమృగేంద్రకంటకభయస్థానాటవిన్, వీతశం
కాతంకస్థితి సంచరించితివి; రామా! యార్తరక్షామణీ. ౩౯

మ. నెలతాలం దనరారుకుట్టిమములన్ మెట్టంగఁ బన్నడ్డనీ
లలనారత్నము, నీవుఁ, దమ్ముఁడును, ముండ్లంగండ్లనేలీల వ
ర్తిలఁగాఁ జాలితి ? యేఁదలంచెదను "గూర్మిన్ బంధుతన్ నేలతో
య్యాలి మీకిమ్మొసరించెఁగాన" నని; రామా ! యార్తరక్షామణీ. ౪౦

మ. అటవీసంచరణంబు, సత్యమును, వంశాచారమే మీకు; బా
సటగాఁ జంద్రమతీసతీమణి, హరిశ్చంద్రుండు శోకంబుతో
నెటు కష్టంపడె ? యుష్మదస్త్రగురుఁ డీవృత్తాంతమాద్యంతమున్
బటువౌఁ దెల్పను, బూసగ్రుచ్చినటు; రామా ! యార్తరక్షామణీ. ౪౧

మ. అకటా ! యార్వది వేల యీడున మహాయాగంబు గావించి, పు
త్రకులం బంక్తిరథుండు గాంచి, తుదకుం బ్రాణాలు నీమీఁదఁబె
ట్టక "హా! రామ! యటంచు హైదొరఁగె"నండుర్; మేలెకా; మోక్షదా
యక మా తారకమంత్రమబ్బెఁ దుది; రామా ! యార్తరక్షామణీ. ౪౨

మ. కనినన్ నల్వురు సూనులన్ దశరథక్ష్మాభర్త, కట్టా ! భవ
జ్జనకుం డొందె నపుత్రసన్నిధి మృతిన్ శాపంబుచేఁ; బాపపుం
బని యేరైన నెఱుంగమిం జలిపినం, బ్రాపింత్రు వా రాఫలం
బనఁ, దార్కాణగఁ దోఁచుఁ దన్మృగయు; రామా ! యార్తరక్షామణీ. ౪౩

మ. పదుమూఁడేఁడులు పుష్పపల్లవరణత్పైకాదికందర్పనం
పదకేకాస్పదమైన కాన, విలసద్భార్యాయుతిన్ బ్రహ్మచ
ర్యదశం గాలము పుచ్చుమానవుఁ డెవం డన్యుండు ప్రాయంబునన్ ?
మదినెన్నఁతు నధోక్షజుండనియె; రామా ! యార్తరక్షామణీ. ౪౪

మ. ఎలుఁగుంగోడ్డులో, కోఁడముచ్చులో, మఱింకేకోఁతులో, రావణుం
గెలువన్ సాయము లంకఁగల్గె; నడవిన్ నీవొంటివై మానవా
దులఁ బద్నాలుగువేగురన్ రణమునన్ ద్రుంపన్ సమర్థుండవై;
తలవే యప్పని మర్త్యమాత్రునకు; రామా ! యార్తరక్షామణీ. ౪౫

మ. అడవిన్ బగ్గునమండుచుండ ననివార్యత్వత్ప్రతాపానలం
బెడగా నూడనిఁబాడ, కాశరగణం బేతెంచి పైదూఁకెడున్;
మిడుతల్ దండకఁ దత్ప్రవాహమున జన్మింపంగఁ బోలున్; భయం
బడ కొండ్రే నటుమూఁగి మ్రగ్గెడునె ? రామా ! యార్తరక్షామణీ. ౪౬

శా. ద్యోవీథిన్ వడిరావణుండు గొనిపో, దుఃఖార్తయై సీత, తన్
గావం గూయిడ, దాయఁబోఁకి, తెగిఱెక్కల్, కూలి, పే చావనై
త్రోవం దోఁచుజటాయు నంత్యవిధి, పుత్త్రుండుం బలెంజల్పి; తా
హా! విశ్వైకకృతజ్ఞతానిధివి; రామా! యార్తరక్షామణీ. ౮౭

శా. ప్రారంభంబున సర్వకార్యముల భావ్యర్థంబుచూపట్టెడున్
జూరూపింపఁగ; రావణాసురుఁడు గొంచుం బోయి యానాఁ డశో
కారామంబున భూమిజాత నిడినాఁ; డారామశోకంబు చ
ల్లాఱున్ వేయన సన్నిమిత్తమది; రామా! యార్తరక్షామణీ. ౮౮

మ. నరమాత్రోచితవర్తనంబులును గానన్ రాకపోవెంచ నీ
చరితంబందును; మాయలేడివెనుకం జాపంబుతోఁ బోనె? బం
గరుజింకుండునె? కొండగుండు లగలంగా నేడ్చితీవాలికై;
యరయన్ నీవొకమాయమానిసివి; రామా! యార్తరక్షామణీ. ౮౯

శా. భావంబుం బరికింతుగాని, మఱిపైపై వేవి నీవారయం
బో; వాఁబోయత, గానవెంగిలిఫలంబుల్ వెట్టఁగా నాఁడు, మే
లౌవిందుంబలె నారగించితివి, యాప్యాయంబుగా; నిన్ను సం
భావింపం దగుకాన్త భక్తిసుమ; రామా! యార్తరక్షామణీ. ౯౦

శా. కేయూరాదివిభూషణంబులను సుగ్రీవుండు దోతేర, సీ
తాయోషామణివౌనొ కావొ యని నీతమ్ముం బరీక్షింపు మం;
టాయాలోచన దోఁచులోపలను నీ డాచూపు బాష్పాకులం
బాయెం; బోలిచె నూపురాలతఁడు; రామా! యార్తరక్షామణీ. ౯౧

మ. ప్రియజాయావిరహంబు, కాంతస్మృతిఁ బ్రాపింపంగ నెట్లేనియున్
సయిఁపన్ వచ్చునుగాని, శత్రుకృతమైనం దుస్సహం; బందునన్
జయశీలుండగు నిన్నుబోఁటి, కదినిచ్చల్ అంపపుంగోఁతె; యె
న్నయినం దాన జనించువేదనలు; రామా! యార్తరక్షామణీ. ౯౨

# నిఘంటుచరిత్రము.

శ్రీ పూ|| మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము.

---

సంస్కృతభాషలో మిక్కిలి ప్రాచీనమైనదియు నిప్పటికిని వాడుకలో నున్నదియు నగునిఘంటువు వైదికనిఘంటువు. దానికి యాస్కుఁ డనునొకమహర్షి యొకవ్యాఖ్యానమును రచించెను. వేదములయందుఁ బ్రయోగింపఁబడిన సకలసుబంతపదములు తిఙంతపదములు దానియందుఁ బూర్ణముగా సంగ్రహింపఁబడినవి. ప్రాయికముగా నీనిరుక్తమువంటి మఱికొన్నిగ్రంథములు పూర్వకాలమం దుండవచ్చును. కాని యవి యన్నియు నిటీవల నంతరించినవి. ఈ నిరుక్తమందుఁ గర్తృకర్మక్రియలు వేఱువేఱు శబ్దము లన్నియు గుంపులుగుంపులుగా నొకచోటఁ జేర్పఁబడినవి. ఇది యయిదధ్యాయములుగా విభజింపఁబడి యున్నది వానిలో మొదటిమూఁడధ్యాయములలోను నామవాచకములకుఁ దిఙంతములకుఁ బర్యాయపదగుచ్ఛము లేర్పడియున్నవి. ప్రకరణసందర్భమునుబట్టి యర్థనిర్ధారణముఁ జేయఁదగిన నిష్పన్నశబ్దములపట్టికలు కలవు. పంచమాధ్యాయమందు నానావిధదేవతలనామము లున్నవి. ఈగ్రంథమును రచించినవాఁ డెవ్వఁడో యెవనికిఁ దెలియదు. యాస్కుఁ డీనిరుక్తమును వ్యాఖ్యానమును వ్రాయుకాలమునకే యీ వైదికనిఘంటువు వ్యవహారములో నున్నది. వేదాధ్యయనము నారంభించినవారు దీనిని వాచోవిధేయముగాఁ జేసికొనుటకు వల్లించుచుండిరి. అందువలన దీని కామ్నాయ మని పేరు కలిగినది. "సమామ్నాయ-స్సమామ్నాతః సవ్యాఖ్యాతవ్యః। తమిమం సమామ్నాయం నిఘంటవ ఇత్యాచక్షతే (నిరు 1. 1. 1) సాక్షాత్కృత ధర్మాణః ఋషయో బభూవుస్తే౽సాక్షాత్కృత ధర్మస్య ఉపదేశేన మంత్రా న్సంప్రాహు రుపదేశాయ। గ్లాయంతో౽వరే బిల్మగ్రహణాయ ఇమం గ్రంథం సమామ్నాయిషు వేదంచ వేదాంగానిచ (నిరు. 1-6-5) బిల్మం భిల్మం భాసనమితి నైరుక్తాః (పాణినిచే నిరస్తులైన యనేకవైయాకరణులను యాస్కుఁడు తనగ్రంథమందుఁ జెప్పినను పాణిని పేరెత్తకపోవుటచే యాస్కుఁడు పాణినికంటెఁ బ్రాచీనుఁడని తలంపఁబడుచున్నాఁడు. పాణిని యాస్కశబ్దసిద్ధివిషయమై తన అష్టాధ్యాయిలో "యస్కాదిభ్యోగోత్రే" 11-4-65) అని వ్రాసియుంచుటచేఁ బాణిని యాస్కు

పేరు నెఱింగియున్నట్లు కానుపించుచున్నది. వైదికనిఘంటువునకు యాస్కుని నిరుక్త మొకవిధమైన వ్యాఖ్యానము. వేదవాఙ్మయమందుఁ బ్రయోగింపఁబడిన శబ్దముల యర్థములనుఁ దెలియఁజేయుట దీనిప్రయోజనము. ఇది వ్యాఖ్యానమే కాదు ఇందులో శబ్దవ్యుత్పత్తులను గుఱించియు దేవతలను గుఱించియుఁ జర్చలు మెండుగా నున్నవి. ఎట్లన; తత్కో వృత్రః । మేఘ ఇతి నైరుక్తాః । త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః (నిరు 2-6-2) ఋగ్వేదమందు వృత్రశబ్దమునకు మేఘమర్థము "వృణోతే రాచ్ఛాదనార్థాత్ - ఆచ్ఛాదయతి హ్యసౌ కృత్స్నం నభః-"ఇదిగాక లౌకికసంస్కృతమందు నాడుకచేయఁబడు పర్వతపర్యాయము లయిన "అద్రి గ్రావా గోత్ర అశ్మా పర్వత గిరి ఉపల మొదలగు శబ్దము లన్నియు ఋగ్వేదమందు మేఘపరములు. వృత్రునిచేఁ జెఱలో నుంపఁబడిన గోవులను నింద్రుఁడు వానిని జంపి విడిపించె నని ఋగ్వేదములో ననేకఋక్కులలోఁ జెప్పఁబడి యున్నది. ఎట్లనఁగా—"ఇంద్రో వృత్ర మవృణోచ్ఛర్ధనీతిః ప్రమాయినా మభినాద్వర్పణీతిః । అహన్వ్యంసముశధగ్వనేష్వావిర్ధేనా అకృణోద్రామ్యాణాం (3-34-3) వృత్రాయ వజ్ర మీశానః కియేధాః (1-4-29-27) అహన్వృత్రం వృత్రతరం వ్యంస మింద్రో వజ్రేణ మహతా వధేన। స్కంధాంసీవ కులిశేనావివృక్ణా హిశ్శయత ఉపపృక్పృథివ్యాః" ఇట్టిఋగ్వేద గాథలు భాగవతాదిపురాణములయం దింకొకరీతికథలుగాఁ గాలక్రమమున మాఱినవి.

ఈనిరుక్తము ద్వాదశాధ్యాయములుగా విభజింపఁబడి యున్నది. ప్రత్యధ్యాయమందు మూఁడు మొదలుకొని యేడు పాదములవఱకుఁ గలవు. దీనికి రెండుపరిశిష్టాధ్యాయము లున్నవి. వానిలో మొదటిదానికి దుర్గాచార్యుఁ డొకవ్యాఖ్యానమును వ్రాసెను. అవి రెండును నిరుక్తమునకుఁ గొన నున్నవి. అవి యంత ప్రమాణములు కావని కొందఱాచార్యు లభిప్రాయపడుచున్నారు. పూర్వోక్తమైనద్వాదశాధ్యాయములు మూఁడుకాండములుగా విభజింపఁబడినవి. 1. నైఘంటుకకాండము-నిఘంటువుయొక్క మొదటి మూఁడధ్యాయములతో సరిగానున్నది. 4, 5, 6 అధ్యాయములు నైగమకాండము. ఇది నిఘంటువుయొక్క నాల్గవయధ్యాయమునకు సరిగా నుండును 7, 8, 9, 10, 11, 12 అధ్యాయములతో నైగమకాండము సరిగా నున్నది. ప్రథమాధ్యాయమందు, పదములు, నామములు, ఆఖ్యాతములు, ఉపసర్గలు నని వర్గీకరణము చేయఁ

బడినది. ప్రతిశబ్దము వ్యుత్పన్నమా యవ్యుత్పన్నమా? ప్రతిశబ్దమునకు వ్యుత్పత్తిఁ జెప్పుట శక్య మగునా కాదా? అది యవసరమా యనవసరమా యను విచారణము, నుపసర్గ నిపాతలను గుఱించి విమర్శము వేదమంత్రముల కర్థ మున్నదా లేదా యను విచారణముఁ జేయఁబడినది.

ఇచ్చట వేదమును గుఱించి కొంచెము ప్రశంసించుట యస్థానము కాదని నాయభిప్రాయము.

వేద మనఁగా నెద్ది? దానికి విషయసంబంధప్రయోజనంబు లెవ్వి? అధికారి యెవ్వఁడు? అను ప్రశ్నముల కుత్తరము లిట్లు చెప్పఁబడుచున్నవి. లోకములో మనుజులు తమకు మేలుఁ గలిగించుకొనుటకుఁ గీడుఁ దొలఁగించుకొనుటకు నుపయోగించు నలౌకికోపాయము నేగ్రంథము బోధించునో దానికి వేద మని పేరు ఇచట నలౌకిక మనువిశేషణమువలన నిది ప్రత్యక్షానుమానములకంటె వేఱైన దని తెలియఁబడుచున్నది. అనుదిన మనుభూయమానము లగుస్రక్చందనవనితాదు లిష్టప్రాప్తిహేతువు లనియు నౌషధసేవాదిక మనిష్టనివారణహేతు వనియు నెల్లవారికిఁ దెలిసినవిషయమే. తా నొకవిషయము ననుభవింపఁగాఁ దనకుఁ గలుగు నానందము మఱియొకపురుషుఁ డావిషయము నే యనుభవింపఁగా వానికిఁ గూడ నట్టియానందము కలిగియుండవచ్చు నని తా నూహించుకొనుట యనుమానముచే సిద్ధించుచున్నది. ఇట్లైనచో రాఁబోవుజన్మమందుఁ గలుగుసుఖదుఃఖాదులు కూడ ననుమానముచేఁ దెలియఁబడు నని పలికెద వేమో; అట్లు కాదు. ఆవిశేషములు మన కీజన్మమందుఁ దెలియవు. జ్యోతిష్టోమాదికర్మ లిష్టప్రాప్తిహేతువు లనియుఁ, గళంజభక్షణత్యాగ మనిష్టపరిహారహేతు వనియుఁ దెలుపఁబడు నీయర్థము నెంతగొప్పతార్కికుఁడైనను వేదవ్యతిరిక్తానుమానసహస్రములచే నైనఁ దెలిసికొనుటకు సమర్థుఁడు కాఁడు. కావున నట్టియలౌకికోపాయమును బోధించునది యే వేద మని వేదమునకు లక్షణముఁ జెప్పినచో సమంజసముగా నుండును.

"ప్రత్యక్షే ణానుమిత్యా వా యస్తూపాయోనబుధ్యతే
ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా"

(ప్రత్యక్షప్రమాణముచేఁ గాని యనుమానప్రమాణముచేఁ గాని యేయుపాయము తెలియఁబడదో యాయుపాయమును దీనిచే మనుజు లెఱుంగుచున్నారు గావున దీనికి వేద మని పేరు) అట్టియుపాయమే వేదమునకు

విషయము. దానిం దెలియఁజేయునదే దీనిం బ్రయోజనము [illegible] మును దెలిసికొనఁగోరువాఁ డధికారి. అయ్యది [illegible] ప్రతిపాద్యప్రతిపాదక భావము సంబంధము. (అనఁగా [illegible] చునది.) నా కెల్లపుడు మే లగుచు గాక, కీడు తొలఁగుచు గాక! అనునది ప్రతిమనుష్యునికి లోకములోఁ గోరిక. [illegible] ద్విజులు గాని ద్విజేతరు లగు స్త్రీశూద్రాదులు [illegible] కావలసివచ్చును. కాని స్త్రీశూద్రులకుఁ బారలౌకికముగు [illegible] యుపాయము నుఁ దెలిసికొనుట కభిలాష యున్నను [illegible] కారము నిషేధింపఁబడినది. [illegible] చెప్పుశాస్త్ర [illegible] స్త్రీశూద్రులకు [illegible] ప్తావహ మని బోధించుచున్నది. [illegible] నగు నయ్యలౌకికోపాయము స్త్రీశూద్రు లెఱుఁగుట యెట్లు? దానిమూలముగా వారు తరించుట యెట్లు సంభవించు నని యడిగినచోఁ బురాణాదులనుఁ జదువుకొని వారు తరించెదరు. కావుననే "స్త్రీ శూద్ర ద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా ఇతి భారత మాఖ్యానం మునినా కృపయా కృతం" (స్త్రీలు, శూద్రులు, బ్రాహ్మణాధములు, వేదము వినఁగూడదు. కావున వారియందు దయగలవాఁడై శ్రీవేదవ్యాసమహర్షి భారతాఖ్యానమును రచించెను.) కాఁబట్టి [illegible] కులకే (బ్రాహ్మణక్షత్రియవైశ్యులకే) వేదము దధికారము, అలౌకికోపాయమును బోధించునది గావున వేదముయొక్క ప్రామాణ్యము స్వతస్సిద్ధము. పౌరుషేయవాక్యము బోధకమైనను బురుషునియందుండు భ్రమ విప్రలంభాదిదోషములవలనఁ బ్రవర్తించునని యూహింపఁబడియుండుటచే నాదోషములను నివారించుట కది మూలప్రమాణసాపేక్షమై యుండును. వేద మట్లు కాదు, అది నిత్యము గావునఁ గర్తృదోషశంక దానియం దుదయింపదు. పూర్వమీమాంసాసూత్రకర్త యగు జైమిని యీయంశము నిట్లు చెప్పెను. "ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధస్తస్యజ్ఞాన ముపదేశః। అవ్యతిరేకశ్చార్థేఽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణస్యానపేక్షత్వాత్ (1 అ- 1 పా. 5 సూ) కాని ఋచస్సామాని జజ్ఞిరే ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మా దజాయత" పు-సూ. అనియును, అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేదో యజుర్వేద స్సామవేదః"

అనియు శ్రుతులే యీవేద వాక్యములవలన నుత్పన్నమైన దని చెప్పుచుండుట వలన నిదియుఁ గాళిదాసాదికృతకావ్యములవలెనే పౌరుషేయమే. అందుచే తనే బాదరాయణుఁడు "శాస్త్రయోనిత్వాత్" అనుసూత్రముచే వేద మీశ్వరకర్తృక మని నుడివెను." అని పలికెడువాదిమీఁ దింక సమాధానమును జెప్పెద వినుఁడు. "వాచా విరూపనిత్యయా" "అనాదినిధనా నిత్యా వా గుత్సృష్టా స్వయంభువా" ఇత్యాది శ్రుతిస్మృతులు వేదము నిత్య మని చెప్పుచున్నవి. వేదవ్యాసుఁడు దేవతాధికరణమందు "అత ఏవ చ నిత్యత్వమ్" (I. అ. 3-29 సూ) అనుసూత్రముచే వేదనిత్యత్వమును సమర్థించియున్నాఁడు. "యజ్ఞేన వాచః పదవీయ మాయన్ తా మన్వవిందన్ ఋషిషు ప్రవిష్టాం" అను మంత్రవర్ణ మిందుకుఁ బ్రమాణము. "యుగాన్తే న్తర్హితాన్వేదా న్సేతిహాసా న్మహర్షయః। లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువా" అని భారతవచనము అట్లైనచో బాదరాయణుఁడు శాస్త్రయోనిత్వాధికరణమందు వేదము పరమేశ్వరకర్తృక మనియు దేవతాధికరణమందు నిత్య మనియు నపౌరుషేయ మనియుఁ జెప్పుట పరస్పరవిరుద్ధముగాఁ గానవచ్చుచున్నదే యనఁగాఁ జెప్పుచున్నాఁడు. ఇచట నిత్యత్వము వ్యావహారిక మని యెఱుంగవలయును. సృష్టికిఁ దరువాతఁ బ్రళయమునకు ముందు వర్తించు కాలమునకు వ్యవహారకాల మని పేరు అట్టికాలమం దీవేదము పుట్టినట్లు నశించినట్లు కానరాదు. కాళిదాసాదికవివిరచితకావ్యములకువలె నీవేదమున కొకగ్రంథకర్త యున్నట్లు తెలియఁబడదు గావునఁ గాలాకాశాదు లెట్లు నిత్యములో యట్లె యీవేదముకూడ నిత్యము. ఆది సృష్టియం దీవేదముకూడఁ గాలాకాశాదులవలెఁ బరబ్రహ్మనుండి పుట్టిన దని వేదప్రామాణ్యమువలననే తెలియవచ్చుచున్నది. కాఁబట్టి విషయభేదమువలనఁ బరస్పరవిరోధము లేదు- పరబ్రహ్మనిర్దోష మైనదగుటవలన వేదమునకు వక్తృదోషము లేదు. కావున దాని ప్రామాణ్యము స్వతస్సిద్ధము.

### వేదముయొక్క యపౌరుషేయత్వసమర్థనము.

జైమినిమీమాంసాశాస్త్రప్రథమపాదమందు వేదాపౌరుషేయత్వము నిట్లు సమర్థించుచున్నాఁడు.

"వేదాంశ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః (I-1-27) చోదనయే లక్షణముగాఁ గలయర్థము ధర్మ మని చెప్పఁబడినది. ఏలయన శబ్దమునకుఁ గలసం

బంధము పురుషకృతము కాదు.” అని పలికితివేని దీనిపై నాక్షేపముఁ జెప్పెద వినుము. చోదనలు పౌరుషేయములు, కొలఁదికాలముక్రిందట నీవేదములు రచింపఁబడినవి. వేదము లనఁగాఁ జోదనాసమూహములే కదా? వేదములు పౌరుషేయము లైనపుడు చోదనలు కూడఁ బౌరుషేయములు కావలయును.” అని కొందఱు తలంచుచున్నారు. ఏలయన; కాఠక మనియు, కాలాపక మనియు, పైప్పలాద మనియుఁ బురుష నామధేయములచేఁ గొన్ని వేదశాఖలు వ్యవహరింపఁబడుచున్నవి. ఈవేదశాఖల కాపురుషులతో సంబంధము లేనిచో నట్టివ్యవహారము సంభవింపదు. పిప్పలాదుఁడు ముద్గలుఁడు మొదలగువా రావేదభాగములను దమశిష్యులకుఁ బలుమా ఱుపదేశించుటచే నప్పేరులు వానికిఁ గలిగిన వని చెప్పుట యుపపన్న మని యందువా? అది సరికాదు- విశేషణ మసాధారణ మైయుండవలయును. కర్త యొక్కఁడే, వానియొద్ద ననేకులు నేర్చుకొనియుందురు. కావున నెవ్వరికిఁ దెలియకపోయినను జోదనల కెవ్వఁడో యొకకర్త యుండఁబోలును. అందుచేఁ జోదన లక్షణముగాఁగల యర్థము ధర్మ మని చెప్పుట ప్రమాణము కాదు.

అనిత్యదర్శనాచ్చ (1-1-28)

'బబరః ప్రావాహణి రకామయత, కుసురువిందః ఔద్దాలకి రకామయత', ఇత్యాదివాక్యములలో జననమరణములు గల ఉద్దాలకపుత్రుఁడు మొదలగువారు పేర్కొనఁబడియుండుటచే వీరికంటెఁ బూర్వ మీవేదము లేనట్లు స్పష్టమగుచున్నది. అందుచే నిది యనిత్యము.

సిద్ధాంతము.

ఆఖ్యా ప్రవచనాత్ (1-1-30)

కఠుఁ డనువానిచే నీగ్రంథభాగము రచింపఁబడెను, కావున, దీనికి కాఠక మని పేరు కలిగిన దని పూర్వపక్షములోఁ జెప్పఁబడెను. అది సరిగాదు. ఈశాఖను కఠాదు లనన్యసాధారణ మగు ప్రవచనమునుఁ జేయుచుండుటచే దీని కాపేరు కలిగినది. వైశంపాయనుఁడు సర్వశాఖల నధ్యయనముఁ జేసెననియు, కఠుఁ డొక్కయీశాఖనే యధ్యయనముఁ జేసెననియు స్మృతులలో జెప్పఁ బడియున్నవి. ఆకఠుఁ డనేకశాఖల నభ్యసించిన వారిసన్నిధిలో నీయొక్క శాఖనే చిరకాలము నేర్చుకొని ప్రవచనము చేసియుండుటచే దీనికిట్టివిశేషణముకలుగుట యుపపన్నమే.

పరంతు శ్రుతిసామాన్యమాత్రమ్ (1-1-31)

ప్రవాహణి యనుదానికి సమాధానము చెప్పఁబడుచున్నది. ప్రవాహణుఁ డనునొకపురుషుఁ డున్నయెడల వానియపత్యము ప్రావాహణి యని సిద్ధించును. ఆపేరుగల పురుషుఁడే లేఁడు. "ప్ర" అనుదానికిఁ బ్రకర్షమనియర్థము. "వహ్" ధాతువునకు "పొందించుట" అనియర్థము. హెచ్చుగా మోయువాఁడని దీనిసముదాయార్థము. ఇకారము "మారుతి, రావణి"ఇత్యాద్యపత్యార్థమందు సిద్ధించిన ట్లిచటఁ గ్రియకుఁ గర్త్రర్థమందు సిద్ధించినది. కావున నెవఁడు విస్తారముగా మోయువాఁడో వాఁడు ప్రావాహణి యనంబడును. బబర యనునది యనుకరణశబ్దము. అందువలన నెద్ది నిత్య మగు నర్థమో దానినే యీబబరప్రవాహణిశబ్దములు తెలుపుచున్నవి.

కృతేవా వినియోగస్యా త్కర్మణ స్సంబంధాత్ (1-1-32)

ఈవేదము వెఱ్ఱివానిమాటవంటిది కా దని మన మెట్లు తలంపఁగలము, ఏమనఁగా—"వనస్పతయ స్సత్రమాసత" (వృక్షములు సత్రయాగము నొనర్చెను) "సర్పాస్సత్రమాసత" (సర్పములు సత్రయాగమును జేసెను.) "జరద్గవో గాయతి మత్తకాని" (ముసలియెద్దు పాటలు పాడుచున్నది) ఇది యంతయు ననుపపన్నముగా నున్నట్లు తోఁచుచున్నది. అను పూర్వపక్షము రాఁగా సమాధానము. ఇది యనుపపన్న మైనయెడల "అగ్నిహోత్రం జుహుయాత్స్వర్గకామః" అనువాక్యములు కూడ ననుపపన్నములు కావలసివచ్చును. "వనస్పతయ స్సత్ర మాసత" ఇత్యాదివాక్యము లనుపపన్నములు కావు. ఇవి సత్రయాగమును స్తుతించువాక్యములు. అచేతనము లగువృక్షములే సత్రయాగ మొనరించినపుడు విద్వాంసు లగు బ్రాహ్మణులు దీని ననుష్ఠింపవలయు నని చెప్పెడిదేమి? ఇట్లు వేదభాష్యకర్త యగు విద్యారణ్యుఁడు ఋగ్వేదభాష్యోపోద్ఘాతమం దీవేదమునుగుఱించి నానావిధపూర్వపక్షములను జేసి వానికి విపులముగా సమాధానములను జెప్పెను. వాని నన్నింటి నిచట వ్రాసినచో గ్రంథ విస్తర మగు నని విరమించితిని.

## నిఘంటుశబ్దవ్యుత్పత్తి.

"తే నిగన్తవఏవ సంతో నిగమనా న్నిఘణ్టవ ఉచ్యంత ఇ త్యౌపమన్యవః"

ఉదాహృతా స్సమామ్నాతా నిర్వచనప్రసంగతో నిరుచ్యంతే। య ఏతే సమామ్నాతా గవాదయ స్తఏతే మంత్రార్థ నిగమయితృత్వా న్నిగన్తవ

స్సన్తో నిగమనా ద్దేత్తో [illegible] ఇత్యేవ మధః నిగమయిత్వా [illegible] శబ్దేన గకారస్థానే ఘకారం కృత్వా [illegible] వ్యాపత్త్యాదిలక్షణమ్ అథాప్యస్తి [illegible] ఇత్యేవ [illegible] పరోక్షవృత్తిషు యథాసంభవం ద్రష్టవ్యమ్ । [illegible] ప్రత్యక్షవృత్తయః పరోక్షవృత్తయః అతిపరోక్షవృత్తయశ్చ । [illegible] ప్రత్యక్షవృత్తయః । అంతర్లీనక్రియాః పరోక్షవృత్తయః । అతిపరోక్షవృత్తిషు శబ్దేషు నిర్వచనాభ్యుపాయః [illegible] ప్రత్యక్షవృత్తినా శబ్దేన నిర్వక్తవ్యః । [illegible] నిగంతవ ఇతి పరోక్షవృత్తిః । [illegible] । యస్మాన్నిగమయితార ఏతే నిగంతవ ఇతి నిఘంటవ ఇత్యుచ్యంతే । [illegible] చ । వర్ణాగమో వర్ణవిపర్యయశ్చ ద్వౌ చాపరౌ వర్ణవికారనాశౌ । ధాతోస్తదర్థాతిశయేన యోగ స్తదుచ్యతే పంచవిధం నిరుక్తమ్ ।" వక్ష్యతి చా యమపి వర్ణవిపర్యయ వర్ణ వ్యాపత్తిలక్షణమ్ తప తే నిగంతవః సంతో నిఘంటవ ఉచ్యన్తే ఇత్యేవ మతిపరోక్షవృత్తయో నిర్వక్తవ్యాః । ప్రాయేణ చోణాదిషు పరోక్షవృత్తయ శ్శబ్దా శ్చింత్యంతే । తత్ర తేషాం లక్షణ ముపేక్షితవ్యమ్ । యేషా మపి లక్షణం నాస్తి । తేషా మపి తత్ర కల్ప్యమ్ । అపరిసమాప్తా హ్యుణాదయ ఇతి లక్షణవిదః ప్రతిజానతే । సర్వథా పి లక్షణాసంభవే పృషోదరాది పాఠసిద్ధిరేవ ద్రష్టవ్యా । తత్ర హి యథాధ్యయనమేవ శబ్దా స్సాధనీయాసో భవంతి । అభివ్యాహారానభిఘాతా యేతి హి లక్షణవిదో మన్యంతే । ఇత్యేవ మన్యవ ఆచార్యో మన్యతే ఇతి వాక్యశేషః । ఉపరతమన్యు రుపమన్యుః । తస్యాపత్య మౌపమన్యవః । కీర్తిప్రథనార్థ మౌపమన్యవగ్రహణం ।

అపి వాహననాదేవ స్యు స్సమాహితా భవంతి। అపి త్వేవం యథోక్తం । అపిత్వేవ మన్యథా నిఘంటవ స్స్యుః । కథమితి । ఆహననా దేవ । ననిగమనా దిత్యభిప్రాయః । విద్యమాన మపి నిగమన మవివక్షిత మేతస్మి న్పక్షే । అనేక క్రియాయోగేపి హి సతికాంచిదేవక్రియా మంగీకృత్య నామధేయప్రతిలంభో భవతి । కిమేతే వ్యాహతమితి । ఉచ్యతే । సమాహతా భవంతి । సమః స్థానే నీత్యేవ నియుక్తః । దర్శయిష్యతి చా య ముపసర్గవ్యత్యయం నిరిత్యేవ సమిత్యేతస్య ఇతి । ఆజ్ అవిద్యమాన ప వా ధ్యాహృతో మర్యాదార్థ ప్రకాశ

# ఆంధ్ర సాహిత్యపరిషద్వార్షికసభావృత్తాంతము.

ప్రజోత్పత్తి, ఆ గీరస సంవత్సరముల వార్షికసభ 1933 సంవత్సరము ఏప్రిల్ నెల ది 15-16 తేదులలో రాజమహేంద్రవరమున, ఇన్నీసుపేట-బాబ్జీసినీమాహాలులో జరిగినది. ఆసభకు విద్యాధికులుఁ, బండితులు, భాషాభిమానులు, న్యాయవాదులు, నుపాధ్యాయులు, నున్నతోద్యోగులు, నధికారులు మొదలగువారులు స్త్రీపురుషులనేకులు విచ్చేసిరి. ఇతరగ్రామముల నుండియుఁ బలువురు భాషాభిమానులుఁ బండితులును దయచేసిరి. వారిలోఁ గొందఱ నామములీక్రిందఁ జూపఁబడుచున్నవి.

రాజమహేంద్రవరవారులు.

మ॥రా॥శ్రీ ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.
,, న్యాపతి బలరామదాసుపంతులుగారు, బి.ఏ., బి.ఎల్. డిస్ట్రిక్టుజడ్జి
,, వేపా పూర్ణయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. సబుజడ్జి.
,, పి వి. గోవిందరావునాయఁడుగారు, బి. ఏ, బి. ఎల్. ఛైర్‌మన్.
,, కనుపర్తి శ్రీరాములుగారు.
,, డాక్టరు. పాలకోడేటి గురుమూర్తిగారు.
,, చింతా దీక్షితులుగారు, బి. ఏ., ఎల్. టి.
,, ఎఱ్ఱగుంట్ల సుబ్బారావుగారు, బి. ఏ.
,, వెన్నేటి రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వడ్డాది అప్పారావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, తాళ్లూరి విజయరామయ్యగారు, బి. ఏ. బి. ఎల్.
,, నిడమర్తి జలదుర్గాప్రసాదరావుగారు.
,, తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.
,, చంద్రాభట్ల రామమూర్తిగారు.
,, నాళం కృష్ణారావుగారు.
,, బూరెల నారాయణమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్.
,, ఉభయభాషాప్రవీణ- రావూరు వేంకటసుబ్బమ్మగారు.
,, ,, కందర్పలక్ష్మీకాంతముగారు.
,, ,, బత్తుల కామాక్షమ్మగారు.

,, సౌభాగ్యమ్మగారు.

,, తెలికిచెర్ల రంగనాయకమ్మగారు, బి. ఏ., ఎల్. టి.

ఇతరగ్రామముల వారు

,, కల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు, విశాఖపట్టణము.

,, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, రాయవరము.

,, అల్లమరాజు రంగశాయికవిగారు, పిఠాపురము.

,, పెద్దింటి తిరువేంగళాచార్యులుగారు, గుంటూరు.

,, డాక్టర్. యస్. కృష్ణస్వామిఅయ్యంగార్, ఎం. ఏ., చెన్నపురి.

,, కేశవరపు కామరాజుగారు, పెద్దాపురము.

,, చన్నాప్రధానుల మాణిక్య[illegible]గారు, [illegible].

,, సుసర్ల శేషాద్రిశాస్త్రిగారు, చాముర్లకోట.

,, కల్లూరి రామచంద్రమూర్తిగారు, బి. ఏ. కొవ్వూరు.

,, కొల్లూరి సుబ్బారావుగారు, పిఠాపురము.

,, సూరవరపు పురుషోత్తమశాస్త్రిగారు, కాకినాడ.

,, బొడ్డు బాపిరాజుగారు, ఏలూరు.

,, రుద్రరాజు నరసింహరాజుగారు, పోడూరు.

,, వావిలాల గోపాలకృష్ణయ్యగారు, చీరాల.

,, నడింపల్లి జగన్నాథరావుగారు, నర్సారావుపేట.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ, కాకినాడ.

,, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు, కాకినాడ.

,, పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము.

,, సూరుకుచ్చి కృష్ణమూర్తిగారు, ఏలూరు.

,, పేకేర్వల నరసింహముగారు, పిఠాపురము.

,, ఉమర్ అలీషాకవిగారు, పిఠాపురము.

,, మొక్కపాటి నరసింహశాస్త్రిగారు.

,, పిలకా గణపతిగారు.

,, తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు

ది 15 తేది శనివారము ఉదయమున బ్ర॥ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి యుపనిషద్వాక్యములతో సభప్రారంభింపబడినది. బ్ర॥ మద్దాలి వేంకటా

చలమువంతులు బి. ఏ., బి. యల్. గారి కుమారుఁడు సంస్కృతధ్యాన శ్లోకములుచదివినపిమ్మట ఆహ్వానసంఘాధ్యక్షులు కార్యగౌరవమున గ్రామాంతరమున కేగియుండుటచే వారువ్రాసినజాబును స్వాగతోపన్యాసమును బ్ర॥ రాళ్లబండి సుబ్బారావుఎం.ఏ. గారు చదివిరి. జయంతి రామయ్యపంతులు బి ఏ ,బి ఎల్. గారు, బుఱ్ఱా శేషగిరిరావుపంతులు ఎం.ఏ.గారు శతావధాని చళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారును, కొంత సభాధ్యక్షులును సూక్తిసుధానిధి వడ్డాది సుబ్బరాయుఁడుగారి గుణగణము ప్రశంసించిన యనంతరము వారగ్రాసనము నధిరోహించి కొంతముచ్చటించి వృద్ధులగుటచేఁ దమ యధ్యక్షోపన్యాసమును, ఆహ్వానసంఘకార్యదర్శులలో నొకరగు బ్ర॥ మద్దాలి వేంకటాచలపంతులు బి ఏ. బి. ఎల్. గారిచేఁ జదివించిరి. అనంతరము శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు (విజయనగరము) నిఘంటుచరిత్రము బ్ర॥ కోరాడ రామకృష్ణయ్య ఎం.ఏ. గారు (చెన్నపురి) ఆంధ్రభాష, వర్తమానార్థకచువర్ణకము- జటావల్లభ పురుషోత్తముగారు బి. ఏ. (కొవ్వూరు,) ఆంగ్లమునుండి యాంధ్రమింకను గ్రహింపవలసిన విషయము బ్ర॥ కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు (సాలూరు) ఆంధ్రి, తద్విశిష్టత- బ్ర॥ నేరెళ్ల నారాయణమూర్తిగారు (పాలకొండ) ఆంధ్రసాహిత్యము- బ్ర॥ టేకుమళ్ల అచ్యుతరావు ఎం. ఏ గారు (రాజమహేంద్రవరము) అల్లసాని పెద్దన్న- మనుచరిత్రము అను వ్యాసములం జదివిరి. అంతటితో నుదయము సభ ముగిసినది.

మధ్యాహ్నము- బ్ర॥ సాగి వేంకటనరసింహము ఎం. ఏ. గారు (రాజమహేంద్రవరము) ఆంధ్రవాఙ్మయమున నవలంబింపఁదగిన నూతనగద్యరీతులు- శ్రీమాన్ యీయుణ్ణి వీరరాఘవాచార్యులు బి. ఏ. గారు (విజయనగరము) చిత్రకవి-భోజునిశృంగారప్రకాశము బ్ర॥ బోడపాటి శివరామశర్మగారు (రాజమహేంద్రవరము) బొబ్బిలియుద్ధనాటకములు- మ॥ జి జాషువాకవిగారు (వినుకొండ) నేను ఆంధ్రుఁడను అనుపద్యములం బఠించిరి. బ్ర॥ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు పంపిన, ఆంధ్రభాషాస్వరూపవిచారము, బ్ర॥ జొన్నలగడ్డ సత్యనారాయణగారు ఎం.ఏ.బి.ఎల్. (చెన్నపురి) పంపిన- సారసత్వము, ముక్తిసాధనము-అను వ్యాసములు చదివినట్లామోదింపఁబడినది

ది 16 తేది, ఆదివారము ఉదయమున- నాళమువారి సత్రములోఁ బరిషత్కార్యనిర్వాహకసభ జరిగినది. తదనంతరము సినిమాహాలులో శతావ

ధాని శ్రీపతి త్ర్యంబకరావుగారు (బెజవాడ) ఆంధ్రభారతీవాంఛ యనుపద్య
ములం జదివిరి. బ్ర॥ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు (రామచంద్రపురము)
నన్నయభట్టు, భారతము- కే. కృపానందముగారు (కాకినాడ) ప్రాథమికవిద్య.
జి జాషువాకవిగారు ఆంధ్రకవులు, భావచిత్రములు- విద్వాన్ కట్టిసాంబ
మూర్తిశాస్త్రిగారు (ఇచ్ఛాపురము) ఆధునికాంధ్రవాఙ్మయము, మ॥ బండారు
తమ్మయ్యగారు (కాకినాడ) శ్రీనాథకవిప్రయోగములు- అను వ్యాసములు
చదివిన పిమ్మట నుదయపుసభ ముగించిరి.

మధ్యాహ్నము—ఉభయభాషాప్రవీణ బత్తుల కామాక్షమ్మగారిచే
నిర్వహింపఁబడుచున్న వైశ్యసేవాసదనమునందలి వైశ్యబాలిక లిరువురు
సంగీతముపాడి కొన్నిసంస్కృతశ్లోకములు చదివి సభ్యుల నానందపఱిచిరి.
ఉభయభాషాప్రవీణ చల్లగణపతిశాస్త్రిగారు, అధునాతనకవిత్వము- బ్ర॥ కొ
ట్రశ్యామల కామశాస్త్రిగారు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి చరిత్రము-నను
వ్యాసములం జదివిరి. బొబ్బిలియుద్ధనాటకములయందలి విజయరామరాజు
పాత్రపోషణవిషయమై కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, శతావ
ధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు కవిరాజ వత్సవాయ వేంకటనీలాద్రి
రాజుగారును గొంతముచ్చటించిరి. తెలికిచెర్ల వేంకటరత్నము ఎం. ఏ. గారు
మాతృభాష. పరభాష- యను వ్యాసముం జదివిరి. జ్వాలాపత్త్రికా సంపాదకు
లగు ముద్దు కృష్ణగారు భావకవుల యభిప్రాయములం గొన్నిటిం దెలిపిరి.
బ్ర॥ ఏలూరిపాటి రామభద్రచయనులుగారు లక్ష్మీపతిసోమయాజి భారత
వ్యాఖ్యానముద్రణముంగూర్చి కొంత దెల్పిరి. శ్రీమాన్ వింజమూరి రామా
నుజాచార్యులుగారు (చామర్లకోట) కొంతవిద్యాప్రశంస కావించిరి.

ఆహ్వానసంఘమువారునుబరిషత్తువారునున్యోన్యప్రశంసలుగావించిన
యంతట సభజరుగుటకై పలుతెఱఁగుల సాయపడినవారి నుగ్గడించుచు వంద
నంబులర్పించి సంపూర్తిచేసిరి.

కార్యక్రమములోని కొందఱురాలేదు. కొందఱు పంపిన వ్యాసములు
సకాలమునకుఁ జేరలేదు. ఆయావ్యాసములలో ముఖ్యములయినవి పరిషత్పత్త్రి
కలోఁ బ్రకటింపఁబడును.

# గ్రంథస్వీకారము.

(1) **శ్రీరామచక్రవర్తి, అను కోసలసామ్రాజ్యము:**—కాకినాడ వాస్తవ్యులు బ్ర॥ బులుసు వేంకటసుబ్బారావు బి. ఏ., బి. ఎల్. గారు రచించిన శ్రీరామచక్రవర్తిని గుఱించిన యాఱంకముల నాటకము భవభూతిమహాకవి యుత్తరరామచరితనాటకమునకే సుబ్బారావుగారు కొంతకథాసంవిధానములో మార్పుచేసి మనోహరముగా వచనములో రచియించి యున్నారు. కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రిగారి యాంధ్రీకృతోత్తర రామాయణమును జక్కఁగ జదివి దానింబట్టి యిద్దానిని సిద్ధముచేసితి మని విజ్ఞప్తిలోఁ గవిగారు తెల్పియున్నారు. ఈనాటకమునుగూర్చి విశేషించి మనము నిగ్గుతీయ శ్రమపడనక్కఱలేదు ఉపోద్ఘాతము వ్రాసిన మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర పండిత పరిషదధ్యక్షులైన శ్రీయుత వేనువరపు రామదాసుపంతులుగారు- నాటకములోఁ గవిగారు చేసిన మార్పులను, తెచ్చిన మెఱుఁగులను నాలుగు ముక్కలలో తెల్పియున్నారు దాని నీక్రిందనిచ్చుచున్నాము.

"సీతావిషయక మగు నపవాదమునకు హేతువు భవభూతికృత గ్రంథంబున సుదృఢంబుగాదు అద్దానికిఁ బ్రస్తుతగ్రంథమున సహేతుకంబగు స్థితి చక్కఁగఁ గల్పింపఁబడినది. విష్ణుశర్మ కుమారుఁ డగు బాలునిమృతికిని శంబూకుని శిక్షకును, సీత యపవాదంబునకును నేకీకరణంబగు నూత్నకల్పన మిందుఁ బొందుపఱుపఁబడి యుండుట వస్తురచక మిక్కిలి నైపుణ్యంబున నెఱవేర్పఁబడి యున్నదని చెప్పవచ్చును. భవభూతిగ్రంథమున రాముఁ డశ్వమేధమును సంకల్పించుట కనివార్యంబగు నావశ్యకత గన్పించదు. ఇందలి శ్రీరామచక్రవర్తి ప్రజారక్షణార్థ మశ్వమేధము చేయక తప్పదాయెను. అట్లానిందుఁ దక్కినకథ యంతయు స్వాభావికమై విషయమునుండి విషయము చక్కఁగ వెలువడుచున్నది. కుశలవుల యుద్ధమును నిరూపించుపట్లఁ గవి యనేకవిధముల భవభూతికల్పనకు మెఱుఁగువెట్టి యున్నాఁడు. శంబూకునివధకయి కవికల్పించిన హేతువు సార్వజనీనాంగీకారమును బడయఁగలదు. ఇంతయేల కథాశరీరమునందలి ప్రత్యవయవమును జక్కగా నొకదానితో నొకటి సంబంధించి సమమైన పుష్టి నొసంగి రామణీయకము గొల్పుచున్నది." అని.

ఈనాటకములో శూర్పణఖ, లవణాసురుండు గల్పించుకొనివచ్చి యితివృత్తమునఁ గొంత క్రొత్తవిశేషములను బ్రవర్తించిరి. చదివినం గాని మాటమాటలవలనఁ బాఠకులకు గ్రంథవిస్తరమే కాని తృప్తికలుగదు. దీని వెల 0-12-0.

ఈ క్రింది మూఁడుగ్రంథములును విజయనగరము మహారాజావారి కళాశాలలోఁ బ్రధానసంస్కృతోపాధ్యాయులు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు దయతో పంపినవి.

(1). ఆంధ్రీకృతహర్షచరిత్రము - బాణభట్టునిచే రచితమైన గద్యకావ్యములలో మొదటిదైన హర్షచరిత్రమును దెనుఁగున గానవచ్చు. దీనిని రచించి పిమ్మట కాదంబరిని ప్రారంభించి ప్రథమభాగమును ముగించి మరణించినఁ దర్వాత నతనికుమారుఁ డుత్తరభాగమును రచించెను. హర్షచరిత్రము కాదంబరివంటి మృదుమధురపాకమునఁ బడలేదు. దీని నాంధ్రీకరించుట శ్రమసాధ్యమే. వెనుక శతావధానులు తిరుపతి వేంకటేశ్వరకవులు సరస్వతీపత్రికలో దీనిని మూఁడుచ్ఛ్వాసములు మాత్రమే తెనిఁగించి ప్రకటించిరి. మన యాచార్యులువారు పూర్తిగాఁ దెనిఁగించి ప్రకటించి లోకమునకు మహోపకార మొనర్చిరి. రత్నావళి, ప్రియదర్శిక, నాగానందములను నాటకముల రచించిన హర్షవర్ధనుఁడను నుత్తరహిందూస్థానము నేలిన ప్రభువు దీనికథానాయకుఁడు. ఇది వాస్తవచరిత్రము. ఇందలి శ్లేషలు మున్నగునవి తెనుఁగునకుఁ దెచ్చుట సాధారణపండితులవలనఁగాదు. బాణునిగాంచి రాజు "మహానయం భుజఙ్గః" అని నిరాదరము చూపిన-కవి, "కామే భుజఙ్గతా" అనియున్నది. కామే భుజఙ్గతా యను దానిని దెనుఁగులోనికిఁ దెచ్చుటకష్టమే "ఏది నాభుజంగత" అన్నఁజాలదు. కాని యింతకంటెఁ జేయునది కనఁబడదు. ఇట్టివానిలో ముఖ్యార్థమునే తీసికొనవలయును గాని తక్కిన విఱుపులు వదలివేయకతప్పదు. శ్రీ వేంకటరమణాచార్యులుగారు కావుననే పట్టుదలతో నెనిమిదియుచ్ఛ్వాసములును దెనిఁగించి ప్రకటించిరి.

ఈగ్రంథము బ్ర॥ ఏచూరి నరసింహముపంతులు ఎం.ఏ. గారికిఁ గృతి యీఁబడినది. కళాశాలలోఁ బాఠ్యగ్రంథముగా నియమింపఁ బడఁదగిన గ్రంథమిది. 158 డెమ్మిపుటలు వెల రు ౧.

(2) శ్రీకృష్ణచరిత్రము —ఇదియొకచక్కని వచనకావ్యము. శ్రీకృష్ణుని యవతారనిమిత్తకథనము మొదలు, శ్రీకృష్ణుండు కుచేలునికైశ్వర్య మొసంగువఱకుఁగల భాగవతకథలననుసరించి చక్కఁగా వ్రాయఁబడినది. ఆంధ్రభాగవతముం జూచియే యీకథలు వ్రాయఁబడినట్లు "దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుండనురాజు గలఁడు. ఆరాజుకూఁతురు రుక్మిణియను కన్యకామణి. అయ్యిందువదన నీపదదాస్యం బవలంబింపఁగోరి వివాహమంగళ ప్రశస్తంబైన యొక్క సందేశంబు నీకు విన్నవింపుమని పుత్తెంచె నవధరింపుము. ఏ నీకళ్యాణగుణంబులు కర్ణంబులసోఁక దేహతాపంబులు శాంతించునో, ఏనీదివ్యమంగళ విగ్రహం బీక్షింపఁగన్నులకఖిలార్థలాభంబు గలుగు"నని యిట్లచ్చటచ్చట గనఁబడుచున్నవి. 158 డెమ్మీపుటల గ్రంథము. వెల రు ౧.

(3) అలంకారశాస్త్రచరిత్రము:—ప్రథమభాగము. ఇందలంకారశాస్త్రమునుగూర్చి సంపూర్ణచరిత్రము గలదు. అలంకారము లెంతకాలమునుండివాడుకలో నున్నవో తెల్పియున్నారు. అలంకారశాస్త్రములను రచించినకవులు—మేధావి,ధర్మకీర్తి,భట్టు, భామహుఁడు,(ఈతనిది కావ్యాలంకారము, దానింగూర్చి యాతనికాలముంగూర్చినచర్చలు) ఉద్భటుఁడు, భట్టోద్భటుఁడు, వామనుఁడు, (ఇతనికావ్యాలంకారసూత్రములు) రుద్రటుఁడు (కావ్యాలంకారము) రాజశేఖరుఁడు,(కావ్యమీమాంస) అర్వాచీనాలంకారికులు. అలంకారశాస్త్రోత్పత్తి-లోకమున దానివ్యాప్తియున్నగు విషయము తత్తత్సందర్భములననుసరించి విపులముగా వ్రాయఁబడినవి. ఏ ద్యావిషయమైనగాధ యేదియును విడువకుండఁ దమ తమగ్రంథములలోఁ గవులెక్కించియున్నారు. చూడుఁడు.—

లేఖనసామగ్రి-ఒకపెట్టె, సుద్దముక్కలు, ఫలకము, తాళీపత్రములు, భూర్జపత్రములు, కలములు, సిరాబుడ్లు, తాళపత్రములు, ఇనుపమేఁకులు (అనఁగాగంటములు) కవితనయొద్దనుంచుకొనవలెనని రాజశేఖరుఁడుచెప్పెను. చూ. 192 పుట.

ప్రాచీనభారతీయులసంభాషణరీతి, పఠనరీతి:—కాశికిఁ దూర్పుననున్న మాగధులు నింకమఱికొందఱు సంస్కృతభాషనుజక్కగమాటలాడువారు కాని ప్రాకృతభాష నెఱుంగరు. గౌడదేశస్థుఁడు ప్రాకృతభాషను బాగుగామాటలాడ నేరఁడు... గౌడబ్రాహ్మణుని యుచ్చారణ స్పష్టముగానుండదు... రసమెట్టిదైయుండినను కర్ణాటదేశస్థులు మాటకొసను టంకారశబ్దముతో సగర్వముగాఁ జదు

వుదురు. ద్రావిడులు గద్యమునుగాని పద్యమునుగాని రాగముతోఁ జదువుదురు. సంస్కృతభాషాద్వేషముగల లాటదేశస్థులు లలితమైన జిహ్వలతోఁ బ్రాకృతమును జక్కఁగా మాటలాడుదురు... కాశ్మీరదేశస్థులు సరస్వతీ కటాక్షముచే మంచికవులైనను వారియుచ్చారణ మెంతమాత్రమును స్పష్టముగానుండదు. ఉత్తరపథమందున్న కవులు మంచిసంస్కారము గలవారైనను ముక్కుతో మాటలాడుదురు. పాంచాలదేశకవుల కావ్యపాఠము సంపూర్ణవర్ణరచనతోఁ గూడి యతివిభక్తమై శ్రావ్యమైయుండును." ఇట్లని కావ్యమీమాంససప్తమాధ్యాయమున నున్నదట-

ఇట్టి విషయములెన్నో యీయలంకార శాస్త్రచరిత్రమునఁ గలవు. భాషాభిమానులు ఆచార్యులుగారి ద్వితీయభాగమునుగూడఁ త్వరలోఁ బ్రకటించునట్లు ప్రథమభాగముం జదివి ప్రోత్సహింతురుగాక. 200 పుటలు. వెల రు ౧.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము. ౨౨ { శ్రీముఖనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.




కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచే బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1933.

# విషయసూచిక.

---



---

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| సంపుటము ౨౨. | శ్రీముఖనామసంవత్సరము<br>జ్యేష్ఠాషాఢమాసములు | సంచిక ౨. |
|---|---|---|

## కవిత్వమునఁ గ్రొత్తమార్పులు.

—॥ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప. ॥—

ఎవ్వరికీర్తి లోకమున నెల్లెడ జ్యోత్స్నవలెన్ మనోజ్ఞమై
నివ్వటిలంగ నీర్ష్యగొని నిందలపాలుగ దానిఁ జేయఁగా
నెవ్విధి నెన్నియత్నము లవెంద అదెట్టు లొనర్పఁబూనినం
గవ్వకుఁ గా కడంగు రసికప్రవరుల్ తమిమీఱ నవ్వఁగన్.

భాషాభిమానులారా! సత్యాన్వేషణతత్పరులారా!

ప్రపంచపరిణామ మతివిచిత్రము. దానిపోకడ లెవ్వారికిఁ దెలియవు. తెలిసినయట్లు కొందఱు నటింతురు గాని కొంతకాలమునకు వారిచిత్తముననే సిగ్గుదోఁచును. బుద్ధిమంతు లాయభినయమును గాంచి పరిహాసింతురు. కాని వారుమాత్రము లోకుల నెల్ల వంచించితిమని తత్కాలజనితప్రమోదమున నించుకసుఖింతురు. కాని యాసుఖము పరిణామమున దుఃఖహేతువు గాక మానదు. పరమేశ్వరుఁ డెల్లరఁ గాంచి యానందించుచుఁ గర్మగతుల నరయుచు సర్వసాక్షియై యుండును.

ప్రపంచపరిణామ మనఁగా మానవులచిత్తవృత్తుల గతివిశేష మని యీ ఘట్టమున నర్థము చేసికొనవలయును. మానవచిత్తములు మార్పునొందుటకుఁ గర్మమే కారణము. ప్రపంచమందలివా రెల్లరుఁ గర్మాధీనులు. స్వతంత్రులు

కారు. కాని స్వతంత్రులం బోలి నటింతురు. స్వాతంత్ర్య మన నెట్టిదో వా రెఱుంగ రనియే పారము. అల్పప్రయత్నమున మహాకార్యములు ఫలించుట, మహాప్రయత్నమున నత్యల్పకార్యములు ఫలింపకయుండుట యనునవియే కర్మము బలవత్తర మని తేటపఱిచెను. కాని యజ్ఞానము కప్పియుండుటంజేసి సామాన్యు లద్దానిఁ బరికింపరు. ప్రయత్నలోపముననో యితరులమూలముననో ఆకార్యము ఫలింపదయ్యె నని భావింతురు. ఫలించుచోఁ దనశక్త్యతిశయము ననే యని సంభావింతురు. ఈవిషయమున నభిప్రాయభేదములు లేవనియే నావిశ్వాసము. ఈపై సిద్ధాంతమును ప్రకృతవిషయమున సమన్వయింతము.

ఒకొక్కసమయమున మానవులయూహలు దెసల కెగఁబ్రాఁకుచుండును. ఆయూహలు సమంచితములా కావా యనుమీమాంస చేయునవకాశమే వారలకు నుండదు. లోకము నుద్ధరింపఁ దమకాయూహలు భగవదనుగ్రహమునఁ గలిగెననియే వారలవిశ్వాస మని మన మూహింపవలయును. ఆకాలము తత్పూర్వపుటాచారములనో ధర్మములనో మతెద్దానినో నిర్మూలింపఁజేయఁ గడంగె ననుట స్పష్టము. ఒకప్పు డా యూహలు మంచికే కలుగు ననవచ్చును. ఒకప్పుడు చెడుగునకే కలుగు ననవచ్చును. కాని శాస్త్రసమ్మతములై సర్వసమ్మతములై యున్నవా లేవా యని యూహించుకొనుట బుద్ధిమంతుల లక్షణము.

ప్రాచీనుల ప్రతిభావిశేషము సంస్తుత్యము. అద్భుతావహము. తఱచుగా వారెల్లరు భగవదనుగ్రహపాత్రులే యనవలయు. ఏదో యొకమంత్రముమూలమున నొక్కభగవద్రూపము నుపాసించి దానినే నమ్మి తదనుగ్రహమున విశేషజ్ఞాన మలవడఁగా విఖ్యాతిఁ గాంచిరి. అందుఁ గొందఱు వాగ్దేవి నుపాసించి యామెస్వరూప మగుభాషను వృద్ధిచేయ బూని యాకార్యమే సకలపురుషార్థస్వరూప మనుకొని యామరణము తత్కార్యమునే యొనరించి యశఃకాయము భూలోకమున నిలిపి పరమపదము నధిగమించిరి. కొందఱు వేఱొకవిధమున నావాగ్దేవి నారాధించి దివంగతులైరి. మొత్తముమీఁదఁ బూర్వులెల్లరు వాగ్దేవత నారాధించి కృతకృత్యులైనవారే యనవచ్చును.

నిరంకుశముగా నేకార్యము సాగింపఁబూనిన నది ఫలింపదు. ఒక్కపరమేశ్వరుఁడు నిరంకుశాధికారము గలవాఁడై యగును గాని యితరు లట్టిదానిం బూనిన నది యెంతో కాలము నిలువఁజాలదు. కొన్ని నియమనములకు లోఁబ

డక తప్పదు. ఆనియమము లొకప్పుడు కష్టములఁ గల్గించునవి కావచ్చును. ఆకష్టములు పరిణామసుఖావహములే యగును. నియమవిహీనకార్యములు పరిణామదుఃఖజనకములే యగు ననవలయును. తాత్కాలికసుఖ ముత్తమ మని సజ్జను లంగీకరింపరు దీని కుపమానము సంసారమే కావునఁ బరిణామసుఖావహము లగునియమములే పెద్దలచే నిర్ణయింపఁబడినవి. ఒక్కొక్కభాషానియమము నాలోచింతము.

స్వాభిప్రాయ మితరులకుఁ దెలుపుటకే భాష యేర్పడినది. కొన్నిసంజ్ఞలు కూడ నేర్పడినవి. ఆసంజ్ఞ లించుక మార్పు నొందిన విరుద్ధార్థమును గల్పింపఁజాలు. భాషయు జనరంజనముగా నభిప్రాయము తెలుపునదిగా నుండవలయునే కాని యెట్లో తనభావముల నితరులకుఁ దెలుపునదిగా నుండరాదు. స్త్రీపురుషు లెంద ఱుండుచున్న నేవగించుకొనక యాలించునట్టు భాష యుండందగు. అట్లుండుటకే నియమము లేర్పఱుపఁబడినవి. వ్యాకరణమే కాక గుణదోషవిచారణము కూడ నందు ముఖ్యము లనఁదగు. చంటిబిడ్డ లున్న నెవ్వరికిని విరుద్ధాభిప్రాయము స్ఫురింపదు. స్తన్యమను మాటయు నట్టిదే. అశబ్దమునర్థమునే సూచించు మఱొక్కపదము నుపయోగించిన దంతభంగమునకుఁ గారణం బగు ఉచితజ్ఞత ప్రధాన మని యే యిటఁగలసారము. నియమములు దేశాభివృద్ధికి భాషాభివృద్ధికి నడ్డుపడుచున్న వనియు వాని నిర్మూలించినఁగాని మేలు లేదనియుఁ గొంద ఱందురు. ఆమాటలు పాటింపఁదగినవి కా వనవలయును. నియమబద్ధము కాని దేదియు వృద్ధికి రాదనుట సిద్ధాంతము. కళాశాలలుకూడ నియమములకు లోఁబడుచునవియే కాని సర్వతోముఖస్వాతంత్ర్యమును బాలుర కిచ్చునవిగ నున్నవియా. అట్లున్న నొక్కఁడుంగూడ విద్యాధికుఁడు కాఁజాలఁడు. ఆనియమబలమే వృద్ధికిం దెచ్చుచున్నయది.

కాళిదాసాదిమహాకవులు కూడ ఛందశ్శాస్త్రమును వ్యాకరణము ననుసరించియే కవిత్వము చెప్పిరి. స్వాభిప్రాయప్రకటనమునకు ఛందశ్శాస్త్ర మడ్డుపడుచున్న దన్న నేమనవలయును. అట్టియూహాలు గలవారు వచనమే వ్రాయవచ్చును. ఒక్కొక్కభాషకుఁ గొన్నినియమములు వేఱుగా నుండును. అవియే యాభాషకు వన్నెఁదెచ్చునవి. సామాన్యనియమము లెల్ల భాషలకు సమములుగా నుండును. ఒక్కవిధము లగునియమములే యన్నిభాషలకు నుండవలయు ననుట పొరపాటు. సంస్కృతభాషయందుఁ గవిత్వము సులభ మనియు నాం

ధ్రమున నయ్యది యతిప్రాసనియమములచేఁ గష్టమనియుఁ గొందఱభావము. వారు భాషాభివృద్ధికిఁ బాటుపడువారే యనవలయును. కాని ప్రతిష్ఠం గోరి యేవో మార్పులఁ గావింతమని వారూహించిరని మనమెంచవచ్చును. సంస్కృతకవిత్వమున యతిప్రాసనియమము లేదు. తెలుఁగున నదికలదు. దానిం దొలఁగించినచోఁ దక్కిన నియమము లీరెండుభాషలకు సమానము లగునా. వ్యాకరణమే త్రోసివేయవలయును. యతిప్రాసములు వలదనువారు గణనియమమును మాత్ర మేల యంగీకరింతురో తెలియకున్నది. యక్షగానము లున్నవి. వాని నల్లుకొనుచు నందే రసమున్నదని భావించుకొనుచు మహానందమున నోలలాడవచ్చుఁగదా.

ఆంధ్రభాషకు నన్నయభట్టారకుఁడు తిక్కనసోమయాజి శంభుదాసుఁడు లోనగువారు జనకులవంటివారని ప్రతీతి యొక్కఁడుకలదు. దాని నాక్షేపించినవారు గాని నన్నయాదులకుఁ గవిత్వముచెప్ప నేర్పు లేదనువారు గాని యీవఱకున్నయట్లు కానరాదు. వారు త్రిమూర్తు లనియు వారికవిత్వమే యితరుల కెల్ల నుదాహరణ మనియుఁ బెద్ద లనుచుందురు. ఒక్క రిద్దఱు తిక్కనయే నన్నయభట్టుకంటె మిన్న యని యెన్నువారుండిరి. కాని నన్నయ్య కేమియుఁ దెలియదనసాహసించువారుకనఁబడకుండిరి. నన్నయ్యభట్టారకునిగతియే యట్లు కాఁగాఁ దక్కినశ్రీనాథాదులగతి యేమగును? వాగనుశాసనుఁడని కవిబ్రహ్మ యని ప్రబంధపరమేశ్వరుఁడని కవిసార్వభౌముఁడని బిరుదములం దాల్చి నలుపురిలోఁ దలయెత్తుకొని తిరుగుచు నేదో కీర్తిఁగాంచిరి. ఆబిరుదము లిపుడు మెల్లగా వారినుండి వదలింపఁబడుచున్నవి. పాపము! ఇపుడు వారుండిన నెంత బాగుగ నుండును? వారుండిన వీరుండరేమో!

మానవస్వభావము తఱచుగా నీర్ష్యఁ బూనునదియేమో యను సందియ ముదయించెడు. వారి నాక్షేపించినఁ గాని గొప్పవిఖ్యాతి రాదని యుదానియలవాటేమో! ఏదియైననేమి? నన్నయాదులకు మాత్రము చీవాట్లు తప్పినవికావు. వారి యశఃకాయ మక్షతమని యెల్ల రంగీకరింతురు. కొంతకాలముక్రింద వారాదికవు లన్నకారణమున నీయఁదగిన తాంబూలమున కించుక యాక్షేపము వచ్చియుండెను. ఆతాంబూలచర్చ యింకను గూడ నూఁగులాడుచునేయున్నది. అది యట్లుండఁగా దానిని మించిన దెబ్బ వారికిం దగులు నట్లున్నది.

నన్నయాదులు భాషాద్రోహులు, కవిత్వము చెప్పనర్హులు కారన్నవా రెంతవారో వచింప విరించియేని శక్తుఁడగునా. కాఁడనియే సారము.

ఏమేమీ జగతిం గఠోరములు శైలేంద్రంబు లౌఁగా తదీ
యామేయస్వయభేది యంతకుఁ గఠోరాకారుఁ డౌనేకదా
యామేటిక్ ధృతివాపి చూపులనె యూటాడించువా రెంతవా
రో మీనేక్షణ తానెఱుంగదె తదాయూఢ ప్రభావోన్నతుల్.

అన్న రామరాజభూషణుని హృద్యమగు పద్యము స్మృతిగోచర మగుచున్నది. ఇప్పట్టున రామరాజభూషణుని హృద్యమగుపద్య మనుట పొరపాటేమో. ఏమహాత్ముని వాగ్ధోరణి నుదాహరణముగాఁ గైకొని తరువాతిమహాకవులెల్లఁ దమకవిత్వమునకు మెఱుఁగుపెట్టికొనిరో, ఏభాషోద్ధారకుని పాండిత్యము సర్వతోముఖమై యొసంగుచుండెడునో, అట్టిమహాత్ముని నన్నయార్యుని నీసడించుట యెంతసాహసము ! ఎంతదుష్పాండిత్యము !

యతిప్రాసముల వదలిన మే లనువారిభావ మని రెండును గవిత్వధోరణి కడ్డుపడుచుండు ననియే యుండవచ్చును. సంగీతమునకుఁ దాళ మెందులకు ? శ్రుతి యెందులకు? గాలిపాటగాఁ బాడుచుండవచ్చును గదా. తాళశ్రుతులద్దాని కడ్డుగా నున్న వని యెవ్వరైన వానిని ద్రోసివేయ నూహించినారా? వ్యాకరణము చదువుట కష్టమని దానిం ద్రోసివేయఁ దగునని యొకఁడనును? ఇట్లే యెన్నియో విధులకు స్వస్తిచెప్పిన మేలని తోఁపవచ్చును, అంతమాత్రమున వానినెల్లఁ దొలఁగింపవలయునా ! గణయతిప్రాసము లుండిననే యది కవిత్వ మనిపించుకొనును. అది మానిన యక్షగాన మనవచ్చును. తెలుఁగు బాస కిదియే మంచిమార్గ మని యెంచి పెద్దలు నిర్ణయించిరి. వాని మాన మేలుకాదు.

వ్యర్థపదము లుండరా దనియు నది కవిత్వమే కా దనియుఁ గొందఱి మతము. ఆపక్షమున వాల్మీకికవిత్వముకూడ నిలువదు. నిరర్థకముగా విశేషించి యట్టిపదములు ప్రయోగింపఁ గవులుసమ్మతింపరు. కొన్నితావుల నట్టివి కూడ నుండవచ్చును. ఈవిషయము నాక్షేపించుట వ్యాసమహర్షిని "చకారకుక్షిగాఁ" డనుట యెట్టిదో యట్టిది. ప్రాయికముగా మాటలాడునపు డెన్నియో వ్యర్థపదములు దొరలుచుండును. "తు హి చ స్మ హ వై రామ స్తు హి చ స్మ హి జానకీ" అని యెవ్వరు కవిత్వము చెప్పరు- నన్నయాదు లట్టివ్యర్థపద

ములఁ బ్రయోగించిన జాడ కానరాదు. సార్థకపదప్రయోగము చేయువా రనియే వారికిఁ బ్రఖ్యాతికలదు.

దళితనవీనకందళకదంబకదంబక కేతకీరజో
మిళిత సుగంధబంధురసమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తు లనునుయ్యెల లొప్పుగ నెక్కియూఁగె ను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్.

ఇందు "ఒప్పుగన్" ఏటి కనువా రుందురు కాఁబోలు. దానియందలి యర్థవిశేషము నెఱుంగఁజాల రనియే సమాధానము.

తఱచుగాఁ బ్రాచీనమహాకవు లర్థమును జక్కగాఁ బోషించి రనియే యందఱు అంగీకరింతురు అట్టిమహాకవులఁ దూలనాడుట మంచిదిగా దని మనమెల్ల వారిని బ్రార్థింపవలయును. కవిత్వ మిష్టము లేకున్నఁ జక్కనివచనగ్రంథముల వ్రాయవచ్చును. కాని మహాత్ముల దూఱుట పాడిగాదు. భావకవిత్వ మని క్రొత్తపే రేదో పెట్టఁ దలఁచిరి గాని యది వారికే వెగటుగఁదోఁచిన దన వచ్చును. భావవిహీనకవిత్వము గూడ నుండునా? అపూర్వవిఖ్యాతిం గాంచ నెంచి ప్రాచీనమతములఁ బాడుచేయఁబూనక యవ్వానిని శిథిలములు గాక యుండఁ గాపాడఁ బ్రయత్నింతు రేని వారిపరిశ్రమము మాబోంట్లకు మార్గదర్శకమై శిరోధార్యమగును. నాలుగు ప్రక్కలనుండి పాషాణప్రయోగములఁ జేసి యాంధ్రభాషాయోషామణిని జంపఁ బ్రయత్నింపరా దని వారిని బ్రార్థింపవలయును. ఇప్పటివారియాశయ మప్పనికిఁ గాకున్నను దుద కది యక్కార్యమునకే చాలియుండును. అట్టికార్యమునకుఁ బూనక యింక నెన్నియో భంగులఁ బూర్వమార్గముల వృద్ధిచేయఁ బూనుఁడని వారిని నిరంతరము ప్రార్థించుచుండవలయును. వారును శ్రీపరమేశ్వరుననుగ్రహపాత్రులు కాన నట్టికార్యములనుండి విరమించి ప్రాచీనపథముల నెన్నియో భంగుల వృద్ధిచేయఁ బూనుదు రని యాశించుచున్నాఁడను. ఈనావాంఛితము ఫలించుఁగాక.

---

# తెలుఁగుబాస.

— బులుసు వెంకటరమణయ్యగారు, రామతీర్థము —

క. జిలిబిలిపలుకులఁ బలు ముద్దులు గులికెడి తెలుఁగుబాసతో సరి యగునే!
తెలిసియుఁ దెలియక పీనుల, నలయించెడి వెఱ్ఱిమొఱ్ఱియరమరబాసల్.

ఏదేని దేశముయొక్క యభివృద్ధికిఁ గాని గౌరవమునకుఁ గాని విషయాంతరములకంటె భాషాభివృద్ధియే ముఖ్యసాధన మని చెప్పుట నిర్వివాదాంశము. కావునఁ బ్రస్తుతకాలమున నాంధ్రదేశాభివృద్ధికిని, ఆంధ్రజాతీయతను వ్యక్తిత్వమును, బ్రత్యేకతను నెలకొల్పుటకు సహస్రముఖములఁ బనిచేయుచున్న మన యాంధ్రసోదరులుకూడ భాషాభివృద్ధికిఁ దోడుపడుట ముఖ్యకర్తవ్యము- కావున నే నిపుడు "తెలుఁగుబాసం" గూర్చి యించుక ముచ్చటించుట యప్రస్తుతము కాఁజాలదు. తెలుఁగుబాస పుట్టినదాది నేఁటివఱకును దానింగూర్చిన ముచ్చటింపులు జరుగుచునేయున్నవి. ఆంధ్రభాషాభివృద్ధికరము లగుప్రోత్సాహములును జరుగుచునేయున్నవి. కానఁ జర్వితచర్వణముగ నే నావిషయమునుగూర్చియే ముచ్చటించుట యనవసరము కావచ్చును. కాని నాయీముచ్చటింపు వెనుకటివిద్వన్మహాజనులయుపన్యాసములకు దార్ఢ్యాపాదక మైనఁ గాఁగల దని తలంచుటయు నాతప్పు కాఁజాలదు.

పాశ్చాత్యవాఙ్మయవ్యామోహమున మునిఁగియున్న యాంధ్రసోదరుల కర్ణములయందు "దేశభాషోద్ధరణమునకై కంకణముకట్టుఁడు దేశాభిమానమును జూపుట కిదియే తరుణము" అనునీరీతి శంఖధ్వానములు ప్రతిధ్వనించి కార్యరూపమునఁ బరిణమించుట కవకాశము లేకపోయినది. తెలుఁగుబాసయొక్క వైలక్షణ్యము, భాషాంతరములకంటె నందుఁగల మాధుర్యము, నొకకొంత ముచ్చటించినఁ గొంతవఱకేని యుపయోగము కలుగకపోదనునమ్మక మొకటి నాయీవ్యాసరచనమున ముఖ్యకారణ మగుచున్నది. దేశాభిమానపుసంగతి యటుంచినను, భాషయందలి యుత్కృష్టత యైనను దనపుత్రునకుఁ దనయెడగౌరవము కలుగునట్లొనరించుటలోఁ గారణ మగుటలో సందేహము లేదుకదా !

ఆంధ్రి ప్రాకృతభాషావిశేష మనియు, సంస్కృతప్రాకృతములు దీనికి మూలము లనియుఁ బ్రాచీనులసిద్ధాంతము. సంస్కృతము ఇండో-యూరపియన్ లేక జర్మానిక్ భాషాకుటుంబమునకుఁ జెందిన యార్యన్ శాఖలోని దనియు, మన తెలుఁగు ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందిన నవీనభాష యనియుఁ,

దమిళకర్ణాటభాషలు దీనికి మూలము లనియును నవీనవిమర్శకులసిద్ధాంతము. ఏది యెట్లున్నను మన తెలుఁ గొక ప్రత్యేకభాషయై "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యనుమేటికీరితి గడించినదనియు, గణింపనర్హమైన దనియుఁ జెప్పవలసియున్నది.

పాశ్చాత్యభాషలలో నాంగ్లభాష చాల నవీన మైన దైనను సర్వదేశములందును దానే మిన్నయై యందఱికిని బ్రధానభాషగా మాఱిపోయినట్లే ద్రావిడభాషలలో నవీన మని చెప్పఁబడు మన తెలుఁగు తక్కినద్రావిడభాషలకంటె మిన్నయై, ద్రావిడభాషలలోఁ బ్రధానమై రమారమి రెండుకోట్లనాల్గులక్షల ప్రజల జిహ్వాగ్రములఁ దాండవమాడుచుండి భారతదేశమందలి భాషలలోఁ ద్వితీయస్థానము నలంకరించుచున్న దనుట కాంధ్రులు గర్వింపవలసియున్నది.

కాని యాంధ్రదేశవిస్తీర్ణతను బట్టి చూచినను మనయాంధ్రులసంఖ్యను బట్టి చూచినను మనవారు భాషకుఁ దగినగౌరవము నిచ్చుచున్నట్లు కనఁబడకున్నది. తెలుఁగుతల్లి యిందఱిపోషణమున నున్నందులకు వాసియు వన్నెయుఁ గల్గి యితోఽధికముగ మేటికీరితిని గడించి యుత్తరదేశీయులచేఁ గూడ గౌరవము నందవలసియున్నది.

ఆంధ్రభాష యొకమాదిరిగ మంచిప్రచారమున నున్నను వాఙ్మయమునకు మాత్రము తగినయభివృద్ధి కలుగుచుండుట లేదు. అందులకుఁ గలకారణములు పాశ్చాత్యవ్యామోహము, నంతఃకలహములు నని యనవచ్చును. పాశ్చాత్యభాషాభిజ్ఞులగు మనవారు కొందఱు గృహమునందలి వ్యవహారముల కొఱకే యాంధ్రమును వినియోగించి తక్కినవిషయము లన్నియు నాంగ్లముననే పరిష్కరింతురు. చదువుకొనువార్తాపత్త్రిక యేహిందూపత్త్రికయో యేస్వరాజ్యయో, లిబర్టీయో! మాసపత్త్రిక, యేమాడరన్ రివ్యూయో యైయుండును. ఆంధ్రపత్త్రికను జదువుట యగౌరవము. పరిషత్పత్త్రిక ముట్టినచోఁ బరువుపోవును. భారతిని గొందఱు తెప్పించుచున్నను, నది యాఁడువారిప్రార్థనలపైనే. పుటలఁ దిరుగవైచినను బొమ్మలకొఱకే వాఙ్మయము నెడఁ గలయిట్టి యభిమానము తదభివృద్ధి కెట్లు కారణము కాఁగలదో సహృదయైకవేద్యము.

ఏవాఙ్మయముననులేని వ్యావహారికగ్రాంథికవిభేదము లాంధ్రముననే యుద్భవించినవి. వీరిని వారు, వారిని వీరు విమర్శించుకొనుటకే సమయము చాలకున్నపుడు వాఙ్మయము నభివృద్ధిపఱుచుటలో నాలోచించుటకుఁ గూడ సమయము చిక్కు టెట్లు ?

వాఙ్మయాభివృద్ధిభంజకము లగు కారణాంతరములు కొన్ని లేకపోలేదు, కాని, యవి సర్వభాషాసామాన్యము లగుట వానిని వివరింపనక్కఱలేదు. తక్కిన భారతీయు లన్ననో తమభాషావాఙ్మయముల యభివృద్ధిం గూర్చి యేమఱి యుండరు. అవకాశము చిక్కినపుడెల్ల వారు దేశభాషలందుఁ బాండిత్యము సంపాదింప విశేషపరిశ్రమ లొనర్చుచుందురు.

మనవారు తల్లిబాసను దగినంతరీతిని గౌరవింప కుండుటలో నింకొక ముఖ్యకారణము భాషాప్రాశస్త్యము నెఱుఁగకపోవుటయే యని చెప్పవలెను. ఎఱిఁగియే యున్నచో మనమధురభాష మాఱుటతల్లియై పోయి మాఱుటతల్లియైన యాంగ్లము మాతృసమానయై యుండఁజాలదు.

ఆంధ్రమునకుఁ గలదేశభాషాంతరవైలక్షణ్య మేమో కొంచెము విచారింతము. సంస్కృతమునందు వలెనే యిందును వర్ణము లన్నియుఁ బలుకుబడిలోఁ గలవు. హిందీ, బెంగాలీ, ఒరియా మొదలగుభాషలు సంస్కృతముతోడి దగ్గఱిసంబంధము కల్గి యార్యన్‌శాఖకే చెంది యున్నను, బలుకుబడిలోమాత్రము సంస్కృతముకంటెఁ జాల విలక్షణములై యున్నవి.

హిందీభాష మాటలాడువారు సంస్కృతోచ్చారణమునఁగూడ షకారమునకు బదులు ఖకారమును, యకారమునకు బదులు జకారమును, వకారస్థానమున బకారమును నుచ్చరింతురు. ఉదా- సహస్రశీర్షాపురుషః. జమునా, బిశ్వనాథ్. మొ॥ ఇందుఁ దుదియుదాహరణమున థయనుటకు మాఱుగ నచ్చును విడిచి హల్లును మాత్రమే గ్రహించుటలవాటైపోయినది. పదము తుద ద్విత్వవర్ణముగాని సంయుక్తవర్ణముగాని యున్నను, నది హ్రస్వాంతమైనచోఁ బొల్లుగనే యుచ్చరింతురు. వారు సంస్కృతము నుచ్చరించునపు డీవిషయములఁ గనిపెట్టవచ్చును. ఉదా-అతఏవ=అతఏవ్. (౨) సర్వత్ర=సర్వత్ర్. మొ॥ ఇయ్యది హిందీసాంప్రదాయమై యుండనోపును. పదంబు తుదిస్వరము (హ్రస్వమైనచో) విడుచుట నియతమగుటచేతనే గాఁబోలు వారు పదాంతముల యక్షరములందుఁ బొల్లుల చిహ్నముల నుపయోగింప నవసరము లేకున్నది. ఉదా- గడ్‌బడ్ అనుటకు బదులు గడబడ యనియు, నరమ్ అనుటకు నరమ అనియు నీరీతులనే లిఖింతురు. వారు వర్ణముల నన్నింటిని నుచ్చరింపఁ దలంచినఁ గొంతప్రయత్నము మాత్ర మవసర మగుచున్నది.

వంగీయులు వకారమునకు బకారమును, క్షకారమునకు ఖకారమును, యకారమునకు జకారమును నుచ్చరింతురు. ఉదా-వెంకటేశ్=బెంకటేశ్. సాక్షిగోపాల్=సాఖిగోపాల్. సరయూ=సరజూ. మొ॥

హిందీమాటలాడువారు ప్రయత్నపూర్వకముగ నైనను వర్ణములనన్నింటి నుచ్చరింపం గలుగుదురు. కాని వంగీయులు మూండువంతుల ముప్పాతిక పాళ్లు ప్రయత్నపూర్వకముగ నైన నన్నివర్ణముల నుచ్చరింపంజాల రని తోంచుచున్నది. ఒరియావారు సర్వవిధముల వంగదేశీయులకు సోదరులే. భాషావిషయమున వీరి శాస్త్రపు టుచ్చారణమును లే దనవచ్చును. సామాన్యముగ నోత్వము సర్వవర్ణసాధారణము తక్కినయుచ్చారణము, వంగదేశీయుల నే యనుసరించును. ఉదా-బోధ=బోధో. శాసన=శాసానో. మొదలగునవి.

పై విషయములంబట్టి పై వారు వర్ణముల నన్నింటి నుచ్చరింపంజాల రని చెప్పినట్లు తోంచవచ్చును. కాని సర్వసామాన్య మగునాంగ్లభాష నుచ్చరించుటలో భేద మంతగా బోధపడదు. ఆంగ్లమున 'వెరీ' అనుటకుం బైవారిలో నెవ్వరును 'బెరీ' అనియనంజాలరు. కావునం బై భాష లన్నియు సామాన్యముగం బ్రాకృతభాషాసంబద్ధము లగుటచేం దత్సాంప్రదాయములే వీనియందు సంక్రమించిన వనియు, నందుచే భాషలోనే సర్వవర్ణముల నుచ్చరింప నవకాశము నవసరము లేకపోయిన దనియును మనము చెప్పవలసియున్నది.

ప్రాకృతములో యకారము జకారముగను, వకారము బకారముగను, షకారము ఖకారముగను నీరీతిగ మారుట మన మెఱుంగుదుముకదా!

ఇంక దక్షిణభారతభాషలలో ముఖ్య మగు తమిళమును గనుంగొందము. అందచ్చులం దనుస్వారము, విసర్గము, ఋ, ౠ, ఌ, ౡ లును లేవు. హల్లులలో వర్గద్వితీయతృతీయచతుర్థాక్షరములు లేవు. శ ష స హలు లేవు. కాని కొన్నివింతయక్షరములు కలవు. ఇక్కాలమున సంస్కృతశబ్దములు వచ్చుచోట జ-శ-ష-స-హ-క్ష అనువర్ణములకు మాత్రము క్రొత్తలిపులను గల్పించుకొనవలసివచ్చినది. ఋకారమును రి గానే తమిళు లుచ్చరింతురు. అట్టిభాషలో వర్ణముల సంపూర్ణోచ్చారణమున కవకాశము కలుగదుకదా!

ఆంధ్రభాషయందుం దత్సమపదము లెక్కువగ నుండుటచేతను, దదుచ్చారణము ననుసరించి యాంధ్రమున నన్నివర్ణముల నుచ్చరింప నవకాశ ముండుటచేతను, నిట్లాంధ్రు లుచ్చరించుచుండుటచేతను, దక్షిణభాషలకంటె

నాంధ్రియే స్పష్టోచ్చారణము కల దనుట నిర్వివాదము. తక్కిన భాషలలో లేని దంత్యతాలవ్యభేదమును స్వల్పభాషలలోఁ గల శకటరేఫళకారభేదము నాంధ్రమున నుండుటయు నేతద్భాషయందుఁ గల యుచ్చారణస్పష్టతను విశదము చేయఁజాలి యున్నవి. శ, స కారములభేదము, థ, ధ కారములభేదము నాంధ్రోచ్చారణమునఁ దెలిసికొనుట కష్టమని కొందఱాక్షేపింపవచ్చును. ఎట్టిచోట సకార ముచ్చరింపవలెనో, యెట్టిచోట శవర్ణము నుచ్చరింపవలెనో, యెచ్చట ధకార ముచ్చరింపవలెనో, యేకడ థకారము నుచ్చరింపవలెనో తెలిసికొనుట దుర్ఘటము. అయ్యది సంస్కృతవ్యాకరణసాధ్యము. పండితులకుఁ గూడ నిట్టిచోట్ల భ్రాంతి కల్గుట కలదు. కాన జనసామాన్య మాభేదమును బాటింప దనుటలో వింతలేదు. ఈవిషయము సంస్కృతసంబద్ధ మగుటచే భారతీయభాష లన్నింటివిషయమున నీయాపత్తి యుండనే యున్నది. కావున మన వారాయావర్ణముల నుచ్చరింపలేక యాభేదములను బాటింప మాని రనుట మాత్ర మనుచితము.

జాను తెనుఁగునఁ గలమార్దవ మగణ్యము. కఠినాక్షరములు లేక స్పష్టోచ్చారణము కలిగియుండుట నది ముద్దులు గులుకుచుండును. జిలిబిలిపలుకు లాంధ్రమునకే చెందినవి. కావుననే కర్ణాటభాగమునే చాలవఱకును బరిపాలించిన కృష్ణరాయఁడు "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని పల్కి దానినే యాదరించి కర్ణాటిం గొంతవఱ కుపేక్షించెను. తంజాపురపరిపాలకు లగు నాంధ్రులు, మహారాష్ట్రులు కూడ దేశభాషయగు నఱవము నుపేక్షించి యాంధ్రినే యాదరించి ముద్దులొల్కు నాంధ్రప్రబంధములను లెక్కలేని యాంధ్రప్రబంధములను స్త్రీలచేతం గూడ రచియింపఁజేసి తెలుఁగుతల్లికి విలువలేని యలంకారములఁ గానుక లొసంగిరి. తెలుఁగు మధురభాష గావుననే మాధుర్యమున వన్నెకెక్కిన యిటలీభాషతో సామ్యమంది పాశ్చాత్యులచే నిండియన్ ఇటాలియను మేటిబిరుదు గడియించెను. అట్టి మనమధురభాషను బాశ్చాత్యవాఙ్మయవ్యామోహమునఁ బడి మనమే యుపేక్షించుట తప్పుపని. కావున సహృదయు లగు నాంధ్రపుత్త్రు లెల్లరును వాఙ్మయాంతరములం దాసక్తియున్నను స్వభాషయందుఁ గొంచె మెక్కువగ నాదరము చూపి వాఙ్మయాభివృద్ధి కనువగురీతిని భాషాపోషణకై కడంగుదురుగాక !

గీ. తెలుఁగువారమంచుఁ దెలుఁగు మాది యటంచుఁ
దెలుఁగు పలుకు తేనె లొలుకునంచుఁ
బలుకుమనము తెలుఁగు కలికిఁ బోనాడినఁ
దెలుఁగువంత లెట్లు తొలఁగఁగలవు ?

గీ. కోరఁగా లేదు గొంతెమకోరికలను
మధురభావమై పరఁగెడి మన తెలుంగు
హిందికున్న ప్రచారము నొందెనేని
చాలు; మాకింక నంతియ చాలుఁజాలు.

---

# అహింసా.

కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు.

---

శ్లో. ఈశామాత్రవశా చ్చరాచరమయం దేవేన సృష్టం జగ
ద్వ్యక్తాయుక్తవిచారణా భగవతా దత్తానరాణాంపునః ।
ఆత్మానందనిదానధర్మసరణౌ సంస్థాప్యవృత్తింధియః
కారుణ్యం కరణీయముత్తమజనై స్సర్వేషు జంతుష్వపి॥

శ్లో. అహింసైవద్వారం సుకృతభవనంప్రాప్తుమనసాం
మహర్షీణాం వాచామపిసమరసో భూతకరుణా ।
గరిష్ఠోఽంతస్సార స్సకలతపసాం ప్రాణిషుకృపా
తతోఽయంధర్మాణాంధురి పరమధర్మోవిజయతే॥

శ్లో. బహుబ్రహ్మాండాభప్రబలభరగోణీప్రణమితాన్
యుగవ్యామర్దే నప్రకటితశిరోధిస్థ పిశితాన్ ।
శిలాతుల్యస్వాంతైః కఠినకశయాచూర్ణితతనూన్
పశూన్దీనాన్త్సంతస్సుమవత, నతేషాంహిశరణమ్॥

# ఆర్తరక్షామణి.

— వడ్డాది సుబ్బారాయఁడుగారు, రాజమహేంద్రవరము —

*మ. అరి శేషం బగునం డ్రపాయకర; మద్దాతాటకాపుత్రు లి
ర్వరలోఁ జంపి సుబాహువున్; మిగిలెం గ్రూరాత్ము మారీచు నీ
మరుదస్త్రంబు; బెడఁబాటు చానికతనం బాటిల్లె నీ కింతికిన్;
హరిణంబై కనుఁబ్రామె వాఁడె కద; రామా! యార్తరక్షామణీ. ౪౭

శా. కాకం బక్షిని బోలె నీ చిలుకునం గాంతార వాసంబునం,
బైకం బెల్లను బాసి నీవలుకునన్ భార్యావియోగంబునన్;
గాఁకం దూలిచి లోకులన్ మనుచు తొల్లారెట్టు, లట్లద్ది, నీ,
కా కాలంబున దుస్సహంబగుట; రామా! యార్తరక్షామణీ. ౫౪

శా. కాకిం గోకిల మించు మించుగ నొకాకారంబునం దోఁచుఁ; గా
నీ, కంఠస్వర ముప్పుఁ గప్పురము, వర్ణింపంగ నవ్వాని; కిం
తే కాకాయుది గర్భశత్రు; లోకఁ డొంటిం గేర కుంఠంగ, నీ
వాకన్నెల్గులు రెంటి కూడ్చితివి; రామా! యార్తరక్షామణీ. ౫౫

మ. కడగండ్లం దొలఁగింపు మం, చెవుడు నీ కాంతార వాసంబునం,
బడుచుం దైన్యము, వేల్పునేని నయినం బ్రార్థించుటల్ గాన రా;
వుడుపం గోఁతులు నీకు; నీవయి నొకం డున్నం గదా వేఁడుకో;
లడ లన్నట్టిది నీకు వేడబడు; రామా! యార్తరక్షామణీ ౫౬

శా. వాలిన్ వృక్షము మాటునన్ నిలిచి చాపం గొట్టుటం దక్క, యే
మాలిన్యం బరి యేని వ్రేల్మడఁచి యుష్మచ్చర్యలం జూపఁ గాఁ
జాలం; డందులధర్మసూక్ష్మత గనన్ శక్తుండు వాల్మీకి యే;
యాలిం దమ్ముని దాని వాఁడు గొనె రామా! యార్తరక్షామణీ. ౫౭

మ. తొలుతన్ నీ నుపరాక్రమం బరసి, నీతో నల్పుసఖ్యంబు చే
నలుకుం బాసి, స్వభార్యతోఁ బడసి రాజ్యం బన్నదారన్, బయిన్
జెలిమిన్ నిన్ దలపెట్ట కర్కజుఁ డతిస్త్రీలోలుఁడై యుండ నీ
యలుఁగుం దెల్పి తొలంచి తత్తగులు; రామా! యార్తరక్షామణీ. ౫౮

మ. సరసీజాంతరకర్ణికాకృతిని హస్తంబందు నీముద్దుటుం
గరమొప్పన్, హనుమానుఁ డర్ణవముఁ జుల్కందాఁటి, గాలించి మా

ఈ *౪౭ పద్యమును ౪౬ పద్యముకడఁ జదువుకొనవలయును.

పు రహస్యంబుగ లంక, సీతఁ గని, త్వన్ముద్రఁ సమర్పించి, క్ర
మ్మఱి తచ్ఛిరోమణిఁ నినుం దరిసె; రామా! యార్తరక్షామణీ! ౫౯

మ ధరియించెన్ దనహస్తమందు నిజచిత్తంబందు నీముద్ర; య
బ్బురమా మారుతి యొక్కగంతున మహాంభోరాశి లంఘించు? టా
హారి సీతం గనుమాత్రతో మురలెనే? యాలంక నీలెంకలా
వరయం జల్పెను భస్మసాత్కృతము; రామా! యార్తరక్షామణీ. ౬౦

మ. పరదారాపహృతిం బ్రతిష్ఠ చెడు; సంపాపించు నాపత్పరం
పర; సీతన్ విడుమన్న, నన్న, సభఁ గోపం బెత్తి తన్ దన్న నీ
దరిఁ జేర్చ్కొన్న విభీషణుం దనుజు, నీతమ్ముం బలెం గన్నపు
ణ్యరఘూత్తంస! దయాపయోనిధివి; రామా! యార్తరక్షామణీ. ౬౧

మ. ఎడఁబాటుం దవకీలి, క్రోధశిఖముల్, హృద్వీథి నూడించునన్
జడిపింపంగ మహాజి నింద్రజి మహీజన్ నిల్పి, ఖండింపఁగన్
మెడ, నబ్బంగరు లేడివంటి దని దానిం దల్పలేకొందు నీ
యడలుం దెల్పి, విభీషణుం డుడిపె; రామా! యార్తరక్షామణీ. ౬౨

మ. కలకుంగొడ్డట నెన్ని, యెన్నితడవల్ ఖండించెనున్నీల వా
పుటియల్ ముందటి రాముఁ; డన్ని తలలీవుల్ రావణబ్రహ్మ వే
తలుగంగాంచితి, హృత్సుధాకలశవృత్తాంతం బెఱింగింప కే
మఱెఁ గానన్ దొలుతన్ విభీషణుఁడు; రామా! యార్తరక్షామణీ. ౬౩

మ. వనవహ్ని ప్రతిమానశోకదహన జ్వాలావలీఢంబునం
దనపాయస్థితిఁ దావకీనహృదయుంబు దొవ్వవె దేహి, లం
కను దానొక్కముహూర్త మగ్గివిలువంగాఁ జాలుటబ్బంబె? య
య్యనలుండున్ సతినాఁటలేఁడు సుచి; రామా! యార్తరక్షామణీ. ౬౪

మ. అరియాకుల్ బలెనెంతవారలకునే నాపత్తులున్ సంపదల్,
దిరుగంగాలము, వచ్చువంతు మెయి; నేదింగా నయారెండిటం
దిర; మిక్కుట్టలఁ గాచు ధైర్యము యనన్ దృష్టాంతమాదివ; శ్రీ
హారికిన్ నీకె సుటిల్లెఁ గష్టములు; రామా! యార్తరక్షామణీ. ౫౫

మ. భవదంఘ్ర్యభ్యటనంబు గౌతమికి సంపాదించె భాగీరథీ
ప్రవరత్వంబు, బదర్యరణ్యముఖతీర్థశ్రేష్ఠతన్ దండకా
టవికిన్, హైమనగాదులొందిన ప్రతిష్ఠన్ రామనామాద్రికిన్,
భవనాశంబు భవత్పదాంకనము; రామా! యార్తరక్షామణీ. ౬౬

మ. తనకుఁ విశ్రవసుండు దండిరి, పులస్త్యబ్రహ్మతాతైన, దు
ష్టనిశాటుం డయి రావణుం డఖిలవిశ్వక్షోభకుం జేయుచుం
టను, వానిం దునుమాడి, బ్రహ్మవధ గానఁ, రామలింగేశ్వరుం
డన సేతుస్థలి నిల్పి తీశ్వరుని; రామా! యార్తరక్షామణీ. ౬౭

మ. శివలింగంబుఁ బ్రతిష్ఠ సల్పితివి తత్సేతుస్థలిఁ భక్తి, వి
ష్ణ్వవతార ప్రథితుండ; వీశ్వరుఁడు నిన్నారాధ్యుఁజేసెయాకృతిం
బవలుఁ రేయి భజించు భక్తుఁ డగుమఁ; భావింపఁ దత్త్వంబునం
దపభేదం బగు మీకు నిర్వురకు; రామా! యార్తరక్షామణీ. ౬౮

శా. వేదోద్ధారక! మందభూధరధరా! పృథ్వీవిముద్ధర్త! ప్ర
హ్లాదోపాసిత! యాచనాపహృతబల్యైశ్వర్య! దుష్టేడ్వన
చ్ఛేదీ! శైవధనుర్విభంగచణ! దుశ్చేష్టత్రిశీర్షాదిమ
ర్త్యాదప్రాణమరుత్ఫణిప్రవర! రామా! యార్తరక్షామణీ. ౬౯

శా. భల్లూకంబులచేత వానరులచే వారాశిఁగట్టింపఁగాఁ
జెల్లుఁ వారధి యేనరాధిపతికిఁ? సీతాపహారిం బగఁ
ముల్లోకంబులు గెల్చి విక్రమనుజుఁ బోకార్చి రాఁగంటి శుం
భల్లీలం బురి; కంబుజాక్షుఁడవు; రామా! యార్తరక్షామణీ. ౭౦

మ. సరిచూడం బాగ లేఖపైఁ దనరు భాస్వజ్జ్వాలతో, నగ్ని వి
ల్పిరో నాఁ, జిచ్చున నేక వేణి యగుచుఁ వెల్గొందు, సాశీల్యమో
ల్లరకుందెల్పినసీతఁ గూడి విజయోల్లాసంబునఁ వచ్చి తం
బరయానంబున నీ వయోధ్యకును; రామా! యార్తరక్షామణీ. ౭౧

శా. శ్యామంబై నవనీరదంబు నయనాహ్లాదంబు గావించు న
ట్లామోదంబు ఘటించు నుల్లమునకుఁ ధ్యానింప నీమూర్తి; నీ
నామం, బాకృతిఁ గాంచి నీకుఁ బిత యన్వర్థంబుగాఁ బెట్టెనా
హా! మోహించిరి నిఁ మహామునులె; రామా! యార్తరక్షామణీ. ౭౨

మ. వనభూమిఁ సరిగాఁ జతుర్దశసమల్ వర్తించి, వైదేహితో
ననుఁగుందమ్మునితో నయోధ్యకు మహాహ్లాదంబునఁ వచ్చి, నిఁ
హానుమన్ముఖ్యకభీషణప్రముఖులుఁ, నైక ప్రభుల్ చుట్టి, జే
యునఁ బట్టంబును గట్టుకొంటిగద; రామా! యార్తరక్షామణీ. ౭౩

మ. భరతుం బేర్కొని పేరుకోనారుని సాపత్న్యానుజుం గాంతుమే?
ధరణీరాజ్యము తల్లి చేత నిడ, నాతం డద్ది గైకోక, త్వ

ద్వరపాదాబ్జద్వయసేవఁ జేసి, తుదకుం బద్మాలుగేండ్లైన, సం
బరమారన్ ద్వదధీనముం జలిపె; రామా! యార్తరక్షామణీ. ౨౪

మ. హనుమన్ బోలెడుభక్తుఁ డెవ్వఁడు? మణీహారంబుఁ, బట్టాభిషే
కనిమిత్తోత్సవవేళ, సీతవయిపం గంఠంబునన్ బ్రీతిమైఁ,
దన కిం పైనవి రామవర్ణములు తద్రత్నంబులం గాన రా
వని, యాభామను గాసిచేసె నఁట; రామా! యార్తరక్షామణీ. ౨౫

మ. ప్రమదోత్కర్షమునం బ్రజల్ బ్రదుకి, ధర్మంబున్ నడన్ నాల్గు పా
దములన్, వ్యాధులు క్షామడామరము లుత్పాతంబు లేగోడు లే
క మనన్ లోకులు నూఱు హాయనములున్, క్ష్మానేలవే రామరా
జ్యమనంగాఁ బదొకండువేల్ సమలు; రామా! యార్తరక్షామణీ. ౨౬

మ. అవనీశుండు ప్రజాతతిం బలెనె వర్ణాచారధర్మంబులుం
దవుఁ బాలింపను; విద్వరంబు లౌదవుం దద్రీతిఁగాకున్న; శై
శవసంప్రాప్తను విప్రపుత్రకుమృతిన్, శంబూకునిం బొందఁ జే
యవె, నీ వారసి దండకాటవిని? రామా! యార్తరక్షామణీ. ౨౭

మ. మనుజాధీశులు లోకరంజనము సామాన్యంబుగాఁ జూడ కి
చ్చను వర్తింత్రు; ప్రజానుకూలతయె యుష్మన్ముఖ్యకృత్యంబు, ప
త్తనమం దైనజనప్రవాద ముడుకన్, ద్వాజ్ఞాయఁ జూలాలి న
త్యనఘం జానకిఁ గాన కంపితివి; రామా! యార్తరక్షామణీ. ౨౮

మ. పలు పూఁబోండ్లను బెండ్లియాడు టవనీపాలస్వభావంబు; నీ
వలె ముల్లోకములన్ వినంబడెడు నెవ్వం డేకపత్నివ్రతుం?
డిలు వెళ్ళించుట సీతఁ, దత్ప్రతిమతో నీ వశ్వమేధంబు ని
ర్మలతం జేసితి వార్యసమ్మతిని; రామా! యార్తరక్షామణీ. ౨౯

మ. బ్రతు కంతఃపురమధ్యమందు, నిజకార్యస్థానమం, దెప్డు యా
పితముం జేసెడుతేని కెట్లగుఁ బ్రజాపీడల్ గ్రహింపన్ సమ
ర్థత? సౌఖ్యానకు సామెతయ్యెఁగద త్వద్రాజ్యంబు; పేయేల? నీ
యతికష్టంబున కద్దియే ఫలము; రామా! యార్తరక్షామణీ. ౩౦

మ. అభియాత్యాశరభీతిఁ గాంచవపుడావంతైన; లోకాపవా
దభయం బెక్కుడు దోఁచు నీకడ; నయోధ్యం దత్ప్రజాసన్నిధిన్
శుభచారిత్రను సీతఁ గోరితి పునశ్శుద్ధిప్రమాణంబు; రా
మ భువిం జొచ్చెఁ దుదిం దదర్థమయి; రామా! యార్తరక్షామణీ. ౩౧

(గతసంచిక శేషము.)

నాయ హంతేః పాఠార్థే ప్రయుజ్యమానస్యానేకార్థత్వా ద్ధాతూనాం వర్ణవ్యాపత్త్యా అఘుశబ్దవత్ హకారస్థానే ఘకారః. అథ కోఽర్థ ఏతస్మిన్ పంచాధ్యాయీ సంగ్రహే మర్యాదయా పఠితా హ్యేతే భవంతి తస్మాత్సమాహతా స్సమాహన్తవ ఏతే సంత ఉపసర్గవ్యత్యయేనోపసర్గాధ్యాహారవర్ణవ్యాపత్తిభి ర్నిఘంటవ ఇత్యుచ్యంతే. ప్రసిద్ధస్య పాఠార్థే హంతేః ప్రయోగః। ఏవం హి వక్తారో భవంతి బ్రాహ్మణే ఇహా సమాహతమ్। సూత్రే ఇద సమాహత మితి అర్థప్రాధాన్యా దనిర్వచనవశేన శబ్దపరిణామో యం ప్రదర్శితః

యద్వా సమాహృతా భవంతి పూర్వపదే వోపసర్గవ్యత్యయ ఉపసర్గాధ్యాహారోఽత్రాపి. ధాతుస్తు హరతి రత్ర యత్ యస్మా దిత్యర్థః. యస్మాద్వా ఏతే సమాహృతా భవంతి ఛందోభ్యః తస్మాత్సమాహరణక్రియాయోగా సమాహర్తవ ఏతే సమాహృతా సంతః పూర్వపదే వోపసర్గవ్యత్యయాదిక్రమేణ నిఘంటవ ఇత్యుచ్యంతే। ఏతస్మిన్నపి నిగమనసమాహననక్రియే నిఘంటుషు విద్యమానే అర్థవివక్షితే కృత్వా సమాహరణక్రియాయోగహేతుకో నామధేయప్రతిలంభ ఉక్తః। ఏవమేవ నిఘంటుశబ్దో గమే ర్త్వేకోపసర్గాత్ హంతి హరతిభ్యాం వా న్యుపసర్గాభ్యాం సిద్ధః'' (నిరుక్తము. ప్ర. అ. 1 ఖం).

— వేదనిఘంటువ్యాఖ్యాతలు —

యాస్కుని వ్యాఖ్యాన మతిసంగ్రహముగా నున్న దని తలంచి 12-13 శతాబ్దములమధ్యను జీవించినవాఁడు దక్షిణదేశమందున్న శ్రీరంగముయొక్క శాఖానగరమందు నివసించువాఁడు నగు యజ్ఞేశ్వరుని కుమారుఁడు దేవరాజయజ్వ యీ వేదనిఘంటువునకు ఋజ్వర్థ యను నొకవ్యాఖ్యను విపులముగా వ్రాసెను. వ్యాఖ్యానారంభమందు తనతండ్రి నిట్లు ప్రశంసించుచున్నాఁడు. "ఆచార్యం శాబ్దికానా మృచి యజుషి చ యద్దృష్టతుల్యప్రభావం। వందే నైరుక్తవృత్తిక్రమ ముపనిషద్వల్లరీణా ముపఘ్నం। ఆభర్తారం క్రతూనా మవని సుఖకరప్రక్రియానుక్రియాయై। తాతం యజ్ఞేశ్వరాఖ్యం ప్రతిహతతమసం జ్ఞానభాస్వన్మయూఖైః." యజ్వా రంగేశపురీపర్యన్తగ్రామవాస్తవ్యః విరచయతి దేవరాజో నైఘంటుకకాండనిర్వచనమ్.

ఈ దేవరాజయజ్వ 1018-1060 సంవత్సరములలో నున్నభోజరాజుగ్రంథములనుండి 12 వ శతాబ్దప్రారంభమందున్న క్షీరస్వామివ్రాసిన అమరవ్యాఖ్యానమునుండి శ్లోకముల నెత్తి తనగ్రంథమం దుదాహరించెను. ఇతఁడు సాయణ

మాధవుఁడు వ్రాసిన వేదవ్యాఖ్యానములు గాని దుర్గాచార్యుఁడు నిరుక్తమునకు వ్రాసినవ్యాఖ్యానమును గాని చూచియున్నట్లు కానరాదు. ఈ నిరుక్తమునం దనేక గ్రంథకర్తలను బేర్కొనియున్నాఁడు. "స్కందస్వామి కృతాం నిరుక్తటీకాం స్కందస్వామిభవత్స్వామి రామదేవ శ్రీనివాస మాధవదేవ ఉవ్వట భట్ట భాస్కరమిశ్ర భరతస్వామ్యాది విరచితాని వేదభాష్యాణి పాణినీయం వ్యాకరణం విశేషత స్తద్వృత్తిం క్షీరస్వామ్యనంతాచార్యకృతాం నిఘంటు వ్యాఖ్యాం భోజరాజీయం వ్యాకరణం కమలనయనీయాభిధానదర్పణాం [illegible] క్రియతే. (నిరు. 3-1-14)

దుర్గాచార్యుఁడు నిరుక్తమునకెప్పుడు వ్యాఖ్యానము వ్రాసెనో తెలియదు. గ్రంథాంతగద్యమందు "ఇతి శ్రీ జంబూమార్గాశ్రమవాసిన ఆచార్య భగవద్దుర్గస్య కృతౌ ఏకాదశోఽధ్యాయః సమాప్తః" అని యున్నది. ప్రాయికముగా నితఁడు దేవరాజునకు సాయణాచార్యునకు మధ్యకాలమందున్నవాఁడు కావచ్చును. ఈనిరుక్తమునకు స్కందస్వామి యొకవ్యాఖ్యానమును, ఉగ్రుఁడనువాఁ డొకవ్యాఖ్యానమును వ్రాసి రని దేవరాజు చెప్పుచున్నాఁడు.

అమరునికంటె ముందున్న నిఘంటుకర్తలు:- సర్వానందుఁడు అమరము ప్రథమకాండ ప్రథమవర్గమును వ్యాఖ్యానముచేయుచు నిట్లు వ్రాసెను. 'అమరుఁడు వ్యాడివరరుచులు రచించిన కోశములఁ జూచి తననామలింగానుశాసనమును వ్రాసెను. త్రికాండశేషము ఉత్పలినీనిఘంటువు, పర్యాయపదములనే ప్రతిపాదించుచున్నది. వ్యాడివరరుచికోశములు మఱికొన్నినిఘంటువులు శబ్దములలింగములనుగూడఁ దెలుపుచున్నవి. (అన్యతంత్రాణి వ్యాడివరరుచిప్రభృతీనాం తంత్రాణి సమాహృత్య ఏకీకృత్య అతఏవ సమ్పూర్ణ మిదమ్ యత త్రికాండోత్పలిన్యాదీని నామమాత్రతంత్రాణి- వ్యాడివరరుచ్యాదిప్రణీతాని లింగమాత్రతంత్రాణి (సర్వానంద పే-2-1-15)" రత్నకోశము మొదలగు నిఘంటువులవలె నమరసింహుఁడు కూడ లింగములనుబట్టి యేల రచింపలేదని సర్వానందుఁ డమరసింహుని 1-1-4 శ్లోకమునకు వ్రాసినవ్యాఖ్యానములో నిట్లడుగుచున్నాఁడు. (ననురత్నకోశాదివత్ స్త్రీపుంనపుంసకకాండవిధానేనైవ వచనముచితమ్) క్షీరస్వామి అమరద్వితీయకాండములో 95 వ శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు "బృహతీ తు నిదిగ్ధికా" అను భాగురిపాఠమును జూచి గ్రంథకర్త భ్రాంతినొందె ననియు, "ఏతచ్ఛ ద్రహసం శర మితి" భాగురి

అభిధానచింతామణికి హేమచంద్రుఁడు వ్రాసినవ్యాఖ్యానము విపులముగా నుండుటయేగాక యితరవృత్తాంతములుకూడ నున్నవి. ఋతువులనుబట్టి సూర్యకిరణజాలము హెచ్చుట తగ్గుట, చంద్రునిరథాశ్వముల నామములు, గణములు, అప్సరసలజన్మము, బౌద్ధమతపరిభాషలు మొదలగునవి ప్రతిపాదింపఁబడినవి. వ్యాడి తాను బౌద్ధమతస్థుఁడు కాకపోయినను బౌద్ధమతసిద్ధాంతమును బాగుగా నెఱింగినవానివలె నగుపడుచున్నాఁడు. ఆతఁడు వ్యుత్పత్తిప్రదర్శనపూర్వకముగా శబ్దార్థములను దెలుపును "చండతాలం (చండాలః) వ్యాపాయస్యేత్యర్థ శ్చబ్దవిదాంమతః। అర్థాన్ని ఘంటయ త్యస్మాన్నిఘంటుః పరికీర్తితః"

పురుషోత్తమదేవుఁడు తాను వ్రాసినత్రికాండశేషములో "కాత్య కాత్యాయనవరరుచులు" అనుపేర్లు వానికే యని చెప్పినాఁడు. కాని పూర్ణకోశమును వ్రాసిన కాత్యుఁడు 'లింగవిశేషవిధి" అనులింగానుశాసనమును వ్రాసినవరరుచికంటె వేఱైనవాఁడు. ఏలయనఁగా, హర్షవర్ధనుఁడు, సర్వానందుఁడు, వామనుఁడు మొదలగు ప్రాచీననిఘంటుకర్తలు లింగవిశేషవిధి యనుగ్రంథము వరరుచివ్రాసినదని తమగ్రంథములయందు వక్కాణించిరి. క్షీరస్వామి హేమచంద్రులు కాత్యునికోశమునుండి "ప్రచ్ఛన్నమన్తర్ద్వారం స్యాత్ పక్షద్వారం తదుచ్యతే" అపి స్త్రీధర్మిణీ స్యాత్" ఇత్యాదిశ్లోకముల నుదాహరించిరి.

కాత్యునికోశమందుఁ గూడఁ బర్యాయపదములు నానార్థపదములును గలవు. ఆతఁడమరునివలె నూరక పర్యాయపదముల నొకచోటఁ బెట్టఁడు. ప్రతిశబ్దమునొక్క యర్థమును స్వశబ్దములచే వివరించును. ఎట్లనఁగా:—"క్షుద్రచ్ఛిద్రసమోపేతం చాలనం తితఉః పుమాన్। ప్రధానా వ్యసహాయేషు సంఖ్యాయాం చైక ఇష్యతే" కాత్యునికోశముపేరు నామమాల. వామనుని కావ్యాలంకారసూత్రవృత్తిలో (1-3-6) నొకభాగమైన నామమాలాప్రతీకముదాహరింపఁబడినది. అమరవ్యాఖ్యాత యగుక్షీరస్వామి 3 వ కాండ 3 వ వర్గు 213 శ్లోకమునకు వ్యాఖ్యానమును వ్రాయుచు "స్త్రీకటీవస్త్రబంధేపి నీవీ(వీః) పరిపణేపిచ। శివాగౌరీఫేరవయో ర్ద్వంద్వం కలహయుగ్మయోః। స్త్రియాః కటీవస్త్రస్య బన్ధనం। యత్కాత్యః-నీవిర్గ్రంథనం నార్యా జఘనస్థస్య వాససః। పరిపణో రాజపుత్రాది బంధకః। అపిశబ్దా దాయవ్యయశుద్ధం ధనం। కారాచ,

భాగురి వ్రాసిన కోశము త్రికాండము. దీనిని సర్వానందుఁడు, రాయముకుటుఁడు మొదలగువారు తమగ్రంథములయం దుదాహరించియున్నారు. ఆప్తె

క్టుపండితుఁ (Aufrecht) డేయాధారముతో నట్లు చెప్పెనో నాకుఁ దెలియదు గాని భాగురిశ్లోకములను త్రికాండశ్లోకములను తైపారా వేసిన పోలికల నది కేవల మసంభావ్యముగాఁ గానరాదు. త్రికాండమునందు లింగములు తెలుపఁబడలే దని సర్వానందుఁడు చెప్పుచున్నాఁడు. భాగురిగ్రంథమునుండి యుదాహరింపఁబడిన శ్లోకములలోఁ గూడ లింగములు తెలుపఁబడలేదు. క్షీరస్వామి, అమరములో నుదాహరించిన శ్లోకములలోఁగూడ లింగములు దెలుపు గుఱుతు లెట్టియును లేవు. ఈ రెండును అనుష్టుప్ శ్లోకములలో వ్రాయఁబడె ననియుఁ బర్యాయపదములతోఁ గూడిన వనియును ఉదాహృతశ్లోకములనుబట్టి మనము తెలిసికొనవచ్చును. భాగురిః- బ్రహ్మసూః బుధవ్యక్తేః సుక్కు నివ్యక్తేనాగ్న్యాత్మజః। నాసత్యదస్రౌ యమజౌ అశ్వినౌ వశ్వినీసుతౌ" ఈ త్రికాండ మమరముకంటె వేరైన దని చెప్ప నవసరము లేదు.

## —। రత్నకోశము ।—

సర్వానందుఁడు చెప్పినట్లు రత్నకోశము లింగములనుబట్టి పరిచ్ఛేదములుగా విభజింపఁబడియున్నది. ఇందు, పర్యాయపదములు కూర్పఁబడినవి. భిన్నలింగములగల యేదైన నొకపదము ప్రత్యేకపదముచేఁ గాని విభక్తిచేఁ గాని గుచ్ఛమునుండి వేఱుచేయఁబడుచున్నది. ఎట్లనఁగా;—స్త్రీ ర్లజ్జాపత్రపా వ్రీడా మందాక్షం షండకే త్రపా। వీర్యం వీర్యాతిశక్తితా॥

## —। మాల, దాని గ్రంథకర్త ।—

క్షీరస్వామి హేమచంద్రుఁడు మాలానిఘంటువును దాని గ్రంథకర్తను దమనిఘంటువ్యాఖ్యానములయందుఁ జేర్చొనిరి. తఱచుగా సర్వానందరాయముకుటులచేత నొకటిరెండుసారులు క్షీరస్వామిహేమచంద్రులచేత నుదాహరింపఁబడిన అమరమాలానిఘంటువే మాల యని వ్యవహరింపఁబడు చున్నట్లు కానుపించుచున్నయది. ఎట్లనఁగా; "శ్యేనా పత్రిశశాదనా।" ఇత్యమరమాలా. అని రాయముకుటుఁడు. "శ్యేనః పత్రిశశాదనా" అని క్షీరస్వామి. రాయముకుటుఁడు అమరము 2-5-15 అమరశ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు "శ్యేనా పత్రిశశాదనా" అని యుదాహరించెను. "తోయోత్థితం తత్పులినం సైకతం సికతామయం। నిషద్వరస్తు జంబాలః పంకోఽస్త్రీ శాదకర్దమౌ" అనుశ్లోకమునకు వ్యాఖ్యానము చేయుచు, తదేవ ద్వీప మితి మాలా। అని వ్రాసియున్నాఁడు.

"నానా ద్వీపం చ పులినం" ఇత్యమరమాలాయామ్. త్రికాండచింతామణి, అమరమాల యను పేరెండును లింగములనుబట్టి పరిచ్ఛేదములుగా విభజింపఁబడియున్నవి. ఈ యమరమాలను రచించినవాఁ డమరదత్తుఁడు. ఇతఁ డమరసింహునితరువాతఁ బ్రాచీననిఘంటుకర్త. హలాయుధుఁ డమరదత్తునిఁ బూజ్యనిఘంటుప్రమాణముగా గ్రహించెను. కొన్ని చోట్ల మాలలోని శ్లోకములనే హలాయుధుఁడు తననిఘంటువునందు వ్రాసికొనెను. మాల తప్పుచేతనో మఱియే కారణముచేతనో గాని యితరప్రాచీననిఘంటువులనుండి భేదించుచున్నది "ద్రప్సం దధ్యఘనం స్యాదితి" మాలా। ద్రప్సం దధ్యఘనం తథా। ఏతచ్చ దప్సం శరమితి పాఠాంతరపాఠే సరమితి బుద్ధ్వా మాలాకృద్భ్రాంతః

— వాచస్పతికోశము —

ఇది శబ్దార్ణవమై యుండవచ్చును దీనిలో ననేకపర్యాయపదములు నొక శబ్దమున కనేకరూపములుఁ బ్రతిపాదితము లగుటచే దీనికి శబ్దార్ణవ మనుట సార్థకము. "పలిక్నీ బాలగర్భిణీ। ప్రష్ఠౌహీ గర్భిణీతి పర్వే। అపిక్నీ బాలగర్భిణీతి భాగురిః। కృష్ణపాకఫలః కృష్ణఫలపాకో వనాలకః। కృష్ణపాకః పాకకృష్ణః ఫలకృష్ణో వనాలయః। పాకకృష్ణఫలః పాకఫలకృష్ణకరాన్నకః। ఫలపాకః పాకఫలో భోలః కృష్ణఫలో రసః। ఇతి వాచస్పతిః। ఇట్లనుష్టుప్ఛందస్సులోనే వ్రాయఁబడినది హేమచంద్రుఁ డభిధానచింతామణికి వ్రాసినవ్యాఖ్యానములో "దీనిలోనివిశేషములకు వాచస్పతి మొదలగువారు ప్రమాణ మని వ్రాసెను. "మల్లికా శతభీరుశ్చ గవాక్షీ భద్రమల్లికా। శతభీరు ర్మదయంతీ భూపదీ తృణశూన్యకం। దశపూరం దశపురం పవనం జీవితాహ్వయం। స్యామాణ్యాం వాసుకే ర్వా ఋషి ర్వ్యక్తశ్చ త్రిస్థపాలతః। ప్రపంచశ్చ వాచస్పతి ప్రపఞ్చే రిహ లక్ష్యతాం। దీనియందు నానార్థవర్గముకూడఁ గలదు. యథా "కోశో దివ్యధనేపి స్యా త్క్షుట్కలాసిపిధానయోః। ధనసాధిఘలస్థాంతః కోశ శ్శబ్దప్రసంగ్రహః। ఇతి మూర్ధన్యాంతే శబ్దార్ణవః।

— ధన్వంతరి —

ఇతఁ డమరసింహునికి ముందువాఁడు, వైద్యనిఘంటుప్రణేత

— అమరసింహుఁడు, నామలింగానుశాసనము —

అమరసింహుని నామలింగానుశాసనము మూఁడుకాండములుగా విభజింపఁబడినది. ప్రతికాండము వర్గములుగా విభక్తమైనది. ప్రథమకాండములో

స్వర్గవ్యోమదిక్కాలధీశబ్దాదినాట్యపాతాళభోగినరకవర్గములు తొమ్మిది, రెండవ కాండములో పృథ్వీపురశైలవనౌషధసింహాదిమనుష్య బ్రహ్మక్షత్రవైశ్యశూద్రాదివర్గములు పది, మూఁడవకాండములో విశేష్యనిఘ్న సంకీర్ణ నానార్థావ్యయలింగాదిసంగ్రహవర్గములును గలవు. ఇందలి పదములు బహువ్రీహిగా నామమాత్ర లింగమాత్రకంతములను ధన్వంతరి మొదలగువారు వ్రాసిన వనౌషధిపదములతోఁ గలిపి యీయమరకోశము వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. ఇందులో శబ్దముల లింగములు విశేషముల చేతను స్త్రీ పుమాన్ ఇత్యాది శబ్దములచేతను దెలియఁజేయఁబడుచున్నవి. సాంకర్యమును పరిహరించుటకై శబ్దమునకు "అథ" శబ్దము ముందునో "తు" అనునది వెనుకనో ఆశబ్దము ముందు వచ్చుశబ్దములను విడి వేఱుచేయఁబడుచున్నది. పర్యాయపదసమూహమందు జంతుప్రలకుఁ గాని వస్తువులకుఁ గాని సంబంధించినపదము లన్నియు వరుసగాఁ జెప్పబడియున్నవి. నానార్థవర్గములోని పదములు వ నియంతములనుబట్టి యేర్పఱుపఁబడినవి. అవ్యయములు లన్నియు నొకవర్గముగాఁ జెప్పఁబడినవి. కొనవర్గము లింగనిర్ణయమును జెప్పుచున్నది.

—॥ అమరసింహుఁడు - బౌద్ధుఁడు ॥—

"గ్రంథారంభేఽభీప్సితసిద్ధిహేతుం జిన మనుస్మృత్య" అని క్షీరస్వామి "అత్రానుక్తోఽపి శాక్యస్తుతిర్ణో జ్ఞానదయాదిభి స్స్పష్టం ప్రతీయతే" అని సర్వానందుఁడు చెప్పుచున్నాఁడు. ఈయమరసింహుఁడు విక్రమాదిత్యుని సభలో నున్న తొమ్మండుగురిలో నొకఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఆఱవశతాబ్దమునకు ముందె యితఁడు జీవించియుండవలెను. ఈనిఘంటువు చైనాభాషలో ననువదింపఁబడెను. జినేంద్రబుద్ధి వ్రాసిన కాశికావరణపంజికలో "తంత్రం ప్రధానే సిద్ధాంతే" అను నమరవచన ముదాహరింపఁబడిన దని డాక్టరు బండారుకారు కనిపెట్టె నని అమరకోశోపోద్ఘాతమునందు (K. G. Oka) కృష్ణజీ గోవింద ఓకా పండితుఁడు వ్రాసెను. ఆజినేంద్రబుద్ధి యెనిమిదవశతాబ్దప్రారంభమం దుండె నని పాఠక్పండితుఁడు (Prof. Pathaka) కనఁబఱిచెను. విక్రమార్కశకము 789 లో వ్రాయఁబడిన అమోఘవృత్తిలోఁ గూడ నమరకోశ ముదాహరింపఁబడెను. కావ్యములకు వ్యాఖ్యానములు వ్రాసిన యిటీవలివారైనవ్యాఖ్యాత లందఱును దానిని బ్రమాణముగా గ్రహించి యందలి శ్లోకములను బలుమా ఱుదాహరించుటవలన దీని యుపయోగము, లోకప్రసిద్ధి,

బాగుగాఁ దెలియఁబడుచున్నది. పాణిని అష్టాధ్యాయియందలి నియమములను దరువాత వచ్చిన గ్రంథకర్తల గ్రంథముల నన్నిటి వెనుకకుఁ ద్రోసిపుచ్చినది.

అమరకోశవ్యాఖ్యాతలు —— వ్యాఖ్యానములు.

1. పదునొకండవశతాబ్దముయొక్క కడపటిభాగమునం దున్నభట్టక్షీరస్వామి వ్రాసిన అమరకోశోద్ఘాటన మమరవ్యాఖ్యానములలో మిక్కిలి ప్రాచీనమైనది. అది యిప్పటికి మాతృకలో నున్నది. ఇతఁడు తన యమరవ్యాఖ్యానములో భోజరాజును రాజశేఖరునిఁ బేర్కొనియున్నాఁడు. క్షీరస్వామిని వర్ధమానుఁడు తనగణరత్నమహోదధిలో "క్షీరస్వామినాపి" "మార్గోమారిష ఇత్యపి" అని యుదాహరించెను గౌడోపాధ్యాయ శ్రీభోజులను ముగ్గురు ప్రాచీనామరవ్యాఖ్యాతలను పర్యాయముగాఁ జెప్పియున్నాఁడు. వారి గ్రంథములను మన మెఱుఁగము. ఈక్షీరస్వామి వ్రాసిన వ్యాఖ్యానము మిక్కిలి సులభముగా నున్నది. ఇతఁడు నూఱుగురు గ్రంథకర్తల ప్రమాణములఁ జూపించుచుఁ గొన్నిచోట్ల మూలమును ఖండించుచు మఱికొన్నిచోట్ల సమర్థించుచు వ్యాఖ్యానమును వ్రాసెను.

2. తరువాత వ్యాఖ్యాత, అర్తిహరుఁ డను నామాంతరముగలవాఁడైన సర్వానందవంద్యఘటీయుఁ డనువాఁడు. ఇతఁడు 1159 లోఁ బదిప్రాచీనవ్యాఖ్యానములను జూచి నూతనముగా, టీకాసర్వస్వ మనునొకవ్యాఖ్యానమును రచించెను ఇతనివ్యాఖ్యానము మిక్కిలి శ్లాఘ్యత్వాపాదకము. ఇది క్షీరస్వామివ్యాఖ్యానమునకుఁ దక్కువకాదు [illegible] వ్యాఖ్యానమును గూడఁ గలుపుకొని బంగాళాదేశములోఁ బుట్టిన యమరవ్యాఖ్యానము లన్నింటికిని యిదిమూల గ్రంథము.

3. వంగదేశపువ్యాఖ్యాతలచేఁ దఱచుగా నుదాహరింపఁబడు ప్రాచీనవ్యాఖ్యానము బౌద్ధుఁడైన సుభూతి లేక సుభూతిచంద్రుఁ డనువాఁడు రచించిన కామధేనువు ఇది టిబెటుభాషలో నున్నది.

1173 సం॥ లోనున్న శరణదేవుఁడు వ్రాసిన దుర్ఘటవృత్తిలో సుభూతిపేరు వక్కాణింపఁబడినది.

4 రాయముకుటమణి లేక తఱచుగా రాయముకుటుఁ డని, ఉపాధినామముగల బృహస్పతి యనుగ్రంథకర్త 1431 వ సం॥లో రచించిన పదచంద్రిక యనునది మఱియొకవ్యాఖ్యానము. దీనికిఁ బ్రాచీనవ్యాఖ్యానము లాధారములు. ఈగ్రంథకర్తకు నివాసస్థానము వంగదేశములో నున్న రాఢాపురము.

# సారస్వతము—ముక్తిసాధనము.

—జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం.ఏ., బి.యల్., చెన్నపురి—

---

తొలినుండియు భారతీయునకు జపమాల యైనది ముక్తి! పుట్టువునందే స్వేచ్ఛాజిజ్ఞాస శిశుమధురాక్రందనమై, గభీరభావపూరమై హృదయమునుండి యుబుకును! భవబాధమునుండి విడివడి, చరమాదర్శ మగుపరమాత్మను జేరుటకున్న మానవుని ప్రతిఘటించు నిరయమును, అగ్రసరుఁజేయు నాకమును ముఖ్యఘట్టము లగుచున్నవి. ఆదర్శమునందుటకు వలయుశక్తిసామర్థ్యముల నలవఱచికొనుట కవకాశములై, స్వయంయత్న, ఆత్మప్రజ్ఞావికాసముల కవశ్యమగు తరుణములై, జన్మపరంపరలు జీవాత్మకైహికయానములై యుండు నని 'కర్మవాదము' వాకొనుచున్నది. కర్మాంతమున మనుజుఁడు కాలిడు బ్రహ్మలోక మెందో వ్రేలాడియుండలే దనియు, స్వర్గనరకము లను ప్రత్యేకమానసికావస్థల నతిక్రమించినంత నది యిందే యలవడు ననియు, నేఁడు తత్త్వశాస్త్రము ఘోషించుచున్నది. కర్మాంతజన్మాంతములందు మానవుఁడు సర్వోత్కృష్టమోక్షమునందును,

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి"-(శ్రీభగవ-అ. 2-39)
"ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధం స్తతో యాతి పరాంగతిమ్." (శ్రీభగవ-అ. 6; శ్లో 45)

ఈమోక్షము నందుట పరమాత్మ నందుట,—బ్రహ్మలోకముఁ జేరుట. ఎందో ముక్తిని మూటఁగట్టికొని, జీవునకై యందలిఫలములను జగదీశుఁడు దాఁచియుంచఁడు. మనముక్తి మనచేతిలోనిపని. భగవంతుఁడు మనహృదయమందే కలఁడు.

"Were not the eye itself a Sun
No Sun for it could ever shine
By nothing Godlike could the heart be won
Were not the heart itself divine"—Goethe.

"He is my soul within my heart smaller than a grain of rice or barley, smaller than a mustard-seed or a Canary-seed, or a husked canary-seed. He is my soul within my heart, greater than the Heavens, greater than these worlds." (Chhand Upanishad, Verse 3).

"He and I are two souls dwelling in one body" Al Hallaj, the Sufi martyr. "Thou wouldst not be seeking me if thou didst not possess me."—Bible.

కావున జగదీశునిసామ్రాజ్యము (The kingdom of God) మనుజుని యంతరంగమందే కలదు. దీనియందలి బ్రహ్మానందమునకు దారిచూపుస్వర్గద్వారము సద్భావము. ఈసద్భావమే, ఆధ్యాత్మికాంతరంగోద్ధారణము!(Vide: Tolstoy's Teachings and Sir Radhakrishnan's Indian philosophy) సద్భావముగాని, దుర్భావముగాని, ఉన్నతిగాని, పతనముగాని, స్వర్గముగాని, నరకముగాని మానవమానసముచే నిర్మాణ మగును.

"The mind is its own place, and in itself
Can make a Heav'n of Hell, a Hell of Heav'n"

సద్భావనిర్మాణమున నాటితేటినమానసము సచ్చిదానందము నందును. ఈసచ్చిదానందము బ్రహ్మానందమునకు భిన్నము కాదు. బ్రహ్మానందము మోక్షము ! ముక్తి బ్రహ్మానందము! దీనినందుటకు సూచింపఁబడిన పంథలలో సేవ నేఁడు మిన్నయై యున్నది. సేవలన్నిటిలో సాహిత్యసేవ తలమానికమని సహస్రాబ్దములకు మున్నె భారతీయులు గుర్తించిరి! ముక్తిగర్భితమైన సారస్వతమునకు వలయు ప్రశాంతవాతావరణము నొసఁగునది ప్రకృతి. కావుననే ముక్తికాంక్షు లగుమునులు గిరికందరములందును, గహనసీమలందును సారస్వతవధూటి నారాధించిరి. పాశ్చాత్యసీమయందలి రచయితలు కూడఁ గ్రైత నెలంతను శాంతియుత శైలములందును, శైవలినీకూలములందును, కాసారతీరములందును గాంచిరి. పశ్చిమఖండసాహిత్యమందలి Parnassus కనులపండు వొనరించు మనఋష్యాశ్రమములకు వేఱుగాదు. పాశ్చాత్యకవుల Olympic heights మనహిమాద్రిశిఖరములకు భిన్నములు కావు. వారువాకొను Mount Sion or Zion ను, Aonian Mount (i.e Hilicon in Boetia sacred to the Muses) ను మన తుషారశిఖరములకు వేఱుకావు. పాశ్చాత్యసారస్వతమున గోచరించు Siloa's సరోవరము మనమానససరోవరమునకు వ్యతిరేకము కాదు.

"Or if Sion Hill
Delight thee more, and Siloa's Brook (it was really a pool) that flow'd
Fast by the Oracle of God." Paradise Lost.

"Soar
Above the Aonian Mount" Milton.

"The waters of Siloah, that go softly" Isaiah VII. 6.
"Sisters of the sacred well, that from beneath the seat of Jove doth spring." Lycidas.

పాశ్చాత్యకవుల Muse తానమాడుకల్హారములు భారతకవుల కవితాకాంత గ్రుంకులిడు నిందిందిరావాసములు.

ప్రస్తుతప్రపంచమునఁ బ్రాచీనభావములు విశేషపరివర్తన మందినవి. ముక్తిసాధనమునకై నట్టడవులందు నడయాడుట యనుచిత మనియు, జనసంకులప్రదేశములందును, సంఘరంగమందును సాధింపఁబడుముక్తియే మహత్తరమైనదనియు 'గెటే' నాఁటనుండియుఁ గర్మయోగులును, గవులును విశేషముగ గుర్తించిరి. కావున సారస్వతము వనమునుండి ప్రజాకార్యరంగమునకుఁ దరలెను. వనవిరాజితమై, సంఘసేవ్యంబైన సాహిత్యలక్ష్మి జీవనయాత్ర, జీవాత్మయాత్రకు ముఖ్యమగుముక్తిసాధన మాయెను. దైవసామ్రాజ్యమైనహృదయము పరంజ్యోతిచే వెలుఁగొందుచున్నది. పరమాద్భుత మగునీపరంజ్యోతిని గుర్తింపఁజేయు దివ్యజ్యోతి సాహిత్యజ్యోతి.

సాహిత్యజ్యోతి మిణుకుమిణుకు మని, వాతూలరహితవనమందు, దుఃఖోద్రేకము గానిమానసమందుఁ, దొలుత వెలుఁగ దొరఁకొనెను. పవిత్రప్రశాంతవాతావరణమున సారస్వతము ప్రస్ఫుటించినది. దానిసౌరభము జగజ్జీవనమున వెల్లివిరియుటకు సమయము పట్టినను, అందలి యానందవీచికలు తొలుత వనభూములందుఁ దొలుకాడెను. అక్షరము లెఱుఁగని యనాగరకుఁడు సహస్రాబ్దములకుమున్ను బాలభాస్కర తేజమును గాంచి మహోల్లాసమున గంతులిడువాఁడు. కౌముదీవర్షమున నొడలుమఱచి యానందగీతముల నాలాపించువాఁడు. వీనుదోసిళ్ళ వికిరగానమును నింపి, పచ్చికపాన్పులఁజేరి, కడునాతురమున హాయికరళ్లు జుఱ్ఱువాఁడు. నభఃకాంతులను గాంచి పరమహంసవలె పరుగులిడువాఁడు. నటరాజులీల సృష్టిమోహననృత్య మొనరించువాఁడు. ఈతనికిఁ దన్మయత్వము నొసఁగి, యీతని నాత్మవిస్మృతుఁ జేసి, స్వర్గరమ్యత్వమునీతనిచేతులందలి పసినిమ్మనుజేసినది యంత్రపుటఱపు గాను, అచ్చునేరుపును గాదు. వీనినృత్యమందలి విచిత్రవలయము. అక్షరరూపము దాల్చని భావగర్భితమైన పంక్తి. ఈతనికన్నుల యెదుట లేనవ్వు లొలికించినది ప్రకృతిజవ్వని. ఇంద్రియకవాటములను భేదించుకొని, ప్రకృతిమహిళ వీనిహృదయసామ్రాజ్యమునఁ బట్టమహిషియై వెలసెను. తెరలుతెరలై యుబుకు పరితోష

మును బట్టఁజాలక, రక్తాభఁ జల్లు తూరుపుదిక్కున కీరఁడు సాగిలపడువాఁడు. సౌరభసౌందర్యముల నిధానమైన వసరము వీనియిల వేలుపు. వీనిజీవితమును చేబంతిచేసికొనినది సృష్టిచిత్రము. అనంతమైన సృష్టిచిత్రమును తనచిన్నిగుండియయం దిముడ్చుకొని పూలరంగఁడై పొంగువాఁ డీతఁడు. ఈతఁడు లేకున్న సృష్టివైభవమునకు గతి లేదు. సృష్టివైభవము లేనిది, వీనికి దిక్కు లేదు. వీఁడు లేనిసృష్టి సున్న. సృష్టిలేనివీఁడు హుళక్కి. ఇరువురను జిత్రసంబంధసూత్రమునఁ గలుపుశక్తి సారస్వతము భక్తియనుఁడు—అనురాగమనుఁడు—వివిధమతము లే మనిన 'భళీ!' యనుఁడు—'భళాభళీ!' యనుఁడు —నామభావవిభేదములు సారస్వతాంగములు కావని తెలుపు టేరితరము ?

మనుష్యజీవనము భావబంధుర మగుసాహిత్యము ! భావము లేనిబ్రదుకు కట్టెమోపు ! భావము వాతూలమువంటిది ! అదృశ్యమయ్యు సృష్టిబాహ్యాంతరంగికచలనముల కిది హేతుకము ! ఇది లేకుండుట యాయువు మూఁడుట ! ప్రకృతిచిత్రములందు వెడలిన భావమారుతమునందే మహత్తర మగు సారస్వతము జనించినది! వేదోపనిషత్తులును, స్మృతి శ్రుత్యాదిశాస్త్రములును బురాణేతిహాసా ద్యుద్గ్రంథములును వనలక్ష్మియింటఁ బుట్టిన డింభకులు ! భారతము కురుక్షేత్రమునఁ బుట్టిన దనుట కల్ల ! రామాయణ మయోధ్యయందు జనించిన దని వాకొనుట బూటకము ! పోయి కురుక్షేత్రమును బెల్లగించి చూడుఁడు. అందు భారతము సున్న ! అయోధ్యను దలక్రిందులు చేయుఁడు. రామాయణ మందు గగనకుసుమము ! భారతాంబ కనిన రాముని, భీముని, సీతను, గుంతిని, మన కప్పన మొనరించినవి వాల్మీకివ్యాసులకలములు వేదయుగమందును, బురాణయుగమందును, నీకవికంఠీరవములకలములచే వనపద్మినియే మనకు సారస్వతమును బ్రసాదించినది ! భావవైభవము వసరమయందు విరాజిల్లుటచే విశేషించి ప్రాచీనకాలమున మనుష్యజీవనమందలి జీవకళ ప్రకృతిరమ్యాంగణమందే ప్రకాశ మగుటచే దిక్కాంతలకు మిఱుమిట్లు గొలిపిన సారస్వతపంక్తులు భాస్వంతమరీచికలట్లు మహితమనోహరమహీధ్రచూడముల నుండి ప్రసరించినవి ! మనుష్యప్రకృతియందును, సాహిత్యప్రకృతియందును బ్రకృతి సీమంతిని యొనలేనిభావమౌక్తికములను వెదఁజల్లెనని కేవలము భారతచరిత్రయే గాక, పశ్చిమప్రపంచేతిహాసముకూడ నుగ్గడించుచున్నది ! షేక్సిపియరుమహాకవి తనయద్భుతవిజ్ఞానమును ఏవక (Avon) నదీవీచికలందును స్ట్రేఫర్డ్ (Strafford)

పల్లెప్రాంతమందలి ప్రకృతియోషామణి క్రోడతలమందుచు బససెను! వర్డ్స్‌వర్త్ మహాకవి కొండసింగారమందు మునింగియుండువాఁడు ! మిల్టన్, షెల్లీ, గోల్డుస్మిత్, కీట్సు లిటలీమాధుర్యసౌందర్యములందుఁ గ్రుంకులిడిరి ! నేపిల్స్‌నోని యానందలహరియం దీఁదులాడని కవి పాశ్చాత్యసీమయందు లేఁడు ! మేఘసందేశమందలి మహాద్భుత ప్రకృతిసౌందర్యమును, గెటేకవిచంద్రుని తాండవనృత్యమునఁ దేల్చిన కురంగవలాయనచిత్రవర్ణనమును, లంకనుండి పుష్పకమున నయోధ్యకు మరలుతఱి వైదేహికి రాముఁడు చూపిన ప్రమోదబంధురదృశ్యములను మనసాలుకావించిన కవిసార్వభౌముఁడు కాళిదాసును, సంతతధారగా జ్ఞాన, విజ్ఞానములను వర్షించిన హోమరు, ఎయిశ్చిలీస్, సోఫొకిల్స్, డాంటే, వర్జిల్, షేక్సిపియరు, గెటే, షిల్లరు లాదిపాశ్చాత్యసాహిత్యాచార్యులును, ఉత్తరరామచరిత్ర, కిరాతార్జునీయ, రత్నావళి ప్రభృత్యుత్కృష్టగ్రంథములకు తండ్రులైన భవభూతి, భారవి, హర్షుఁడు మున్నగు కవికుంజరములును, రజతతరంగిణి, మనుచరిత్రాది గ్రంథరాజములందు శీతనగశోభను కలుగఁజేసిన కవితల్లజులును గనులపండు వొనరించు 'శాంతినికేతనమున' నంచలరాయఁడై మన కన్నులయెదుటఁ బ్రసుకవీంద్రుఁడైన రవీంద్రుఁడును గోదావులినతలమందలి కవిపుంగవులును, వీరును వారును ననసేల ? కాలవిహాయసమున భాస్వరజ్యోతులట్లు వెలుఁగు సారస్వతపట్టభద్రులు ప్రకృతిజనయిత్రిమధురదుగ్ధము లానినవారేకదా! వనమునుండి వెడలి సాహిత్యము సంఘుసేవకు సనుముఁగట్టెను. షేక్సిపియరు మహాకవి యుపదేశము లెవ్వియుఁ గావింపలేదు. నీతులు కఱపుటవానియలవాటుగాదు. తనచిత్తము వచ్చిన తెఱఁగున నతఁడు తనపాత్రలను సృష్టించుకొనలేదు. వివిధ మానసికశక్తిసంపన్నుఁడైన యాకవిచక్రవర్తి యున్నదున్నట్లు వ్రాసెను. గెటేకవీంద్రుని మెఫిస్టుఫలీస్ పృథ్వియందు లేఁడు. షిల్లరు కవిచంద్రుని రాబర్ ఊహాప్రపంచమందు మాత్రము గోచరించును ! కాని షేక్సిపియరుకవిసామ్రాట్టుయొక్క ఎడ్మండు అయాగోలును, మూఁడవరిఛార్డ్ మేక్‌బత్ సతులును, ప్రపంచమందు ప్రత్యక్షవిభీషికలై యున్నారు ! షేక్సిపియరుపాత్రలు కల్పితములు కావు ! (Vide: Bradley's masterly criticism, on the four Great Tragedies) సహజగురుగంభీరరచనలం దాతఁడు సత్యము వ్రాసెను ! షేక్సిపియరుచేతి కంకణమైన సత్య మాతనికలమందలి దివ్యసారస్వత మాయెను. ప్రపంచసమును, దౌరాత్మ్యమును, అతని నాటకములను గొన్నిం

టిని రుధిర స్రవంతియందు ముంచివైచినవి ! నిరుపేదలను విచ్చుకత్తుల కర్పించినవి ! నిరీహుల నగ్నికుండమున మాడ్చివైచినవి ! నిర్భాగ్యులను లోఁతుగోతులందుఁ బూడ్చిపెట్టినవి! హేంలెట్ ఒఫీలియాలను, లియరు కార్డీలియాలను, ఒథెల్లో డెస్డిమోనాలను కండకండలందును, కటికినెత్తురునందును, ముంచిముంచి విడిచిన షేక్సిపియరుకల మెంతకన్నీరైన నోడ్చియుండును! తొలుతఁ దనయెడఁదను గాల్చుకొనియే షేక్సిపియరు తనవిషాదాంతనాటకములచేఁ బ్రపంచహృదయమునుఁ జిచ్చుపెట్టెను! పొంగుపొంగు దుఃఖపూరముచే నిండిన తన గుండియను గ్రుమ్మరించియే యతఁడు పృథ్వీహృదయము నార్ద్రిచే నింపివైచెను! ప్రపంచమందలి సెగలు, పొగలు, దిగులుల నీలకంఠువలె నోటఁబోసికొనియే జగతియం దాతఁడు హాహాకారములు పుట్టించెను. వడకుఁ బుట్టించు ఘోరక్రియలను బూలవానకుఁ బోల్చుటకు షేక్సిపియరు రక్తపిపాసువైన పిశాచము కాదు ! అగ్నికణము మల్లెచెండు కాఁజాలునా ? కన్నులందు చిచ్చుఁగొలుపు పొగలు కమ్మతెమ్మెర లెట్లగును ? కర్ణపుటములు భేదించు కఠోరాక్రందనము కర్ణరసాయనగాన మనుట కెంత తెగువ కావలెను ? బూటకములను మాటలు గట్టుట యన్యకవులకు మాటలలోనిపనియైనను షేక్సిపియరునకుఁ జేతులలోని పనిగాదు ! భీషణముగ నగ్నిశిఖ లెగయుతఱి ముచ్చటకు వీణవాయించుటకు నీరో తెగించెను గాని షేక్సిపియరు తెగింపలేదు ! మయూఖమును మించిన తనుకాంతియందు కుసుమముకంటె కోమలమైన యౌవ్వనమందు మంచుకంటెఁ బరిశుభ్రమైన మనసునందుఁ గల్వఱేకులకెన యగు వాలుఁగన్నులందుఁ గ్రూరమగు శాతాసి గ్రుచ్చుకొనుచుండ జిలిబిలిపలుకులును, జిఱునగవులును, బుడిబుడి నుడువులును, జోజోయూఁపులును, లాలిపాటలును, చిట్టిబొట్టిముచ్చటలును జెనఁటికిఁ గాని షేక్సిపియరునకు సరిపడ వెట్లు? ఎందో మనుజులు తలక్రిందుగా వ్రేలుచు అమవడ పులిహోరలు మెక్కుచున్నా రనియు, రెండున్నరతలలమానిసి యొకఁడాకస్మికముగఁ జెట్టుతొఱ్ఱలోఁ బుట్టి 'అమాంతముగ' నాకసమునకు సముద్రమును దాపట మొనరించి పుట్టెఁడుటంకమును గండిగుండతో దిగమ్రింగె ననియు, మహాపర్వతములు మామిడిపిండెలై గొంతుకలో నదృశ్యమాయె ననియు చందురు నంటిన వెన్న సూర్యరశ్మిచేఁ గ్రాఁగి గ్రాఁగి కుంభవృష్టిగఁ గురియ రాజసూయయాగమందలి పెసరట్లమోపులు తడిసి తట్టెఁడై రుచిదేర ననియు నేమేమో వింత చెత్తవ్రాసి కుంచములతో డబ్బుఁ గొలపోయుచుఁ బండ్లి

కిలించి 'కస్తూరీరంగరంగా !' యను కవికూటమునకును సత్యనిష్ఠాగరిష్ఠుం డగు షేక్సుపియరునకును బంక్తిభోజనములు మాటటుండఁ గనుచూపు మేరైన లేవు ! అబద్ధపు తోకచుక్కలంత మూర్ఖజనులపైఁ బాఱవైచి, తంత్రపుఁగొట్టు బ్రదుకీడ్చుటకు షేక్సుపి యెఱుకర్మ మంత కాలలేదు! మహత్తరమైన దయ్యు, సత్యమశ్రాంతము నవనీతమై యుండ దని యామహాకవి నిరూపించెను. అన్యులకు దురూహ్యమగు మానవ ప్రకృతి నాతఁడు మన కన్నులయెదుటఁ బెట్టి పున్నెము గట్టుకొనెను! షేక్సుపియరు షేక్సుపియరెట్లు కాఁజాలెను? ఈమోహ, యాతని కేలయుందురా? కన్నీరు జాలువార్చుచుఁ గఠోరములై భయదములైన సత్యముల నాతఁడు పేర్కొని మానవసంఘమందు, పైశాచికనృత్య మొనరించు పలుగాకులను ముంగలఁబెట్టి కలమాన్నమును భుజించి కండలు పెంచి నిర్లక్ష్య నిర్లజ్జా జీవనములు గడపువారి కనుఁబొరల నాయుహాసియుఁడు చీల్చివైచెను! దౌష్ట్యమం దాఱితేఱిన నరాధములు ముక్తులు కాఁజాల రని యాతఁడు నిరూపించెను. (Work of Nemesis) సంహారమునందలి ఘోరారిష్టములకు లోకులు నిరుత్సాహులు కాకుండుటకై మహత్తర మగుతత్త్వము నాతఁడు తనకడపటిరచనాజీవనమున (The fourth period of his dramatic career) జూపెను! సర్వస్వమును గోలుపడి, దుహితను గూడి నిర్మానుష్యద్వీపమునఁ బడియుండి భయంకరఝంఝూనిలము ద్గల్లాడిన ప్రాస్పెరో, (Vid : The Tempest) తుదకు జగదీశుసికరుణవెంపున హృదయశాంతి నంది జీవనరహస్యమును గుఱితించి నిజముక్తిని బడసెను. ఈముదుసలిజీవనమున నొక యద్భుతసత్యమును జూపి ప్రపంచమునందలి ప్రజలనందఱిని మంత్రముగ్ధులఁ గావించిన తనకలమునకు (Shakespeare's Pen and Prospero's magic wand are one, critics say) విశ్రాంతియొసఁగి షేక్సుపియరు నిజపల్లెకుఁ దరలెను. షేక్సుపియరునాటకములు నేఁటికినిగ్రొత్తవై గోచరించుటకు హేతుక మవి సత్యసంఘటనాభూయిష్ఠములై ప్రకృతిహృదయమును బ్రతిఫలించునవియై, యుండుటే- (The myriad minded Shakespeare held up the mirror to nature) మానవులెన్నఁడును గని, విని, యెఱుఁగని మహాద్భుతప్రజ్ఞను జూపి కవిసార్వభౌములకు సార్వభౌముఁడై మనుష్యులం దనిమిషుఁడై వెలిసిన యీమహాత్ముఁడు చేసిన యనన్యసామాన్య భాషాసేవ, సంఘసేవలే యీతనికిని మానవులందుఁబలువురకును ముక్తినొసఁగినవి.

ప్రజాకంటకుఁ డగు ఛార్లెసు కెదురుగ విపుల చమూసమూహమును నిలువంబెట్టినది మిల్టన్ కవికలము! క్రాంవెల్ ఖడ్గము క్రాంవెల్‌తోనే శిథిలమై

నది ! మిల్టన్ కలను పంచభూతములను మించిన ప్రజ్ఞకలిగి, చిరమైయున్నది! దేశారిష్టము నెఱిగి, యిటలీనుండి మరల్చి సంఘసేవకును దేశసేవకును నాతఁడు తొడరెను ! తనకంటె నొరులకల్యాణము మహత్తరమైనదని యోజించి కనులను సేవాతత్పరత కప్పన మొనరించెను. తనక్రియ భగవత్ప్రేరితమైనదనియు జగదీశుని కింకరుఁడై తాను జగతి కంపఁబడెననియు కనులు లేమి కాళ్ళేతులను బరిచర్యకై ప్రయోగింపకున్నను నొకచో నిలిచి సారస్వతప్రజ్ఞను జూపుచు దాఁజేయుసేవయే భగవంతునకు ముదావహమై యుండుననియు స్పష్టవాక్కుల నాకవిసింహుఁడు (Vide: "On His Blindness"; "Milton's sonnet to Syrack Skinner" and "On his arriving at the age of twenty-three.)" పల్కెను. పతితుఁడైన మానవుఁడు జగదీశునికరుణాపెంపునఁ బునరుద్ధారణ మందు నని (Vide: Paradise Regained) తెలిపి, సారస్వతసేవయందే మహోన్నతస్థితినంది (Vide: Wordsworth's "London 1802") మిల్టన్ నిజముక్తిని బడసెను. ఫ్రాన్సుసీమస్థులకు స్వాతంత్ర్యపటుత్వమును బోధించి ఆత్మగౌరవమందిరముదెస వారిని బురికొల్పినవి వాల్టేర్, రూసోలమేటికలములు. రష్యాయం దాధ్యాత్మికభావస్రవంతిని దొలుకాడించినది టాల్‌స్టాయ్‌కలము. మనుజుని సర్వతోముఖజీవనమున నద్భుత మగు నాధ్యాత్మికశక్తి తేజరిల్లెనని తెలిపిఆంగ్లసంఘమునకును, మానవ సంఘమునకును, సాహిత్యపథమున నెంతేని సేవసలిపి, రస్కిన్ మహాశయుఁడు తరించెను.

భావశక్తి యద్భుతమైనది. అగ్నికంటెఁ దేజవంతమై, యదియగ్గివలె బుగ్గికాఁజాలదు. భావము లేకున్న భౌతికప్రపంచము గాని, ఆధ్యాత్మికప్రపంచము గాని లేదు. మానసమున నొకమాఱుతళ్కొత్తిన తలఁపు నేఁడుగాకున్న రేఁపైనను మహాద్భుత మగుప్రపంచమును బుట్టించును. భావము లేనిక్రియ, ఉద్దేశము లేనియుద్యమము, మతిమాలినమాట, నగుఁబాటును నుపద్రవమును నాపాదించును. కవి, భావమయుము. ఆతనిసూక్ష్మదృష్టినుండి సృష్టియందెట్టి దృశ్యముఁ గాని, సంఘజీవనమం దెట్టి సంఘటనముఁ గాని తప్పఁజాలదు! ఆతనిగమనమునకుఁ గాలస్థలపరిమితులు లేవు! తుపారబిందువునందును, పుష్ప కేసరమందును, ఉడుగర్భమందును, మరీచికాంతియందును, గలజగదీశుని సౌందర్యమును మోచుకొని, తనరచనలందు కవి స్ఫురింపించును! కవి చేయఁజాలుసేవ మఱియేమానవమాత్రునకు సాధ్యముకాదు ! సృష్టికర్త కాతఁ డెందును దీసిపోఁడు.

# ఆంధ్రవాఙ్మయమున నవలంబింపఁదగిన నూతనగద్యరీతులు.

(సాగి వేంకటనరసింహముగారు, ఎం. ఎ, రాజమహేంద్రవరము.)

---

రసాత్మక మైనవాక్యము గాని మహావాక్యము గాని కావ్య మనఁబడును. అట్టికావ్యము ఛందోబద్ధమైనచో, అనఁగా గణయతిప్రాసలతోఁగూడిన పాదములు గలదగుచోఁ బద్యకవిత్వ మనియు, సామాన్యవాక్యధోరణిని రచింపఁబడినచో గద్యకవిత్వ మనియు ననఁబడును. కావ్యములు పూర్వమునుండి తఱచుగఁ బద్యాత్మకము లగుటవలన గద్యగ్రంథములు కావ్యములు కా వని కొందఱు సంశయింతురు కాని సహృదయులకు బ్రహ్మానందసబ్రహ్మచారియగు రసమును గూర్చుట మాత్రమే కావ్యధర్మము గాన, పైసంశయము నిలువఁజాలదు. రసోద్బోధకములగుగద్య గ్రంథములు పెక్కులు సంస్కృతభాషయందును దదితరభాషలయందును గానవచ్చుచున్నవి.

దురదృష్టవశమునఁ బూర్వరచితము లగుగద్యగ్రంథము లాంధ్రమున గోచరించుట లేదు. మధురనాయకులపరిపాలనము, అనఁగా, సుమారు 17 వ శతాబ్దము మొదలుకొని వ్రాయఁబడిన గద్యగ్రంథములలోఁ గొన్ని యిప్పుడు కాన్పించుచున్నవి. కలువే వీరరాజకృత వచనభారతము కృష్ణప్పనాయకవిరచితజైమినిభారతము మొదలగుగ్రంథములు ముద్రణసౌభాగ్యమును గూడఁ బొందినవి. ఇట్టివచనగ్రంథములు నన్నయాదులకాలమునందు లే వని చెప్పుట సాహసము. ఉండియుఁ బద్యగ్రంథములయంత రసవత్తరములైనవి కాకపోవుట చేతనో వాఙ్మయవిలేఖకులకు వానియం దసూయ యుండుటచేతనో యవి యంతరించినవి. ఇఁక నప్పటిగద్యము భారతాదులయందును శాసనములయందును గానవచ్చుచున్నది. భారతమునందు రాజులపేళ్లును దీర్థములపేళ్లను వివరించుటకును దదితరసందర్భములయందు నావశ్యకత ననుసరించియు గద్యములు గలవు. ఇవి సామాన్యముగ రసములేనిపట్టులు. మఱియు శాసనములు పామరులుగూడ గ్రహించుట కనువగు భాషలో వ్రాయఁబడియుండుటచేతను వానిలో మనుష్యులనామములు సరిహద్దులనామములు ప్రధానమగుటచేతను వానికిఁ గావ్యస్థితి లే దనవచ్చును. వానిలో నచ్చటచ్చట దాతలనుగూర్చి

కవులు పద్యములలోఁ బ్రశంసలు చేసిరి. మొత్తముమీఁదఁ గావ్యమని చెప్పఁ గొనఁదగిన గద్యమేదియుఁ బ్రాచీనకాలమునుండి మనకు లభించియుండలేదు.

ప్రబంధయుగమునందు గద్యప్రయోజనము విస్మరింపఁబడినది. స్వతంత్రగద్యకావ్యములు కవులు వ్రాయకపోవుటయేగాక తమకావ్యములలో వ్రాసినగద్యములను గూడ జటిలముఁజేసి దురవగాహ మొనర్చిరి. భారతములో గద్యమువలన లభించిన ప్రయోజనముగూడ నిచ్చట నంతరించినది. అదృష్టవశమున మనకు లభించిన లేఖలు మొదలగునవి యప్పటిరాజకీయవిషయములను వీరచరిత్రములను జాటుచున్నవి. ఇటీవలిశతాబ్దములలో వ్రాయఁబడిన గద్యములు గూడ భాషాంతరీకరణములే గాని స్వతంత్రకావ్యములు గావు. పూర్వకాలమునుండియు గద్యరచనయందభిమానము లేకపోవుటచేతఁ గాఁబోలును మనకు లభించుగద్యము లన్నియు రాయవాచకమువలె నక్షరాస్యులు కానివారిచేత గ్రామ్యభాషయందుఁ బ్రతిపాదింపఁబడినవిగా నున్నవి.

ఇటీవల, ఆంగ్లవాఙ్మయము మన కుపకారము చేయుటచేత నైననేమి కాలపరిణామముచేత నైననేమి గద్యవాఙ్మయమునందు నూతనయుగము బయలుదేఱినది. నూతనగద్యవాఙ్మయములోఁ, జిన్నయసూరి వ్రాసిననీతిచంద్రిక మొదటిది. తదితరము లైనవివిధకావ్యముల కది మార్గదర్శక మైనది. రెంటాల వేంకటసుబ్బారావుగారు నవలలు, లేఖలు వ్రాయనారంభించిరి. ఆకాలముననే కవిజీవితములు సుమనోమనోజ్ఞము మొదలగుగ్రంథములు బయలుదేఱినవి. శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులు మొదలగువారు తెలుఁగునఁ బత్రికలను గూడ స్థాపించిరి. శ్రీ వీరేశలింగముపంతులుగారు బహుళముగ గద్యభక్తి నవలంబించిరి. కవిజీవితములు రాజశేఖరచరిత్రమువంటి కొలఁది గ్రంథములు తప్ప మిగిలిన వన్నియు సంఘసంస్కరణమున కై వినియోగింపఁబడి కావ్యనామమున కనర్హము లయినవి. ఇట్లే మఱికొందఱుకవులును దమ గద్యములను లౌకికనీతిబోధనమునకు వినియోగించుటచే వారి గ్రంథములు గద్యవాఙ్మయమున శాశ్వతముగ నిలువవని తోఁచుచున్నది. ఇఁక భాషాంతరీకృత మైననవలలు కొన్నియు, స్వతంత్రమైన నవలలు కొన్నియు గద్యకావ్యములుగ నిలిచియున్నవి. కాని కాలప్రవాహమున వానిస్థిరత్వము కూడ నిర్ణయించుటకు వీలు లేదు.

ప్రస్తుతకాలమునఁ బత్రికలమూలమునను, గ్రంథములమూలమునను గద్యవాఙ్మయము వెల్లివిరియుచున్నది. కథలు, వ్యాసములు, గద్యరూపకములు, అనువాదములు, అనుకరణములు, నవలలు మొదలగునవి విస్తృతముగ బయలుదేఱినవి. ఆంధ్రాదిపత్రికలయందు గద్యగ్రంథరచనమున కనువగు శైలియుఁ బరిణామము చెందుచున్నది. ఈశైలితోపాటు గ్రామ్యవాదుల స్వేచ్ఛావిహారము తలచూపినది. ఇందువలన గ్రామ్యగ్రాంథికవాద మంకురించినది. ఎందఱు కవులు గలరో యన్నిరకముల భావములు పుట్టినవి. మహాకవి యింత దెవ్వరైన నున్నచో నాతనిమహోన్నతభావములను గ్రహించుటకు లోక మాతనిభావ నభ్యసించియైనను గ్రహింపవలెను కాని యీపిదపకాలములో నట్టిమహాను భావుఁ డుదయించునా యని సంశయము కలుగుచున్నది.

శైలిననుసరించి విచారించినచో నిప్పటిగద్యకావ్యములు గ్రాంథికములు గ్రామ్యములు నని రెండువిధములుగ నున్నవి.

ఇఁక గద్యగ్రంథము లేయేవిషయములను గూర్చి యెట్లువ్రాయవలెనో విచారింతము. ఈకాలమున వాడుకలోనున్న విషయములను సంస్కరించుటను గూర్చియు నూతనవిషయములను గ్రహించుటనుగూర్చియు ముచ్చటింపవలసి యున్నది. గద్యరచనమునందు ముఖ్యముగ ననుసరింపవలసినది ప్రకృతి. కావ్య జీవమునకు ముఖ్యాధారము గోల్డుస్మిత్తు మహాకవి చెప్పినట్లు "ప్రకృతి ననుసరింపుము" (Follow nature) అను సిద్ధాంతమే వ్యక్తులనుగాని సంఘములనుగాని సంఘాచారములనుగాని నిందించుటయు స్తుతించుటయు గొప్పలక్షణముగాదు. ఆవ్యక్తులకును ఆసంఘములకును నంతర్గతమైనస్వభావమును నున్నదున్నట్లుగాఁ జిత్రించుట కళోపాసకునిధర్మము. అట్లు చిత్రించినప్పు డావర్ణనలు మానవసత్త్వము నుద్రేకింపఁజేసి రసానందమునకుఁ గారణములు కాఁగలవు. గద్యగ్రంథము వ్రాయునప్పుడు, ఆంధ్రకవు లీవిషయమును విస్మరించి తమప్రతిభను వ్యర్థము చేసికొనిరి. నవయుగమున శాశ్వతవాఙ్మయమును గల్పించుటలోఁ బ్రకృత్యను సరణము విపులముగ నుండుట మొట్టమొదట గమనింపఁదగినది. ఈసూత్రము హృదయఫలకమున నాటినప్పుడే నిజమగు వాఙ్మయము వెలువడును.

కావ్యభేదములు:—పద్యమునందు వలెనే గద్యమునందును- కావ్యములు ఖండకావ్యములు నని రెండు తెగ లుండును. నేఁడుమనకు దేశకాలపరిస్థితుల ననుసరించి ఖండకావ్యము లెక్కుడుగ రచించుచున్నవి. ఆంగ్లవాఙ్మయ

మున, అడిసన్, గోల్డుస్మిత్, లాంబు, థేకరీ ప్రభృతులు సహృదయరంజక ముగ వ్యాసములను వ్రాసిరి. హృదయకవాటమును దెఱచి మృదుమధురముగ భావములను దెలుపుటయే యీకవుల ప్రధానోద్దేశము. ఆంధ్రమున వ్యక్తిగతభావముల నుత్తమపురుషలో మొగమోటములేక చెప్పు కావ్యము లరుదుగ నున్నవి. ఇట్టి కావ్యరచన మవలంబించుటవలన మనము కృత్రిమత్వమునకు దూరులమగుదుము. కావ్యమునందుఁ గవి నిమగ్నుఁడగుటకు వ్యక్తిగతకావ్యములు (Personal element) సహాయముచేయును. నాటకములను, నవలలను అనుకరించు కథలను నిర్మించుటయం దాంధ్రు లెక్కువయాసక్తిని జూపుచున్నారు. ఇది యెక్కువ ఫలవంతమగునది కాదని నాయుద్దేశము. ఈఖండకావ్యములలో వాఙ్మయమును గూర్చిన విమర్శనములు చేయుచుగాని విమర్శకుఁడు మొదటిరకపు వాఙ్మయనిర్మాత కాఁడు. కావ్యానందమును సహృదయులకుఁబంచిపెట్టుటయందు విమర్శకునిసేవ యపారము. ఇట్లయ్యు విమర్శకావ్యము లుత్తమకావ్యములు కావనుటకు సందేహములేదు. కావున స్వతంత్రకావ్యరచనముమిక్కిలిగ నవలంబింపఁదగినది.

ఇఁకఁ గావ్యములలో నెట్టివి వ్రాయవలెనో విచారింతము. చరిత్రాత్మకము లైనవిషయములను గద్యకావ్యములుగ నిర్మించుట యొకవిశేషము. దీనికి ఆంగ్లవాఙ్మయములో కార్లయిల్ మహాశయుఁ డాదర్శప్రాయుఁడు. ఈకావ్యలక్షణమును గొంతవఱకుఁ జెప్పెదను. మనుష్యులపేర్లు దేశనామములు తేదులతో నిండినచరిత్ర మంతమనోహరముగ నుండదు. అయినను మనపూర్వుల చరిత్రలఁ దెలిసికొనఁదలఁచి మనము వాని నెట్లో పఠింతుము. అట్లుగాక చరిత్రకావ్యమును వ్రాసినప్పు డందలిమానవులు మనకుఁ బ్రత్యక్ష మగుదురు. వారిభావములను మనము గ్రహించి వారిసుఖముల కానందించి వారికష్టములకు వగచి వీలైన సహాయము చేయఁదలఁచి యిట్లాకాలపువార మైత్రేయత్వము చెందుదుము. ఇట్టి చరిత్రములు వ్రాయునప్పుడు మనయిష్టానిష్టములను వానిలోఁ బ్రవేశపెట్టక నిష్పాక్షికముగఁ బ్రవర్తింపవలెను.

తరువాత నవలలను రచించుటయందు సంపూర్ణ మగుమార్పవసరము. హైందవాశయములకు భిన్నముగఁ బ్రవర్తించి లోకుల మనుష్యులను జీకాకు పఱుచు నవరాధపరిశోధకనవలలు తదితరము లగు కష్టాంతము లైన కథలు విసర్జింపవలసియున్నది. నవలలలో నాంధ్రత్వమును వ్యక్తీకరించునవియు, ఆంధ్ర

సంఘమును జిత్రించునవియు మిక్కిలి తక్కువగ నున్నవి. కవి యాంధ్రలౌకికజీవనమునందు నిమగ్నుఁడై ఆంధ్రసంఘమును సంపూర్ణముగ సహజవర్ణములతోఁ జిత్రింపవలెను. ఇట్లు చిత్రించువాఁడొక్కఁడు బయలుదేఱినను, ఆంధ్రావని తరించుననుట కనుమానము లేదు.

లోకమునందు కవులజీవితము లత్యంతాకర్షకములుగ నుండును. ఒక్కొక కవి నిరుపేదయై అతి వికారముగ నుండి ప్రజలచేఁ బరిహసింపఁబడి యట్టి మలినావరణమునుండి తన తేజోరూపము నెట్లువ్యక్తీకరించునో విచిత్రముగ నుండును. ఒక్కొకకవి పలుకుబడి కలవాఁడై తిన నన్నమును గట్ట బట్టయు ననుభవింప ద్రవ్యమును గలిగి తన జీవితమునందు, ప్రతిభ వహించును. అతని వలన లోకమున నెట్టిమార్పు గలిగినదో, లోకమువలన నతనియం దెట్టిమార్పు గలిగినదో విచారించుట మిక్కిలి యానందముగ నుండును. శ్రీనాథుఁడును పోతనయు నీసందర్భమునకుఁ దగిన యుదాహరణములు కాఁగలరు. వారి దేశకాలపరిస్థితులను గ్రహించి వారిని గథానాయకులను జేసికొని వారి జీవనములందు నిమగ్నులమై యట్టి కవుల జీవితములను వ్రాయుట మహాభాగ్యము. మనవాఙ్మయమున నిట్టి గ్రంథములు మిక్కిలి కొంచెముగ నున్నవి.

కావ్యమందునీతి:—విశ్వశ్రేయమును బ్రతిపాదించుట కావ్యలక్షణము. కావ్యము వాచ్యముగ నీతిని బోధించుట దోష మగును. నీతి సూచిత మగుట దోషము కాదు. ఎట్టులైనను, అవినీతిని బోధించుట గర్హ్యము. ప్రేమను బ్రతిపాదించుకావ్యములు సకలవిధములైన ప్రేమలను బ్రతిపాదించినను గావ్యసారము నీతికి దూరాలమై యుండవలెను. నేఁటికాలమునఁ గొందఱుకవు లభినవకీచకుల నభినవరావణులను గథానాయకులనుజేసి కులటలను గావ్యనాయికలను జేసి రసాభాసము ప్రధానలక్షణముగఁ గల కావ్యములను నిర్మించుచున్నారు. ఇట్టికావ్యములను బేర్కొనక వానిని గర్హించుపని సహృదయులకు వదలివేయుచున్నాను. నవనాగరకతకు ఫలితముగ హైందవపరమాశయము లడుగంటుచున్నవి. వానిని పునరుద్ధరించుట యుఁ గవిధర్మము గావున గద్యకవులు దోషపూరిత మగు నగరజీవనమును హైందవప్రకృతివర్ణనలతోఁ బునరుజ్జీవింపఁ జేయవలసి యున్నది. ఈసందర్భమునఁ గావ్యమునకు నిష్కల్మష హృదయు లగు గ్రామవాసులు పాత్రములును నిర్మలవనసీమలు స్థానములు నగుట మంచిది. ఇంకను మత కావ్యములు డైరీలు లేఖలు సంభాషణములు

మొదలగునవి కూడ గద్యమునందు ప్రాయఁదగియున్నవి. ముఖ్యముగ హాస్య కావ్యములసంగతి యాలోచింపవలెను.

హాస్యలక్షణము:—అసమము కాని పరిస్థితులను సమముగాని గుణములను నొక్కి చోఁ బ్రదర్శించినప్పుడు హాస్య ముత్పత్తిల్లును.

హాస్యము వ్యక్తిదూషణపరమైనచో నది ద్వేషమునకుఁ గారణమగును. సామాన్య ధర్మములను బ్రదర్శించి నప్పుడే హాస్యమునకు శాశ్వతత్వము చేకూడును శ్రీవీరేశలింగముగారు ప్రభృతులహాస్యములు దూషణప్రాయము లైనవి. కన్యాశుల్కములో నున్న కావ్యలక్షణము వానిలో లేదు. పాత్రోచిత భాష నాటకములయందు వాడుట యుచితము. జగ్గకవిరచిత మైన చంద్ర రేఖావిలాపమును దిలకించినచో గ్రాంథిక భాషయందుఁ గూడ హాస్యమును జక్కగఁ బ్రదర్శింపవచ్చు ననుట స్పష్ట మగుచున్నది.

పైఁజెప్పినట్లు గద్యమునందు నూతనరీతుల నవలంబింపనిచోఁ, బ్రపంచ వాఙ్మయమునం దాంధ్రభాషకుండఁదగిన మహోన్నతస్థానము లభించుటకష్టము.

---

# గ్రంథస్వీకారము.

(1) మన్వంతరములు—కాకినాడనాట్యకళావిజ్ఞానమండలి చతుర్థకుసుమము. విజ్ఞానచంద్రికాపరిషత్తువారిచే రెండుబంగారుపతకములు నూఱురూపాయలును బహుమానము పొందిన శ్రీమతి దాల్తాబాను హనుమాయమ్మ గారిచే రచియింపఁబడినది. భాగవతము, విష్ణుపురాణము, మార్కండేయపురాణము, బ్రహ్మాండపురాణము మొదలైనవి పరిశీలించి యీయమ్మగారు మనుష్యకాలము, దేవకాలము, యుగప్రమాణము, మనువులు, వారుచేయుపనులు, ప్రళయములు, లోకవిమర్శనము, లోకములోకమునకుఁ గలదూరము, లోకవాసులవివరము, మొదలగునవి పటములతోఁ గూడఁ జూపియున్నారు. పదునాల్గుమన్వంతరములు నందలివిశేషములు సంగ్రహముగాఁ జర్చించినారు. పైపురాణము లన్నియుఁ జదువకుండ సాధారణముగా స్త్రీలు నల్పజ్ఞానము గలపురుషులు మనువులు కాలము తత్తద్విశేషములు తెలిసికొనుటకు సులువుగా నున్న యీగ్రంథము 71 పుటలు క్రౌనుసైజుది, వెల రు 0-12-0 విషయము, శైలి కొంత మచ్చుచూడుఁడు.

"మను వనఁగా నొకపదవి. ఆపదవికి వచ్చువాఁడు మనువు, మనుపదవికి వచ్చువారు మహాతపస్సంపన్నులు క్రమవృద్ధిం జెందినవారు. అట్టివారలే యాపదవికి నర్హులు. మనస్సుకలవారు మానవులు, మానవుల కాదిపురుషుఁడు మనువు. మానవులందఱు వానిసంతతివారే. మానవజాతిని సృజించి చెడకుండ వృద్ధిచేయువాఁడు మనువే, మానసాభివృద్ధికి శరీరసౌందర్యాభివృద్ధికిఁ దగినచట్టముల ధర్మముల నియమించి ప్రజలఁ బరిపాలించుట మనువుపని—"

(2) భారతనీతులు—కొల్లాపురము స్నేహలతాకవితాసంఘములోని సభ్యురాలగు వాజపేయయాజుల మహాలక్ష్మిగారు సంగ్రహించినవి. ఇందు భారతమహిమ, జ్ఞానము, పాడి, ఓర్పు, సుతుఁడు, సత్యము- ఇట్లని కొన్నివిషయములకు నూఱుపద్యము లేఱి ప్రకటింపఁబడినవి. చివరఁ గఠినపదములకుఁ డిప్పణి చేర్పఁబడినది—

"సారము లేని సంసరణసంగతిఁ గాలముఁ బుచ్చఁబోక వి
స్తారకథాసుధామధురసారముఁ జిల్కెడుభారతంబులో
నేరితిఁ గొన్నినీతులను నేర్పడునట్లు జగద్ధితంబుగా
నేరుపుచాలకున్న జననీ నిరసింపకుమమ్మ శాంకరీ".

అని ప్రార్థించి ప్రారంభించిన యీమహాలక్ష్మిగారియత్నము కొనియాడఁదగినది. ఈదినములలో భారతముం జదువఁగోరువారు పురుషులే యరుదు, అట్టిచో నీయమ్మగారు శ్రద్ధతోఁ జదివి నీతుల నేర్చి కూర్చుట పొగడఁదగినది.

స్నేహలతాకవితాసంఘములో నిట్టివా రుండఁబట్టిదానికివన్నె రాఁగలదు. ఈమె కవనముగూడఁ బ్రార్థనపద్యముంబట్టిచూడఁ జక్కనగా నగపడుచున్నది. స్వతంత్రముగాఁ గొన్నినీతిపద్యము లను రచింపఁ జూడఁగోరుచున్నారము. వెల ౨ అ.

(3) శ్రీకేశవశతకము — బ్ర॥ పెద్దాడ రామలింగశర్మగారు రచియించినది. కాకినాడ జగన్నాథపురనివాసులు పరమశ్రీరామభక్తులు మ॥ శ్రీబల్ల మంగపతిదాసునాయఁడుగారి ద్రవ్యసహాయమున నిది ముద్రింపఁబడినది. పద్యములు భక్తిరసపూరితములుగను, నిర్దుష్టముగ నున్నవి. పదములు మృదుమధురముగా నున్నవి, శైలికి—

చ. "ఒకమనుజుండు కొంతవఱ కున్నతశైలముపైఁకిఁ బ్రాఁకి క్రిం
దికిఁ జనుదారిఁగానమికి దీనత నందెడిరీతి నక్కటా
చకచక నిన్నుఁబొందఁదగుసాధనమౌ నరజన్మమెత్తి ముం
దుకుఁ జనలేక యుంటినిఁకఁ బ్రోవను జూపఁగదయ్య కేశవా"
"నరకమునందుఁ ద్రోసినను నాకమునందు వసింపఁజేసినన్
సురుచిరభోగమిచ్చినను శుష్కదరిద్రునిగా నొనర్చినన్
వెలపునుబొంద దేనికిని విశ్వమయాత్మక నీదుపాదత
త్పరత నశించనేని గడు దైన్యమునొందెద నమ్ము కేశవా"

"తావకపీఠము దివ్యఛత్రమై" 46 పద్యము "కైకొనిభూత ప్రపంచమంతటన్" 53 పద్యము, ఇట్టి స్వల్పాభిప్రాయభేదములతోడి పదములు ప్రయోగింపఁబడినవి. దీని వెల రు 0—0—6.

(4) మహాభారతచరిత్రము- బ్ర॥ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే రచియింపఁబడినది. ఇది రెండవకూర్పు. మొదటికూర్పు పొత్తము 237 పుటలు. ఈరెండవకూర్పు 346 పుటలు. గ్రంథము విస్తరింపఁబడినది. దుశ్శాసనాది దుష్టచతుష్టయము, పరిక్షిత్తు, తక్షకుఁడు, జనమేజయుఁడు, శతానీకుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, అశ్వమేధజుఁడు ననువీరలచరిత్రము నూత్నముగఁ జేర్పఁబడినది. ఇందుఁ బదునాల్గుపుటలయుపోద్ఘాతము 18 పుటల యింగ్లీషు మహాభారతచరిత్రమును గలదు. మొదటికూర్పులోకంటె నిందు విశేషాంశములు చేర్పఁబడినవి. చారిత్రకదృష్టిం జూచువారి కిందనేక భారతకాల విశేషములు తెలియఁగలవు. భారతకాల భరతఖండము పటముగలదు. దీనిపై కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఎం. ఏ. 2 హిందూపత్రిక. 3 సర్. రాధాకృష్ణన్‌గారు, 4 పండిత సీతానాథతత్త్వభూషణులు మున్నగువారు మంచియభిప్రాయముల నిచ్చియున్నారు. దీనివెల రు 1-12-0 పిఠాపురములోని కౌండిన్య నిలయమున నీగ్రంథము దొరకును.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౨ — శ్రీముఖనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. — సంచిక 3.








కొత్తపల్లి సూర్యారావు [illegible] ముద్రాక్షరశాలయందు

ప్రకటింపఁబడినది.

[illegible] వ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1933.

# విషయసూచిక.

---



---

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౨. | శ్రీముఖనామసంవత్సరము శ్రావణభాద్రపదమాసములు. | సంచిక 3.


## ప్రార్థన.


వి. రామసుబ్బారాయఁడుగారు, బి. ఏ., కొల్లాపురము.


మ. పురుషార్థంబిడునీపదాబ్జయుగళీపూజాదికర్మక్రియా
పరతం గాంచనిమూఢచిత్తుఁడఁ బశుప్రాయుండఁ గ్రూరుండ, సు
స్థిరవైకుంఠవిలాసభోగములకుం జేసాఁచఁగా నెట్లు చే
కుఱునయ్యా! క్షణమైన నిన్ గొలువకే గోపాలచూడామణీ. 1

మ. క్రతువుల్ దానజపాగ్నిహోత్రవిలసత్కర్మంబులుం జేయలే
దతిమూఢుండ వివేకశూన్యుఁడ భవద్ధ్యానంబునైన న్నమం
చితబుద్ధి న్సలుపంగ లేనినిసుఁగుం జేకొంచు నోదేవ! సు
స్థితినొప్పారెడు నీపదాబ్జయుగళీసేవల్ ప్రసాదింపుమా. 2

మ. తను నెవ్వారు పదారవిందమకరందం బాని విజ్ఞానయో
గనిరూఢత్వముచేఁ బరార్థపరులై కర్మంబుల న్వీడి బం
ధనిరోధం బొనరింపఁగాఁ దలఁచుచున్ ధ్యానింతు రవ్వారికి
న్వనజాక్షుండు పరార్థసౌఖ్యగతులం గల్పించి రక్షింపఁడే? 3

మ. సరసీజాక్షపదారవిందయుగళీసంసక్తచిత్తంబుతోఁ
బరమానందము గాంచి యెల్లపుడు సద్భక్తిం బిసాళించి, వా
సరముల్ ద్రోయఁదలంచువార లెపుడు న్సంసారదుఃఖంబులోఁ
బొరలం బోవక సౌఖ్యమొంది తుదకున్ మోక్షంబుఁ జేపట్టరే? 4

మ. తొలిజన్మంబున నీపదాబ్జయుగళిన్ దుష్టాంతరంగుండనై
కొలువన్నానితినో మదాంధతను నేఘోరాఘముల్ సేతునో
యిల జన్మంబును గాంచినాఁడ నిఁక నిన్నే నమ్మి యోదేవ! యం
జలి గావించి భజింతుఁ బ్రోవుము పునర్జన్మంబు లేకుండఁగన్. 5

# సాహిత్యము—ముక్తిసాధనము.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ. బి. ఎల్. చెన్నపురి.

---

సాహిత్యము, తత్త్వశాస్త్రము కవలలు. తత్త్వభావగర్భితముగానిసాహిత్యము చొప్పమోపుచొప్పున నుండును.—సాహిత్యగంధము లేనితత్త్వశాస్త్రము ఱాళ్ళగుట్టయై, యడలుపుట్టించును. రెంటికిని గలసంబంధము ప్రాచీనకాలమునుండియు నవిచ్ఛిన్నమై యున్నది. నిన్నను గాక మొన్న (Vide. Report about the recent Andhra University Commission) మేధాసంపన్నుఁడగు రాధాకృష్ణుఁడును, ప్రిన్సిపాలు థామసును నీభావమున "కా నా" ననిరి. వర్డ్స్‌వర్తుకవీంద్రుని ప్రతిపంక్తియుఁ దత్త్వభావమునఁ దొలుకాడుచుండును. (Wordsworth's Pantheism) ఎట్టి నిరుత్సాహులకైన నాశాలోకముఁ జూపు బ్రౌనింగుకవిత్వ మెందఱునిర్జీవులను సజీవులఁ జేయలేదు? (Browning's Optimism) అతులసౌందర్యలహరిని (Keat's Hellenism)దొలుకాడించు కీట్సుకల మెందఱుచింతలఁ గడిగివేయలేదు? బైరన్ కవిచూపిన స్వాతంత్ర్యకాంక్షను బ్రశంసింపలేని మానవు లెందుఁగలరు? ఈకవులందఱు నున్నతాదర్శములుచూపి పున్నెముఁ గట్టుకొనలేదా?

గీతాంజలి వ్రాసినరవీంద్రుఁడు తనగోడేమో వెడలఁగ్రక్కికొని, బ్రదుకఁదలఁపలేదు. గీతాంజలి భావములు పాశ్చాత్యులకుఁగూడ మిఱుమిట్లు గొలిపినవి!—సుమవర్షమట్లు పృథ్విని నింపివైచినవి. మణిమయూఖములట్టులు వసుమతి నలంకరించినయవి—భారతమాతదెసఁ బశ్చిమఖండముల నన్నింటి నొక్కమాఱు సాఁగిలపడఁజేసినది గీతాంజలి! స్వార్థచింతయందు మునిఁగి మనుష్యత్వమునుండి దిగజాఱి, గభీరకలుషమునఁ గూలఁబడువారి కింత తత్త్వబోధచేసినది గీతాంజలి! భారతహృదయమందలి యద్భుతభావపూరముచే నొక్కపరి పశ్చిమగోళమును బవిత్రవంత మొనరించినయది గీతాంజలి!! జగదీశుని మహిమముఁ గీర్తించి, నూతనయుగభావములను దశదిశల వెదచల్లి, విజ్ఞానము నుగ్గుగఁ బోసి, పల్వురకు ముక్తిమంత్రమును నుపదేశించినయది గీతాంజలి!!

ఇఁక మన వసురాయని భక్తచింతామణి ! వసుకవి యాంధ్రుఁడు ! ఎట్టికల్పద్రుమ మైనను, ఆంధ్రునకుఁ బెరటిచెట్టగుచో, మంచునకైన దాని నాతఁడు ముట్టఁడు ! ఆంధ్రుఁ డేలోకో తనప్రాచీనమహత్త్వమును, దనప్రస్తుత ప్రజ్ఞను, దనభావికర్తవ్యమును దనయాంధ్రత్వమును మఱచి, తనచ్ఛాద్లితీవల నన్నిదిక్కులకు బిగించివైచెను ! వసుకవి యేవంగసీమయందో పుట్టియుండుచో వంగవాతావరణమందలి యస్పృశ్యతాశయములను దిగమ్రింగి ఉత్సాహవంతు లగుస్వీయసీమస్థుల ప్రోత్సాహమునం గలము ముంచి, రవియట్లే తానుఁగూడ యనురాగంపుటందలమెక్కి దిగంతవిశ్రాంతవసుప్రభలను వెదచిమ్ము వాఁడు! భావగాంభీర్యమందును, దత్త్వబోధనమందును, భక్తచింతామణిపద్యములు కొన్ని ప్రపంచసాహిత్యమందలి యేకవితకును దీసిపో వని యుచ్చైస్స్వనమున నుచ్చరించిన, "కాదు కా" దనువారును,' నెల్లెట్ల'ని యుసికొల్పువారును,'నిది వట్టినవాల'ని బావురు మనువారును నుండుచో, వసుభావమందలి లోఁతు నందు వారిని ముంచివేయుటకు వెనుదీయను ! స్వార్థ మగుతనముక్తికే, వసుకవి దేవులాడలేదు ! తలఁపుజపమాలను, దనగుండియయందుఁ ద్రిప్పుకొనక, మాలను స్వార్థముతోఁ బుటుక్కునఁ ద్రెంపి, యందలిపూసలను దశదిశల నీ కవిశేఖరుఁడు వెదచల్లెను ! గుఱితించినవానికే పూసయందలి యగాధ మైన యుపనిషత్తును, నద్భుత మగుపురుషార్థమును, ననిర్వచనీయ మైన పరమార్థమును ద్యోతక మగును. రవివసుకవులు తమరచనలమాలమున నిహలోకమందే ముక్తినందిరి.

సాహిత్యము ముక్తిసాధన మని నిరూపించుట కెన్నేని దృష్టాంతములను జేర్పఁగలను. అల్ప మగునీసమయమందు విపుల మగుచర్చ సలుపుట వాంఛనీయము కాదు.—సూచనమాత్రమున సంతసింప నెంచితిని. విప్లవమందు, ప్రపంచము తలక్రిందు లగుతఱిఁ దా నుద్భవింతు నని గీతాచార్యుఁడు వాకొనెను గదా ! ఆత్మజ్యోతితో వెలుఁగు శరీరరూపమం దొక్కొకపుడును, భావప్రభతోఁ దేజరిల్లు శబ్దరూపమం దిఁకొకపుడును వివిధదేశములందు, వివిధసమయములందు, జగదీశుఁడు గోచరించుచుంట ప్రసిద్ధవిషయము ! భగవత్ప్రేరిత మగుకవితయందు; భగవంతుని యవతారము గోచరించి మలీమసమై యున్న మానవమానసమును దివ్యమరీచికాపూరమున స్నానమొనరించి పృథ్వికి ముక్తి చేకూర్చును ! శైలపార్శ్వమున నాకస్మికముగ నిదురనుండి లేచిన కె యిడ్

మన్ (Caedmon.) నోటనుండి వెడలిన కవితాస్రవంతి యెవ్వరిది ? కెయిడ్‌మన్ నిరక్షరకుక్షియైన పల్లీయుఁడు కాఁడా ? సైనవ్రుల్ఫ్ నేర్చిన దేమి ? ప్రజలమనసులఁ దియ్యనిక్షైతచే నానందవార్ధిని ముంచిన బర్న్స్ (Burns) నేర్చిన దేమి ? తంత్రీతల ఋణాకులకు మునుఁగునందాకఁ దనపల్లెయందలి గ్రామదుస్కూలులో షేక్స్పియరు నేర్చినయక్షరము లెన్ని ? నేఁటిరవీంద్ర, బెక్‌వార్డ్‌సాలును, హావెల్స్, గాల్స్‌వర్దీలును, ఎన్నిడిగ్రీలు సంపాదించిరి ? వీరిపల్లులును వీరిగీతములును వీరివికావు. వీరి నాధారముగాఁ గొనిన కొండొక శక్తి తనమహత్త్రకోద్దేశసిద్ధికై జలదగంభీరవాక్యముల వీరిముఖములనుండి వాకొనుచున్నది. పలుకుచాఁడు తానైనను, పలికించెడిది వైష్ణవ మని పోతనామాత్యుఁడు వచింపలేదా ? మిల్టన్ కవిచంద్రుఁడు సంబోధించిన Heavenly Muse ఎవరు ?

> "Of man's First Disobedience, and the Fruit
> Of that Forbidden Tree, whose mortal taste
> Brought Death into the world, and all our woe,
> With loss of Eden, till one greater Man
> Restore us, and regain the blissful Seat,
> Sing *Heav'nly Muse.*" —Paradise Lost.

"తద్రయశ్శక్తిక్ మణులట్ల వెల్వడ ననంతా" అని వసుకవి యెవరి నుద్దేశించి పలికెను ? "త్వదంఘ్రిసంస్మరణభాస్వద్రోచి" అని యాతఁ డనుచేల ? హోమరు వర్జిలు కవిచంద్రులు మహత్తరము లగుతమపురాణములందలి తొలిపలుకుల నేశక్తి నుద్దేశించి పల్కిరి? కవులకుఁ గవియైన ("The Poets' Poet") స్పెన్సర్ సంబోధించిన Muse ఎవరు? షెల్లీకవీంద్రుఁ డుల్లేఖించిన యుద్వేగ మెట్టిది ? (Vide. Shelley's "Defence of Poetry") నాస్తికుఁ డని విశ్వవిద్యాలయమునుండి తఱుముఁబడిన యాకవిచంద్రునినోటినుండి యాధ్యాత్మిక వాక్యుల నుచ్చరింపఁజేసిన దేశక్తి? చెమట లోడ్చి, యుష్షురుస్సు రని, నిట్టూర్పులు పుచ్చి వ్రాయునది కవిత యనిపించుకొన దని తెలుపుటయందు హేతువు లేదా ? అప్పకవీయసులక్షణసారములను దిగమ్రింగినంతన కైత యబ్బునా ? ఆదమఱుపున నున్నపుడు, ఆకస్మికముగ మానసమునఁ దళ్లొత్తుభావద్యుతి ప్రసరించుటతర్కశాస్త్రమునుండి కాని, భౌతికశాస్త్రమునుండి కాని గణగుణాకారమునుండి కాని, కాక యనంతమై, యద్భుతమై, యాధ్యాత్మికమైన శక్తినుండి కాదా ? ఇట్టిశక్తి కవిమానసమునందును, కవికలమునందును ప్రభాకలితమై యుం

డుటం దెట్టియుద్దేశము లేదు? ఇది తుచ్ఛమై, స్వార్థమైన యుద్దేశమా? మహత్తరమై, మహిమోపేతమై, పరార్థమై, ముక్తిప్రదమైనయుత్కృష్టోద్దేశము కాదా? ఈయుద్దేశము నీతన్నయోద్వేగమును మిల్టనుకవి యెన్నిమాఱులు గుర్తింపలేదు?

" And hears the Muses in a ring,
Ay, round ab^ut Jove's Altar Sing "

—Il Penseroso.

(These lines indicate the Sanctity of Poetic inspiration).

గ్రీకు, లాటినుకవులు వారిని "Vates," "Scriptural investiture" ఎట్టివి?

" I thence
Invoke thy aid to my adventurous Song,
That with no middle fight intends to soar
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
And chiefly Thou O Spirit,"

—Milton.

In the "Christian Doctrine" Milton explains what he means by the Spirit that it is "that impulse or voice of God by which the prophets were inspired."

Milton was always filled with the sanctity of the Poet's avocation!

"Devout prayer to that eternal spirit, who can enrich with all utterance and Knowledge" (The Reason of Church Government, Book ii.)

కవిత్వమందలి యాధ్యాత్మికశక్తిని, పవిత్రోద్దేశమును, ముక్తిపంథను పాశ్చాత్యులే గుర్తించియుండఁ, దత్త్వజ్ఞానమున నీఁదియాఁడి తమయపూర్వ రచనాశైవలినులను బృథ్వియం దెల్లకడలందుఁ బ్రవహింపఁజేసిన భారతకవులు గుర్తించియుండలేదా? కవియాక్రందనమందును, నానందగానమందును గూడ మహితభావము తొలుకాడుచునే యుండును! In Memoriam టెన్నిసన్ కవియొక్క సొంతగోలయా? వసుకవి "సుతస్మృతిసతీస్మృతు"లు కుటుంబఘోష యగుచోఁ, గాల్వరైపాటినకన్నీరు ముద్రాయంత్రమును దడిపి తడిపి, పాషండులను, పాషాణములను, పాషాణముపగిది హృదయములను గరఁగించివైచె

నేల ? కటికితాళికిఁ గుసుమకోమలత్వము నొసఁగునది కవిత్వము కాదా ? బ్రుక్కడిని ముముక్షువుఁ జేయునది కవనము కాదా? ముష్కరుని మునిపుంగవుఁ జేయునది కైత కాదా? క్రూరకిరాతుని వాల్మీకిఋషినిం గావించినయది కవిత కాదా? రాముపదమందలి కవితాభావస్పర్శచేఁ గదా పాషాణ మొకటి పావనగుణశోభిత మైన యహల్య కాఁగలిగెను! సామాన్యకీటకమును ద్విరేఫరాజ మొనరించి, మధురఝంకృతులఁ బుట్టించునది ప్రసవహృదయమునఁ దోలు కాడు కవితాసుధ కాదా? కారుమొగులును గాంతికవుంగిలిని బంధించి ధునీదర్పమునఁ జిఱునవ్వులు చల్లునది కైత కాదా? కోయిలగొంతున గణయతులు నింపి, గీతకళలను జగతిపైఁగురిపించునది కవిత కాదా? పతికరస్పర్శచేఁ బులకితమైన కమలకాంతకంధరమున శిశిరతారహారము నిడి, హాసనరేఖలకు రవిద్యుతులు కలిపి, తన్నువరించిన సుందరహృదయునకుఁ దలఁబ్రాలు వోసి, వాని తలఁపుఁదలఁబ్రాలు తాఁ గొని యులరునది కైతనెలంత కాదా? కడు మొఱకువాని గాళిదాసుఁ గావించినది కవిత కాదా? ఐహికపునర్జీవనమును, హృదయకోమలత్వమును, భావోన్నతియు, ననురాగప్రభావము, నాధ్యాత్మికశక్తియు, మానసికోద్ధారణమును సుక్తిగాక మఱేమి?

కవి తల్లివంటివాఁడు! కటువు లగుసత్యములను విజ్ఞానడింభకులకుఁ గఱపుటకుఁ గవి నెమ్మనసి వెరవులు రోయును! గోరుముద్దలకుఁ దోడు జననిజాబిల్లిపాటలను గలుపును! వెన్నముద్దలకు వెన్నెలముద్దలను జేర్చును!! నెయ్యిబువ్వకుఁ దననెయ్యముఁ గలుపును. దొడ్డవస్తువులకు దోబూచిఁజేయుచును. ఏడుచుకుఱ్ఱని జోలపాటలం దుఱ్ఱూఁతలూపుచు... జనయిత్రి హృదయముఁ గల కవి సూక్తిసుధానిధి! కవిశేఖరుని యెడఁద కసుగాయలకఱుపుకంటెఁ గోమలమై పవిత్రమై యుండును! కవిశేఖరుఁడు హృద్యమైనపద్యము! అందంపుటలంకారములందును, మధురోక్తులందును, వింతదోబూచులందును, చిత్రకథలందును, లాలనపాలనలందును, జాబిలిపాటలందును గలిపి గంభీరసత్యముల నాతఁడు ప్రజలచేఁ దినిపించును! భాషాజాతీయములందేమి, స్వాతంత్ర్యరచనయందేమి యాటితేటివిలక్షణ మెట్టిపారస్వరహాస్యములను మనకుఁ దెలుపలేదు? తేనెసోనలు గురిపించిన వెంకటకవి యెట్టియానందలహరిని మనహృదయముపై వర్షింపలేదు? ఇక్షుఖండము గాని వెండు గా దని వసుకవి మెప్పొందగిన పూర్వార్థమందలి కవిత్వమం,దెట్టిమహత్త్వము లేదు? పశుపుఁగూటిని బడ

దన్ని, యాత్మగౌరవరక్షణార్థము, స్వాతంత్ర్యరక్షణార్థము, మనుష్యత్వరక్షణార్థముఁ గటికిదరిద్రుఁడై, కాపాటులే, గుడ్డిపేలికలే తనకు గాని చీనిచీనాంబరములును బట్టుపుట్టములు గా వని, యనన్యసాధ్యసజ్జనత జూపి, తన ధైర్యమును, దన స్థైర్యమును, దన సత్యనిష్ఠను, దనపరాకాష్ఠను, దనపరార్థచింతను, దనభక్తిని, దనకరుణను, దనయనురాగమును, దనయపూర్వరచనావిదగ్ధతయుం దత్యద్భుతముగ గురిపించి, పోతన చేసినబోధన పోతన చూపిన దృష్టాంతము పోతన కావించిన సేవ, పోతన చూపినముక్తి పృథ్వీతలమున నేకవి చూపెను? పోతనయందలి యద్భుతశక్తిని గీర్తింపని యాంధ్రుఁ డెవఁడు? నన్నయకు రాజరాజు కామధేనువు! తిక్కనకు మనుమసిద్ధి మందారము!! శ్రీనాథునకు హేమరాసులు చేతిలోనిదాసులు!!! ఇఁకఁ బోతన కెవ్వరల వని వసుకవి యబ్బురపడలేదా? విమలధిషణాధురంధరుఁ డగురాధాకృష్ణుఁడు పోతనను దలఁచి, పోతనభక్తిని మెచ్చి పోతనపద్యములు చదువుట నేనెఱుఁగుదును. తెలుఁగున భాగవతము వ్రాసి తరింపు మని భగవంతుఁడు ప్రత్యక్షమై తనతోఁ దెలిపెనని పోతన వాకొనెను! భాగవతము పఠించి, పరమభాగవతులై, ముక్తిఁ గనినవా రెందఱు లేరు? గీతకంటె భారతభాగవతములును, భారతభాగవతములకంటె గీతయుఁ దనకెక్కుడై, తనజీవనమున కేడుగడలాయె నని మాలవ్యాపండితుఁడు, ముంగల వాకొనుట నేను మఱవలేదు! గీతయందలి కర్మబోధను, గర్తవ్యతత్త్వమును హృదయంగమ మొనరించుకొని, విజయజీవు లగుటకు నేఁడు పాశ్చాత్యఖండములం దెంద ఱాతురపడుటలేదు? మనసాహిత్యమరందమును జుఱ్ఱిజుఱ్ఱి, మేక్సిములరాది పాశ్చాత్యపండితులు జీవన్ముక్తులు కాలేదా? నమలి నమలి, దిగమ్రింగివలయుపాత్రములు కొన్ని కల వని యుఁ బఠనము మనుజుని పరిపూర్ణుఁ జేయు ననియు బేకనుమహాశయుఁడు వాక్రుచ్చెను! మనసాహిత్యముదెసఁ జూచితి మేని యిట్లు జుఱ్ఱవలయుపంక్తులును, బద్యములును నెన్నేని గలవు! ఇంచుమించుగఁ బ్రపంచ మంతయు నజ్ఞానధ్వాంతమునమునిఁగియుండఁ దన విజ్ఞానద్యుతులచే దిక్కామినులకు మిఱుమిట్లు గొలిపి, తనయామ్నాయధ్వానములచే బ్రహ్మాండమును బ్రతిధ్వనింపఁజేసిన భారతసారస్వతము నాఁడు బర్కుమహాశయుని, నేఁడు మేక్డొనాల్డును (Vide. Edmund Burke's Speech on the Impeachment of Warren Hastings and Ramsay Macdonald's Speech at the First Round Table Conference.)

నాఁడును నేఁడును బల్వురు పాశ్చాత్యులకే పరమప్రమోదసంభరితస్వాంతులఁ జేసి యెందఱెందఱికి ముక్తిపంథనుజూపలేదు? శంకర, రామానుజ, మాధవాచార్య, మధ్వాచార్యులు తమయద్భుతరచనలచే నెందఱి కాధ్యాత్మికశక్తి నొసంగలేదు? ఆంధ్రులం దవతారమూర్తి యైన త్యాగరాయ లెందఱికి ముక్తిమార్గము చూపలేదు? పామరులు పాడుకొను పాటలు పట్టిగాలిపాటలు కావని చెప్పనేల?

సారస్వతము శైవలినివంటిది. ఒక్క తీరున నొక్కచోటనే నిలిచినచో, నది ప్రజాళి కెట్టి యుపకృతి నొసఁగఁజాలదు. కాలవాహినితో సారస్వతఝరి పాటిననాఁడే యది పరిపూర్ణత్వ పయోధిని జేరఁజాలును! కాళులు ముందులకు జరుగుతఱి దల వెనుకకు తిరుచుకొను టేటిపాడి? అన్నియుద్యమము లందు ముందంజ వేయు నాంధ్రులు సాహిత్యోద్యమమున నింకను వెనుకాడియే యుండుట విషాదకరము. వడివడిగ జరుగు కాలచరణములచిహ్నము లింకను మనసారస్వతమున నంకితము కాలేదు. సంఘజీవము, నేఁడు సారస్వతఝురీమతల్లికి జీవవేగమును, భావపూరమును నొసఁగు నాశిక యాయెను! జీవనమును సాహిత్యమును నవిచ్ఛిన్న మైనవి. సంఘమందు గోచరించు సంస్కరణములునువింతలును, సారస్వతదర్పణమునఁ బ్రతిఫలించిననాఁడేయందుఁ గ్రొత్తళ్లులు నృత్యమొనరించును. గమనిక లేనిధుని మాధ్యపంకిలమయమై, జుగుప్సాగర్భితమై యుండును! ప్రపంచమందుఁ బ్రతీతి వడసిన సాహిత్యములు విశాలభావవీచికావిలసితములై గాంగనిర్ఝరసదృగ్ధారాళ వేగమున నొప్పుచున్నవి. ఆంగ్లసాహిత్యమును బరికింపుఁడు.—అన్ని దేశములు, నన్ని కాలములు, నిరువదాఱక్షరములందు ఛాయాప్రతిమలట్లు గోచరించుచున్నవి! ఇతర భాషలందలి చిత్రములను, బదములను, భావములను తనవి చేసికొనుట కాంగ్లసారస్వతము సంశయింపలేదు! పందుచోటులనుండి దుమ్ము దెచ్చి షేక్సిపియరు దానిని రంగారు బంగారుపాడి చేసెను! గంభీరభావవిలసితమై, సర్వాంగసుందరమై సృష్టికర్తయట్లు నేఁడాంగ్లము సర్వాంతర్యామియై, సర్వలోకిమంతమై యున్నది! తన్నొరులు చూడరా దనియు, నంటఁగూడ దనియుఁబలికి, మకిలిమడియందు వాలి పెట్టికొనియుండుచో నేఁడాంగ్లసారస్వతము, షేక్సిపియరును గనినసారస్వతము, కవిరవులం గనిన సారస్వతము, ప్రపంచసాహిత్యములం దగ్రగణ్యమై జగజ్జేగీయమానమై యెట్లు భాసిల్లఁగలదు? పేరు గాని, రూపుగాని, యూరుగాని

లేక, మైమెన్‌సింగుపాటలలో నిలుచుకొని యున్న వంగసాహిత్యము సుమా రేఁబదివత్సరములలో భారతభాషలందు మిన్న యనిపించుకొని ఖండాంతర విశ్వవిద్యాలయములందు బఠనీయము మగుటకును, ఏసు గాని బుద్ధుఁడు గాని పుట్టకమున్న ఇలియడ్ గాని బ్యూవుల్ఫ్ గాని గోచరింపకమున్న, నేఁడు ప్రజ్ఞానిధుల మని గిఱ్ఱీఁగువారితాతముత్తాత లడవులం దాకలములు మెక్కుచుండ, నవ్యతత్ప్రభావిలసితమై రాజసభలం దేమి, ఋష్యాశ్రమములం దేమి మధురమంజులనిస్వనముల నాలాపితమై, గంభీరభాషణములఁ బ్రతిధ్వనితమై, చరిత్రాంశములును, నితిహాసవిషయములును నటుండ నవగ్రహముల జోజో పాటలను, బృథ్వీకాంతజాతకచక్రమును భారతభూమియం దంతటను శిలా శాసనములందుఁ జూపి శతాబ్దములకును, సహస్రాబ్దములకును మిఱుమిట్లు గొలిపి, యిటీవలఁ బాశ్చాత్యులచేఁ బ్రాచ్యలాటి నని ప్రసిద్ధినందిన ఆంధ్ర మాంధ్రావని కవ్వల నొక్కయంగుళ మైనను జరుగకుండుటకుఁ గారణ మేమి? నాకుఁ దల్లిమాటగాని వంగభాషయందుఁ గలిసిపోయిన యాంగ్లపదములను నన్యభాషాశబ్దముల నెన్నేని చూపఁగలను, కాని, జననిస్తన్యముతో ననుఁ జొచ్చి యుగ్గుఁబాలయందును, గలమాన్నమందును గలిసి, నారక్తమై, నాపలలమై, నాప్రాణమై, చెలికారమందును, మమకారమందును, జెండాటలందును జెడుగుడులందును నుప్పొంగి, యన్యరాష్ట్రములయందు సహితము ప్రథమపూజ్య మైననాయాంధ్రసారస్వతమునఁ జూపుటకుఁ దడవులాడుచుంటిని. ననుఁ గన్నతల్లి నాకు ముత్తవ్వ వలెఁ దోఁచి నన్ను సిగ్గిలఁ జేయుచున్నది! సంఘజీవన మట్లు, సారస్వత మెన్నఁడును గ్రొత్తపోయగమున నలరారుటొవ్వు గాని ముప్పు గాదు! గ్రీకుసంఘమును, గ్రీకుభాషయును నవనవోన్మేషములై తనరుటకుఁ గారణ మేమి? (Vide. "Plato's Republic") త్రుప్పుపట్టిన పద్ధతులందు తమబొందెలను బొందసీళ్ళతోఁ గొట్టి, మీఁగడతో ముంతమడ్డిని గూడ దిగమ్రింగి, పూలమోపులతోఁ గూడ తాలగుట్టను పైఁబడవైచికొని యడుగువెట్టఁజాలక మూల్గుచు వగర్చుచునుండు కవులును, జరామరణములను "దూ! దూ!!" యను సాహిత్యములును నెంతకాలము జీవించును? జాతిమతభేదములును, సంటరానితనమును, స్వీయకాంక్ష, పరద్వేషములును సాహిత్యపుఁగుత్తుకకు పిచ్చుకత్తులు! యుక్తాయుక్తములను విమర్శించి, యన్యభాషలందలి చిత్రములను భ్రాతృభావమునఁ గొని, తనవి గావిం

చుకొని, తనస్వాతంత్ర్యమును దాను వృద్ధిఁజేసికొనుటకుఁ బ్రతిసారస్వతమున కును హక్కుకలదు! తనతనయులచేతులందుఁ దనసేవకులకరములందుఁ దాను ముక్తిపడయని సారస్వత మొరుల కెట్లు ముక్తిదాయిని కాఁజాలును ?

దేశపరిస్థితులందలి మార్పులును, గాలపరిస్థితులందలి పరివర్తనములును బ్రతియుగమందును బ్రతిఖండమందును గోచరించుచునే యుండును. ప్రకృతిసౌం దర్యము ను, కళానైపుణ్యము ను, భావసౌష్ఠవము ను, గానమాధుర్యము ను, మహోన్నతాదర్శములును స్వోకరిసొమ్ములు కావు ! కాళిదాసషేక్స్పియరులు కవితామాతకడుపునఁ బుట్టినకవలలు; రవీంద్రరోలండు లన్నదమ్ములు. వీరి కేజాతియు లేదు— వీ రన్నిజాతులకుఁ జెందినవారు ! మనసంస్కృతమును దమసంస్కృత మొనరించుకొనిన జర్మను లెందఱులేరు ? మనపాళీప్రాకృతము లను, దమప్రాకృతపాళీలఁ గావించుకొనిన బర్మీయులును సింహళవాసులును టిబెటనులును జపానీయులును చైనీయులు నెందఱులేరు ? ఆఁగ్లమును దమ సొమ్ముఁ జేసికొనిన (వీరియాంధ్రాభిమానము సుడిగుండమునఁ బడినదే యం దురా ?) ఆంధ్రు లెందఱులేరు ? బ్రౌనుదొరకుఁ దెలుగుఁగోలయే లనియు, రవీంద్రరాధాకృష్ణుల కింగ్లీషుఘోషయేల యనియు వాకొని దురభిమానము మూటిముడుచుచో బ్రౌను తెల్గులమన్ననల నందుటకును, రవీంద్రరాధాకృష్ణు లును భారతజనయిత్రియు నేఁడు పశ్చిమఖండముల జోహారులనందుటకును నవకాశ మెట్లుండును ? సర్వజనసౌహార్దమును, సకలరాష్ట్రభ్రాతృత్వమును, సర్వమానవసంఘీభావమును సారస్వతమువలననే చేకుఱును ! ఈసంఘీభావ, మీసౌహార్ద్య, మీభ్రాతృత్వము చేపడిననాఁడే నేఁటి విప్లవమును, నేఁటి దురంతమును, నేఁటిదౌరాత్మ్యమును, నేఁటిదుఃఖమును రవికాంతులు తోఁచి నంతఁ బలాయనమగుకాఱుచీఁకటులట్లు పటాపంచలై, ప్రపంచమును శాంతి యుత, సౌఖ్యయుత, సత్యయుతానందయుతధామముఁ గావించివైచును! సచ్చి దానందము (సత్ + చిత్ + ఆనందము) విరాజిల్లిననాఁడే మానవుఁడును, మానవలోకమును ముక్తినందుదు రని తోఁచునే వాకొనియుంటిని. ఆదర్శము లం దాదర్శమైన యీయాదర్శమును, ఉన్నతాశయములందు మహోన్నత మైన యీయాశయమును నేఁడుగాకున్న రేపైనఁ గరస్థలామలకముఁ గావిం చునది "సారస్వత మని" నాయాశ !

---

# ఆంధ్రభాష-వర్తమానార్థకచువర్ణము.

—: కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ, చెన్నపురము. :—

---

ఆంధ్రభాషలో వచ్చుచున్నాఁడు, చేయుచున్నాను మొదలగు క్రియారూపముల నిష్పత్తిక్రమమును గూర్చి విచారింపఁ దొడంగినపుడు, వానిలోఁ గనఁబడుచున్న 'చు' అనుదానిని వర్తమానార్థకప్రత్యయ మని చెప్పుట సామాన్యముగా నాంధ్రవ్యాకరణపద్ధతి యై యున్న దని చెప్పవచ్చును, గాని, బాలవ్యాకరణమున వర్తమానకాలరూపప్రక్రియను సాధించుసందర్భమున వర్తమానమున లట్టగు ననియు నీలట్టు పరమగునపు డుదంతంబునకు ఉ అను నది యనుబంధం బగు నని యు, నీయనుబంధము పరం బగునపుడు మరల ధాతువునకు 'చు' వర్ణకంబు-లేదా ప్రత్యయంబు వచ్చు ననియు విధించెనే గాని, ధాతువుపైఁ జేర్పఁబడిన యీచువర్ణముయొక్క గాని ఉన్నానుబంధము యొక్క గాని ప్రయోజనము- లేదా శక్తి యేమి యనువిషయమును గూర్చి యేమి యుఁ జెప్పఁబడి యుండలేదు అనఁగా, వర్తమానార్థద్యోతకత్వము, ఉన్నానుబంధములో నున్నదా, చువర్ణములో నున్నదా- అనువిషయ మేమాత్రము సూచింపఁబడలేదు. కాని సంస్కృతవ్యాకరణపద్ధతి నంతను, అనఁగా, ధాత్వధికారమును, లట్టు, లిట్టు, లూట్ మొదలగు లకారపరిభాష నంతను గూడ నాంధ్రులు భాషావ్యాకరణములోనికి దింపివేసిన వైయాకరణు లొకవిధముగా దీనికి సమాధానము చెప్పెదరు. చువర్ణకము గాని ఉన్నానుబంధము గాని వర్తమానార్థకము కానే కా దని వారు సమర్థింప యత్నింతురు. కావుననే వర్తమానార్థమున, చువర్ణము గాని ఉన్న యనునది గాని వచ్చునని చెప్పక "వర్తమానార్థమున లట్టగు" నని సూత్రించి, దానికి వర్తమానక్రియావృత్తే ర్ధాతోః లట్ స్యాత్" అనువృత్తి కనుకూలముగా "వర్తమానక్రియావృత్తి యగుధాతువునకు లడ్వర్ణకం బగు' నని వ్యాఖ్యానం బొనరించినారు. ధాతువు వర్తమానక్రియావృత్తి యగుట యనఁగా నేమి, యను ప్రశ్నము కలుగ దానికి సంస్కృతవైయాకరణుల సిద్ధాంతమునే సమాధానముగాఁ జెప్పుదురు. ఆసిద్ధాంతం బిది-జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబు లనునవి ప్రాతిపదికమునకే యర్థంబులు, ప్రథమాదివిభక్తు లాయర్థమును స్ఫుటీకరించును. అగ్నికి సహజంబులైన దహనప్రకాశశక్తులను బ్రకటింపఁజేయుటలో

శుష్కేంధనంబు సాధనం బైనట్లే యీవిభక్తిప్రత్యయములు కేవల సాధనమాత్రములే గాని స్వతంత్రశక్తి కలవి కావు; ఈరీతిగనే, క్రియాత్వ క్రియాసంఖ్యా కాలకారకార్థకం బగుపంచకంబు ధాతువునకే యర్థంబులు గాని లకారములకు స్వతంత్రశక్తి లేదు. ఆధాత్వర్థపంచకమును స్ఫుటీకరించుటలో లడాది ప్రత్యయంబులు కేవలసాధనమాత్రములు, కావున వర్తమానకాలికపదార్థంబు నందలి క్రియను దెలియఁజేయుధాతువునకు లట్ప్రత్యయం బగుచున్నది గాని లట్ప్రత్యయమునకు వర్తమానకాలము వాచ్యముకాదు.—ఈడొంకతిరుగుడు వాద మంతయు విభక్తిప్రత్యయముల మూలస్వరూపమును మూలార్థము నన్వేషించి తెలిసికొనుట కేమాత్రము కొఱుకఁబడని సంస్కృతభాష కన్వయించిన నన్వయింపవచ్చును గాని, సంస్కృతమువలె సంపూర్ణప్రత్యయావస్థను బొందక చాలవఱకు సంశ్లిష్టపదరూపత్వము నింకను నిలుపుకొని యున్న దక్షిణ హిందూదేశభాషలవిషయమునఁ జెప్పు టేమియు సమంజసముగఁ గనఁబడదు. ఆభాషలోని, తిప్, తస్సులకుఁ గాని వికరణప్రత్యయములకుఁ గాని యర్థమేమియుఁ దెలియకపోవుటచే, లట్ లిట్ లనుసంకేతముల నేర్పఱుచుకొని, ఈసంకేతములకు వాస్తవముగా నర్థ మేమియు లేనేలేదు గనుక, వర్తమానాది కాలములు, సంఖ్యాదులు ధాతువులోనే యున్నవి. తిప్, తస్సులు కేవల ద్యోతకము లని యావైయాకరణులు చెప్పుకొనవలసివచ్చినది. లేనిచో తిప్, తస్, శప్, శ్నా వీని కర్థమేమి యను ప్రశ్న వెంటనే కలుగును గదా, దాని వారించుట కాపన్నాగము వారు పన్నిరి. “అంధేనైవ నీయమానా యథాంధాః” అన్నట్లు సంస్కృతవైయాకరణులు పోయినత్రోవనే కన్నులుమూసికొని వీరును బోవుటచే లట్టు లిట్టు అను ననవసరసంకేతములను గల్పించుటయే గాక “వచ్చుచున్నాను” అనుదానిలో వర్తమానద్యోతక మగు భాగమేదో కనిపెట్టలేని స్థితిలోఁ బడవలసినవారైనారు. కావునను ‘వసతి ధాత్వర్థకమైన ‘ఉండు’ ధాతువునుండి యేర్పడిన ‘ఉన్న’ అను క్రియావిశేషణము స్వయముగా నర్థము లేని లట్టు కంతకంటె నర్థవిహీన మగు ననుబంధమాత్రముగా వారిచే గ్రహింపఁబడవలసివచ్చినది. చువర్ణకము నర్థము తెలియని ప్రత్యయముగా గ్రహించిన గ్రహించిరిగాక, ‘ఉన్న’ అనుదానిని గూడ నర్థము తెలియని యనుబంధ మనుట యుక్తముగా లేదు. వసత్యర్థక మగు ‘ఉండు’ ధాతువునుండి యేర్పడిన ‘ఉన్న’ అనుదానికి వర్తమానమే యర్థము

కదా. కావునఁ "జేయుచున్నాను" అనుదానిలోని 'ఉన్న' అనునది వర్తమానకాలమును సూచించుచున్న దని చెప్పవలసియుండును. ఇట్లు 'ఉన్న' అనునదే వర్తమానచిహ్న మని చెప్పవలసియున్నచో 'చు'వర్ణకముయొక్క ప్రయోజన మేమి యను ప్రశ్న కలుగక మానదు. సామాన్యముగా చువర్ణము వర్తమానార్థకచిహ్న మని చెప్పఁబడుచున్నది. వైయాకరణులు కూడ, ముఖ్యముగా బాలవ్యాకరణమున సంధిపరిచ్ఛేదములో, ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణేత్యాదిసూత్రమునుబట్టి 'చు'వర్ణమును శత్రర్థకముగా గ్రహించియుండినట్లు స్పష్టం బగుచునే యున్నది. కావున వైయాకరణులు 'చు'వర్ణమునే వర్తమానచిహ్నముగా గ్రహించినారు కాని 'ఉన్న' అనుదానిని కాదు. ఈకారణముచే వర్తమానార్థకచిహ్న మేది? 'చు' అనునదా? 'ఉన్న' అనునదా యనుసందేహము కలుగక మానదు.

కేవలము పాణినీయపక్షి ననుసరించి యీభాషను వ్యాకరించి సూత్రములుగనో కారికలుగనో లక్షణము చెప్పిన యీవైయాకరణులను విడిచి పూర్వకాలమున నాంధ్రభాషాలక్షణ మాంధ్రముననే చెప్పిన కేతనపెద్దనాదు లీవిషయ మేమి చెప్పిరో యని పరిశీలించినను నీసందేహము తీరకయే మఱింత చిక్కులోఁ బడునట్లున్నది. ఏలయనఁగా వారి వ్యాకరణములలో నీచువర్ణముయొక్క గాని ఉన్నానుబంధముయొక్క గాని ప్రసక్తియే లేదు. చేయుచున్నాఁడు, అనువర్తమానార్థకరూపమునే వారు గ్రహించినట్లు లేదు. కావున నారూపముయొక్క నిష్పత్తి క్రమమును జెప్పునావశ్యకతయు వారికిఁ గలుగ లేదు. దీనినిబట్టి యీ'చున్న'తోఁ గూడిన వర్తమానార్థకరూపము వారికాలమునఁ బ్రచారములోనికి రాలే దనియో, వచ్చినను శిష్టవ్యవహారములోనిదిగాఁ బరిగణింపఁబడకపోవుటచే దానిని సాధింప వారు గ్రహింపలే దనియో తలంపవలసియున్నది. ఇఁక, కేతన వర్తమానార్థకచిహ్నము "ఎన్" అని చెప్పియున్నాఁడు. దానిపై "డును దరు లొరులకు నెదిరికిఁ,దనరంగాదు,దవు,దరులు, తనకుదను, దముఁ, జనునేకబహువచనములు, మనుసన్నిభ క్రియల వర్తమానార్థములఁ". అని చెప్పినాఁడు. దీనినిబట్టి 'ఎన్' అనునది వర్తమానార్థకచిహ్నముపై 'డును' 'దరు' మొదలగు సర్వనామచిహ్నములఁ జేర్చినచో వర్తమానకాలక్రియ లేర్పడుచున్న వని తెలియుచున్నది. నేను, మేము, మొదలగు సర్వనామశబ్దముల యవశిష్టభాగములును, 'ము' 'వు' 'రు' అను

నవియే కావలసియుండఁగా, కేతన వీనికిఁ బూర్వమున నొకదకారమును జేర్చుటనుబట్టి యీ కాలవాచకక్రియారూపములలో మూలధాతు వేది? కాలచిహ్న మేది, సర్వనామప్రత్యయ మేది, యనువిషయమును సరిగా నీతఁడు విమర్శించిన ట్లగపడదు. కాని కాలచిహ్నములను మాత్ర మీతఁడు విడఁదీసి యిట్లు తెలిపియున్నాఁడు.

ఇన్నగు * భూతార్థము నెడ, నెన్నగు వర్తించునర్థ మెఱుఁగఁ బలుకుచో
నున్నగు భవిష్యదర్థము, నున్నంగాఁ బలుకుచోట నూతనదండీ.

ఇట్లు, 'ఇ'కారము భూతకాలమునకును, ఎకారము వర్తమానమునకును, ఉకారము భవిష్యత్తునకుఁ జిహ్నము లని కేతన తలంచెను. ఇఁక, పెద్దన కాలచిహ్న మేది ప్రత్యయ మేది యనువిషయమునే యెత్తుకొనక-

తెలుఁగు క్రియాపదములకును, దలకొను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు కాన వానిఁ బేర్కొన, నలదుప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుదుర్.

అని యీ క్రియాపదముల నిష్పత్తిక్రమమును దెలుప సాధ్యము కాదు ప్రయోగమునుబట్టి రూపములను దెలిసికొనవలసినదే యని చెప్పుచు, "వర్తమానార్థమునఁ, బ్రథమపురుషంబునకు నేకవచనబహువచనంబులందు నెడి నెదరులును, మధ్యమపురుషంబున నెద వెదరులును, నుత్తమపురుషంబున నెద నెదములును గ్రమంబున నాదేశంబు లయ్యె" నని-అడిగెడి, నడిగెద రనఁగా యని, రూపముల నుదాహరించినాఁడు. భవిష్యదర్థంబున 'ఉన్' అగు నని కేతనయు, ఉనుదురు మొద లగునవి యగు నని పెద్దనయుఁ జెప్పి, "చేయున్, జేయుదు రనఁగాఁ, జేయుదు చేయుదురు మీరు చిత్తం బలరం, జేయుదుఁ జేయుదు మనఁగా, నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పన్" అని యుదాహరణములు నిచ్చినాఁడు. ఈ అరిగెదను, అరుగుదును, అనురూపములు వర్తమానభవిష్యదర్థకములుగా వీరిచే గ్రహింపఁబడినను, సామాన్యవ్యవహారమున నివి యొక్కకాలమును నిష్కర్షగాఁ జూపునవి గాకుండుటచేఁ దరువాతి వైయాకరణులచే నివి తద్ధర్మార్థకము లనఁబడుట తటస్థించినయది. ఈభాషలో, తొలివ్యాకరణములు రచింపఁబడునాఁటి కివి ప్రత్యేకకాలములను సూచించునవి గానే తలంపఁబడుచుండినను, ఈకాలభేదము భూతకాలికరూపముల విషయముననే స్పష్టముగాఁ గనఁబడుచుండెను, గాని, తక్కినవాని విషయమున

* ఎన్నగు-పా.

నంతగా లేదు. అనఁగా- భూతకాలమును సూచించుటకుఁ బ్రత్యేకరూపము లేర్పడియుండ, వర్తమానభవిష్యత్కాలముల కట్టి యేర్పాటు నిష్కర్షగా నున్నట్లగపడ దనుట. అడిగెను- అడిగితిని, అనునవి భూతకాలికరూపములే కాని అడిగెదను- అడుగుదును అనునవి వర్తమాన భవిష్యత్తులకు రెంటికిని వర్తించునవై యున్నవి. ఒకప్పు డివి భూతమును గూడ సూచించియుండును, కావుననే యివి తద్ధర్మార్థకము లనుట పొసఁగుచున్నది. చేయుదును అనున దొకప్పుడు కాలభేదము లేక ప్రయోగింపఁబడుటంజేసి, త్రికాలవాచి యని కాని తద్ధర్మార్థకరూపం బని కాని యెట్లు చెప్పఁదగుచున్నదో, యట్లె "చేసితిని" అనురూపమునుగూర్చి మనము చెప్పలేము గదా- కావున నొకకాలమునఁ "జేయుదును" అను తద్ధర్మార్థకరూపమే త్రికాలములందును వ్యవహరింపఁబడియుండ మఱి కొంతకాలమునకు భూతక్రియను భాషలో సువ్యక్తము చేయవలసిన యగత్యము కలిగినపుడు 'చేసితిని' అనురూపము నీభాషను వ్యవహరించినవారు కల్పించియుందు రని తలంపవచ్చును గదా! అప్పుడు, ప్రత్యేకముగా భూతమునకు 'చేసితిని' అనురూపమును, కాలనియమము లేకుండ, అనఁగా, తద్ధర్మార్థకముగ "చేయుదును" అనునదియు వ్యవహారమున నుండి యుండును. భూతమునకుఁ బ్రత్యేకరూపము భాషలో నేర్పడినపిదప, తద్ధర్మార్థకరూపమునకు భూతకాలమునందు వ్యవహారము తగ్గి, యిదివర్తమానభవిష్యత్తులయందే ప్రయోగింపఁబడుట తటస్థించు ననుట సంభావ్యమె గదా! ఆకారణముచేతనే 'చేయుదును'అనునది వర్తమానభవిష్యత్తులను రెంటిని సూచించుచునే యున్నది. బాలవ్యాకరణకర్తయు,"తద్ధర్మాదులందు లాట్టగు"అను సూత్రము చెప్పి, తచ్ఛీల, సంభావనా, సంప్రశ్న, సాతత్య, వర్తమాన, భావ్యాశీరాదులు ఆది పదగ్రాహ్యము' లని వ్యాఖ్యానముచేసినాఁడు. తద్ధర్మార్థకము లనఁబడు నీరూపములు వర్తమాన భావ్యాశీరాదులందేగాక వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును. అని దీనికి భూతమునను వ్యవహారముకల దని వ్యక్తముచేసినాఁడు. "ఆత్మమోక్షావలంబి యైన, ధర్మముత్తమమండ్రు తత్త్వజ్ఞులధిప" (భార-శాంతి 4 ఆ); పౌరుషంబు చూవె ఫలమండ్రు కొందఱు, అను నీమొదలగు నుదాహరణంబుల నిచ్చి 'అండ్రు' ఇత్యాది లాట్ప్రత్యయాంతంబులకు 'అనిరి' అని భూతకాల మర్థము, అని గుప్తార్థప్రకాశికాకారుఁడు దీనియర్థము నింకను బ్రకాశింపఁ జేసెను. ఇట్లు దుగాగమరూపములు కాలత్రయమందును వ్యవహా

రింపఁబడుచున్నట్లు వ్యక్తమగుచుండ, ఎదగాగమరూపములు తద్ధర్మార్థకములే యని చెప్పఁబడినను, భూతమునందు మాత్రము ప్రాచీనకాలమునఁ బ్రయోగింపఁ బడినట్లగపడదు. వెనుకటికాలమున దీనికి వర్తమానంబుననే ప్రయోగప్రాచుర్యము కలదని చెప్పనగును. భావికాలమునను చేయుదును, చేసుదును, చేస్తును, మొదలగు "ఉదు"రూపములకున్న ప్రచారము, ఎదరూపమునకున్నట్లగపడదు. కావుననే తరువాతి వైయాకరణులు 'ఎద' రూపమును గూడ, తద్ధర్మార్థకములలోఁ జేర్చినను, కేతనపెద్దనలు, దీనిని వర్తమానార్థక మనియే చెప్పియుండిరి.

కాఁగా ఉదురూప మొకటి మూఁడు కాలములందు వ్యవహరింపఁబడున దుండఁగా 'ఎదు'రూప మెట్లు భాషలో బయలుదేఱినది, అనునది తరువాతిప్రశ్న. 'ఇతు' రూపము భూతకాలరూపముగ నేర్పడిన తరువాత 'ఉదు' రూపము తక్కిన రెండు కాలములను సూచించుచుండె నని కదా తలంచితిమి. కావున 'ఉదు' రూపము చేసితు, చేసితిని, అను భూతకాలికరూపముకంటె నీభాషలోఁ బ్రాచీనం బగురూప మని నామనవి. ఏల యనఁగా:- నిది త్రికాలవాచి. ఇంతియ కాక తమిళమునందలి "శెయ్యుంపు" అను ప్రాచీనరూపముతో నభిన్నము. కన్నడమునందలి కాలభేదమును సూచింపని "గుం" ప్రత్యయమును ఈ"గుందు" అనుదాని యవశిష్టరూపమే. భవిష్యద్వర్తమానముల కొక్కరూపమునే వ్యవహరించుటలోఁగలచిక్కును దొలఁగించుకొనుటకుఁగా వర్తమానమున 'నెద'రూప మొకటి ప్రాచీనులు కల్పించి వ్యవహరించి రనుటలో వింత యేమియు లేదు. కన్నడభాషలోఁ గూడ నిట్లె 'చేయుదును' అనుదానితో సమాన మగు 'మాడుత్తేనే' అనురూప మొకటి తద్ధర్మార్థక మనియే చెప్పఁదగిన దుండఁగా, నదియే సామాన్యవ్యవహారమున వర్తమానమునఁ గూడ వాడుకొనఁబడుచుండఁగా, నొకప్పుడు దీనికి భావ్యర్థము కూడఁ గలుగు నను తలంపుతోఁ గావలయు, ప్రాచీనకన్నడులు "మాడిదపం" అనునొకప్రత్యేకవర్తమానకాలరూపమును గల్పించుకొనినారు. ఈరూపము ప్రాచీనమైన గ్రాంథికరూపముగా నిప్పుడు కనఁబడుచున్నను, దరువాతి హాసగన్నడమున, మధ్యకాలపు శైవవాఙ్మయమున విశేషముగాఁ బ్రయోగింపఁబడియుండిన "మాడుత్తేనె" అనురూపము కూడ నైదానితో వ్యవహారమున సమకాలికమె యని కాని యంతకంటెఁ బ్రాచీనమే యని కాని చెప్పక తీరదు. కన్నడమునందలి

'మాడిదపం' రూపమువంటిదె మన వర్తమానకాలిక 'చేసెదను' అను 'ఎద' తోఁగూడిన రూప మని నాతలంపు భాషలో 'ఎద' రూపమునకంటె సామాన్యవ్యవహారమున 'ఉను' రూపమునకుఁ బ్రచార మెక్కు డగుటంబట్టి కాఁబోలును, 'మాడుత్తేనె' అను రూపము కన్నడమునందువలెనే, చేయుదును, చేసుతును, చేసుతాను, చేస్తును, చేస్తాను, అనునవి తెలుఁగునకు వర్తమానరూపములై వ్యవహరింపఁబడుచువచ్చినవి. ఇక్కడ మఱియొకవిశేషము గమనింపవలసియున్నది ప్రాచీనకన్నడమున వర్తమానార్థకరూపము 'మాడిదపం' అనునదే యైయున్నను, దీనినుండి యేర్పడిన క్రియాజన్యవిశేషణ మగపడుట లేదు. ఆప్రాచీనభాషలోఁగూడ వర్తమానకాలిక క్రియాజన్యవిశేషణము 'మాడుత్తు' అనునదే. అనఁగా హళగన్నడములో వర్తమానార్థకమైన, లేదా, ఆకాలమున వ్యావహారికరూపముగా గ్రహింపఁబడిన 'మాడుత్తేనే' అనుదానికి సంబంధించినదే. ఈకారణముచేతనే 'మాడిదపం' అనునది మధ్యవచ్చిన కృతకరూపమనియు, 'మాడుత్తు' అనుదానినుండి యేర్పడినదే ప్రాచీనకాలమునుండి వ్యవహారమందుండినదనియుఁ దలంపనగును. అట్లే కానిచో 'మాడుత్తేనే' అనుదానికి సంబంధించిన 'మాడుత్తు' అను క్రియావిశేషణమువలెనే 'మాడిదపం' అనురూపమునుండి యేర్పడిన, లేదా, దానికి సంబంధించిన యొకవిశేషణరూప ముండవలసినదే గదా. అది లేదు- సరి గదా- అర్వాచీనం బగు హళగన్నడరూపముగాఁ దలంపంబడుచున్న 'మాడుత్తేనే' అనుదానికి సంబంధించిన "మాడుత్తు" అనునదే ప్రాచీనభాషలోఁ గూడ వర్తమానార్థకవిశేషణమై యున్నది. అనఁగా 'మాడిదపం' అనునది వైయాకరణులు గ్రహించినవర్తమానార్థకరూపము. 'మాడుత్తేనే' అనునది దానితో సమకాలమందే వ్యవహారమందుండెడిది గాని గ్రాంథికభాషాప్రయోగగౌరవము దానికి రాలేదు. కాని 'మాడుత్తు' అను దీని న్యూనరూపము మాత్ర మాకాలముననే గ్రాంథికగౌరవమును బడసి వర్తమాన క్రియాన్యూనరూపముగా నంగీకరింపఁబడినది యని తలంపఁదగియున్నది.

ఇది నే నేందుకుఁ జూపితి ననఁగా- ఈస్థితియే తెలుఁగున కన్వయించినచోఁ జక్కఁగా సరిపోవుచున్న దని తెలుపుటకే. మాడిదపం అనుదానినుండి యేర్పడిన శత్రర్థకరూపము కన్నడమున నగపడనట్లే, 'చేసెదను' అను దానికి సంబంధించిన శత్రర్థకరూపము తెలుఁగునను గనఁబడదు. ప్రాచీనభాషలో, అనఁగా హాలగన్నడములో 'మాడుత్తేనే' అనునది క్రియారూపముగా వై

యాకరణులచే గ్రహింపఁబడనట్లే, 'చేస్తున్నాను'- చేయుచున్నాను- అనునది వర్తమానక్రియారూపముగాఁ బ్రాచీనాంధ్రవ్యాకరణమును దెలుఁగులో వ్రాసిన కేతనపెద్దనలచే గ్రహింపఁబడలేదు. కాని యాకాలమునఁ బ్రయోగింపఁబడిన శత్రర్థకరూపముమాత్రము 'చేయుచున్నాను' అనుదానికి సంబంధించిన 'చేయుచు' అను 'చు'వర్ణాంతరూపమే. 'చేసెను' అను మఱియొక విశేషణరూపము-ఇప్పుడు తద్ధర్మార్థక మనఁబడునది యుండిన నుండుఁగాక- ఇది "చేసెదను"అను 'ఎద'రూపముతో సాక్షాత్సంబంధము కలదని చెప్పుటకు వీలుకనఁబడదు. 'చు' వర్ణాంతరూపములు భారతకవులచేతను విశేషముగానే వాడంబడినవి. "అఱచుచుం బఱతెంచి"-అన్వేషించుచుం జని" (ఆది-8-ఆ-83-86) "సముంచితదక్షిణలిచ్చి తన్పుచుం జేయుచునుండె" 'తక్షకుఁ డీకుండలము లపేక్షించుచునుండు వాఁ డభేద్యబలుఁడు' "తంతు సంతానంబు ననువయించుచున్నవారి" ఈమొదలగు ననేకసందర్భములలో 'చు' వర్ణాంతరూపము వర్తమానన్యూనముగనో, లేదా 'ఉన్న'అనుదానితోఁ జేర్పఁబడి వర్తమానవిశేషణముగనో ప్రయోగింపఁబడుచుండిన ట్లగపడుచుండెనేగాని "చేయుచున్నాఁడు, చేయుచున్నది" అనురీతిగా సంపూర్ణక్రియారూపము వాడుకలోఁ బడిన ట్లగపడదు. "ఇది మనకేర్పడుచున్నది" అనుదానివంటి క్రియారూపములు నన్నయభాగముననే గాక తిక్కనాదులలో సయితము నల్పసంఖ్యాకములే యైయున్నవి. ఇచ్చట నైనను వారిదృష్టిలో, ఏర్పడుచు + ఉన్నది-అని 'ఉన్నది' అను శబ్దమే క్రియగా గ్రహింపఁబడియుండవచ్చును- అనఁగా- 'చు'వర్ణాంతము వర్తమానన్యూనరూపముగనే కాని సంపూర్ణక్రియారూపముగ వారిచే నింకను గ్రహింపఁబడిన ట్లగపడదు.

కేతన పెద్దనలును నిట్టి చువర్ణాంతశబ్దములను వాడియున్నారు. "నెఱయఁగ నూఁదుచుఁ దేలుచు,నొఱపై యిరుదెఱఁగుఁ జెల్లుచుండుం గృతులన్" అని కేతన ఊఁదుచు, తేలుచు ననియే కాక, "చెల్లుచుండుఁ" అని 'ఉండు' శబ్దముతోఁగూడఁ జేర్చి ప్రయోగించినాఁడు ఇఁకఁ బెద్దన "అగుచున్నకర్తయగు వర్తమానంబు" అని వర్తమానకాలలక్షణమును దెలుపుటకుఁగా- చువర్ణాంత శబ్దమును 'ఉన్నా'నుబంధముతో 'ఉండు' ధాతువుయొక్క సంబంధార్థకక్రియావిశేషణముతోఁ జేర్చి ప్రయోగించినాఁడు. "ఇట్లు చెల్లుచుండుఁ" అను దానివంటిరూపములను బ్రయోగించిన వీరు వర్తమానక్రియారూపముల నిష్పత్తిక్రమమును దెలుపునపుడు 'దును, దరులు, ఎడి, నెదరులు' మొదలగు

వానిచే మాత్రమే నివృత్తిచేసి చూపుచు. "చెల్లుచున్నది, అగుచున్నాను" అనునట్టి చువర్ణాంతశబ్దములనుండి సంపూర్ణవర్తమానక్రియారూపముల నివృత్తిని గూర్చియే యెత్తుకొనక పోవుట చూడఁగా, వారికాలమునకుఁ గూడ నీ రూపములకు, ప్రత్యేకక్రియాపదత్వము వ్యవహారమున సిద్ధింపలేదని నిశ్చయింపక తీరదు. 'చేయుచున్నది' అనురూపమును, చేయుచు + ఉన్నది అను ప్రత్యేకపదములను దృష్టితో లేదా జ్ఞానముతోడనే వారు ప్రయోగించిరి కాని యదియొక సంపూర్ణక్రియ యనుభావముతో వారు వ్యవహరించియుండలేదు. కావుననె చువర్ణాంతశబ్దములనుండి వర్తమానక్రియ లప్పటి కేర్పడనే లే దని చెప్పవలసియున్నది. ఇట్లు చువర్ణాంతశబ్దములనుండి వర్తమానక్రియారూపములు భాషలో నేర్పడకపూర్వము, అంతకుమునుపే ఇత్వాంతరూపము భూతకాలసూచకమై ప్రత్యేకముగా నేర్పడియున్నది, గావున, చేయుదు- చేసెద, అను ఉదు-ఎదులతోఁ గూడిన రూపములు భవిష్యద్వర్తమానకాలములను రెంటిని సూచించునవై యుండును కాని సామాన్యవ్యవహారమున ఎదరూపము వర్తమానకాలముననుఉదురూపము భవిష్యత్తునను విశేషప్రయోగము గలవై యుండుటను బట్టి కేతనపెద్దన లిట్లె తమవ్యాకరణములఁ జెప్పిన ట్లగపడుచున్నది. ఎదరూపము భవిష్యత్తునను, (పని యేమి పంచినఁ బదపడి చేసెద ననక" తిక్కన) ఉదురూపము వర్తమానమునను (సద్ధర్మమార్గంబునలుపుద య్యా-సభాపర్వ-నన్నయ)గూడ వ్యవహరింపఁబడినను నవిప్రధానముగా వర్తమానభవిష్యత్తులనే క్రమముగా సూచించున వనుటకు సందేహము లేదుగదా, ఈచిక్కును దొలఁగించుకొనుటకే కన్నడులు "మాడిదపం" అను మఱియొక రూపమునుగల్పించికొన్నారు ఈరూపము'మాడితు' అను భూతకాలికరూపమునుండి కల్పింపఁబడినది. సామాన్యముగా నీభాషలలో నర్థభేదము సూచింపవలసినపు డొకధాతువుపై మఱియొక సహాయధాతువును జేర్చి ధాతుపల్లవములుగనో-శబ్దపల్లవములుగనో చేసి చెప్పుట స్వాభావికంబే యగుటచే- ఈధాతురూపాంతరమగు 'ఇతు' అనుదానింజేర్చుటచే నేర్పడిన మాడు + ఇతు"మాడితు అను భూతకాలికరూపమునకు 'అగు-అవు' అనుసత్త్వార్థకసహాయధాతువును జేర్చి 'మాడిదవు' అను వర్తమానకాలికరూపమును గల్పించినారు. అవులోని వకారము పకారముగా మాఱుటచే 'మాడిదవు-మాడిదపు-అయి- మాడిదపు + అం=మాడిదపం- మొదలగురూపము లేర్పడినవి, మాడిదపం అనఁగా మాడితు=చేసిన(ది) అవుచున్నది లేదా-చేసినవాఁడు అగుచున్నాఁడు.

అనువర్తము వచ్చినది. కేళ్దపం, గెల్దపం మొదలగు హలంతధాతువులపై 'ఇతు' అనుదానిలోని 'ఇ' కార మగపడక లోపించుచున్నది వీనినుండి యేర్పడిన భూతకాలికరూపములకే కేళ్దం, గెల్దం' అని ఇకారరహితము లై యున్నవి. ఈ భాషలో నికారరహితరూపములే విశేషముగా నుండుటచుబట్టి యుందలి భూతకాలికచిహ్నముయొక్క మూలస్వరూపము ను దెలిసికొనలేని వైయాకరణులు 'ద' కారము నే భూతకాలికచిహ్నముగా గ్రహించినట్లై, "కేళ్దపం" మొదలగు రూపములను బట్టి 'దప' అనునదే వర్తమానకాలచిహ్న మని కూడఁ దలంచి యట్లె వ్యాకరణములలో దానిని దెలిపియున్నారు. ఇట్లే భాషలో నీరూప మేర్పడిన చాలకాలమున కీభాషను వ్యాకరించిన వైయాకరణుల యనువితవిభాగము మూలముగా, "దప" అనునది కన్నడవర్తమాన కాలచిహ్నమై యేర్పడుట తటస్థించినది. తమిళమున 'గిరు' అనునదియు, తెలుఁగునందలి "చు" వర్ణంబుఁ గూడ నిట్లేర్పడినవే యనుటకు సందేహము లేదు.

కావునఁ బ్రస్తుతము "అగుచు" అను వర్తమానక్రియావిశేషణరూపము లోని "చు" అనునది మాత్ర మెట్లువచ్చినది యనువిషయమును బరిశీలింతము. తెలుఁగునందలి చేయుచు-చేసుతు-చేస్తూ అనునది కన్నడమునందలి "మాడు తు" అనుదానితో నభిన్నమైనదే యనుటకు సందేహ మ్మొక్కఱలేదు చేయుతు- అనుదానిరూపాంతరమే చేసుతు, చేస్తూ" అనునది మఱికొందఱి యుచ్చారణములో తుది 'తు' వర్ణము 'చు' వర్ణముగా మాఱుటచే, చేయుతు- అను దానికి 'చేయుచు' అనురూపాంతర మేర్పడినది. చేసుతు-చేస్తూ, అనునవి యూ, చేయుచు అనునదియు సమకాలికరూపములే యై యుండును. కాని 'చేయుచు' అనునది యుత్తమవర్ణములవారియొక్క లేదా శిష్టులయొక్క వ్యవహారములోని దగుటచేఁ గాఁబోలు శిష్టరూపమై సాధుత్వమును బడసి పండితులకవితలోను, శిష్టవాఙ్మయమునను, బ్రయోగింపఁబడి వ్యాకరణములలోని కెక్కినది. 'చేస్తూ' అనునదప్పటినుండి యిప్పటివఱకు సామాన్యజనులవ్యవహారముననే నిలిచియుండుట తటస్థించినది.

ఇట్లు "చేసెదను" అనునది వర్తమానక్రియారూపముగఁ బరిగణింపఁబడిన కాలముననే "చేయుతు- చేయుచు" అనుశబ్దార్థకరూపమునుండి "చేసుతు, చేస్తూ-చేయుచు"-అను వర్తమానార్థకక్రియాజన్యవిశేషణరూపములు భాషలో బయలుదేఱి వ్యవహరింపఁబడుచువచ్చినవి. ఇంతకుఁ గన్నడభాషలో వర్తమా

నార్థకక్రియావిశేషణ ముగు "నూంకుత్తు" అను దానివలెనె తెలుఁగు నందలి "చేయుచు"- చేస్తు- అనురూపములు కూడ నంతకు పూర్వము చిరకాలము నుండి భాషలో కాలభేదము లేక తద్ధర్మార్థకముగ వ్యవహరింపఁబడుచున్న "చేయుదు" అను "ఉదు" శబ్దాంతరూపము నుండి యేర్పడిన దని తెల్పుటయే నా ముఖ్యవిషయము. ఆంధ్రలోకవ్యవహారమున చేయుదు- "చేయుదు" అను ప్రాచీనరూపములు 'చేసుతూ' చేస్తూ, చేయుచు అను నూతనరూపములను బొందినపుడే వీనికిఁ బ్రత్యేకముగా వర్తమానార్థముగ నూతనశక్తి సంక్రమించుటయు ఉదంతరూపమునకుఁ గలవర్తమానభావ్యతద్ధర్మార్థబోధకశక్తిస్థానస్థ నదలి భావ్యర్థమున వ్యవహారము ప్రబలముగుటయుఁ దటస్థించినది. కావుననే 'చేయుచు' అనునది ప్రత్యేకముగా వర్తమానార్థకక్రియావిశేషణముగా భాషలో నేర్పడినది. ఇఁక దీనినుండి క్రియారూప మేర్పడవలసియున్నది. 'చేసి' అను భూతకాలికన్యూనరూపమువలెనే 'చేయుచు' అనునది కేవల వర్తమాన న్యూనరూపమె గాని సంబంధార్థక విశేషణరూపము కాదు. 'చేసి' అను భూత న్యూనమునకు 'చేసిన" అను సంబంధార్థకవిశేషణము భాషలో నేర్పడియున్నది. ఇది "చేసితు" అను దానికి సంబంధార్థక 'అ' కారము చేర్చుటచే నేర్పడిన "చేసిత" అను దానికి రూపాంతరముగా నేర్పడినశబ్దము. ఇది తమిళమునందలి 'శెయ్‌ద' పాడిన అను దానితో నభిన్నంబైనదే. 'చేసిన' అనుదానినుండి వాఁడు, అది, ఆను, మొదలగు సర్వనామములను జేర్చుటచే, చేసినవాఁడు- చేసినాఁడు, చేసినాను, చేసినావు మొదలగు cf త. శైదాన్. శైదేణ్ etc., క్రియారూపము లేర్పడినవి ఇవి చేసెను, చేసితిని, చేసితివి, అని 'ఇతు' అనుదానితోఁ గూడినరూపములకంటె నర్వాచీనములు. భూతమునందలి చేసిన, (శెయ్‌ద,) అను సంబంధార్థకక్రియావిశేషణముతోఁ బోల్పఁదగిన వర్తమానసంబంధార్థకరూపము (relative participle) తెలుఁగులోఁ గనఁబడుట లేదు. చేయుచు అనుదానినుండి చేయుచ అనియో, లేదా- చేయుతు- అను దానినినుండి- చేయుత 'చేయున" అనియో యేర్పడియుండవలెను అట్టిది తెలుఁగులో నేర్పడలేదో లేదా అంతరించినదో చెప్పలేము. చేసితు- నుండి 'చేసిన- శెయ్‌ద" అనురూపము లేర్పడియుండఁగా, చేయుతు- అనుదానినుండి చేయుత- చేయున, అనురూపములు భాషలో నేర్పడకుండునా యని పరిశీలింపఁగాఁ దెనుఁగున లేకపోయినను, సజాతీయభాషయగు మళయాళములో నట్టిరూపము లున్నట్లగపడినది. ఆభాషలో వర్తమానార్థకరూపము "శెయ్యున్నేన్"

అనియు, సంబంధార్థకక్రియావిశేషణరూపము "శెయ్యున్న" అనియుఁ గలవని తెలియవచ్చినది. ఈ 'శెయ్యున్న' అనునది తెలుఁగునందలి 'చేయుదు' తమిళమునందలి 'శెయ్యుదు' అనుప్రాచీనరూపమునుండి యేర్పడిన సంబంధార్థక విశేషణరూపమై యుండు నని టకు సందేహము లేదు

శెయ్యుంను, శెయ్యున్ను: శెయ్యున్ను + అ = శెయ్యున్న, శెయ్యున్న + వన్ = శెయ్యున్నవన్, సర్వనామ ప్రత్యయములు లేకయే "శెయ్యున్ను" అనునది లింగవచనభేదము లేక అన్నిలింగములలోను వచనములలోను నా భాషలోఁ బ్రయోగింపఁబడుచున్నది. నాన్ శెయ్యున్ను, నామ్ శెయ్యున్ను. అవన్ శెయ్యున్ను, అవర్ శెయ్యున్ను, నీ శెయ్యున్న - మొ। శెయ్యున్న - శెయ్యున్న మనిషన్ = చేయుచున్న మనిషి. ఇక్కడ మళయాళములో 'శెయ్యున్న' అని యున్న దానికి బదులుగాఁ దెలుఁగులో "చేయుచున్న' 'చేసుతున్న' 'చేస్తున్న' అనురూపములను వాడుచున్నాము. అనఁగా చేయుతు - అనుదానినుండి సంబంధార్థకవిశేషణము చేయుత - చేయుత్త - అని చేయక, చేయుతు - అను దానికి మరల వర్తమానార్థక మగు 'ఉందు' ధాతువునుండి నివృత్తి చేయఁబడిన ఉందు - ఉంద - ఉన్న అను సంబంధార్థకక్రియావిశేషణము ను సహాయముగాఁ జేర్చి, చేయుధాతువునుండి సంబంధార్థకక్రియావిశేషణమును నివృత్తిచేసి కొన్నాము. ఇట్లు - చెయ్ - ధాతువు, దానిపై నతిప్రాచీనకాలముననే దానిక్రియావాచకత్వమును వ్యక్తీకరించుటకుఁగా - ఉతు - ఉంను - అనుసహాయధాతువు చేర్పఁబడి, చెయ్యుందు - చేయుదు, అనురూపము లేర్పడినవి. ఇవియా కాలమునఁ గాలభేదమును సూచించునవై యుండలేదు. మూఁడుకాలములం దును బ్రయోగింపఁబడుచుండెడివి. కావుననే తద్ధర్మార్థకము లనఁబరఁగినవి. కాలక్రమమున వీనికి సర్వనామ ప్రత్యయములు చేర్పఁబడుటచేఁ బురుషవచన భేదముమాత్ర మేర్పడినది. శెయ్యుఁదు అనునీఉంద్వంతరూపమే ప్రాచీనతమిళ మున, కాలాదిభేదము లేకయే ప్రయోగింపఁబడి కొంతకాలమునకు "పేరచ్చ" అనఁబడు క్రియావిశేషణముగా మాఱినది, ఈ 'శెయ్యుందు' అనుదాని రూపాంతరమే యగు శెయ్యున్ను అనునది మళయాళమున, తద్ధర్మార్థకముగ వ్యవహరింపఁబడుచువచ్చినది. 'శెయ్యుందు' లోని 'దు' వర్ణము జాతిపోవు టచే నేర్పడిన "శెయ్యుం" అనురూపము తమిళమునందును, దీనికి రూపాంత రమే యనఁదగిన "చేయును" అనురూపము తెలుఁగునను దద్ధర్మార్థకములు గనె వ్యవహరింపఁబడుచువచ్చినను, గాలక్రమమున భవిష్యద్వర్తమానకాలన

ములందు ప్రథమపురుషలో లింగవివక్ష లేకయే ప్రయోగింపఁబడుట తటస్థించినది. తమిళమున నీరూపమును 'పల్లార్ పడర్కై'యనియందురు. వాఁడు, అది, ఆమె, అవి, చేయును, అని తెలుఁగునఁ జెప్పినట్లే అవన్ శెయ్యుం, అవళ్ శెయ్యుం, అదు శెయ్యుం, అవై శెయ్యుం, అని తమిళమునను జెప్పవచ్చును. ఉత్తమమధ్యమపురుషలలో 'శెయ్యుందు' అనుదాని రూపాంతర మగు 'చేయుదు' అను 'దు' వర్ణాంతరూపమే వాడుకొనఁబడుచునుండి కొంతకాలమునఁ బురుషభేదమును సూచించుటకుఁగా-ను, వు ప్రత్యయములు చేర్పఁబడియుండును. అనఁగా నీవు చేయుదు, నేను చేయుదు, అని కొంతకాలము వ్యవహారము జరిగినపిదప చేయుదువు, చేయుదును, చేయుదురు మొదలగురూపము లేర్పడియుండు ననుట తమిళములో 'శెయ్యుంపు' అనునదే ప్రాచీనకాలమున నన్నిపురుషలలోను వాడుకొనఁబడినను, చేయును-అనుదానికి రూపాంతర మగు 'శెయ్యుం' అను దువర్ణరహితరూపము ప్రథమపురుషను మాత్రమే సూచించున దైనవెనుక ఉత్తమ, మధ్యమపురుషలను సూచించుటకుఁగా శెయ్వేన్, శెయ్వేమ్, శెయ్వాయ్, శెయ్వీర్ అనురూపములు బయలుదేఱినవి. తెలుఁగులోవలె- చేయుదును, చేయుదువు అను దువర్ణసహితరూపము లేకారణముచేతనో యాభాషలో నంతరించినవి. ఇట్లు తమిళమున- శెయ్యుందు, మళ-శెయ్యున్ను, తె-చేయుదును, కన్న-మాడుత్తు, అనురూపము లభిన్నములుగ నె కనఁబడుచుండుటచే వీనికిఁ మూలంబగు ప్రాచీనభాషలోనుండియే వీనిలో సంక్రమించిన వనియు, నివియతిప్రాచీనము లనియు నిశ్చయింపఁదగియున్నది. మళయాళభాషలోని 'శెయ్యున్ను' రూపము కాలపురుషలింగాదిభేదము లేకయే యప్పటినుండి యిప్పటివఱకు వ్యవహరింపఁబడుచుండఁ దక్కినభాషలలోఁ గాలక్రమమున నాప్రాచీనరూపమునుండి లింగాదిభేదములతోఁ గూడినరూపము లేర్పడిన వనియు భూతకాలమునకుఁ బ్రత్యేకరూప మేర్పడినతరువాత, నాప్రాచీనభాషనుండి చీలిపోయి భిన్నభాషలుగా స్థిరపడిన యీతమిళాంధ్రకన్నడములలో వర్తమానరూపములు ప్రత్యేకముగాఁ గల్పింపఁబడిన వనియుఁ దలంపఁదగి యున్నది. పైరూపములలోని 'ఉందు'-ఉదు-వలెనే ధాతువుల క్రియాపదత్వమును వ్యక్తపఱుచుటకు సహాయధాతువుగాఁ జేర్పఁబడి 'అగు' అనుదానితోఁగూడినఁ శెయ్గు అనుదానిపై వసత్యర్థక 'ఇరు' ధాతువును చేర్చు సర్వనామప్రత్యయములను గూర్చుటచే, తమిళ

ముస సైగు + ఇరు + ఏన్ = సైగిరేన్ అనువర్తమానకాలరూప మేర్పడినది. కన్నడములో మాడుత్తు, అనుదానినుండి మాడుత్తేనే అను వ్యావహారికరూప మొకటి, మాడిదు అను భూతకాలికరూపమునకు - అగుధాతువును జేర్చుటచే మాడిదపం అను గ్రాంథికరూపము మఱియొకటి, వర్తమానకాలికరూపములుగా నేర్పడినవి. తెలుఁగునను కన్నడమునందువలెనె (భూతకాలికరూపమునుండి) చేసెదను అనున దొకటియు, చేయుతు - అనుదానికిని దానిరూపాంతర మగు - చేయుచు అనుదానికిని వసత్యర్థక 'ఉను' ధాతువుయొక్క క్రియావిశేషణమగు 'ఉన్న' శబ్దమును జేర్చి దానిపై సర్వనామములను జేర్చుటచే చేయుతు + ఉన్న + అను = చేయుతున్నాను - చేసతున్నాను - చేస్తున్నాను - అనియు, చేయుచు + ఉన్న + అను = చేయుచున్నాను అనియును రూపములు తేర్పడి యందు చేయుచున్నాను అనునది గ్రాంథికభాషలోను చేస్తున్నాను అనునది వ్యవహారభాషలోను స్థిరపడినవి.

దీనినిబట్టి కన్నడములో "మాడుత్తుం" అనువర్తమానక్రియావిశేషణరూపముతో నభిన్నంబై చేయుతు చేస్తూ అనుదాని రూపాంతర మైన చేయుచు అనునదే తెలుఁగున వర్తమానక్రియాన్యాసము గా వ్యవహరింపఁబడుటంజేసి 'చు' వర్ణమే వర్తమానార్థక చిహ్నమని తేలుచున్నది. దీనినుండి సంబంధార్థకవిశేషణము చేయవలసివచ్చినపుడు 'ఉన్న'శబ్దసహాయము మరల గ్రహింపఁబడినది. 'సైగు' అనుదానికి ఇరేన్, ఇరాయ్, ఇరార్, ఇరదు అనుసహాయధాతుక్రియారూపములు తమిళమున వర్తమానార్థమునఁ జేర్పఁబడినట్లే, తెలుఁగునను ఉన్నాను, ఉన్నారు, ఉన్నావు, మొదలగు ఉండు అను సహాయధాతువుయొక్క క్రియారూపములు చేర్పఁబడినవి. ఇట్లాంధ్రభాషలోని వర్తమానార్థకప్రత్యయము 'చు' వర్ణంబే యనియు - తక్కినభాషలలోఁగూడ మాఱురూపమునఁ గనంబడుచునే యున్న దనియు, ఉన్నానుబంధము - వర్తమానసంపూర్ణక్రియారూపమును గల్పించుసందర్భమునఁ, జేరనసహాయధాతురూపమనియు, నీక్రియారూపకల్పనావిషయమునఁ దెలుఁగుతమిళభాషలు లోకరీతి సంప్రదాయమునే అనఁగా వసత్యర్థకసహాయధాతురూపమును జేర్చుకొనుట యనుసంప్రదాయమునే యవలంబించిన వనియు, సువ్యక్తం బగుటయేగాక, యీరూపముల నిష్పత్తిక్రమ మీభాషలసాజాత్యమునుగూడ వెల్లడించుచున్న వనియుఁ దేటతెల్లం బగుచున్నది.

---

ఇతనితండ్రిపేరు గోవిందుఁడు. విశ్రాముఁడు, రాముఁడు, మొదలగువా రీతని పుత్రులు. ఈరాయముకుటుఁడు తనయమరవ్యాఖ్యానములో 270 మంది గ్రంథకర్తల వచనములఁ బ్రమాణముగా గ్రహించె నని ఆఫ్రెక్టు (Aufrecht) పండితుఁడు చెప్పుచున్నాఁడు.

5. భట్టోజీదీక్షితుని కుమారుఁడైన భానోజీదీక్షితుఁడు వ్రాసిన వ్యాఖ్యానము వ్యాఖ్యాసుధ. దానికి రామాశ్రమి యని నామాంతరము కలదు. దీనిని వాఘులవంశస్థుఁడైన కీర్తిసింహునిప్రార్థనచే 17 వ శతాబ్దములో భానోజీదీక్షితుఁడు వ్రాసెను. గ్రంథకర్త యితరనిఘంటువులనుండి శ్లోకములను బ్రమాణముగా నుదాహరించుటవలన మూలమును సమర్థించుచుఁ బెంచుచు విపులముగా వ్రాసెను.

6. నారాయణశర్మ 1619 సం॥రములో నమరకోశపంజిక లేక పదార్థకౌముది యనువ్యాఖ్యానమును వ్రాసెను.

7. రామనాథవిద్యావాచస్పతి 1633 లో త్రికాండవివేక మను నొకవ్యాఖ్యానమును రచించెను. దీనియుపోద్ఘాతములోఁ బెక్కు ప్రమాణశ్లోకములుదాహరింపఁబడినవి.

8. గౌరాంగమల్లికుఁ డనువానిపుత్త్రుఁడు భరతమల్లికుఁడు లేక భరతసేనుఁడనువాఁడు వ్రాసిన యమరవ్యాఖ్యానము మిక్కిలి ప్రశస్తమైనది. విశదముగాను విపులముగా నున్నది. వోపదేవుని వ్యాకరణము ననుసరించి దీనిలో శబ్దముల వ్యుత్పత్తులు వ్రాయఁబడినవి. ఈగ్రంథకర్త 18 వ శతాబ్దము మధ్యను జీవించెను. 1639 లో నున్నవోపదేవుని కవికల్పద్రుమమునకు వ్యాఖ్యానము వ్రాసిన దుర్గాదాసుఁ డతనిని, తనగ్రంథమందు, పలుచోట్ల నుదాహరించెను. ఎట్లనఁగా:—"క్షినివాసగత్యో రాధారే క్షిః ఇ త్యమరటీకాయాం భరతః (కవికల్పద్రుమః) ఘజఁతోపి క్వచి న్నపుంసక మితి ధాతుప్రదీపే, ఇ త్యమరటీకాయాం భరతః''

9. శివరామచక్రవర్తికిఁ బార్వతికిఁ గుమారుఁడైనమధురేశవిద్యాలంకారుఁడు 1666 సం॥ లో నమరకోశమునకు సారసుందరి యనునొకవ్యాఖ్యానమును వ్రాసెను. "శాకే సోమ'ర సేషు భూమి గణితే శ్రీసార్వభౌమాత్మజో దుర్గాదాస ఇమాం చకార విశదాం టీకాం స్వబోధా దపి॥ గజాష్టతిథియుక్శాకే విద్యాలంకార ధీమతా। లింగాదిసంగ్రహేటీకాం నిర్మమే సారసుందరీం॥

శివరామచక్రవర్తి జనకః పార్వతీ ప్రసూః యస్య స మధురేశోఽసౌ చకార సారసుందరీమ్" ఇతఁడు సుపద్మవ్యాకరణానుసారముగా శబ్దముల వ్యుత్పత్తులను వ్రాసెను. ఈమధురేశుఁ డమరకోశసరణి నవలంబించి "శబ్దరత్నావళి"యను మఱియొకనిఘంటువును వ్రాసెను.

ఇప్పుడు నేను జెప్పినవ్యాఖ్యానములు కాక నామలింగానుశాసనమునకు మఱి నలువది వ్యాఖ్యానము లున్నవి. వాని నన్నిటి నిచట గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు. కోల్బ్రూకు తానమరమునకు వ్రాసిన యుపోద్ఘాతములో నచ్యుతోపాధ్యాయుని వ్యాఖ్యాప్రదీపమును నీలకంఠుఁడు రామతర్కవాగీశుఁడు వ్రాసిన మఱిరెండు వ్యాఖ్యానములను జెప్పెను. వీరిలో రామతర్కవాగీశుఁడు కలాపవ్యాకరణము ననుసరించి శబ్దవ్యుత్పత్తులను వ్రాసెను. రఘునాథచక్రవర్తివ్రాసినత్రికాండచింతామణి మహేశ్వరుఁడు వ్రాసిన యమరవివేకము నమరకోశమునకు నవీనవ్యాఖ్యానములు.

—। అగ్నిపురాణమందలి నిఘంటువు ।—

అగ్నిపురాణమం దొకనిఘంటు వున్నది దానిలోఁ గొన్నిశ్లోకములను విడిచినయెడల నమరమే మరల నందు వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. అమరశ్లోకము లన్నియును గ్రంథకర్త చేసిన మఱికొన్నితప్పులు నందుఁ గానవచ్చుచున్నవి. ఎట్లనఁగా; పశ్చాన్నితంబః స్త్రీకట్యాః క్లీబే తుజఘనం పురః (అ-పు-పే 731-అ 18) అమరము-2-6-74 సమ్మార్జనీ శోధనీ స్యాత్సంకరోఽవకర స్తథా (పే 726-అ 11. అమరము 2-2-78.) ఖదిరపర్యాయ మైన బాలతనయశబ్దము తప్పని క్షీరస్వామి అమరవ్యాఖ్యానములోఁ జెప్పెను. అమరమందువలెనే దీనిలోను ముందు బుద్ధునిపేళ్లు తరువాత బ్రహ్మాదిదేవతలపేరులు చెప్పఁబడినవి. అమరముఁదుకంటె దీనిలో నూతనవిశేషము లెవ్వియు లేవు. దీనిలో నధ్యాయములవరుస నీలుగా నున్నది 1 స్వర్గపాతాళాదివర్గములు. 2 అవ్యయవర్గము 3 నానార్థవర్గము. 4 భూమివనౌషధ్యాదివర్గములు. 5, 6, 7 నృబ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాది వర్గములు. 8 సామాన్యనామలింగములు.

—। పురుషోత్తమదేవుఁడు-అతనిగ్రంథములు ।—

ఈపురుషోత్తమదేవుఁడు పాణిన్యష్టాధ్యాయికి భాషావృత్తి యను నొకవ్యాఖ్యానమును, త్రికాండశేషము, హారావళి, వర్ణదేశన, అనుమాఁడునిఘంటువులను వ్రాసెను. ఏకాక్షరకోశము ద్విరూపకోశము కూడ నతఁడే వ్రాసె

నని వ్యవహరింపఁబడుచున్నది. ఆతనికాల మింతవఱకు నిశ్చయింపఁబడలేదు. కాని 1659 లో జీవించిన సర్వానందుఁ డతనినాలుగుగ్రంథములనుండి శ్లోకముల నుదాహరించుటచే సర్వానందుని కీతఁడు ముందువాఁ డని మన మూహించుకొనవలయును. గోయిచంద్రుఁడు సంక్షిప్తసార మను గ్రంథమునకు వ్రాసినవ్యాఖ్యానములో నితనిభాషావృత్తినుండి కొన్నివాక్యముల నుదాహరించి యుండుటచే నితఁడు నాశతాబ్దము వాఁడే యని మనము తెలిసికొనవలయును. మంఖుఁడు గాని హేమచంద్రుఁడు గాని తమగ్రంథములలో నెచ్చటను నితనిని గాని యితనిగ్రంథములను గాని పేర్కొనలేదు. భాషావృత్తిప్రథమశ్లోకమునకు వ్యాఖ్యానమువ్రాయుచు నీగ్రంథము నితఁడు లక్ష్మణసేనునిప్రార్థనపై వ్రాసితి నని చెప్పెను. (వైదికప్రయోగార్థినో రాజ్ఞో లక్ష్మణసేనస్య ఆజ్ఞయా ప్రకృతే కర్మణి ప్రసంజన్ వృత్తే ర్లఘుతాయాం హేతు మాహ (భాషావృత్తి) 1169 లో లక్ష్మణసేనుఁడు సింహాసన మధిష్ఠించెను, గావున, నీపురుషోత్తమదేవుఁడు వ్రాసిన భాషావృత్తి తక్కినమూఁడుగ్రంథములు లక్ష్మణసేనుఁడు సింహాసనమునకు రాకముందే రచింపఁబడియుండవచ్చును. కావున 1159 సం॥ లో సర్వానందుఁడు పురుషోత్తమదేవుని గ్రంథముల నుదాహరించి యుండుట సమంజసమే. జనమేజయుఁడు ధృతిసింహుఁడు పురుషోత్తమదేవునికి సమకాలికులు. శబ్దార్ణవము, ఉత్పలిని, సంసారావర్తము నను నీమూఁడునిఘంటువులకుఁ బ్రాయికముగా వాచస్పతివ్యాఢివిక్రమాదిత్యులు ప్రణేతలై యుందురు పురుషోత్తమదేవుఁడు తనగ్రంథములయందు వీరినిఁ బ్రమాణముగా నుదాహరించెను అమరునివలె నితఁడును బౌద్ధుఁడే.

త్రికాండశేషము- ఇది యమరముయొక్క వెలితిని బూర్తిచేయుటకు రచింపఁబడినది యని దీనిపేరుచేతనే తెలియవచ్చుచున్నది. అమరుఁడు విడిచిపెట్టిన శబ్దములను మాత్రమే యిందులో సంగ్రహించితి నని గ్రంథకర్త గ్రంథాదియందుఁ జెప్పియున్నాఁడు. అమరునిక్రమమునే యనుసరించి మఱికొన్ని పర్యాయపదములఁ జేర్చెను. అందు కుదాహరణముగా నమరుఁడు చెప్పిన బుద్ధుని పదునేడునామములకు మఱిముప్పదియేడు నామములను జేర్చెను. అమరుఁడు చెప్పిన గౌతమబుద్ధుని యేడుపేర్లకు మఱి మూఁడింటిని గలిపెను. ఇవి గాక రాహులదేవదత్తశ్రావకప్రత్యేకబౌద్ధాదినామములను జేర్చెను. ఇవి యమరకోశములో లేవు. అమరునివలె ననుష్టుప్ శ్లోకములను గాక హలాయుధుఁ డభిధానరత్నమాలలోవలె ననేకవిధములైనవృత్తములను వాడుకచేసెను.

గ్రంథకర్త హారావళిలో నరుదైనశబ్దములను సంగ్రహించితి నని ప్రతిజ్ఞఁ జేయుచున్నాఁడు. "హారావళీ నిర్మి తేయం మయా ద్వాదశవత్సరైః" దీనిని గూర్చుటకుఁ బండ్రెండు సంవత్సరములు కవి కష్టపడె నఁట, దానిలోని శ్లోకసంఖ్య 270 మాత్రమే ఆశ్లోకములు రెండు భాగములుగా విభజింపఁబడి యున్నవి. వానిలో మొదటిది పర్యాయపదములు. వానిలోఁ బ్రతిపర్యాయ పదసంఘమును (1) పూర్ణశ్లోకముగాను (2) అర్ధశ్లోకముగాను (3) చతుర్థపాదముగాను విభక్తములై యున్నవి. నానార్థములు కూడ మూఁడు భాగములుగా విభజింపఁబడియున్నవి. వానిలో నొకశబ్దముయొక్క యర్థము (1) అర్ధశ్లోకముచేఁ గాని (2) చతుర్థభాగముచేఁ గాని (3) ఏకపదముచేఁగాని వివరింపఁబడుచున్నది.

వర్ణదేశన-వచనరూపముగా వ్రాయఁడిన గ్రంథము. శబ్దలక్షణమును బ్రతిపాదించుచున్నది. గ్రంథకర్త దాని ప్రయోజనమును గ్రంథాదియం దిట్లు చెప్పుచున్నాఁడు. "అత్ర హి ప్రయోగే। బహుదృశ్వనాం శ్రుతిసాధారణ్య మాత్రేణ గృహ్ణతాం ఖురక్షురప్రాదౌ ఖకారక్షకారయోః సింహసింఘానకాదౌ హకారఘకారయో స్తథా గౌడాదిలిపి సాధారణ్యాత్ హిండీర గుడాకేశాదౌ హకారడకారయోః భ్రాంతయ ఉపజాయంతే। అత స్తద్వివేచనాయ క్వచి ద్ధాతుపారాయణే ధాతువృత్తిపూజాదిషు ప్రవ్యక్తలిఖనేన ప్రసిద్ధోపదేశేన ధాతుప్రత్యయోణాది వ్యాఖ్యా లిఖనేన క్వచి దాప్తవచనేన శ్లేషాదిదర్శనేన వర్ణదేశనే య మారభ్యతే॥ భాషానుభవము లేని వారు శబ్దశ్రవణమాత్రముచే ఖురక్షురప్రశబ్దములలోనున్న ఖకారక్షకారములను, సింహసింఘానకశబ్దములలోనున్న హకారఘకారములను హిండీర గుడాకేశశబ్దముల లోనున్న హకారడకారములను గౌడభాషావర్ణములయందువలె వర్ణసాదృశ్యమును బట్టి తప్పుగా నుచ్చరింతురు. కావున ధాతుపారాయణమును, ధాతువ్యాఖ్యానములను వ్యుత్పత్త్యర్థములను ననుసరించిపైశబ్దములఁ జర్చించుట యీ వర్ణదేశనయొక్క ముఖ్యప్రయోజనము.

—। శాశ్వతుని యనేకార్థసముచ్చయము. ।—

ఇది యొక నానార్థనిఘంటువు. ఇది 800 అనుష్టుప్ శ్లోకములలో వ్రాయఁబడినది. ఇది యాఱు భాగములు. మొదటి మూఁడుభాగములలోఁ బ్రథమ భాగమందు, ప్రతిశబ్దముయొక్క నానార్థములు పూర్ణశ్లోకముచేతను ద్వితీయ

భాగమం దర్ధశ్లోకముచేతను ద్వితీయభాగమందు శ్లోకచతుర్థపాదముచేతను జెప్పఁబడినది. నాల్గవభాగము గ్రంథపూర్తికొఱకు నిర్దిష్టమైనది. అయిదాఱు భాగములలో నవ్యయములు చెప్పఁబడినవి.

ఈవిభాగము తప్ప నిందులో నొకక్రమము లేదు. శబ్దము లన్నియు యథాయథముగా నున్నవి. శబ్దరూపముచేతనే లింగము తెలియఁజేయఁబడుచున్నది. పురుషోత్తమదేవుని హారావళి మహాక్షపణకుని యనేకార్థధ్వనిమంజరి యీరీతిగానే యున్నవి.

శాశ్వతునికాల మింతవఱకు నిర్ణయింపఁబడలేదు. మహాబలుఁడు వరాహుఁడు ననుమహాకవుల పలహాపైని వ్రాసిన తనగ్రంథమును విద్యావిలాసుని యాస్థానమందున్న ఋషులుఁడు మొదలగువారు జాగ్రత్తతోఁ బరిశీలించి రని యితఁడు గ్రంథాంతమందు వ్రాసెను. ఈవరాహుఁడే వరాహమిహిరుఁ డని Borooah (బోరా) పండితుఁడు, Pavolini (పివోలిన్) పండితుఁడు సమర్థించిరి. ఈవరాహమిహిరుఁ డాఱవశతాబ్దమం దుండెను. అమరకోశములోని కొన్ని యర్ధశ్లోకములు కొన్ని పూర్ణశ్లోకములు శాశ్వతుని గ్రంథమందుఁ గానవచ్చుటచే శాశ్వతుఁడమరునికిఁ దరువాతివాఁ డని K. G. Oka (ఓకా) పండితుఁడు సమర్థించెను. క్షీరస్వామివంటి ప్రాచీనగ్రంథకర్తలతనిశ్లోకముల నుదాహరించిరి. కావున నతఁ డాఱవశతాబ్దమునకు దగ్గఱగా జీవించియుండవచ్చును.

—॥ భట్టహలాయుధుని యభిధానరత్నమాల. ॥—

ఇది యయిదు కాండములుగా విభజింపఁబడి యున్నది. మొదటివి స్వర్భూమిపాతాళసామాన్యకాండలు. ఈనాలుగును బర్యాయపదములతోఁ గూడినవి. ఐదవది యయిన యనేకార్థకాండములో నానార్థములు నవ్యయములుఁ జెప్పఁబడినవి. విభక్త్యంతరూపములచే లింగములు తెలుపఁబడుచున్నవి. తక్కినవిషయములలో నమరకోశమువలె నున్నది. ఇందలిశ్లోకసంఖ్య తొమ్మిదివందలు. ఇం దనుష్టుప్ శ్లోకములే గాక నానావిధవృత్తములు కలవు. అభిధానచింతామణికి వ్యాఖ్యానమైన సారోద్ధారమను గ్రంథమందు వల్లభగణి యనువాఁడు హలాయుధటీకను జేర్చెను.

హలాయుధుఁడు అమరదత్తుని, వరరుచిని, భాగురిని, వోపాలితుని దనకుఁ బ్రమాణభూతులనుగాఁ బరిగ్రహించెను. "ఇయ మమరదత్త వరరుచి భాగురి వోపాలితాద్యి శాస్త్రేభ్యః। అభిధానరత్నమాలా కవికంఠవిభూషణార్థ

ముద్ధ్రియతే"॥ పండ్రెండవశతాబ్దమునకుఁ బైఁగా హలాయుధునిశ్లోకములు వో పాలితునిశ్లోకములు నితర గ్రంథకర్తలచే నుదాహరింపఁబడినవి మహేశ్వరుఁడు వోపాలితుని, మంఖుఁడు హలాయుధుని బ్రమాణభూతులనుగా నెన్నుకొనిరి. క్షీరస్వామి వోపాలితుని గాని హలాయుధుని గాని చెప్పలేదు. హలాయుధుఁడు పదియవశతాబ్దము నుండె ననియు, మాన్యఖేటపాలకుఁ డైనమూఁడవకృష్ణరాజును గౌరవించుటకుఁ గవిరహస్యమును (ధాతునిఘంటు) ధారారా జైన ముంజవాక్పతి కంకితముగా పింగళచ్ఛందస్సునకు మృతసంజీవనీవృత్తి యను నొకవ్యాఖ్యానమును వ్రాసెనని Ludwig Heller పండితుఁడు R. G. భండార్కారు చెప్పియున్నారు.

—। యాదవప్రకాశకుని వైజయంతి. ।—

ఇదికూడఁ బర్యాయపదములు నానార్థములు నని రెండుభాగములుగా నున్నది. వానిలో మొదటిది స్వర్గాంతరిక్షభూమిపాతాళసామాన్యకాండములుగా విభజింపఁబడియున్నది. రెండవభాగము ద్వ్యక్షరత్ర్యక్షరశేషకాండ లని మూఁడుభాగములుగా విభజింపఁబడినది. ఈకాండము లన్నియుఁ బ్రత్యేకముగా నొక్కొక్కటి యధ్యాయములుగా విభజింపఁబడియున్నది. పర్యాయపదనానార్థపదభాగములు రెండును నమరములోనివానికంటె విస్తీర్ణతరముగా నున్నవి. నానార్థభాగమందు పదము లకారాదిగా నుంచఁబడినవి ద్వ్యక్షరత్ర్యక్షరానేకాక్షరములతోఁ గూడిన నానార్థపదములు మూఁడుకాండములుగా విభజింపఁబడినయవి. ప్రతికాండము పుంలింగాధ్యాయము, స్త్రీలింగాధ్యాయము, నపుంసకలింగాధ్యాయము, అర్థవల్లింగాధ్యాయము, నానాలింగాధ్యాయము నని లింగక్రమమున మరల విభజింపఁబడినది. కొనకాండమునకు మఱినాలుగధ్యాయములు చేర్పఁబడినవి వానిలో వ్యస్తపదముచేఁగాని సమస్తపదముచేఁ గాని మఱియొకవస్తువును బోధించు కొన్నిశబ్దములకుఁ బర్యాయపదములు మొదటిదానిలో నున్నవి. రెండవదానిలో నానార్థములుగల అవ్యయములు, మూఁడవదానిలో నవ్యయములకుఁ బర్యాయపదములు, నాల్గవదానిలో లింగనియమములుఁ గలవు. పరిభాష లమరములోని పరిభాషలే. స్త్రీ, క్లీం, నపుం, మొదలగు గుఱుతులను నపుంసకలింగము మొదలగువానికి వాడుక చేసెను. దీనిలో వైదికశబ్దములు మెండుగా నున్నవి.

1017—1137 సంవత్సరములలో జీవించియున్న శ్రీరామానుజమునికి మొదట గురువు, తరువాత శిష్యుఁడు నైనయాదవప్రకాశకు లీ నిఘంటువును

రచించినవాఁడు. 11 వ శతాబ్దమధ్యమున దీనిఘంటువు రచింపఁబడెను. గ్రంథకర్త జన్మస్థానము తిరుప్పట్కులి లేక గృధ్రసరస్సు. ఇది కాంచీపురసమీపమున నున్నది. మొదట నితఁడు దృఢతరశంకరసిద్ధాంతాభినివిష్టుఁడు, కానను శ్రీరామానుజాచార్యోపదేశసామర్థ్యముచేఁ దచ్ఛిష్యుఁడయ్యెను.

—। మహేశ్వరుని విశ్వప్రకాశ. ।—

ఇదియు నొకనానార్థనిఘంటువు. ఇందలి పదము లంత్యాక్షరనియమముతో నమర్పఁబడినవి. ఒకయక్షరముతో నంతమగు శబ్దము లొకటిమొదలుకొని యేడువఱకు మరల గుంపులుగా విభజింపఁబడినవి. ఎట్లనఁగా:—కైకకం, కద్వికం, కత్రికం, కచతుష్కం, కపంచకం, కషట్కం, కసప్తకం, ఈయవాంతరవర్గములలో నకారాదిక్రమము లేదు. పదము లన్నియు నియమము లేకుండఁ జెప్పఁబడినవి. గ్రంథాంతమున దవ్యయము లక్షరాంతనియమముతోనే చెప్పఁబడినవి శబ్దముల లింగములు శబ్దోచ్చారణముచేతనే తెలియఁజేయఁబడినవి. అవసరమున్నచోట భిన్నపదములచేఁ జెప్పఁబడినవి. స్త్రీలింగపుంలింగాదిరూపములతోనే శబ్దములు చెప్పఁబడినవి. స్త్రీ పుం మొదలగుశబ్దములు వాడుకచేయఁబడలేదు. ఆద్యంతములయందు గొన్నివృత్తములు తప్పఁ దక్కిన శ్లోకము లన్నియు ననుష్టుప్పులే. గ్రంథాదియం దీగ్రంథకర్త యొక శ్లోకములో భోగీంద్రుఁడు, కాత్యాయనుఁడు, సాహసాంకుఁడు, వాచస్పతి, వ్యాడి, విశ్వరూపుఁడు, అమరుఁడు, మంగళుఁడు, శుభాంకుఁడు లేక శుభాంగుఁడు, గోపాలితుఁడు, భాగురి మొదలగువారు తనకుఁ బ్రమాణభూతు లని చెప్పియున్నాఁడు.

శ్లో॥ భోగీంద్ర కాత్యాయన సాహసాంక వాచస్పతివ్యాడిపురస్సరాణాం। సవిశ్వరూపామరమంగళానాం శుభాంగగోపాలితభాగురీణాం। కోశావకాశాత్ప్రకటప్రభావసంభావితానర్ఘ్యగుణస్య ఏషః। సంపాదయ న్నేష్యతి వాంఛితార్థాన్సార్థం నచింతామణితాం కవీనాం॥ ఆమిత్రశైలచరమాచలమేకలాద్రి కైలాసభూమివలయాద్య దిహాస్తి కించిత్। ఏకత్రసంభృత మగోచరశబ్దరత్నమాలోక్యతాం తదఖిలం సుధియః కవీంద్రాః॥ యద్యస్తివాఙ్మయమహార్ణవమంథనేచ్ఛా ప్రాప్తుం పదం ఫణిపతే ర్యది కౌతుకం వః। విశ్వప్రకాశ మనిశం త మిమం నిషేవ్య సంభావ్యతాం పరమశాబ్దికశేఖరశ్రీః॥

ఈనిఘంటువు 1111 వ సంవత్సరములో రచియింపఁబడెను. "రామానలవ్యోమరూపై శ్శకకాలేఽభిలక్షితే। కోశం విశ్వప్రకాశాఖ్యం నిరమాచ్ఛ్రీమ

హేశ్వరః'' వైద్యశాస్త్రప్రావీణ్యము గలవాఁడ నని గర్వితుఁడైన యీ గ్రంథకర్త సాహసాంకమహీపాలుని యాస్థానమందు వైద్యుఁడు- చరకసంహితా వ్యాఖ్యాతయు-నగు హరిచంద్రుని వంశస్థుఁడు. వైద్యులకుటుంబములోఁ బుట్టినవాఁడు. శ్రీబ్రహ్మ యనువాని కుమారుఁడు. శ్రీకృష్ణుఁ డనువాని మనుమఁడు. సాహసాంకచరిత్ర మను గ్రంథమును వ్రాసిన వాఁడు. ఈవిషయమునే గ్రంథాదియం దిట్లు వ్రాసెను. "శ్రీ సాహసాంకనృపతే రనవద్య వైద్య విద్యాతరంగపద మద్వయ మేవ బిభ్రత్। యశ్చంద్రచారుచరితో హరిచంద్రనామా స్వవ్యాఖ్యయా చరకతంత్ర మలంచకార॥ ఆసీ దసీమవసుధాధిపవందనీయే తస్యాన్వయే సకలవైద్యకళావతంసః। శక్రస్య దస్ర ఇవ గాధిపురాధిపస్య శ్రీకృష్ణ ఇత్యమలకీర్తిలతావితానః॥ కృష్ణస్య చాజని సుతః స్సితపుండరీకమండాతపత్రపరభాగయశఃపరాగః। శ్రీబ్రహ్మ ఇత్యఖిలాత్మముఖారవింద సోల్లాసలాసితరసార్ద్ర సరస్వతీకః। తస్యాత్మజ స్సరసకైరవకాంతకీర్తి శ్రీమా న్మహేశ్వర ఇతి ప్రథితః కవీంద్రః। నిశ్శేష వాఙ్మయమహార్ణవపారదృశ్వా శబ్దాగమాంబురుహషండరవిర్బభూవ। యస్సాహసాంకచరితాది మహాప్రబంధ నిర్మాణనైపుణగుణాగతగౌరవశ్రీః। యో వైద్యకత్రయసరోజసరోజబంధు ర్బంధు స్సతాం సుకవికైరవకాననేందుః॥

ఈవిశ్వప్రకాశముయొక్క కీర్తి దీని ప్రణయనకాలమందే సకలదిక్కులయందు వ్యాపించెను. 1159 లో నున్న బంగాళాదేశపు గ్రంథకర్త యగుసర్వానందుఁడు 1088-1170 లో జీవించిన ఘూర్జరదేశస్థుఁడైన హేమచంద్రుఁడునీవిశ్వప్రకాశమును దమ గ్రంథములలో నుదాహరించిరి. ఈవిశ్వప్రకాశకు గ్రంథకర్తయే యొక పరిశిష్టమును (Supplement) వ్రాసెను. దానిపేరు శబ్దభేదప్రకాశిక. అది శబ్దభేదము, బకారభేదము, ఊష్మభేదము, లింగ భేదము నని నాలుగు నిర్దేశములుగా విభజింపఁబడియున్నది. 1598 లో జ్ఞానవిమలగణియనునొక జైనపండితుఁడు దాని కొకవ్యాఖ్యానమును వ్రాసెను.

—॥ మంఖుని యనేకార్థకోశము ॥—

భాగురి, కాత్యుఁడు, హలాయుధుఁడు, హర్గుఁడు, అమరసింహుఁడు, శాశ్వతుఁడు, ధన్వంతరి వ్రాసిననిఘంటువుల నాధారముగాఁ జేసికొని మంఖుఁ డనేకార్థకోశ మను నొకనిఘంటువును వ్రాసెను. అతఁడు గ్రంథాదియం దిట్లు చెప్పుచున్నాఁడు:—

# ఆంగ్లమునుండి యాంధ్రమింకను గ్రహింపవలసిన విషయములు.

—జటావల్లభుల పురుషోత్తముగారు, బి. ఏ. కొవ్వూరు.—

---

రెండుజాతులకు దైవికముగ సన్నిహితసంబంధ మేర్పడినపు డందొక జాతినుండి మఱొకజాతి సాంఘిక సారస్వతాద్యనేకవిషయములలో నూతనాంశములను గ్రహించును ఆ రెంటిలోను దుర్బలమగుజాతి బలీయమగుజాతినుండి యెక్కుడువిషయములను గ్రహించును ఆంగ్లేయులకును మనకును సుమా రిన్నూఱుసంవత్సరములనుండి వచ్చుచున్న సాంగత్యమువలన మనకు మొత్తముపయిని లాభము వచ్చినను నష్టము వచ్చినను సారస్వతవిషయములో మాత్ర మాంధ్రుల మగు మన మాంగ్లేయుల భాషావాఙ్మయములనుండి యనేకలాభములను బొందియున్నామని యంగీకరింపవలసియున్నది ఇంకను ననేకలాభములను బొందవలసియున్నాము. అందు ముఖ్యము లని నాకుఁ దోఁచినవాని నీక్రిందఁ దెల్పుచున్నాను.

(1) సారస్వతదృష్టితో వార్తాపత్రికలను నడుపుట యనునది మన మాంగ్లేయులనుండి గ్రహింపవలసియున్నది. ఆంగ్లములోని గద్యరచన చమత్కృతు లన్నియుఁ బత్రికలలోనే పుట్టి పెరిఁగిన వని చెప్పవచ్చును. అడిసను స్టీలు అను వారితోఁ బ్రారంభించి యీరీతివాఙ్మయము నేఁటివఱకును బెరుఁగుచున్నది. పెద్దపెద్దతరగతులకుఁ బాఠ్యగ్రంథములలోఁ జేర్పఁదగు వ్రాఁతలు వారివార్తాపత్రికలలోఁ బ్రచురింపఁబడుచుండును. ఈవిధమగు సారస్వతము మన మాంగ్లమునుండి గ్రహింపవలసియున్నది.

(2) వాక్యరచన విశేషములను బరిశీలించు నింగ్లీషులోని రెటరిక్ (Rhetoric) అను కళను మనము వృద్ధినొందించుకొనవలసియున్నది.

(3) సైన్సునకు సంబంధించిన పారిభాషికపదములను యూరోపియనుభాషలలోనుండి యెట్లు గ్రహింతుమా యని విచారించుచుఁ గార్యహీనులమై చేతులుగట్టుకొని కూర్చుండుటను మాని యాంగ్లేయు లేరీతిగ లాటినుపదములను నిరాటంకముగఁ దీసికొనినారో యట్లే సంస్కృతభాషలో సార్థము లగు పారిభాషికపదములను మనము సృష్టించుకొనవలసియున్నది.

(4) సైన్సుల నన్నింటిని దేశభాషలలోనికిఁ బరివర్తనము చేయవలసి యున్నది.

(5) గ్రంథాలయోద్యమములను స్థాపించియు నిర్బంధోచితప్రారంభ విద్యావిధానము నేర్పఱిచియుఁ బాఠకులసంఖ్యను హెచ్చింపవలెను.

(6) Shelley's Defence of Poetry మున్నగు సారస్వత విమర్శ గ్రంథములను దలఁపించునవైనను మనలో లేకున్నవి. ఎవరినో యొకవ్యక్తిని దూషించుటయో భూషించుటయో మాత్రమే విమర్శ యని మనలోఁ జాల మంది భావించుచున్నట్లగపడుచున్నది. కాని పైనిఁజెప్పఁబడిన గ్రంథకర్తలవలె సారస్వతసమస్యలను నేర్పుతోఁ జక్కని శైలిలోఁ జర్చించు విమర్శకులు మనలో నింతవఱకును లేరనియే చెప్పవలెను.

(7) ఆంధ్రవాఙ్మయచరిత్రకు సంబంధించిన గ్రంథములు బయలు వెడల వలసియున్నవి.

(8) నీతికిని వేదాంతమునకును దేశచరిత్రలకును సంబంధించిన గ్రంథములను సారస్వతములోఁ గూడ నున్నతస్థానము నలంకరింప నర్హ మగురీతిని రచించుట యనుదానిని మన మాంగ్లవాఙ్మయమునుండి నేర్చుకొనవలసియున్నది. గిబ్బను రచించిన రోమకసామ్రాజ్యక్షీణపతనచరిత్ర (Decline and Fall of the Roman Empire) ను మెకాలే రచియించిన యాంగ్లదేశచరిత్ర (History of England) ను బోలిన గ్రంథములు మనభాషలో రచింపఁ బడ వలసియున్నవి.

(9) వచనగ్రంథములలోను బద్యగ్రంథములలోను నుత్తమమైన భాగములను వేఱుచేసి చిన్నచిన్న గ్రంథములుగఁ బ్రచురించుట యాంగ్లములో నాచారముగ నున్నది. ఆంధ్ర మీవిషయమున నాంగ్లము ననుకరింపవలసి యున్నది.

(10) బి. ఏ. తరగతిలోఁ బాఠ్యగ్రంథముగ నుండఁదగిన వచనకావ్య మింతవఱకు నాంధ్రములో లేకుండుట శోచనీయము. ఈకొఱఁతఁ దీర్చుకొనుటకు మన కాంగ్లము మార్గదర్శి కావలెను. మనలోఁ గేవలము శూన్యముగ నున్న ఎస్సే (Essay) అను వాఙ్మయవిభాగమును గూడ నాంగ్లేయులనుండి యనుకరింపవలసియున్నది.

(11) సభ్యములగు ఫార్సులును, జ్ఞానమును గల్గించు నవలలును నిపుడు మనలో మృగ్యములుగ నున్నవనియే చెప్పవలెను. ఆంగ్ల మీవిషయములలో మనకు మార్గము చూప నర్హమైనది.

(12) ఉపన్యాసము నొక కళగా నభ్యసించుట మనలో లేదు. ఎంత పండితులైనను మనవారు మాటలాడునపుడు వ్యాకరణము గాని సామాన్య వాక్యరచనపద్ధతి గాని పాటించుట లేదు. ఆంగ్లేయులలో నట్లుగాక చక్కని శైలిలో నిర్దుష్టభాషలో నుపన్యసించుట పరిపాటియైనది. ఆంగ్లేయులే కాక మన వారుఁ గూడ నట్లుచేయుచున్నారు. ఈకళను మన మాంగ్లమునుండి గ్రహింపవలసియున్నది.

(13) వ్యతిరేకదృష్టాంతముచే నాంగ్లమునుండి మనము గ్రహింపవలసిన యొకవిషయమును మనవిచేసెదను. అది గ్రామ్యగ్రాంథిక భాషలకు సంబంధించినది. భాషకు స్థిరత్వమునది వీలైనంతవఱకు నుండునట్లు మనము యత్నింపవలెనని దానివలనఁ దేలును. నేఁటికి సుమా రాఱువందలసంవత్సరముల క్రిత మాంగ్లములో చాసర్ అను నొకకవి యుండెను. అతని కవిత్వమనేకవిధములచేత నాంగ్లవాఙ్మయమునకు మకుటమని చెప్పవలెను కాని నేఁటియాంగ్లేయుల కాకవిరచించిన గ్రంథములను జదివి యానందించు భాగ్యము లేదు. ఏమన- ఈయాఱువందలసంవత్సరములలో నింగ్లీషుభాష యెంతగ మాఱిపోయినది. మనమన్ననో సుమారు వేయిసంవత్సరములనాఁటి నన్నయభట్టు రచించిన భారతభాగము నాస్వాదింపఁగలుగుచున్నాము. అందులకుఁ గారణము మనము భాషలో మార్పునుగలుగనీయకుండుటయే. ఆంగ్లాంధ్రభాషావాఙ్మయములలోని యీవ్యత్యాసమునుబట్టి భాషలో మార్పు గలుగనీయరాదను నొక పాఠమును మనము గ్రహింపవలసియున్నది.

# గ్రంథస్వీకారము.

---

నెచ్చెలి:—కవి, బ్ర॥ శొంఠి శ్రీపతిశాస్త్రిగారు- వీ రాంధ్రలోకమున నపారపాండిత్యవిఖ్యాతిని గాంచిన కీ॥ శే॥ శ్రీభద్రాద్రిరామశాస్త్రులవారికుమారుఁడు.

"మృదుమధురపదలలితమును, సనాతనానూతన భావమిళితమును, విశుద్ధధారాకలితమును నయి యలరారుచున్న 'నెచ్చెలి' సహృదయబృందమునకు నెచ్చెలియే.........కవి యొనరించిన యీమహాన్వేషణమున సర్వమతములును సమత్వము నందె ననుట మహాగభీరభావభరిత మని విమర్శకవరేణ్యు లంగీకరింపఁగలరు నెమకుటలో మూర్తిత్రయంబు కరఁగి ముద్దయయ్యెను. మహాప్రకృతి మహేశ్వరునితో వియ్యమందెను. దశదిశావ్యాప్త మగు వైవిధ్య మంతయు నేకత్వశోభను బొందెను. అయ్యదియే ముమ్మొనలసిలువకు మూలదండము. అట్టిదియే శ్రీపతి యైక్యానుసంధానము. ఇంత మహోత్కృష్టభావసంపద నింతపిన్నవయస్సునఁ గాంచఁగలిగిన యీకవి కడుంగడు ధన్యుఁడు."

కథ:--నిద్రలో నెవ్వరో మేలుకొలిపినట్లయి యన్నిదిక్కుల వెదకఁబోవును, గలవచ్చును. ఆకలలోఁ గవి వివిధవిషయములు చూచును. చూచినవాని నెల్ల మనకు హృదయంగమముగా నుండున ట్లలంకరించి చెప్పుచు వెదకి వెదకి తుదకు నెచ్చెలిం గాంచి నిర్వృతిం బొందును

"నెమ్మది నెలకొన్న నినుఁగాంచ లేక, ఆలయము లని దివ్యస్థలము లని
మఠము లని భజనమందిరము లని, మునుఁగుట లని నోము లని పూజ లని
యింక నేమేమొ యనేకవిధముల, ఒడినున్నబిడ్డకై యూరెల్ల వెదకు
తల్లిపోలికఁ దల్లడిల్లిపోయితిని, ఎట్లుఁ గోరిననట్టు లేయుండు నిన్ను
నెవ రెట్టినామంబు లిడిపిల్చికొన్నఁ, బ్రణవాంతరం బయి ప్రణయార్థమగుచు
నెచ్చెలియను పేర నేఁబిల్చికొందు"

ఈవాక్యములకే నెచ్చెలియనుగ్రంథము ప్రమాణ మగుచున్న దని మేము తలంచుచున్నారము. మంజరీమార్గము నిర్దుష్టముగ నిరర్గళధారతో విరాజిల్లుచున్నది. ఇందుఁ గవికిఁ గలపాండిత్యము వెల్లడి యగుచున్నది. అభిప్రాయము స్పష్టపడుచున్నది. శ్రీపతిశాస్త్రిగారు బహుకాలము ద్రవిడదేశములో

నుద్యోగవశమున నుండియును మాతృభాషను గమంగ్ఁ పోసల్పి యిట్టికావ్యము నాంధ్రలోకమున కొసంగుట మాతృభాషాభిమానము.

దీనివెల రు 1-0-0. చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండు సన్సు వారియొద్దఁగాని, కాకినాడలోఁ గవిగారియొద్దఁగాని దొరకును.

---

సంస్కృతవాఙ్మయచరిత్ర — ప్రథమసంపుటము. వైదికవాఙ్మయము.

ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథమాలలోని పదియవగ్రంథము.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు రిజిస్ట్రారుగారు దయతోఁ బంపినది.

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారనేక వేదశాస్త్రగ్రంథములు పరిశీలించి వేదకాలనిర్ణయములను వేదధర్మములను దత్కాలీన పురుషాచారభేదంబులను విస్పష్టముగాఁ దెలియఁజేయు సంస్కృతవాఙ్మయచరిత్రము ప్రథమసంపుటమును బూర్తిగాఁ జూచినాఁడను. వారిప్రతిభావిశేషమును నైపుణియును జాలఁ బ్రశంసనీయము లై యున్నవి. చిరకాలమునుండి వేదము లపౌరుషేయము లని కొందఱు నీశ్వరకృతము లని కొందఱును జెప్పు మన నైయాయిక వేదాంతశాస్త్రాదిమతకర్తల యభిప్రాయములను, ఆధునికనవనాగరకుల కాలనిర్ణయసూచక మైనశిలాశాసనగ్రంథాదినిరూపణలతో సమన్వయము చేసి వేదశాస్త్రములు సకలమతగ్రంథములకంటె బహుప్రాచీనము లని స్థిరపఱిచి హిందూమతమునకు మహోపకారమును గావించినారు. వేదమందు ఋషులుగా మంత్రద్రష్టలుగా వ్యవహరింపఁబడు ఋషు లందఱును బూర్వమందున్న మంత్రములను స్మరించి విశదీకరించినవారే కాని నూతనస్రష్టలు కా రనువిషయమును శ్రీశాస్త్రులువారు విశదీకరించుటచే వేదము లనాదు లని చెప్పుశాంకరసిద్ధాంతమును స్థిరపఱిచినా రని నేను విశ్వసించుచున్నాఁడను.

శ్రీశాస్త్రులవారు, ఉత్తరధ్రువము హిమప్రళయానంతరయుగారంభ మను శీర్షికాప్రారంభమందు "క్రీస్తుపూర్వము ౧౨,౦౦౦ లేక ౮,౦౦౦ సంవత్సరములు వేదసూక్తములందలి యనేకవిషయములు హిమప్రళయపూర్వకాలమందలి వని వైదికఋషు లెఱుంగుదురు. బహుపురాతనము లైన యావిషయములే సూక్తరూపమును దాల్చినవి" అని వ్రాసియున్నారు. ౧౦ వేల ౮ వేల సం॥రములకుఁ బూర్వమందే మహర్షులు తెలిసికొనినవిషయములు, అంతకంటెఁ బ్రాచీనులయిన ఋషిపరంపరయొక్క సూక్తములవలననే తెలిసికొనియుందురు. అందుచే

తనే వేదములకు శ్రుతు లనుపేరు సార్థకమైనది. శబ్దార్థము లనాదు లని మన శాంకరమతసిద్ధాంతము. కనుక యీవిషయమునే శాస్త్రులవారు, విషయములు సూక్తములును బహుపురాతనము లని సూచించినా రని నేను దెలిసికొనుచున్నాఁడను. సమస్తవిషయములయందు నిరుపమాన మైన పాండిత్యమును లోకోపకారార్థమై వినియోగించిన శాస్త్రులవారి నవీనప్రతిభావిశేషమున కభినందనములు చేయుచున్నాను. సంస్కృతమందుఁ గాలనిర్ణాయకచరిత్రములను విమర్శగా వ్రాయని లోపమును సవరించి క్రొత్తదారిని జూపించిన శ్రీశాస్త్రులువారును, నట్టివారియుద్గ్రంథమును బ్రకటించి యాంధ్రదేశమునకు మహోపకార మొనరించిన యాంధ్రవిశ్వకళాపరిషత్తువారును నాంధ్రలోకమునకుఁ జిరస్మరణీయులు. దీనివెల రు. 3.                వం॥ వేం॥

---

## कल्याण.

— కళ్యాణ. —

శ్రీశివాంకము—హిందీ- గోరక్‌పూర్‌నుండి శ్రీయుత హనుమాన్ ప్రసాదపోద్దార్ మహాశయులయు శ్రీయుత చిమ్మన్‌లాల్ గోస్వామీ ఎం. ఏ. శాస్త్రి మహాశయులయు సంపాదకత్వమున నెనిమిది సంవత్సరములనుండి వెలువడుచున్న "కల్యాణ" హిందీపత్రికయొక్క—, ఆగస్టు, సెప్టెంబరు-శ్రావణభాద్రపదముల (8 సం. 1-2 సంచికలు) సంచిక యేకముగా శ్రీశివాంకమను పేరఁ బ్రకటింపఁబడినది. స్థాలీపులాకన్యాయమునఁ జదివి సారాంశమును గ్రహించితిమి. ఈయంక మపూర్వ మైనది.

తొలుదొలుత బ్రహ్మసూత్రములు, శ్రీశంకరాచార్యుల శివానందలహరి, అప్పయ్యదీక్షితుల స్తోత్రములు చేర్పఁబడినవి. ఇందులో వేదములు, ఉపనిషత్తులు, సూత్రములు, తంత్రములు, ఆగమములు, పురాణములు, కావ్యములు, నాటకములు, స్తోత్రములు, స్థలపురాణములు, క్షేత్రమాహాత్మ్యములు, సాధుగీతములు, భక్తోపాఖ్యానములు, లోనుగా సంస్కృతాది దేశభాషలపర్యంతముఁ గల సద్గ్రంథములనుండి ప్రమాణములఁ గ్రోడీకరించుచు బహువిధామూల్యవ్యాసములతో శివతత్త్వము చక్కఁగా వివరింపఁబడినది. ఆయాయి కథాభాగములు బోధపడునట్లు నయమనయముఁ జిత్తాకర్షకము లగు నేకవర్ణ ద్వివర్ణ బహువర్ణచిత్రము లనేకములు పొందుపఱుపఁబడినవి. శివవిషయశంకలకన్నిం

టికి నిందు సమాధానములు దొరకును. కార్యాంతరనిమగ్నులగు భాషాభిమానభక్తుల కిది హస్తపుస్తకముగా నుండును. ఈశివాంకమున శివకేశవుల కభేదముం దెల్పుట వీరిముఖ్యోద్దేశముగా నున్నట్లు మొదట ముఖపత్రముపై హరిహరరూపశివప్రతిమను బొం సుకటిచిరి. అవిషయమై యభేదవిషయములు పెక్కులు వ్రాసియున్నారు ఉత్తరదక్షిణదేశములలోనున్న శివభక్తుల ఛాయాపటము లిందుఁ గలవు. శ్రీకాశి, శ్రీరామేశ్వరము, శ్రీశైలము, తంజావూరు, మధుర, పక్షితీర్థము, భువనేశ్వరము, వైద్యనాథము, మొదలగు శివస్థలముల లోని గోపురముల యాలయముల చాయారూపము లిందు విశేషముగఁ జేర్చియున్నారు. బహువర్ణచిత్రము లన్నియు నతి మనోహరములుగా నున్నవి. పార్వతితపస్సు, సతీశరీరమును శివుఁ డెత్తికొనిపోవుట, హాలాహలభక్షణము, వ్యాఘ్రపాదలింగపూజ, కాశిలో శివుఁడు తారకమంత్రోపదేశము చేయుట, ధ్యానమగ్నశివుఁడు మొదలగు ననేకములు మెచ్చఁదగినవి.

ఈశివాంకమునందలి వ్యాసకర్తలెల్లరును సంస్కృతాంగ్లేయాది వివిధ భాషాకోవిదులును, ఆస్తికులు నగుటచేఁ బాఠకులకు దృఢమతాభినివేశము కలుగును. హిందీభాష బహుమృదులముగా నిర్దుష్టముగా నున్నది. ఇట్టివే, రామాంకము, గీతాంకము ఇత్యాది కొన్ని వీరు ప్రకటించినట్లు మేము విని యున్నారము.

కల్యాణ సంవత్సరమునకుఁ జందా రు. 4-3-0. శ్రీశివాంకము వెల రు. 3.

---

## KALYANA—SRI SIVANKA (Hindi.)

We have great pleasure in announcing to our readers that the Joint Editors of the Hindi Journal 'Kalyana' published from Gorakhpur have issued Parts 1 & 2 Vol. 8 under the title of Sivanka This is a continuation of the Editor's laudable attempts in the past, —the Ramanka, Gitanka etc. The issue under review consists of a series of articles by eminent scholars and is profusely illustrated. Drawing abundantly on the materials in the Vedas, Tantras, Agamas, Puranas, Kavyas, and other books, the articles discuss Sivatattva in diverse aspects and aim at pointing out the oneness of Siva & Kesava. Names do not matter and the ultimate reality remains one & the same whether the sectarian call Him Siva or Vishnu. The illustrations not only touch upon the themes discussed in the work but also consist

of the various temples dedicated to Siva in Benares, Rameswaram, Srisaila, Tanjore Madura and other places. The frontispiece illustrates the image of Harihara in accordance with the intention of the Editors. We have every reason to hope that a perusal of the work leads one to the path of religion specially in these days when tenets of all leading religions are put to the test of strict scrutiny and subjected to unbelief and doubt.

**Kalyana-Annual Subscription for the Journal is Rs. 4-3.**
**Sivanka alone Rs. 3-0-0.**

---

ఓరుగల్లు సామ్రాజ్యము—చారిత్రికనవల- ఆయుర్వేదభూషణ పండిత శ్రీ.సా. వాసుదేవశాస్త్రిగారిచే రచియింపఁబడినది క్రౌనులో 334 పుటలు, నలుపది ప్రకరణములుం గలది. ఇందలివిషయము- ప్రతాపరుద్రుని పరిపాలనాకాలమునాఁటిది పద్మనాయక వెలమవంశజు లగు మధుమతీ మాధవు లిందు ముఖ్యపాత్రములుగా ప్రవేశపెట్టఁబడిరి. నాఁడు ప్రతాపరుద్రునకు లింగధారులును ఆరాధ్యులును మతగురువులుగా నుండిరి ఈశైవులు జైనమతముపై ద్వేషమును వహించి వివిధమాయోపాయములచే జైనుల దేశభ్రష్టుల గావించిరి. దేశభ్రష్టు లగు జైనులు, పరదేశములకు బోయి యోరుగల్లు గుట్టంతయును వారి కెఱింగించి ప్రోత్సహించి యోరుగల్లుసామ్రాజ్యముపై దండయాత్రల వెడలింపజేసిరి. మతమే ప్రధానవిషయము గాఁగల చారిత్రకనవలకిదే ప్రథమము.........మధుమతి మాధవుని ప్రేమించినది. మాధవుడు మధుమతిని ప్రేమించినాడు. ఉభయులకును వియోగమేర్పడినది. మధుమతి నెన్నియో కష్టము లెదుర్కొన్నవి. ఆత్మబలవిశ్వాసములతో నామె స్వధర్మరక్షణ మొనరించుకొని స్త్రీలోకమున కాదర్శప్రాయమైనది.........కామపాలుఁడు తనయందముపై నాధారపడి మధుమతిని లోబఱుచుకొన యత్నించి విఫలుఁడైనాడు. ప్రేమసాధనమునకు......గుణములును విద్యయును ప్రధాన సాధనములుగాని సౌందర్యముకాదని మధుమతి చరిత్రమువలన చక్కగా బోధపఱుపబడినది." అని యిట్లుగా నీనవలలోని సారాంశమును పీఠికలో మ॥ శేకుమళ్ళ అచ్యుతరావు ఎం. ఏ. ఎల్. టి. గారు తెల్పినవిషయములం బట్టియే పాఠకులు దీనిలోని విషయము గ్రహింతురు. దీని వెల రు 1. గ్రంథకర్తగారి యొద్ద రాజమహేంద్రవరములో దొరకును.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౨౨ { శ్రీముఖనామసంవత్సరము. ఆశ్వయుజ కార్తికమాసములు. } సంచిక ౪.



కాకినాడ:
కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.
చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.
విడిసంచిక రు. ౦-౮-౦.
1933.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౨. | శ్రీముఖనామసంవత్సరము ఆశ్వయుజ కార్తికమాసములు. |

## ఆంధ్రీ-తద్విశిష్టత.

—( మహాకవి కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు )—

ఆంధ్రీతద్విశిష్టతా ప్రతిపాదనా కార్య మాంధ్రునకు జన్మస్వాభావ్యమును సహజధర్మమును నైనను నాంధ్రేతరుఁ డన్న యాంధ్రీతద్విశిష్టత ప్రామాణ్యతర మనియు నత్యంతవిశ్వాసపాత్ర మగు ననియు ననుట ప్రమాప్రాబోధకులకుఁ బరమహర్ష కారణ మైనను దత్ప్రియమాతృతాత్మానుభవైకరంజితాంతరంగాంధ్రజన మండలమున కఖండానందసముత్పాదక మగు విషయ మాంధ్రముఖప్రణుతాంధ్రీతద్విశిష్టతానువాదకకార్య మగునను పటుమతిఁ బలుకు నన్ను మన్నింపరే నిలింపవాణీనితాంత కాంత త్రిలింగ వాణీమనోనాథులారా ?

ఆంధ్రు లనియు నంధ్రు లనియుఁ బిలువఁబడు నీయాంధ్రులవాణియే యాంధ్రి యగును. ఇది యత్యంతప్రాచీన మగుభాష యని యైతరేయశ్రుతి ముఖమున నెఱుంగుదుము. అత్యంతశ్రావ్య మని "తెలుఁగులెస్స" యనుకృష్ణరాయోక్తియు "Telugu is the Italian of the east" "ఆంధ్రి ప్రాచ్యేటలీభాష యనఁగఁ జెల్లు" అను పాశ్చాత్యపండితుని (C. P. Brown) వాక్యము వలనను సుదృఢముగ ననఁగలము. మధురాతిమధుర మాంధ్ర మని యాంధ్రానుభూతియయ్యె నాంధ్రవాఙ్మయము నన్నయపూర్వ మగునది లభింపదే యని మాత్రము వాఙ్మయప్రాచీనత్వస్థాపనాభిలాషులకుఁ గొంత తద్విషయమున విషాద ముండకపోదు. అయినను నన్నయపూర్వమున నేరూపముననో వాఙ్మ

య ముండెనని వాఙ్మయవికాసక్రమశాస్త్రజ్ఞు లందఱు అంగీకరింతురు. వాఙ్మయా లాభమును నెపముగాఁ గొని తమిళ భాషాకాశమున కాదినే సృష్టింపఁబడె ననియుఁ దజ్జన్య మాంధ్ర మనియు ననుట యనుచితము. ద్రావిడశబ్ద మార్య వాఙ్మయమునఁ బ్రాచీనప్రయోగము లభింపదు. ప్రపంచమున నెందును వాఙ్మ యము లేని యాయతిదురూహకాలమునఁ బావనవేదవాఙ్మయ ముదయించెను. అం దాదివేద మగు 'ఋగ్వేద'మున "ఆంధ్ర" స్మృతి గలదు. ఆంధ్ర మతిప్రాచీ నము నతిమధురము ననువాదము సుస్థిరము.

ఆర్యసంప్రదాయ మాంధ్రులకుఁ బిత్రుపైతామహక్రమాగతము. ద్రావిడసంప్రదాయ మాగంతుకము మాధ్యమికమును నగును. ఆంధ్రులు పంచ ద్రావిడులలోనివా రని యనుటయుఁ గాలానుగుణ్యముగఁ దాత్కాలికముగ ననుటయే యగును. పూర్వవాఙ్మయమున లభింపదు. ఇంతకును నన్నయ్య భట్టారకుఁడే తనభారతమున నొకచో ద్రావిడులను స్వేతరులనుగఁ జేర్కొని గర్హించుటవలన నన్నయ్యనాఁటికి నాంధ్రులు తాము ద్రావిడుల మని యనుకొ నలే దని స్పష్టముగఁ జెప్పవచ్చును

మ. ద్రవిడాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబునై యుదీచీభాగము పాడగున్ .........(ఇత్యాది)

దక్షిణాపథమువా రగుదురా యన్న నగుదు రనియే ప్రత్యుత్తర మిచ్చితీఱవలయును. అగుచో దాక్షిణాత్యు లనియు వారు ద్రావిడవాచ్యు లనియు నట్లగుట నాంధ్రులు ద్రావిడు లనియుఁ దర్కించుట నిష్ప్రయోజనము. సంప్రదాయముగ నఱవమువారు ద్రావిడు లని పిలువఁబడుచుండుటచేత నే యాంధ్రదేశమున స్థిరపడియుఁ గొందఱు ద్రావిడుల మని యనుకొనుచున్నారు. అట్లే వ్యవహరింపఁబడుచున్నారు. ఇఁక నాంధ్రు లట్టివా రన్యదేశములయం దాంధ్రు లనియుఁ దెలుంగు లనియు వ్యవహరింపఁబడుచున్నవా రగుటనాంధ్రు లు ద్రావిడులు గారు.

ఆంధ్రు లనార్యులా:—దస్యుగణపతితు లగుటనాంధ్రులు దస్యులు ననా ర్యులు నని యనుటయు నబాధితము గాదు. శప్తార్యులు విశ్వామిత్రపుత్రులు దస్యుజాతివా రనుట యనన్వితవాక్యము. మఱియు నైతరేయబ్రాహ్మణ మైతి హాసికబుద్ధితో నర్థవాదమర్యాదతో నన్నది కాని సిద్ధాంతవాక్యముగఁ బలు కమి నాశ్రుతి యాంధ్ర ప్రాచీనత్వమాత్రోపయోగి యని గ్రహించుటయె

సముచితవాదసరణి యందును. మనుస్మృతి మున్నగువానిలోఁ గల వాక్యములు సమన్వయము చేసికొన్నఁ బూర్వోత్తరవిరోధము లుండవు. ఆమనుస్మృతిశ్లోకమును దదనుబాధకశ్లోకములును బ్రక్షిప్తములుఁ బ్రమత్తములు నని యన్యో వ్యాఖ్యాతలే యభిప్రాయపడిరి. మఱియుఁ గొన్నింట నాశ్లోకములే లేవు. అట్లగుటచే నాంధ్రులు దస్యులు గారు. పురాణములలో నాంధ్రచాణూరాదులు రక్కసులు గలరు. వారు తాత్కాలికాపరవాచ్యు లని నాసమాధానము. శ్రీకృష్ణునితల్లి యార్యజాతయై మేనమామ కంసుఁ డసుర కాలేదా ఇట్టివే పౌరాణికములు. వేదములలో నొకచోటఁ గృష్ణుఁడు దస్యుఁ డని యున్నది. కాని శ్రుతిస్మృతిపురాణేతిహాసముల నన్నింట నాంధ్రప్రశంస గలదు ఖండాంతరముల వర్ణించిరి. అట్లగుట సంప్రదాయసిద్ధముగ నాంధ్రత్వ మవిచ్ఛిన్నముగ నాఁటఁ గోలెఁ దామరతంపరై పెంపుగాంచుచున్న దన్నఁగా దనువా రుండరు. అయినను “But the Andhra Kings and the Andhra tribes have disappeared without any trace from the second century” శ్రీనివాసయ్యంగా రనువారు “Indian Antiquary” అనుపత్రికలో వ్రాసిరి. ఈవ్రాఁత సాహసము. ఏదో శాసనమునఁ గానరా దను నెపమున విమర్శకులు వేగపడుట తగవే? అట్లే యగుచో దేశగానము (Notional Anthem) న రవీంద్రకవీంద్రులు మన “ఆంధ్ర”శబ్దమును జేర్పలేదు, కాన, మన మున్నను లేనివారమే యగుదుమా! వాదమర్యాద యాకీతినున్న నేది యేమిగాను. అది యట్లుండనిండు. వాఙ్మయాధారమున నాంధ్రులు ప్రాచీనులు నార్యులనియే సుదృఢముగ నిర్ణయమగును.

ఇఁక మఱొక్కయెత్తువ్వెత్తుగఁ బన్నుదురు. శబరపుళిందాది సాహచర్యమున నాంధ్రశబ్దమును స్థానపరీక్షఁ బట్టి శబరాదితుల్యదస్యువాచక మని యందురు. కాని యందలిశాబ్దనియతి నరయరు. అల్పాచ్ఛత్వమున దాక్షిణాత్యజనకథనానుక్రమమున నాంధ్ర మని వాడి రనుట మఱతురు. ఆచారవ్యవహారము లనార్యములు గావని యెట్టివాఁడు నెఱుగును. ఆంధ్రుల యాచారములు యథార్థ్యము లైనట్లే యితరభాగములవారి యాచారములును గావని చెప్ప సాహస మని యనుకొన రని యనుకొందును. విశ్వగుణాదర్శాదులలో ననేకులు గర్హింపఁబడలేదా? పాశ్చాత్యశాస్త్రపద్ధతి నెంత విస్తరించినను నాంధ్రు లార్యేతరు లనువాద మణుమాత్రమును నిల్వదు. కావునఁ బాశ్చాత్యులపద్ధతి నవలంబింతురు. అగుఁగాక.

కాపాలికనిర్ణయశాస్త్రము:—వీరిసిద్ధాంతములు విభిన్నములై సర్వసామాన్యాంగీకృతములు గానికై యున్న ట్లాశాస్త్రమును గూలంకషముగ నరయుచో నెఱుకపడును శాస్త్రజ్ఞాభిప్రాయదౌర్భాగ్య మన్నింట నట్టిదే కానిండు. అయినను వివ్పింతము. "The Aryan type......is marked by a relatively long (Dolichocipheli:c) head a straight finely cut nose (Leptorrhine) a long symmetrically narrow face, well developed regular features and a high facial angle"— Haddon-Study of Man—

ఇట్లు తదేకాధారముగ సిద్ధాంతాభాసములను వ్రాయుచుండుట పరిపాటి యయ్యెను. అట్లగుచో "భస్మాంత మిదగ్ంశరీర" మ్మను ధర్మముగల యార్యుల కపాలాద్యంగోపాంగములు పరీక్షకు లభింపవు కావున నీశాస్త్రము గగనపుష్ప మని సమాధాన మియ్యరాదా ?

అన్ని దేశములలో జాతినిర్ణాయకసూత్రము లేవి పాటించిరో వానిని మనదేశమున వినియోగించుచో ఫలిత మేమగునో చూతము గాక. అంతకు నీసిద్ధాంతములను సందిగ్ధాసందిగ్ధములుగ గ్రహించుటయే తగవు. "The general conclusion seems to be that in Europe the influence of race is to a great extent observed by other factors... ..

Indian Empire—Ethnology and caste.

ఇతరవిషయసమన్వయము గావలయు నని పాశ్చాత్యులే సమ్మతించిరి. ఇంక మనయార్యులీకపాలాద్యంగపరీక్ష జాతినిర్ణాయక మనక భావిభూతినిరూపక మనియు నది సాముద్రికశాస్త్ర మనియుఁ జెప్పిరి.

శ్లో॥ ఉన్నతనాసః సుభగః గజనాస స్స్యా త్సుఖీ......

మస్తక మిభకుంభనిభం భూమిభుజామ్......ఇత్యాది సాముద్రికశాస్త్రోక్తులరయఁగపాలజ్ఞులని యదే యేమో యనుకొనఁగూడదా ? ఆంగ్లులును నీయార్యమార్గమును ద్రొక్కిరి. 'A round head invariably denotes a slow thinker' అని యనిరి. కావునఁ గాపాలికులుఁ దదంతఃపాతులు నన్నవానిఁ బట్టి యాంగ్లేయులు దస్యుల నియో ద్రావిడు లనియో నిశ్చయింప నలవిగాదు. మఱియు ద్రావిడ మేది యని చెప్పుట కష్టతర మనియుఁ గొందఱందురు. A more intricate Problem, however, is the settlement of the so called Dravidian question,"—B. S. Guha-Ph. D., గా రనిరి.

సంఘము:—ఆర్యసంఘము నార్యమతమే యాంధ్రులది యగుటను నయ్యె ఋషులగోత్రములవా రగుటను నాంధ్రు లార్యులే. వేదములు శాఖలు నన్నియును యథార్థ్యము లగుట నాంధ్రు లార్యులే యగుదురు.

భాషాశాస్త్రము:—అన్నియును నిక్లిష్టము లగుట విక్షేపములాగు భాషాశాస్త్రమునుబట్టి యాంధ్రులు ద్రావిడు లని నిర్ణయించి యాంగ్లజనుల నందఱు నించుమించు తనవలెనే జ్ఞప్తించుకొన్న 'కాల్డువెల్లు' పండితునకు ద్రావిడు లందఱుఁ గృతజ్ఞులు కావలయును. ఈపండితుని పరిశ్రమమునకుఁ దోడు శ్రీశేషగిరిశాస్త్రిగారి కృషియు నవ్వల నందఱికష్టమును నేకమై ద్రావిడవంశ మని యొకబలవద్భ్రాంతిహ్మాణార్థము సిద్ధమయ్యెను. భాషావిషయ పరిశోధనములు జరుగకున్నను "కాల్డువెల్లు" గారి యడుగులజాడల నంద ఱేఁగుచున్నారు. సందేహించినవారిని శుద్ధచ్ఛాందసు లనుచున్నారు.

పాశ్చాత్యులు "ఫైలోలజీ" యనునదియే ప్రాచ్యులశిక్షాశాస్త్ర మని యెఱుంగవలయును. ద్రావిడభాషావర్గ మని యాంధ్రము ననుటకుఁ జూపిన హేతువు లెల్లను ఖండించుచుఁ దెలుపఁదలఁచిన నొకమహాగ్రంథ మగును, గావున, సంగ్రహించి తెలిపెదను. పదములు, పదార్థములు, సంఘటన, వ్యాకరణపద్ధతి, విభక్తి, తదర్థానుబంధక్రమము మున్నగునవి సదృశము లయి సన్నిహితము లయి యుండుటచే నీయాంధ్రము ద్రావిడవర్గమునకుఁ జెందిన దని యనవలసివచ్చును. ద్రావిడవర్గ మని పేరు పెట్టుటకంటె నాయభిప్రాయమున నాంధ్రవర్గ మని పేరు పెట్టుట యుచితతర మని యందును. వింధ్యకు దక్షిణమున నున్నవర్గ మంతయు నాంధ్రవర్గ మనియే పిలువవలయును అట్లే వైదికశ్రుతి గలదు. పురాణములయందును నాంధ్రదేశము నిషేధింపఁబడ లేదు. ఇంతయేల ? ఆర్యభాషాతదుచ్చారణసామగ్రీ సాదృశ్యము వైదికమున లౌకికమునను యథాశిక్షితముగ నాంధ్రమునఁ దక్క మఱి యేయితరదాక్షిణాత్యభాషలయందును లేదు. "అ" వర్ణమును 'ఒ' వర్ణముగఁ గొందఱు ఉచ్చరింతురు. కొందఱేమో యూఁత నుచ్చరింతురు. 'ఋ' 'ౠ' వర్ణంబుల గతి యెట్లయ్యెనో విజ్ఞు లెఱుంగుదురు. క, చ, ట, త, ప, వర్గంబులను గో, చో, టో, తో, పో, వర్గంబులుగను మఱికొందఱు క జ చ ఞ లు గను గొందఱు ఊఁతలు విసరులతోఁగను బలుకఁ దెలుఁగునుడికారముల పొందికను మెచ్చుకొనితీరవలయునుగదా! అఱవలకు సరళములే లేవు. వర్ణోచ్చారణమున నాం

భ్రమలమార్గము యథార్థ్యమనరా? అక్షరాకృతులును సాదృశ్యసమ్మతము లగు ననుట కుదాహరణముగ రెండుమూఁడక్షరములఁ జూపుదును. అకారము శేషశాయి విష్ణువు. ఆకృతియు నర్థము నట్లే యగును. "ఇ" బ్రహ్మాకృతి. ఆకార మాత్మజాతాకృతి నొందినది. దానికది యర్థ మగుటయే ప్రమాణము. ఉకార మీశ్వరాకృతి. దక్షిణామూర్తియు శిరమున గంగయు నున్నయాకృతి. 'క' కాముని యాకృతి ఆతనియాకృతి ప్రతీకలక్ష్య మగుట నెక్కిన ధనువునాకృతి 'క' వర్ణమని గ్రహింపుఁడు. ఇట్లే సర్వవర్ణములకు సాదృశ్యసంప్రదాయార్థములు గలవు నాయాక్షరకోశవ్యాస మను గ్రంథ మరయుఁడు. అందు విపులముగ నీయంశము వ్రాయఁబడెను. మంత్రశాస్త్రములో నున్నట్లే యక్షరక్రమము గలదు.

పదములు:—హలంతముగ నుచ్చరించుట యస్వాభావికము. ఆంధ్రమున కాకపటపద్ధతి లేదు. పద మనుటకు మాటయని యాంధ్రమునఁ గలదు. పద మనునప్పుడు బ్రహ్మాండమైనంత శాస్త్రచర్చ గలదు. సుబంతమా తిజంతమా తదుభయమా శక్తమా యని యనేకప్రకారముల వివదింపవలసి వచ్చును, కాని, "మాట" యనునప్పు డేచిక్కును లేక పదమునకుఁ గలయఖిలచ్ఛాయలును మాటయందుఁ గలవు. మాట యనఁగా వాక్య మనియు నర్థ మగును. పదమునకును నట్టియర్థమే వ్యాకరణపారీణులు చెప్పఁదొడంగిరి అట్టిమాటలు హలంతము లగుట యస్వాభావిక మని హల్లులు సాచ్చములుగ నుచ్చరింపవలసిన సంప్రదాయమే నొక్కిచెప్పును. మఱియు నుచ్చరించువాఁడును గడుఁగష్ట మనియే యొప్పుకొనును. ఇంతకును నాంధ్రమున మాధుర్యము గల దనుటకీయజంతత్వమే ప్రధానాంగము. పూర్వము భాషాసంప్రదాయ మజంతమంతమై యఖిల ప్రపంచమున నుండెనేమో యని యేకాక్షరకోశపరిశీలనమున స్ఫురింపకమానదు. హల్లు హల్లుగ నున్న యేకాక్షరపద మెక్కడలేని లేమి కేమి కారణము కల్పింతునో? కావుననే వైదికమునను లౌకికమునను గల హలంతపదముల నుచ్చరించునప్పు డుచ్చారణమాత్రప్రయుక్తాలంబస్వరములను వాడుట కలదని యొప్పుకొని తీఱవలయును గదా!

ఇట్టిపదముల యుచ్చరితరూపము సంప్రదాయవేద్య మనియే వేదజ్ఞనమయము. కాని వేదమునందే యాస్వరప్రాధాన్య మనియు లౌకికమున కక్కఱలేదనియు ననుచున్నారు. అట్లన్నను దత్త్వపరిశోధనమువలన లోకమునను స్వర

ప్రాధాన్యమున్నదని యెఱుఁగుదురు. ఆలంకారికులును శబ్దార్థనిర్ణయవృత్తులలో స్వరమునుగూడ గ్రహించిరి. కాని "కాకు" స్వర మనిరి. అయినను వ్యాకరణమునఁ గలప్రమాణధాత్వాదిస్వరములు లోకమున నెట్లు వచ్చును; కావున లోకమునకు స్వరము గలదని నమ్మింపవలయును. ఆస్వరమాంధ్రమునఁ బ్రచురము గాఁగలదు. అంతయును సంకరమై పోవుచున్నది. అది కాలధర్మము, ఆస్వరభ్రంశమే యపభ్రంశాదిభాషలకుమూలము. ఆంధ్రశౌరసేన్యాదిభాషల కీస్వరవైస్వర్యమే మూలకారణము. ఇన్నిహేతువులంబట్టి యాంధ్ర మార్యమనవలయును.

ఆంధ్రమున "అగ్గి" అను పద మెట్లు వ్యుత్పన్న మయ్యెనో విచారింపుఁడు. "అగ్నే రంత్యహాలో లోపః । శేషస్య ద్విత్వమ్॥" అని శాసించి యిది ప్రమాణము ని చూపుట తగదు. ఏల లోపించి దానికి ద్విత్వప్రాప్తి కలిగెనో విచారింపఁదగును. ఆంధ్రోచ్చారణా సంప్రదాయము వ్యంజనమాత్రమును ద్విత్వము గావించుట యగునుగదా ? 'అగ్ న్ ఇ' అను 'అగ్' అనుదాత్తమై 'ని' (న్ + ఇ) అనునది యుదాత్తమై యుచ్చరింపఁబడుటచే 'అగ్' 'అగ్గి' అని యు, 'ని' ఉదాత్తస్వరోచ్చరిత మగుట 'ని' పూర్వవర్ణాలక్షణ స్వరవత్త్వమాత్రవ్యవధాపిత మగుట 'ని'లోని హల్లంశము పోయి నిలిచినపదమే 'అగ్గి' యయ్యెను. మఱికొంద ఱాయుదాత్తమును దీర్ఘస్వరభ్రాంతిచే 'అగ్గీ' యని యనిరి. వేఱొక కొందఱు 'ని' యనునంత్యమును స్మరించి పూర్వవర్ణమును గలిపి 'నిగ్' నిగ్గు, నివ్వు, నిప్పు, గ నుచ్చరించిరి. గ, వ, ల వినిమయమువలన "నివ్వు" వ, వ, ల మార్పువలన (దీప—దివ్వె, వాపి—బావి) నిప్పుగాఁ బలికిరి. నిప్పే భ్రంశమై "నెరుప్పు"గ మారెను. ఇట్లు స్వరవిశేషములఁ బాటించి దాఁటించినవా రగుట నొక్కభాషయే పెక్కురూపములఁ బొందెను. బ్రిటనింగ్లీషు, అమెరికాయింగ్లీషు నన్నట్లు నిశ్చయముగ నాయాభాష లాయాదేశముల నుండుట మాఱిన యొక్కభాషయే యగును. ఆంధ్ర మనఁగ సన్నిహితదక్షిణమున స్థిరపడిన యార్యుల యార్యభాష యని యనవలయును. అట్టే తదితరములు గొన్ని గలవు. కావున నాంధ్ర మార్యభాష యగుచున్నది. మఱియు నీవిషయము నూతన మగుట నగ్ని నగ్గి సేసిన సు మిగిలిన పదముల కీ వ్యుత్పత్తిక్రమము పట్టునా యని శంకించి వ దమున కిప్పుడే స్వస్తి చెప్పవలదు. ఆక్రమము పట్టినకడ నట్లును గానినాఁడు వేఱొక సనాతనాచారమును ననుబంధమై యుండునని సమాధాన మిత్తును. ఇట్టివి నెంటను నన్నిశాస్త్రములయందును గలదు.

కావ్యనఁ గినిసి తనియకుండుం. విని వివేకింపుఁడు. క్రమముగ నీస్వరవిశేషమే సాధారణముగఁ బదావయవశైథిల్యమునకుఁ గారణ మని యెఱుకపడును లెండు. ప్రకృత ప్రసక్త ప్రకరణానురోధముగఁ గొంచెము తెల్పితిని భాషాపరిణామమునకు హేతు విది యొకం డని యనుటకుఁ దార్కాణముగఁ జూపితిని. ఇట్లే శిక్షాకర్తలును సూచించిరి. గీతియు, శీఘ్రియు, శిరఃకంపియు, లిఖితపాఠకుఁ డును మున్నగువారుపాఠకాధము లని పిలువఁబడిరి. గ్రామ్యమే గ్రాంథికమైనట్లు, జీర్ణుఁడే దేవుఁడైనట్లు, సీటిబొట్టే సిరధి యైనట్లు, పాఠకాధములే పఠకమహాశయులైరి. నాఁటి వైదికభ్రంశమే లౌకికమై నాఁటియార్యభాషాభ్రంశమే యాంధ్రమై యాంధ్రభ్రంశమే యగున వయ్యెను. ఆంధ్రమే యఱవమును నభిప్రాయమునమున్న పరిశోధకపండితులును గొందఱున్నారు. స్వరవిశేష సమర్పకభాషాశాస్త్రవేత్త లాంగ్లులును గొందఱు గలరు. క్రీ. శ. 1877 లో నొకపండితుఁ డిట్లే యుదాత్తానిస్వరకారణకపదపదావయవ వ్యవస్థాపూర్వక తత్త్వశాస్త్రము నుపపాదించెను. కార్లువెర్న రను డెన్మార్కుపండితుండు. అవధానములలో జటామాలాఘనేత్యాద్యవధానములలో నుదాత్తాదిహేతుక ద్విత్వవిధానములు స్వరధర్మము లని యవ్యైశిక్షలలోఁ దత్లక్షణములలోఁ గలవు. ఉదాహరణముగ నీక్రిందివచన మరయుఁడు.

వ. సంయుతో ర్ధ్వే హ్రస్వపూర్వో నుస్వారః ద్విత్వ మాప్నుయాత్॥
"ఘనద" కిగ్గంస్విదాసీత్, అని యుదాహరణము. ఇట్లే మనయాంధ్రమునను గూడ "హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్" అని కలదు.

ఇట్టిసంప్రదాయము లనేకస్థలములయందుఁ గలవు. వానినెల్లఁ జూపనీయలఁతివ్యాసము చాలదు. దిఙ్మాత్రముగఁ జూపుటయే పరిశోధకవ్యాసకార్య మగుటఁ గొన్ని చూపితిని. పదమును దత్స్వరూపమును బరామర్శింప నార్యభాషావర్గమునకే యాంధ్రము చేరును. అయినను దేశ్యము లనునవియు నన్యదేశ్యము లనునవియుఁ బదము లన్నింట నుండును. వైయాకరణులు వైదికమునను లౌకికమునను దేశ్యములయట్టివానినే నిపాతాదులుగ వ్యవహరించిరి. ప్రాకృతములలో దేశినామము లని యున్నట్లు హేమచంద్రాదులు చూపిరి. అట్లే యార్యభాషావర్గమునకుఁ జెందిన యాంధ్రిలోఁ గూడ నట్టివిభాగము గలదు. తత్సమము, తద్భవము, దేశ్యము, (అన్యదేశ్యమును) గ్రామ్యమును నని విభాగింతుము. గ్రామ్యమనునది వ్యవహారయమాణాఖిలభాషలలో నట్టే భావ

ప్రకాశకశాస్త్రములలోఁ నుండవలసి వచ్చును. అది పదధర్మము. "శవతి" పదము గమనవ్యాపారమున నొకచోఁ వ్యవహార మున్నను గ్రామ్య మై లౌకిక భాషనుండి తొలఁగి పోయెను. 'చనిపోయెను' అనువ్యవహారము వెళ్ళిపోయెను, అనువ్యవహారమునకు సమమే యైనను గమనకర్మమున వెళ్ళిపోయె ననునదియే ప్రయోగింపవలయును. పాని స్వాలని యైనను నేఁడు కులట యయ్యెను. ఇట్లెన్నియో గలవు; విజ్ఞుల కెఱుకయే. ఇంకఁ దత్సమతద్భవములఁ బట్టి యాంధ్రి యార్యవర్గ మనియే చెప్పవలయును. దేశ్యపదజాలమును దత్సాదృశ్యమును విమర్శింపఁ గర్ణాటాదులకు సన్నిహిత మని నిర్వచింతురు. కా దన లేము. కాని యేకదేశసామ్యమును బట్టి సర్వదేశము తదనుబంధ మని యనుట న్యాయమా? కా దనియే భాషాశాస్త్రజ్ఞు లందురు. అట్లని తదధిక సంబంధము భాషావిష్కరణవిధానసాదృశ్య మనియు వ్యాకరణసంబంధ మనియు నిర్వచించిరి. అనేకశబ్దశాస్త్రజ్ఞు లీ వ్యాకరణసంబంధము భాషావర్గీకరణమునకు బలవత్తము మని సమ్మతించిరి. అట్లగుట నాంధ్రమునఁ గలవ్యాకరణ సంబంధము ద్రావిడ మగుటను నాంధ్రము ద్రావిడ మని చెప్పుదురు. ఆనామకరణము మార్చుట లెస్సయని నాయభిప్రాయము. ఆంధ్రభాషావర్గ మని యనుచోఁ గతిపయపదసాదృశ్యఫలము సార్థక మగును. అయినను దత్తదేశ్యనామముల మూలరూపములఁ గొంత తడవి చూతము.

| తమిళము. | తెలుఁగు. | గీర్వాణము. |
|---|---|---|
| తలై | తల | ధ్ర, ధర, మూర్ధ |
| కణ్ | కన్ను | అక్షిణీ, (అక్షి) |
| మూక్కు | ముక్కు | ముఖ. |
| కై, శేయ్ | కై, చేయి | కృ- కర, చాయత్ - |
| మిండఱు | మెండ | మేదస్సు |
| నెత్తోర్ | నెత్తురు | న్యస్రమ్ |
| అమ్మాళ్ | అమ్మ | అంబా |
| అయ్యర్ | అయ్య | ఆర్యః |
| అణ్ణాన్ | అన్న | అగ్రణీః, అగ్రః |
| తంబి | తమ్ముఁడు | తక్ష |
| మామన్ | మామ | మహామహః |

| | | |
|---|---|---|
| ఊర్ | ఊరు | పూర్ |
| ఇల్ | ఇల్లు | ఇలా |
| నిలం | నేల | నిరృతిః |
| పూ | పూ | పుష్పమ్ |
| మరుందు | మందు(ప్రాసుది) | వాత్సకమ్ |
| మగళ్ | మగువ | మంగళా |
| తెరిప్పై | తెఱువ | స్త్రీః |
| చుట్రం | చుట్టము | శ్రితః, శ్రితమ్ |
| ఇరండు | రెండు | ఋతుః |
| మూన్రు | మూఁడు | మూర్తిః |
| నాన్గు, నాల్ | నాలుగు | నానా |
| ఐన్దు | అయిదు | హస్తమ్ |
| ఆఱు | ఆఱు | షట్, (ఆట్,) |
| ఏళు | ఏడు | సప్త, హేళిః. |

ఇట్లనేకము లగుపదములు ద్రవిడమునను నాంధ్రమునను సమాన వర్ణకము లగునవి కలవు. కావున నాంధ్రము ద్రవిడమునుండి వ్యుత్పన్నమైన దని యందురు. కాదు సోదరీభాష యని యందురు.

**మాతయా? సోదరియా?**— మాత యన్నవాద మపాస్త మయినది, కావునఁ, బ్రత్యేకముగ నిప్పుడావాదము ఖాద్యఖాదన మని విడిచి సోదరి యన్న దాని వాదమును గ్రహింతము. అజ్ఞాత మగు నొకమూలభాషనుండి ద్రావిడభాష లనఁబడునవి వచ్చియుండవచ్చు నని యు నాపిమ్మాలవాణియే ద్రావిడమాత యని యు నించుమించు చాంగ్లులు తెచ్చిపెట్టిన యార్యభాషా మాతవంటి దానిని బ్రతిష్ఠించి పుష్పాంజలు లిడువాదము సేయుదురు. కాని యాంధ్రభాష యట్టిది కాదు. వైదికభాష యెట్టిదో యాంధ్రభాష యట్టిది. అట్లగుటచేఁ గర్ణాటాదిభాషలకుఁ దల్లి యాంధ్ర మగుచున్నది. క్రమమును జన్యజనకభావోపపత్తికముగనే యున్నది. కనుక యాంధ్ర మనఁగ నార్యమును నజ్ఞాతమును గలిసినదైన దని యుఁ దమిళ మనఁగ నాంధ్రము ను జ్ఞాతమును గలిసినదైన దనియు నర్థ మగును. వ్యక్తియు దేశమును గలిసి యొక భాష యగును. మఱియు భాషాప్రాచీనత్వమును నిర్ణయించుట కత్యంతావశ్యత

నిశాతంకనిశ్చయోపాయము తదుచ్చారణక్రమ మగుటను నుచ్చారణమున హల్లాత్రాంతత్వము ప్రారంభభాషితములకుఁ బ్రాచీనభాషకు నుండుట యస్వాభావికము ననుభవదూరము నగుటచే నాంధ్ర మజంతపదక్రమవిన్యాసము గలదగుటఁ బ్రాచీనతమ మనిన్ న్యోక్తి చెప్పవచ్చును. అట్టియాంధ్రమే ద్రావిడాదికి నాదిమాత.

క్రియాపదముల స్వరూప మరయ నీద్రావిడసంప్రదాయము పునరుద్ధరింపఁబడు నని యుందురు. అదియును సుదృఢోపాయము గాదు.

| తమిళము. | తెలుఁగు. | గీర్వాణము. |
|---|---|---|
| పో | పో | ప్రవతే- ప్లవతే |
| ఎయ్దు | ఎయ్దు | ఇయాత్ |
| అడంగు | అడంగు | అధోగ |
| అదర్ | అదరు | అటతి |
| తిన్ | తిను | సినమ్ |
| ఎదిర్ | ఎదురు | వృత్ర |
| తొడర్ | తొడరు | తోదః-సంసారారంభః |
| పెరుగు | పెరుగు | వర్ధతే. |

ఇట్టి వనేకము లగుక్రియాపదములు వైదికము లయి యున్నవి. తమిళము ను దెలుఁగు ను నేపదముల సమానముగ నున్నదో యాపదములనే గ్రహించి గీర్వాణరూపములఁ జూపితిని, మఱియు ననేకము లగుప్రాచీనరూపములే యచ్చ తెనుఁగులును వాడుకలో నున్నపదములును నగుచున్నవి. "బీసు, బీసుః, శప్, చెప్పు, చాపు, చ్యావ, శావ, పేశః, పసిడి, వాణః, మాట, మాయు, వాయి, నాళి, నుడి, నుతి, స్వన, అను, వల్గు, అద్దు, రి, రేఁచు, రక్షస్సు, వృజ్-విడుచు, రుత్, రోయు, రోఁత, యాఱు, దుర్వ్, నస్ని, నసి, అఱ, హ్రు, (కొటిల్ల్యే) బియ్యము- బ్రహ్మ, ఇ ట్లెన్నియో యుండుటయే కాక యాంధ్రంబున సముచ్చయముగ నుపయోగించు "ఉన్" పదము వేదములోని "ఉ" పదము, "కమమిద్వితిచత్వారః (నిరుక్త) కమ్-కన్, మొదలగునవి కలవు. అధికము త్రిలింగరంగమునఁ జూడఁదగును. క్రియానిష్పత్తివిషయమున ద్రావిడమార్గమూర్గ మనుచున్నారు. అదియును వైదికమయి యున్నది. సంస్కృతములోని శతృప్రత్యయ మగు "త్" అనుదానికి "ఉ" చేరి, తు ట ను

అగుచున్నది. భూ-ఊన్, త్ + ఉ, ఉంమ, ఊ-అ, ఓ-అ (అవు-అగు) భవ్-
ఇట్లు రూపనిష్పత్తి యగుచున్నది. ఈనిష్పత్తియే, విభక్తిసర్వస్థలమునఁ బట్టును. రాముఁడు, అనుదానిఁ దీసికొని చూతము.

రామ-త్ + ఉ, రామ్ అయి ఉండువాఁడు రాముఁడు-రాముండు, రాముణ్డు, అనురూపము లేర్పడినవి. "వాఁడు, వాః, తద్వాన్, అనురూపమే. వాఁడు" ఆంధ్రమున మతుబర్థమై యున్నది ధనవాన్, ధనమువాఁడు, ఇత్యాదులు. ఒకప్పు డీవిషయమునే హిందూపత్రికలో శ్రీ, స్వామినాథ అయ్యరుగారు ప్రసంగించిరి. "All the pronouns in Dravidian languages have their source in Indo-Germanic languages". "స్తు" రూపమే "ండు" గ మారెనని శ్రీ జయంతి రామయ్యపంతులుగారి వాదము. శాసనలేఖకుల వైషమ్యమని నాసమాధానము. మఱియు వైదికభాషలోఁ బ్రథమాప్రత్యయ "మున్" అనునదియు 'రామ్-అస్-భువి-' అనునదియే యగుచున్నది.

పదము లన్నియు నొక్కరీతి నుదయింపమి ననేకవిధములఁ దచ్చరిత్రముల నరయవలయును ధాతురూపపదభాష మొదటి దగుటను ధాతువు ద్రావిడసాధారణ మగుటను క్రియాసిద్ధిలో ద్రావిడవాదసిద్ధి యున్న దని యందురు. "వచ్చు, తెచ్చు, పుచ్చు, మొదలగువానిని గ్రహించి "మెఱమెచ్చు" ను బుచ్చుకొని వాదించిరి. కాని యవియు వైదికసంప్రదాయమున నున్నవి. "వ్రజ్" వచ్చు, అని యయ్యెను. అందలి రేఫమే రూపాంతరములఁ బ్రయుక్త మయ్యెను. వ్రజరూపమున "కా" కారము చేర్ప, రాక యేర్పడును. ధాతువులరూపములఁ దీసికొనక నామరూపములఁ దీసికొని నిర్వహింపవలసి యుండుటయే పరిశోధకమర్యాదయు ను దత్స్వభావము ను నగును. Grammatical roots were derived from words. (Truths of Languag_e). కావున, వచ్చు, 'రాక' కు సంబంధించినది. తెచ్చుట, అనియే నిలుచును. కాని కృత్తు రాదయ్యెను. కృదభావమునఁ దుమర్థమును గైకొనవలయును. తే, తేరన్, అగును. "పుచ్చు" నామార్థము ధాత్వర్థభిన్నము కాన శబ్దాంతరమే పుచ్చు వచ్చితి ననునట్లుండదు. కాని ప్రయోగము లున్నవి. కావున "పుచ్చవలయు" నను రూపములోఁ గూడ "పుచ్చు"గలుగుట నదియే ధాతువుగ గ్రహింపవలయును. ఇట్టివి రెండు క్రియలరూప మని గ్రహింపవలయును. పోవు + ఇంచు=పుచ్చు అయ్యెను. మెచ్చు-మెప్పు, నకు సంబంధించినయది. కావున వీని మూలరూప

ముల గ్రహింప ని ట్లగును. వచ్చు-ర, తెచ్చు-తేర్, మెచ్చు-మేప్, ర-వ్రజ్ రజ్, రాక, (రాగః- అయినట్లు) తేర్- తేవృ (దేవనే) మేప్- మేపృ-గతౌ) ఈమొదలగునాధారములు గలవు. ఇంక "కు, గు, చు, జు, ప్రభృతిప్రత్యయ ము లెట్లు వచ్చిన వను శంక మనకు లేదు. కాని ప్రత్యయములు పూర్వము పదములే యనుట సర్వశాస్త్రజ్ఞజనాంగీకృత మగుట నయ్యేధాతువుల యం త్యవర్ణములం బరీక్షించుట కంటెం గాలార్థప్రత్యాయకవర్ణకములఁ బరిశోధిం పవలయును. వచ్చు + చున్నాఁడు, మొదలగురూపములు చూతము. వచ్చు-చ్, ఉన్న + వాఁడు, "చ్" కారము వర్తమాన మగుచున్నది, వైదికమునఁ గూడ "త్, తి" లు తదర్థము లగుచున్నవి.

'వచ్చెను- వస్తిని- వచ్చిరి. వచ్చేరు- వచ్చేడు- మొద లగునవి చూడ "వచ్చెను, వచ్చేడు" లోనున్న "ను, డు" లును, వచ్చింది, వచ్చేయి, లో, ది, యి, నామసంగ్రహము లగు నని బోధ మగును. నీవేను, వాఁడేను, ఇత్యా దులయందలి యవధారణార్థద్యోతక మగు, "ఎను" వంటిదే భూతమునఁ బ్ర యుక్త మయ్యెను. అట్టియవధారణము వైదికమున, "ఇత్" ప్రత్యయమగును- వచ్ + ఇత్ = వచ్ + చ్ + ఇత్- వచ్చిత్ వచ్చి- నిలిచెను, తరువాత నూతగఁ "ఎన్" వచ్చి వచ్చెన్, అని యయ్యెను. ఇట్టియూఁతలు చేర్పఁబడు నప్పుడు లింగభేద ముండదు. కొన్నింటికి వచనభేదము ను నుండదు. ఇట్లే క్రియాపదము లరయనరయ నత్యంతప్రాచీనవైదికవాఙ్మయమునకు నాంధ్రము నకును బరిణామ సంబంధ మున్నట్లు తోఁచుటచేఁ బ్రాకృతములును వేదభా షాసంప్రదాయములు ను నెఱిఁగిన యాంధ్రీమూలస్వరూపము తెల్ల మగు నని యెంచును. వైదికమునం గాలవ్యత్యాసము విభక్తివ్యత్యాసము లెట్లున్న వో యాంధ్రమునను నట్లేయున్నవి. విశేషణవిశేష్యరూపసంబంధము స్థలవిశే షమును బట్టి యగుననుట యున్నిభాషలకును వర్తించును. పదశక్తివాదములో దిగవలసి వచ్చును.

ఇంక వ్యాకరణరచనాసంప్రదాయము ను విశేషముగ వైదికమర్యా దనే యున్నది. ద్రావిడభాషలలోఁ గ్రియాపదము లక్కఱ లేకయే వాక్యము లుండు నని యు నార్యభాషలలోఁ గ్రియ యుండి తీఱవలయు నని యు నని యావిశేషలక్షణ మార్యద్రావిడబంధమోక్షణ మగుచున్నారు. కాని కొన్ని క్రియాపదము లుండనక్కఱలేకయే వాక్యము లుండవచ్చు నని వైయాకరణసమ

యము. ఆంగ్లులును నట్లే తర్కించి "Logical verb is not a grammatical verb" అని యనిరి.

ఛందోవిషయమునను ద్విపద భేదముచేఁ గలుగు, తెనుఁగునను గలుగు ఇట్లనేకవిషయములయం దార్యసంప్రదాయమైన యాంధ్రీయత్వాంతము నాద్య మగుటను వర్గీకరణమున నాంధ్రవర్గమని యనుటయే శాస్త్రమర్యాద యగుటను నాంధ్రీశద్విశిష్టత యిట్టిదని చెప్పి యర్థవాదముగ నాంధ్ర మాం భ్రమఁ డభ్యసించకున్న నధోగతి నొందు ననియుఁ దెలిపి మధురమధురమహితాంధ్రీకరకంకణరిక్వణనియమానుకారవీణానాదవినోదగానప్రమోదభరహృదయంబున నిదె పనుప్రతుఁ గై మోడిచి పేఁడికోలుగ నానుడు లడరుతమని దీవెన లిడ నెడనెడఁ దడఁబడని యొడఁదననిపదంబుల నందు, ననంకుపమ్మై మేకొనరే నామాటనరే వినరే యనుచు నిదేజోహారు.

# రెండు కాకతీయశాసనములు.

---

ఈవ్యాసమున కనుబంధముగా ముద్రింపఁబడు రెండుశాసనములలో మొదటిది పశ్చిమగోదావరి మండలములోని తణుకు తాలూకా, జుత్తిగగ్రామ మందు శ్రీసోమేశ్వరాలయములో నొకరాతిస్తంభము మీఁదఁ జెక్కఁబడియు న్నది. ఈసోమేశ్వరవిగ్రహము వాసుకిరవులచేఁ బ్రతిష్ఠింపఁబడుటచే దేవు నకు వాసుకిరవిసోమేశ్వరుఁ డనునామము కొన్నిశాసనములం దగపడుచు న్నది. రెండవశాసనము నైజాముదేశమందు, ఒరంగలుమండలము, భువనగిరి తాలూకాలో, కొలనుపాకగ్రామమందు శ్రీ సోమేశ్వరాలయములో నొకరా తిస్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది.

శాసనప్రతిబింబములను బట్టి పాఠము నిర్ణయించుట యైనది.

మొదటిశాసనములో-కాకతీయగణపతిదేవునకు రుద్రమమహాదేవి యను కూఁతు రుండినట్లును, ఆమెను, చాలుక్యవంశస్థుఁ డగువీరభద్రేశ్వరుఁడు వివా హమయి "ధాత్రీభారధురంధరుఁ" డయినట్లును, ఆతనిమంత్రి పిన్ని యనుపేరు గలవాఁడు తల్లాంబ యను తనతల్లికి సుకృత మగునట్లు ౧౧౮౧ వ శకాబ్దము నందు శ్రీ సోమేశ్వరస్వామి కఖండవర్తిదీప మొకటి సమర్పించినట్లు నున్నది. వీరభద్రేశ్వరుఁడు "ధాత్రీభారధురంధరుఁ" డనుటవలన మామగా రయిన గణ పతిదేవునిచేఁ గొంతదేశమునకు బరిపాలకుఁడుగా నియమింపఁబడిన ట్లూహింప వలసియున్నది.

రెండవశాసనములో, కాకతీయరాజవంశవర్ణనము పిదప గణపతిదేవు నకు రుద్రమదేవి యనుకూఁతురు పుట్టినట్లును, ఆమెను, చాలుక్యవంశజుఁ డగువీరభద్రుఁడు పెండ్లియాడినట్లును, లక్ష్మాంబామహాదేవులకొడు కగు ఇందు శేఖరుని "లెంక" యయినపోతినాయకుఁడు కొల్లిపాకలో కాలువ నొకటి త్రవ్వించినట్లు నున్నది. శాసనమధ్యభాగములోఁ గొంత గ్రంథపాత ముండు టచేత, ఇందుశేఖరవీరభద్రులకుఁ గలసంబంధము తెలియరాకున్నది.

రెండుశాసనములందును గూడ రుద్రమదేవి గణపతిదేవునికిఁ గూఁతు రయినట్లును, చాలుక్యవంశజుఁ డయిన వీరభద్రుఁ డామెకు భర్త యయినట్లు నున్నది. రుద్రమదేవి గణపతిదేవునిభార్య యయినట్లు మార్కోపోలో (Marco Polo) యను ఇటలీదేశస్థుఁడు పొరపాటునఁ దొల్లి వ్రాసియుండుటచేఁ బలువు

రాఁగ్రాఁలనే సమ్మి యుండిరి. ఇటీవల దొరకిన ప్రమాణములవలన రుద్రమదేవి గణపతిదేవుని కూఁతురే గాని భార్య కాదని తేలినది. ఈవిషయము పరిష త్పత్రికయం దిదివఱలోఁ బెక్కుసారులు నిరూపింపఁబడి యున్నది- ఇప్పుడు చారిత్రకాంశవిమర్శకు లీమతమునే సిద్ధాంతముగా గ్రహించియున్నారు. కా దనువా రెక్కడనయిన నొకరిద్ద ఱున్నచో వారిసందేహమును బ్రస్తుతశాసనములు నివర్తింపఁజేయఁ జాలియున్నవి. ఇవి రుద్రమదేవి గణపతిదేవుని పుత్రిక యని చెప్పుటయే గాక యామెభర్తపేరు కూడఁ జెప్పుటచేత భిన్నాభిప్రాయమున కవకాశము లేదు.

జయంతి రామయ్య.

(క)

పశ్చిమ గోదావరీమండలములోని తణుకుతాలూకా, జుత్తిగ గ్రామములో శ్రీసోమేశ్వరాలయములో నొక స్తంభముమీఁది శాసనము. శాసనాధికారులు 1920 వ సంవత్సరములో సంపాదించిన శాసనములలో 343వది.

1 శ్రీమ (త్సా)కతివల్లభగణపతి
2 క్షోణీశచూడామణే ర్జాతా (రా)
3 జ్యరమేవ రుద్రమమహాదేవీ (సు)
4 రూపాన్వితా తాం సౌభాగ్యబలా దు
5 దూహ్య విధివతు(త్) చాలుక్యవంశాగ్రణీ(ః)
6 ధాత్రీభారధురంధరో విజయతే శ్రీ
7 వీరభద్రేశ్వరః । త(న్మ)ంత్రీ నిజమంత్ర
8 పాటవధియా పాదా నిజస్వామినో
9 రాజద్రాజకిరీటకోటిఘటితై రత్నైస్త్ర
10 రై భూషయం ఉత్సాహేన రిపూ న్విజిత్య
11 సమరే శత్రుప్రభాభంజనో ప్విణ్ణు ప్విణ్ణు
12 రివ ప్రభుత్వజనితః శ్రీకీర్తితేజోనిధి(ః)
13 తల్లాంబాయా స్వమాతు(రద్య)సుక్రిత...
14 ......సా సుపుత్రం శ్రీశాకాబ్దే శశాం
15 క(ద్విపశి)వగణితే రమ్యసౌమ్యాయనాదా
16 దీపం ప్రాదా దఖణ్డం త్రిభువనపతయే

17 డుత్తుకగ్రామధామ్నే శ్రీమతోస్సిమిాశ్వ
18 రాయ అరుణకిరణలసత్వా(ద్వా)సుకిస్థా
19 పితాయ.

(దీనితరువాతఁ గొన్నిపంక్తులు గలవు కాని, యవి, శిలపై పోవుటచేఁ జదువఁదగి యుండలేదు.)

(చ)

ఒరంగల్ మండలము, భువనగిరి తాలూకా, కొలనుపాక గ్రామములో శ్రీసోమేశ్వరాలయములో నొకరాతి స్తంభముమిాఁది శాసనము.

—। పశ్చిమదిశ ।—

1 శ్రీశివమస్తు॥ అవ్యా ద్వరా
2 హ స్త్వాం యస్య దంష్ట్రాగ్రే జ
3 యతి క్షమా। బోధాపేక్షాలి
4 బృందాగ్రశ్యామశుభ్రాబ్జ
5 కోరకం॥ అవ్యాజోద్దామ
6 భూయాసం భవతు భవతా(ం)
7 భూతయే దంత్రివక్త్రః పార్వ్వ
8 త్యాః ప్రేమపాత్రం ప్రణతజ
9 నమనస్తోమపోషప్రదాయా। స
10 ర్వేషా మర్ణ్ణవానాం జలమల
11 ఘుగలద్దానపాథః ప్రవాహై
12 రుద్వేలం సావలేపః కలయ
13 తి పిహ్వ(లో) యస్య హస్తో విహ
14 స్తః॥ చాంద్రీకలా దిశతు (వ) స్స
15 కలాం విభూతిం సాంద్రామ
16 లాఘుపరివాహిభి రంశుజాలైః
17 ఉజ్జీవయం త్యవిరతం భువన
18 ంసమస్తం భానోః కరైః ప్రతి
19 దినం పరివర్ద్ధ్యమానా॥ ఆమ్నా రెూ
20 దారధామ్నా స్సరసిరుహద్యుశస్త

21 స్థాపో నాభిపద్మే ధాతు స్త్రాతుః ప్ర
22 జానా మజనివ తభుజ(జాత్) భూభు
23 జో దుర్జయాఖ్యాః। వంశే తేషా
24 మభూవ న్నతులితవిభవాః
25 కాకతియ్యానరేంద్రాః కువ్వాణాః
26 క్షోణిరక్షాం నిజభుజపరి
27 ఘైర్జాగరూకానుభావాః॥ తద్గో
28 త్రే జని జన్మభూమి మహాస శ్శ్రా
29 య్యస్య క్షాత్రా తిథీః కారు
30 ణ్యస్య గృహం సువేశ్మ యశసో
31 గంభీరతాయాః పదం। ఔదా
32 ర్యస్య నికేతనం గుణమణిశ్రే
33 ణ్యాః ఖని స్మరందిరం లక్ష్మ్యా స్స్వచ్ఛ
34 రితస్య కేలిసదనం స ప్రోల
35 రాజాహ్వయః॥ తస్మాజ్జాతో

—( దక్షిణదిశ )—

36 ... ... ... ...
37 ణికతి రతుల దోర్దండవి
38 భవో యుధీయాం స్తస్యాపి
39 త్పరిమథిత క్రూరిద్విషమ(దః)
40 మహాదేవం దేవం యు
41 మనుదితభాలాక్షిమ
42 హాసం భుజంగవ్యాసంగో
43 ఝ్ఝితతను మమన్యంత (యం)
44 మనుజాః॥ తత్పుత్రో
45 గణపతిదేవనామధేయ
46 స్సంజజ్ఞే జలనిధిమేఖలాం
47 భువం యః। దోస్తంభే
48 మణివలయాచకార శైలై

49 ద్దిగ్గాన్గైః ఫణిపతినా కథం
50 చి దూఢాం॥ జాతా తస్య పయో
51 నిధే రివ రమా శ్రీరుద్రదేవీ
52 సుతా భాస్వద్భి స్నృపమౌళి
53 రత్ననివహై స్సీరాజితాంఘ్రి
54 ద్వయా॥ త్యాగేన త్రిదివద్రు
55 మా న్దశదిశః కీర్త్యా ధనా
56 నాం వ(ప?)తిం లక్ష్మ్యా కించ
57 భుజాబలేన విజయం
58 న్యక్కుర్వ్వతీ వర్త్తతే॥ భాగ్యై
59 ర్వ్విశ్వస్య తస్యాః పతి రభవ
60 దఖో వీరభద్రాభిధాన స్సౌ
61 ందర్య్యే ణేందు మహ్నం
62 పతి మపి మహసా
63 మందభాసా వితన్వ(న్) య
64 ద్దైన్యపగ్వ్యం విదగ్ధా యయురు
65 వితరణం యాచకా
66 ఘా య దాక్షాం రాజానో య
67 త్ప్రితాపం విమతనృపత
68 యో జానతే జ్ఞాతభావాః॥ జ్యే
69 ష్ఠ శ్చాళుక్యవంశార్ణ్ణ

—। పూర్వదిశ ।—



* * * * * * *

1 ౖరరినృపతితమ(స్స)ంచ (యై)
2 (రా)శుయాతం॥ లక్ష్మాంబా
3 యాం సుతో జాత శ్రీమహా
4 దేవరాజతః। నామ్నేందుశే
5 ఖరో రాజా కుమారశ్శివయో
6 రివ॥ ఇందుశేఖరనరేంద్ర

7 నందనే నందతి స్వయము

8 శేషనందనే। జగ్ముషాం వీత

9 రణాం రణాం ముఖాస్వ

10 స్థత్రైవ విదుషాం ద్విషాము

11 షి॥ లోక స్త్రస్యాకలంకః ప్రతిస్ప

12 పతిపరోజాతరాజన్యగాకోని

13 శ్యాక శ్యస్త్ర తేజ స్ఫురతి రణశి

14 ర స్యుద్ధతారాతిఘోరే। య

15 స్య స్య త్ర్య త్రమత్తద్విపవిపు

16 లకిరోవ్రాతనిర్యాణాతముక్తా

17 భీక్తై జ్ఞాతా స్సుకీర్తి ప్రతతివిత

18 (త)యః ప్రోల్లసంతి త్రిలోక్యాం॥

19 భువిమాచనాయకాఖ్యో

20 విదితో జనకో జనస్యపిచ

21 సాక్షాత్। గుణవిజితమహో

22 లక్ష్మీ శ్శీలవతీ భవతి మాదచీ

23 యస్య॥ వీరేందు శేఖరపదా

24 రవిందసేవకేన శ్రీసోతినాయ

25 క ఇతి ప్రథితేన తేః। మావంశ

26 వర్ధన సమాహ్వయః ప్రసుతా

27 సా కుల్యాకృతా త్ర రుచి(రా) కాలి

28 పాకపుయ్యాణం॥ అస్యః కాకతి

29 సంతతిక్షితిభృతాం భృత్యా శ్చి

30 రా మేశ్వరా (రా?) ధకా స్సూనృతవా

31 దిన స్త్రిభువనఖ్యాతైకవీరా

(ఉత్తరదిక్కున నున్న దీని తరువాయి స్పష్టముగా లేదు, మఱికొందఱు నాయకులు సోమేశ్వరునకు భూదానము చేసినట్లు సూచనలు గలవు.)

# గ్రంథస్వీకారము.

(1) తప్రాసకందరామాయణము - బాల, అయోధ్యారణ్యకాండములు: — మ॥ కొచ్చెర్లకోట వేంకటరామయ్యగారిచే రచియింపఁబడినది. బ్రహ్మశ్రీ కవిశేఖర వడ్డాది సుబ్బారాయఁడుగారిచే పరిమాడఁబడినది కవిగారు "సీతారామాంజనేయ శ్రితజనగేయా" యను మకుటముతో సుమారు 900 కందములలో బాలకాండమును, 950 కందములలో నయోధ్యాకాండమును తప్రాసయుతముగా రచియించినా రనిన నెల్లరును ముక్కుమీఁద వ్రేలు వెట్టుకొనవలసినదే. ఇక్కాలమున నిట్టినియమములతోఁ బద్యములు చెప్పువారు లేరు. నియమమునకు లోఁబడి రచియించిన యీ గ్రంథములోని పద్యములు కొన్ని ధారాళముగా నుండవు. ఉండకుండుట సహజమే. ఇంకఁ గొన్నికొన్ని విషయములు, వాల్మీకిరామాయణములోనివి గావు. మోక్షగుండరామాయణ మను హరికథనుండి చాలవఱకు గ్రహింపఁబడినవని కవిగారు తెల్పినారు.

సీతయుఁ దనబాల్యంబున, భూతేశునిచాప మీఁదఁ బుడకఁగఁ గ్రీడా
దాతయు విస్మయమందెను, సీతారామాంజనేయ శ్రితజనగేయా
దాతను జేరియు శత్రు, వ్రాతముగని చంపనేల ప్రహరింతు నరిఁ
చూతువుగా కిపు డనవే, సీతారామాంజనేయ శ్రితజనగేయా.
ఆతరుణీమణి భర్తయు, నాతావున నుండెనేని నపుడే నిన్నున్
స్వేత్రుంపఁడె యని ఖగమును, సీతారామాంజనేయ శ్రితజనగేయా.

గాయత్రీమహామంత్ర ప్రథమాక్షరమగు తకారము ప్రాసగాఁగొనఁబడినది యిందొకవిశేషము.

ఈ గ్రంథము రాజమహేంద్రవరములోని సీతమపేటనివాసులగు కవిగారియొద్ద దొరకును బాలకాండ మొకసంపుటము. అయోధ్యారణ్యకాండము లొక సంపుటము కాని ఒకటి క్రౌను, ఒకటి డెమ్మీ. రెండును ఒక్క రీతినే యుండవలసినవి. వెల తెల్పఁబడియుండలేదు.

ఈ క్రిందిగ్రంథములు మూఁడు శ్రీకాశీక్షేత్రమందలి శైవభారతభవనమునకుఁ గార్యదర్శులుగానున్న శ్రీయుత చిదిరెమఠము వీరభద్రశర్మగారిచే మాకుఁ బంపఁబడినవి. గ్రంథములు దేవనాగరలిపిలో ముద్రితములు వీరశైవ మతమునకు సంబంధించినవి.

(1) దుర్వాదదూరీకరణము—ఇది ధార్వాడజిల్లాయందలి నాగనూరు బృహన్మఠాధ్యక్షులును, ప్రస్తుతము మైసూరునందు వెలువడు "పంచాచార్య ప్రభ"యను కర్ణాటపత్రికకుఁ గార్యనిర్వాహకులు నగు పండిత శ్రీకాశీనాథ శాస్త్రికావ్యతీర్థుల వారిచే వారు కాశీలో విద్యాభ్యాస మొనర్చుచున్నప్పుడు 1916—1917 సంవత్సరములో రచింపఁబడినది- వీరశైవమతమునకుఁ బ్రధానాంగమగు లింగధారణము వేదాగమశాస్త్రపురాణాదిసమ్మతమని నిరూపించుటయే గ్రంథముయొక్క ముఖ్యప్రయోజనము. ఉత్తరహిందూస్థానము నడుమ రాంవపట్టణమందలి పరమహంసాశ్రమమునందు పండిత శ్రీకాలికేశ్వరదత్త శర్మగారు తాము రచియించిన "శైవబ్రాహ్మణోత్పత్తి" యను గ్రంథముయొక్క ప్రస్తావనలో లింగధారిశైవులు "అవైదికు" లని లిఖించినారఁట. ఆదుర్వాదమును దూరీకరించుటకయి శ్రీకాశీనాథశాస్త్రిగారికిని శ్రీకాలికేశ్వరదత్త శర్మగారికిని జరగిన పత్రవ్యవహారములే యీగ్రంథరూపమును దాల్చినవి. శ్రీకాశీనాథశాస్త్రిగారు పంపిన మొదటిలేఖకు శ్రీకాలికేశ్వరదత్తశర్మగారు కొంత సమాధానము నొసంగిరి. కాని దానిని సవిమర్శముగ ఖండించుచు శ్రీకాశీనాథశాస్త్రిగారు పంపిన ప్రతిలేఖవయి శర్మగారు పలుమాఱులు రిజస్టర్డు ఉత్తరములద్వారమున హెచ్చరింపఁబడియు మౌనము వహించినారు. అందుచే విద్వాంసు లీవాదవిషయమును విచారించి యథార్థతత్త్వమును గ్రహింతురుగాక యను తలంపుతో నీలేఖల నెల్లఁ బుస్తకరూపమునఁ బ్రకటించితి మని శ్రీకాశీనాథశాస్త్రిగారు తమవిజ్ఞప్తిలోఁ దెలియఁబఱిచిరి- గ్రంథము శ్రీకాశీనాథశాస్త్రిగారి యద్వితీయమతపరిశ్రమమునకుఁ బాండిత్యమునకు నాదర్శకముగనున్నది. "పవిత్రం తే విततం బ్రాహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః అతప్తతనుర్న తదామోఽశ్నుతే శ్రుతాస ఇద్వహన్త స్తత్సమాశత" ఇత్యాది శ్రుతివాక్యములఁబట్టియు, "నిధనపతయే నమః నిధనపతాంతికాయ నమః... ... ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగం స్థాపయతి పాణిమంత్రం పవిత్రం"మున్నగు మహానారాయణోపనిషద్వాక్యములఁ బట్టియును, తదుపబృంహణరూపములగు ననేకపురాణాగమాది ప్రమాణములఁబట్టియు లింగధారణము వైదికమే యని, సనాతన మని, పూర్వమునీశ్వరసమాశ్రిత మనియు శ్రీశాస్త్రిగారు లెస్సగాఁ బ్రతిపాదించిరి. వీరశైవమతప్రాచీనత నెఱుంగఁగోరువారికీ గ్రంథము చాల నుపయోగకరము. ఈలేఖ లాంధ్రభాషలోఁ బరివర్తింపఁబడినచో నాంధ్రవీరశైవులకుఁ జాల నుపయోగించును. వెల రు 0-4-0 మాత్రమే.

(2) లింగధారణచంద్రిక— ఇదియుఁ బైదానివలెనే లింగధారణము వేదసమ్మతమనియు సనాతనమనియు నిరూపించు నత్యుత్తమమయిన ప్రాచీన గ్రంథము. ఇది శ్రీనందికేశ్వర విరచితము ఈనందికేశ్వరశివాచార్యుఁ డెప్పటివాఁడో తెలియదు. ఈగ్రంథము మొదట 1884 సంవత్సరములోఁ దెలుఁగులిపిలోఁ జెన్నపట్టణమందలి శైవసిద్ధాంత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి శ్రీమల్లంపల్లి మల్లికార్జునలింగము, అత్తలూరు కోటిలింగము అనువారలచేఁ బ్రకటింపఁబడినది. గ్రంథమునకు వ్యాఖ్యానము లేకుండుటచే నిందచ్చటచ్చటఁ బ్రతిపాదితమయిన మీమాంసాధికరణముల కాఠిన్యముచే గ్రంథవిషయము పండితులకుఁ గూడ సులభగ్రాహ్యము కాకున్నది. ఈలోపము నివారించుటకయి శ్రీకాశీక్షేత్రస్థ విశ్వారాధ్యసింహాసనాధ్యక్షులు, శ్రీమన్మహామహోపాధ్యాయ పండిత శ్రీశివకుమారశర్మమిశ్రులచే శరన్నామక వ్యాఖ్యను రచియింపించి తద్వ్యాఖ్యాసమేతముగ నీప్రస్తుతగ్రంథమును బ్రకటించిరి. కర్ణాటభాషలోఁ బూర్వము ముద్రింపఁబడిన మూలగ్రంథమొక దానిని వీరాధారముగాఁ గొనినట్లు గ్రంథభూమికవలనఁ దెలియనగును. తెలుఁగుప్రతికిని దీనికిని గొన్ని పాఠభేదము లచ్చటచ్చటఁ గాననగును. గ్రంథకర్త నందికేశ్వరావతారషట్స్థల పరబ్రహ్మానందపూజ్యపాదు లని తెలుఁగు ప్రతిలోని యంత్యగద్యములలోఁ గానవచ్చుచున్నది. బసవేశ్వరపౌత్రుఁడును, మహేశాచార్యసూనుఁడు నగు నందికేశ్వరుఁడు గ్రంథకర్త యనియు నాతఁడు శ్రీమద్వీరశైవవిశిష్టాద్వైత విద్యాచార్య, పాషండాంబుజ మహాగజ, పాంచరాత్ర ప్రాలేయ చండకిరణ, అద్వైతకుంభికుంభదళన రౌద్రపంచానన బిరుదాంచితుఁడనియుఁ బ్రస్తుతగ్రంథమువలనఁ దెలియనగును. తెలుఁగుప్రతిలోని గ్రంథావతారిక యీగ్రంథమునఁ గానరాదు. దానిలో గ్రంథకర్త తనయుద్యమ కారణము నిట్లు వివరించినాఁడు. "వేదశాస్త్రాణ్యనాలోచ్య కేచిత్పండితమానినః। ధారణం శివలింగస్య నాంగీచక్రు రమర్షితః॥ స్వయంవరే వరం దేహీ కరోమి భవదాజ్ఞయా తేషాన్నిరాససిద్ధ్యర్థం లింగధారణచంద్రికాం॥

ఇది లింగధారణ సిద్ధాంత మనియు, ఖననసిద్ధాంత మనియు రెండుభాగములుగా రచియింపఁబడినది. అసంఖ్యాకము లగు శ్రుతిస్మృతిపురాణాగమాది ప్రమాణములచే నీసిద్ధాంతములు రెండును బాగుగాఁ బ్రతిపాదింపఁబడినవి. శరద్వ్యాఖ్యయు సార్థకనామమై దురవగాహవిషయములను సువిశదమొనర్చు

చుఁ బాఠకులకు మిగులనుపయుక్తముగ నున్నయది. వీరశైవమతజిజ్ఞాసువులకీ గ్రంథమత్యావశ్యకము. గ్రంథము వెల రు 3—0—0.

(3) వీరశైవేందుశేఖరము—దీనిఁగూర్చి ముందు బ్రకటింపఁబడును.

1. ఆంధ్రభూమి—సర్వవిషయములను జర్చించు సచిత్రాంధ్రమాసపత్త్రిక. సంపాదకులును బ్రకాశకులును గూడ బ్ర॥ ఆంధ్ర శేషగిరిరావు బి.ఏ. గారు. వీరు పత్త్రికా ప్రకటనానుభవము చాలకలవారు గావున నాంధ్రభూమిని గడుమెలఁకువతో నడపి యాంధ్రుల యాదరప్రోత్సాహములకుఁ బాత్రముగా నొనరించి ప్రఖ్యాతిం గాంతురుగాక.

ఇప్పత్త్రిక నెలనెలకు 50 పుటలచొప్పున 25 వ తేదీని బ్రచురింపఁబడుచుండును. వేపేరీ చెన్నపురి చందా సం॥నకు రు 3. విడిసంచిక 0-4-0.

2. వినోదిని—ఇది యొక సచిత్రమాసపత్త్రిక ఇందుఁ బ్రచురింపఁబడువ్యాసము లన్నియు నత్యుత్పుట్టించుచు హాస్యరసపూరితములై పాఠకులకు వినోదము గొల్పుచుండును. సం॥రమునకు చందా రు 1. విడిపత్త్రిక 0-2-0. నెం 234 రు గోవిందప్పనాయకర్ వీథి, చెన్నపురి. వినోదినీకార్యాలయమునను రైల్వేపుస్తకశాలలయందును బ్రతిముఖ్యపట్టణమందును సాధారణముగా దొరకును. ప్రకాశకులపేరు పాఠకులకుఁ దెలియుమార్గము పత్త్రికలోఁ గనబడదు.

3. గృహలక్ష్మి—దసరాసంచిక-చెన్నపురిలో డాక్టరు కే. యన్. కేసరి గారిచేఁ బ్రకటింపఁబడుచున్న గృహలక్ష్మియను మాసపత్త్రిక, ఆఱుసంవత్సరములనుండి దినదినాభివృద్ధి నొందుచున్నది. దానికిఁ బ్రతివత్సరమును దసరాసంచికయను నొకచక్కని సంచిక సర్వాంగసుందరముగా వెలువడుచున్నది. ఈసంవత్సరమునఁ గూడ దసరాకు (ఆఱవసంచిక) బైలుదేఱినది. పత్త్రికయేమి పత్త్రికలోనివిషయము లేమి స్త్రీలకేకాదు పురుషులకుఁగూడఁ జిత్తాకర్షకములై యున్నవి. వ్యాసములు పలువురు తరుణీమణులచే వ్రాయఁబడుచున్నవి. ఇయ్యది సర్వవిధముల భారతీప్రకృతిగా నలరారుచున్నది. దీనిసలహాసంఘములో ననేకులు సుప్రసిద్ధవిదుషీమణులును విద్వాంసులు నుండుటచేఁ బత్త్రిక వివిధరుచులవారికిఁ దగినట్లు వివిధవ్యాసములతో విరాజిల్లుచున్నది. స్త్రీలయారోగ్య సౌభాగ్యములను బెంపొందింప సచిత్రముగఁ బ్రకటించు డాక్టరుగారి యుద్యమము కొనియాడఁదగినది. సర్వేశ్వరుఁ డీపత్త్రికకును బత్త్రికాసంపాదకులకును దీర్ఘాయువునొసంగుఁగాక !

# *భోజదేవుని 'శృంగారప్రకాశము'

—యీయుణ్ణి వేఙ్కటవీరరాఘవాచార్యులుగారు, బి. ఏ., కాకినాడ.—

(1). విషయవివేకము:——విద్వత్కవీంద్రుఁడును, కవికోకిలకల్పభూజుఁడును జగద్గీతకీర్తియు నగు భోజదేవుఁడు [క్రీ. శ. 11 వ శతాబ్ది] సంస్కృతమున వివిధ శాస్త్రవిచారకము లగు నుత్కృష్టగ్రంథము లనేకములు నిర్మించి గీర్వాణశారదారాధనము నొనరించియున్నాఁడు. అలంకారశాస్త్రగ్రంథ మగు నీతని 'సరస్వతీకంఠాభరణము' సుప్రసిద్ధమే. మఱియు నీతఁడు 'శృంగారప్రకాశ' మను బృహదలంకారగ్రంథమును గూడ రచించియున్నాఁడు. నేఁటిదనుక విద్వల్లోకవిదితము లగు నలఙ్కారగ్రంథములలోని కెల్ల నిది బృహత్తమ మనుట నిర్వివాద విషయము. ఈగ్రంథము 36 ప్రకాశములుగా విభజింపఁబడి యున్నది. ప్రతిప్రకాశముయొక్క పరిమాణము సుమారు వేయి యనుష్టుప్ శ్లోకముల గ్రంథమంతయుండును. ఇందలి మొదటియెనిమిది ప్రకాశములలోను వ్యాకరణశాస్త్రమునకు సంబంధించిన శబ్దము, అర్థము, వృత్తి మొదలగు విషయములు వివరింపఁబడినవి. నవమప్రకాశమున గుణదోషములు, దశమప్రకాశమున నుభయాలంకారములును, నేకాదశప్రకాశమున మహాకావ్యవిచారమును, ద్వాదశప్రకాశమున నాటకవిచారము నొనరింపఁబడి యున్నవి. మిగిలిన 24 ప్రకాశములలోను రసవిచారము చేయఁబడెను. అందును 'శృంగారము'నకగ్రస్థాన మీఁబడెను. 'రస' మనఁగా 'శృంగారరసము'నకే చెల్లు నను భోజుని సిద్ధాంతము ననుసరించి యీగ్రంథమునకు 'శృంగారప్రకాశ' మని యన్వర్థాభిధాన మొసఁగఁబడెను. ఇందలి మూఁడుప్రకాశములు [22, 23, 24] గలగ్రంథభాగము [103 పుటలు] నాగరలిపిలో శ్రీ యదుగిరి యతిరాజస్వామిచేఁ బ్రకటింపఁబడియున్నట్లు విదితమే. శ్రీస్వామి 'శృంగారప్రకాశము'ను సూలంకషముగ వ్యాసంగ మొనర్చి యమూల్యము ను విపులము నగు పీఠికను రచియించి పైఁ బేర్కొనిన ప్రథమసంపుటముతోఁ జేర్చి ప్రచురించిరి. ప్రతిప్రకాశమునందలి విషయమును సూచించుచుఁ బ్రతిప్రకాశముయొక్క యాద్యంత భాగములఁ గూడఁ బీఠికలో వీ రుల్లేఖించియున్నారు. శ్రీమత్పండిత ఆసూరి రంగస్వామి సరస్వతిగారు [బి. యే.] ఆంగ్లమున రచియించిన యుత్తమోపోద్ఘాతముగూడఁ

*ఈ వ్యాసము మూఁడుసంవత్సరములకుఁ బూర్వమున రచించితిని. ఏప్రిల్ 1933 లో రాజమహేంద్రవరమునఁ గవిశేఖర శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారి యగ్రాసనాధిపత్యమునఁ జరిగిన ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసభలోఁ జదువఁబడెను.

వైసంపుటమునకుఁ జేర్పఁబడియున్నది. 31, 32, 33 ప్రకాశములుగల ద్వితీయ సంపుటము శ్రీస్వామి వారిచే ముద్రింపఁబడుచున్నది. 26 వ ప్రకాశము సమగ్రముగా నుత్పన్న మయ్యెను. 25, 27, 29 ప్రకాశములలో విశేషముగా గ్రంథపాతము చూపట్టుచున్నది. నాటకవిచారక మగు ద్వాదశప్రకాశమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిచంద్రులు పరిష్కరించియున్నా రనియుఁ, ద్వరలో ముద్రింప నుండి రనియుఁ గాశీప్రసాదజయస్వాల్ పండితుఁడు* వ్రాసిన వ్యాసముం బట్టి తెలియుచున్నది. ఈ వ్యాసము ప్రకటింపఁబడి నేఁటికి మూఁడువత్సరములైనది కాని నేఁటికిని శ్రీ రామకృష్ణకవిగారు సంపుటము ను బ్రచురించి యుండలేదు. వా రెప్పుడు దానిని బ్రచురింతురా యని స్వాతి వానలకు ముత్తెపుఁజిప్పలవలె నువ్విళులూరుచున్నారము. ఈ ప్రకాశమున విద్వల్లోక మింతవనుకఁ గని విని యెఱుఁగనివియు, విలుప్తములును, నామమాత్రజ్ఞాతములు నగు ననేక నాటకములనుండి యుదాహరణము లొసంగఁబడి యున్నట్టులు తెలియుచున్నది. ఈ వ్యాసమున స్థలాంతరమున సూచింపఁబోవు 'స్వప్నవాసవదత్త' వృత్తాంతముగూడ నీ ప్రకాశములోనిదే. ఇఁక 'శృంగారప్రకాశము' నందలి విషయముల సూచించెద.

(2). ప్రకాశసంఖ్య.

1 వ ప్రకాశము: ప్రకృతిప్రత్యయోపపదనిపాతాదికవర్ణనప్రకాశము. (ప్రకృత్యాదిప్రకాశము)
2 ప్రాతిపదికాదిప్రకాశము.
3 ప్రకృత్యాదిశబ్దప్ర. (శబ్దప్రపంచము)
4 క్రియాద్యర్థచతుష్టయప్ర.
5 ఉపాధ్యాద్యర్థచతుష్టయప్ర. (ఉపాధ్యాదికభేదము)
6 విభక్త్యర్థాదిచతుష్టయప్ర. (అన్వయపేకము)
7 కేవలశబ్దసంబంధశక్తిప్ర.
8 సాపేక్షశబ్ద, శబ్దశక్తిప్ర. (శబ్దశక్తివికాసము)
9 దోషహానగుణోపాదానప్ర. (గుణదోషములు)
10 ఉభయాలఙ్కారప్ర.
11 రసవియోగప్ర.
12 ప్రబన్ధాఙ్గచతుష్షష్టిచతుష్టయప్ర.
13 రతి(?)ప్రకాశము.
14 హర్షాదిభావప్ర.
15 రత్యాలంబనవిభావప్ర.
16 రత్యుద్దీపనప్ర. (రత్యుద్దీపనవిభావవర్ణనము.)
17 అనుభావప్ర.
18 ధర్మశృంగారప్ర.
19 అర్థశృంగారప్ర.
20 కామశృంగారప్ర.

* "*King Bhoja's Art Criticism of Lyrical Poetry*"—K. P. Jayaswal. [Modern Review for June 1928. Pp. 722-25]

21 మోక్షశృంగారప్ర.
22 అనురాగప్ర.
23 సంభోగవిప్రలంభశృంగారప్ర.
24 విప్రలంభశృంగారప్ర.
25 ప్రథమానురాగసాధర్మ్యము (ఇటఁ జాలగ్రంథము లోపించినది)
26 అంతయు నుత్పన్నమైనది
27 అభియోగవిధిప్ర.
(ఇక్కడనుజాలగ్రంథముపోయినది)
28 దూతవిశేష,దూతకర్మోపవర్ణనప్ర.
29 దూతప్రేషణ, సందేశదానప్ర.
(ఇటను గ్రంథపాతము గలదు)
30 మానప్ర.
31 ప్రవాసోపవర్ణనప్ర.
32 కరుణరసవినిర్ణయప్ర.
33 సంభోగశబ్దార్థప్ర
34 ప్రథమానురాగప్ర.
35 మానాంతరాదిప్ర.
36 సంభోగావస్థాప్రకాశ మను షట్త్రింశ ప్రకాశము.

(3). ఈగ్రంథమునఁ బేర్కొనఁబడిన గ్రంథకర్తలు, గ్రంథములు.

1 ధర్మకీర్తి.
2 పంచశిఖుఁడు.
3 వాగురి.
4 వికటనితంబ.
5 విశాఖదేవుఁడు.
6 శాకల్యుఁడు.

ఇఁక నీగ్రంథమున నుట్టంకితము లగుగ్రంథములఁ బేర్కొనియెదను. ఇందేమైదాఱుగ్రంథములలో దప్ప మిగిలిన వన్నియు ననూర్యంపశ్యములే యనఁదగును.

1 అనఙ్గవతి.
2 అబ్ధిమథనము.
3 అభిసారికావంచితకము.
4 ఇందులేఖ
5 ఇందుమతి.
6 ఉదయనోదయము.
7 ఉపాహరణము.
8 ఉదాత్తరాఘవము.
9 కుందమాల [ముద్రితము]
10 కువలయాశ్వచరితము.
11 కృత్యారావణము[ఇది భావప్రకాశమునఁ గూడ నుద్ధృతము అభినవభారతీ,వక్రోక్తిజీవిత,సాహిత్యదర్పణములలోఁ గూడ నుట్టంకితము. దీనింగూర్చిన వ్యాసమును మద్రపుర ప్రాచ్యపరిశోధకపత్త్రికలోఁ జూడనగును II సం. 3, 4, సంచికలు. జూలై, అక్టోబరు 1928]
12 కృష్ణచరితము.
13 చారుమతి.

---

[ఈవిషయసూచికను బ్రదర్శించుటకు నా కుపజీవ్యగ్రంథములు: (1) శ్రీయతిరాజస్వామి సంస్కృతపీఠిక. (2) మహామహోపాధ్యాయ, సాహిత్యాచార్య రామావతారశర్మ (M. A.) మహోదయులు "సుధ" యనుహిందీమాసపత్త్రికయొక్క 'సాహిత్యాంకము'లో 'శృంగారరసము' అను శీర్షికతో వ్రాసినవ్యాసరాజము. ఆగష్టు 1928.]

14 చిత్రలేఖ.

15 ఛలితరాఘవము. [ఛలితరామమని సరస్వతీకంఠాభరణములోఁ గలదు.]

16 తాపసవత్సరాజము. [శ్రీ యతిరాజస్వామిచేఁ బ్రకటితము. సరస్వతీకంఠాభరణోట్టంకితము.]

17 త్రైలోక్యసుందరి.

18 దమయంతి

19 దేవీచన్ద్రగుప్తము.

20 పార్థవిజయము. [పై నుదాహరించిన 'జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రిసెర్చి' II సం. 3, 4 సంచికలలో దీనిం గూర్చిన వ్యాసము గనునది.]

21 పుల్లసకము.

22 బృన్దావనము.

23 బృహత్కథ.

24 భీమకుల్య.

25 మత్స్యహసితము.

26 మలయవతి.

27 మదాలసాఖ్యాయిక.

28 మాధవిక.

29 మారీచవధ.

30 మాలతిక.

31 ముకుటతాడితకము. [దీనిం గూర్చిన నా వ్యాసమును మార్చి 1930 భారతిలోఁ గాంచునది.]

32 రతివిలాసము.

33 రామచరితము.

34 రామాభ్యుదయము [దీనింగూర్చిన వ్యాసము పైనుదాహరించిన 'మద్రపురప్రాచ్యసాహిత్యపరిశోధకపత్రిక' III సం. 3 సంచిక. 1929 లోఁగనునది.]

35 రాఘవానందము.

36 రామాయణము.

37 రావణవధ.

38 లక్ష్మీస్వయంవరము.

39 లీలావతి.

40 విక్రాన్తశూద్రకము. [సరస్వతీకంఠాభరణమునఁ గూడ నుద్ధృతము.]

41 వినయవతీశూద్రకము.

42 శకుంతిక.

43 శఙ్ఖాదిశఖోపయమము.

44 శూద్రకకథ.

45 స్వప్నవాసవదత్తము.

46 స్వయంప్రభ.

47 సుభద్రాహరణము.

48 హయగ్రీవవధ. [దీనింగూర్చిన నా వ్యాసమును ముందు ప్రకటించెదను]

49 హరవిలాసము. [దీనింగూర్చిన నా వ్యాసమును ఉగాదిసంచికలోఁ జూచునది. 1930.31 సం.]

50 హరివంశము.

51 హరివిజయము.

52 హరిశ్చంద్రచరితము.

(4) గ్రంథకర్తృత్వవిచారము:-ప్రకృతము ప్రచురింపఁబడుచున్న 'శృంగారప్రకాశము' భోజునిదే యనుసిద్ధాంతమును నిర్వివాదముగఁ బ్రతిపాదింపఁ

దగును. సంస్కృతపీఠికలో నొసఁగఁబడిన యాయా ప్రకాశముల యాద్యంత భాగములలో నీవిషయమై యనేకములగు నుపపత్తులు లభించుచున్నవి. భోజుని 'శృంగార ప్రకాశము'లోని వవి ధర్మసూరి 'సాహిత్యరత్నాకరము'న [334 పు. తెలుఁగు ప్రతి] నుట్టంకించుకొనిన 'శృంగారవీర కరుణాద్భుతహాస్యరౌద్ర', 'వీరాద్భుతాదిషురసేషు' అను రెండు శ్లోకములును 'శృంగార ప్రకాశము'నఁ [I ప్రకాశము] కృత్యాదిశ్లోకములలోని 6, 7 శ్లోకములే యని యెఱుంగునది. తనకృతికి సాహిత్య ప్రపంచమున నమరత్వము సిద్ధించుచుగాక యని భోజుఁడు రచించిన—

"శ్లో. యావ న్మూర్ధ్ని హిమాంశుకందలధృతి ర్వ్యాహినీ ధూర్జటే
ర్యావ ద్వక్షసి కౌస్తుభస్తబకితే లక్ష్మీ ర్మురద్వేషిణః
యావ చ్చిత్తభువ స్త్రిలోకవిజయప్రౌఢం ధనుః కౌసుమం
భూయా త్తావ దియం కృతిః కృతధియాం కర్ణావతంసోత్పలమ్."

అనుశ్లోకము భోజుని 'సరస్వతీకంఠాభరణము' [నిర్ణయసాగర ప్రచురణము. 648 పు]నఁ గూడ నుపసంహారశ్లోకముగాఁ గాననయ్యెడిని. రసపక్షవాదమును భోజుఁడు సూత్రప్రాయముగా 'సరస్వతీకంఠాభరణము'నందలియీ క్రిందిశ్లోకమున నుడివియున్నాఁడు:

"శ్లో. రసోఽభిమానోఽహంకారః శృఙ్గార ఇతి గీయతే
యోఽర్థ స్తస్యాన్వయా త్కావ్యం కమనీయత్వ మశ్నుతే."

[—V పరి. రసవివేచనము. 1 శ్లో. 474 పు.]

ఈయర్థమునే 'శృంగార ప్రకాశము'నందలి యీ క్రిందిశ్లోకములో భోజదేవుఁడు నుడివియున్నాఁడు:—

శ్లో. అప్రాతికూలికతయా మనసో ముదా దే
ర్య స్సంవిదోఽనుభవహేతు రిహాభిమానః
జ్ఞేయో రసః సరసనీయతయాత్మశక్తే
రత్యాదిభూమని పున ర్వితథా రసోక్తిః" —శృం. ప్ర. I ప్ర. 8 శ్లో.

ఈరెండు గ్రంథములలోనిగద్యములును సమానముగానే యున్నయవి. "సరస్వతీకంఠాభరణము"లో నీతఁడు సరసము విరసము నగువాక్యముల నిట్లు చమత్కారముగాఁ దెల్పియున్నాఁడు.

శ్లో. పశ్యతి శ్రీర్ఇతి వాక్యే హి నరసః ప్రతిభాసతే
విలోకయతి కాన్తే తి వ్యక్తమేవ ప్రతీయతే "—స. కం. V పరి 4 శ్లో.

సాహిత్యపాథోనిధిని మథించిన వాఁడగుటఁ జేసి 'సరస్వతీకంఠాభరణము' నందు వలెనే "శృంగారప్రకాశము"నఁ గూడ భోజుఁడు తనలక్షణముల కనేక కావ్యరత్నములనుండి లక్ష్యముల నన్వేషించియున్నాఁడు. అపార కావ్యరత్నాకరమునుండి యీతఁడు "సరస్వతీకంఠాభరణము"న 1500 శ్లోకరత్నములను 'శృంగారప్రకాశము'న నింపుమించు 16000 శ్లోకరత్నములను సంగ్రథనము చేసెను. 'కవీన్ద్రవచనసముచ్చయము,' వల్లభదేవుని 'సుభాషితావళి' శార్ఙ్గధరుని 'శార్ఙ్గధరపద్ధతి'-శ్రీధరదాసుని 'సదుక్తికర్ణామృతము' మొదలగు ప్రాచీన సుభాషిత సుధానిధులవలెనే భోజుని యలంకారకృతి ద్వయము సారస్వతపరిశోధకులకుఁ, కవితాపిపాసువులకుఁ గూడ నత్యంత చేతోమోదమునొనగూర్చుచుండును. భోజుఁడు లక్ష్యముం జూపకుండ నొక్క విషయమునైన వక్కాణింపఁడు.

(౫) భోజునిశయ్య:—'శృంగారప్రకాశము'న భోజునిచే రచింపఁబడిన శ్లోకములు స్వల్పసంఖ్యాకములు మాత్రమే కలవు. ప్రమాణశ్లోకములు, లక్ష్యశ్లోకములు నగు నాకరములు దక్క మిగిలినగ్రంథ మంతయు గద్యమయమే. భోజుని గ్రంథములయందును, నాఁటి కావ్యవాఙ్మయమునను సామాన్యముగాఁ గానవచ్చు భావభాషాసమావేశకౌశలము, సౌకుమార్యమును "శృంగారప్రకాశము"నందలి భోజుని శ్లోకములందుఁ గానవచ్చుచున్నది. గద్యభాగముల శయ్య పద్యభాగముల శయ్య కణుమాత్రమును దీసిపోదు. శబ్దార్థములు రెండును మహోదార్యవిలసితములు. ఉదా:—

"శ్లో. అమ్నాసిషు ర్ధశరసా న్నుధియో వయంతు
శృఙ్గార మేవ రసనా ద్రస మామనామః"—శృం. ప్ర. I ప్ర 6 శ్లో.

"వీరాదయో మిథ్యారసప్రవాదాః శృఙ్గార ఏకైక శ్చతత్పునః శబ్దార్థయో స్సాహిత్యమామనన్తి".—శృం. ప్ర. I ప్ర. [పీఠిక VII—VIII పు]

రసము చిప్పిలునట్టి లఘుకావ్యములు [Lyrics] సంస్కృతకవీన్ద్రులకంటెఁ బూర్వమే హాలసాతవాహనుఁడు [గాథాసప్తశతి] మొదలగు ప్రాకృత కవులు విశేషముగా రచించియుండిరి. భోజుని కాలమునకు [క్రీ. శ. 11వ శతాబ్ది] సంస్కృతప్రాకృతములరెంటియందును, ఈరసగీతవాఙ్మయము[Lyrical

Literature] విశేషముగా నభివృద్ధినొందినయది. అట్టియెడల భోజుఁడు కావ్యనిర్మాతలను, గావ్యపరిశోధకులను రసికులు నగునాలఙ్కారికుల నొకపరిషత్తుగా సమావేశ మొనరించి, సంస్కృతప్రాకృతకవితారత్నాకరణమునుండి యించుక స్థూలములు నమూల్యములు నగుశ్లోకరత్నముల సుభాషితసర్వస్వ మనఁ దగు సంధానగ్రంథముగాఁ గ్రోడీకరింపించి యుండును. కవి గానివాఁడు ధారానగరమున నుండరా దని భోజునియనుశాసనమఁట. కవితాదేవత తాండవ మొనరించునట్టి భోజుని ప్రసన్నవదనాంభోజమునొక్కసారియైన నవలోకించుభాగ్యమబ్బెనేని నిరక్షరకుక్షికిని సద్యఃకవితాప్రాప్తి కల్గుచుండెడిదఁట * అట్టి మహానీయుఁ డగుభోజుఁడు దక్ష, పరత్వతవిషయమున నిక్షిప్తమున కార్యమునకు నను మఁకట్ట నర్హతరు లేక నెవ్వ రుందురు? భోజుని ప్రతికృతియుఁ దన్నిర్మిత మగు [250 చదరపుమైళ్ళకంటె నెక్కువవైశాల్యముగల] విశాలసరోవరరాజమువలెనే సజీవమై సారగర్భమై సౌందర్యసంపన్నమై యలరారుచుండును. తనకుఁ బిమ్మటఁ గావ్యకుసుమావళి నాస్వాదింప నుత్కంఠగొను రసికాళికి మహోపకారకముగ భోజుఁడు ప్రాక్తనప్రాకృతసంస్కృతకవితోద్యానము నన్వేషించి, సజీవమును, సారవంతమును, నమరత్వప్రసాదకము నగుకవితామృతమును 'శృంగారప్రకాశ'మను నీకృతిభాజనమున సంగ్రహించియున్నాఁడు. ఈకృతినిర్మాణావసరమున భోజున కిట్టియభిప్రాయమే యుండియుండు నని యీగ్రంథమును బరిశీలించుబోద్ధలకుఁ దెలియకపోదు.

(6) భోజునిప్రాకృతకవితాదరణము :—భోజుఁడును, దదనుయాయులును సంస్కృతకవితాసుధాస్వాదనముతోడనే తృప్తినంది యుండలేదు. అతిరుచ్యకవితాసుధామయ మగుప్రాకృతసారస్వతమధుకోశముం గూడ వీరన్వేషించి యందలియమృతముం గూడ 'శృం. ప్ర.' అను నీకృతిపాత్రమున సంగ్రహించియుండిరి.

భోజుఁడు ప్రామాణికుఁ డగునాలంకారికుఁడే కాక శబ్దశాస్త్రనిష్ణాతుఁడని 'శృం. ప్ర.' లోని మొదటి యెనిమిదిప్రకాశములవలనను, దన్నిర్మితమగు 'సరస్వతీకంఠాభరణ'మను (స్వతంత్రవ్యాకరణగ్రంథము)వలనను విశద మగుచున్నయది. ఈతఁడు ప్రాకృతసారస్వతసాగరమునఁగూడ నోలలాడిన ప్రథితప్రజ్ఞుఁడు. 'శృంగారప్రకాశము'న సంస్కృతశ్లోకములకంటెఁ బ్రాకృతగాథలే

---

* సాలభంజికలిచ్చిన వరమువలననఁట.

ప్రచురముగా నుట్టంకింపఁబడియున్నయవి. భోజునకు సంస్కృతశ్లోకములకంటెఁ బ్రాకృతగాథలే యెక్కుడు ప్రహర్షహేతువులగునట్టులు తోఁచెడివి. ఇందువలన నాఁడు ప్రాకృతకావ్యములు సార్వజనీనములై విలసిల్లుచుండెడి వని తెలియుచున్నది. సంస్కృతకృతికల్పనముకంటెఁ బ్రాకృతకావ్యరచనమే నాఁడు విశేషాదరణీయముగా నుండియుండును. కాని యీ ప్రాకృతకవితాకల్పకములు గూలంకష కాలప్రవాహముచే నిర్మూలింపఁబడియుండును. హాలసాతవాహనుని 'సప్తశతి' రాజశేఖరుని 'కర్పూరమంజరీ'సట్టకము, వాక్పతియొక్క 'గౌఢవధ' మొదలగునుత్కృష్టకావ్యములు ప్రాకృతమున స్వల్పసంఖ్యాకములు మాత్రమే మనకు సుపరిచితములై యున్నయవి. బాలకవియుఁ, గవిరాజు నగురాజశేఖరునకు నాతనిభార్య యగు 'అవన్తిసుందరీ'విదుషీమణికిని బ్రాకృతకవన మన విశేషాదరము గలదు. తనసతీతోషణమునకే యితఁడు 'కర్పూరమంజరి'ని నిర్మించియున్నాఁడు. అవన్తిసుందరి యలంకారశాస్త్రమునందే కాక ప్రాకృతగాథారచనమునను నందెవేసినచేయి. ఈమె రచించినప్రాకృతగాథలు హేమచంద్రుని 'దేశీనామమాల'లో నుల్లేఖింపఁబడియున్నవి. ఈవిషయములం జూడ నాఁడు ప్రాకృతకవితకుఁ గలయాదరము విశద మగును. ప్రాకృతవైశిష్ట్యమును రాజశేఖరుఁ డిట్టు లభివర్ణించియున్నాఁడు.

(i) ఛాయ:—"అర్థనివేశా స్త ఏవశబ్దా స్త ఏవ పరిణమన్తోఽపి
ఉక్తివిశేషః కావ్యం భాషాయా భవతి సా భవతు."

(ii) "పరుషాః సంస్కృతగుమ్ఫాః ప్రాకృతగుమ్ఫోఽపి భవతి సుకుమారః॥ పురుషమహిలానాం యావ దిహాన్తరం తేషు తావత్"

కర్పూరమంజరి. I.—7, 8 శ్లో.

వాక్పతిరాజుకూడ 'గౌడవహో'లోఁ బ్రాకృతప్రాశస్త్యము నిట్టులు వ్రాసియున్నాఁడు.

(iii) "ఛాయ:— నవ మర్థదర్శనం సంనివేశశిశిరాబన్ధర్ద్ధయః
అవిరళమేతద్ ఆభువనబన్ధ మిహ కేవలం ప్రాకృతే"-గౌడవధ-౯౨ శ్లో.

(iv) "సకలా ఏతత్ ప్రాకృతం వాచో విశన్తీవ
ఇతశ్చ ప్రాకృతా ద్వినిర్గచ్ఛన్తి వాచః ఆగచ్ఛన్తి సముద్రమేవ
నిర్యాన్తి సాగరాదేవ జలాని"—అదే ౯౩ శ్లో.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy·)

సంపుటము. ౨౨ { శ్రీముఖనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.





కాకినాడ:
కొత్తపల్లి సూర్యారావుచే పరిషత్కార్యాలయమున
ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు. ౦-౮-౦.

1934

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౨. { శ్రీముఖనామసంవత్సరము మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.

## న్ను, మ్ము, లాగమములా? లేక యాదేశములా?

(ఉ. ప్ర. అయలసోమయాజుల నరసింహశర్మగారు, కలవరాయి.)

"నా" అను ప్రాతిపదికకు ద్వితీయావిభక్తి వివక్షయం దేకవచనబహువచనములందు "అమ్" "శస్" అను ప్రత్యయములు రాఁగా "న్ను, మ్ము, హ్రస్వశ్చాదే రమిశశిచ" అనుచిన్తామణిసూత్రము ననుసరించి యేకవచన బహువచనములందు వరుసగ "న్ను, మ్ము" అనునవి రాఁగా-

"తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తేః । కించిత్ప్రశంసనాద్యుత సన్తాపయదాతదాకిమేవాంశ్చ, క్త్వాకిలతుమ్షష్ఠీ మాద్యానభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్" అను సూత్రనియమమువలన ద్రుతము చేరఁగా "న్ను, మ్మూ, హ్రస్వశ్చాదే రమిశసిచ" అను సూత్రముచేతనే "నా" అనుచో హ్రస్వమును "ఏతయో ర్బహుత్వే మః" అను సూత్రముచే బహువచనమున మాదేశమును రాఁగా నన్నును మమ్మును అనురూపములు సిద్ధించుచున్న వని చిన్తామణిప్రణాళికయుఁ దద్వ్యాఖ్యలును దెలుపుచున్నవి.

కొందఱు "న్నుమ్మూ హ్రస్వశ్చాదే రమిశసిచ"అనుసూత్రమునకు "అమి

శసి చ పరే న్న మ్మా వేతౌ స్తః" అని వ్యాఖ్యానము చేసికొని న్ను మ్ము లాదేశములు కావనియు నాగమములనియు వ్రాయుచున్నారు.

అనఁగా నాప్రాతిపదికకు ద్వితీయావిభక్తియందు "సుఔజస్" అను మొదలగు సంస్కృతమర్యాద ననుసరించి అమ్, శస్, లు రాఁగా వానికిఁ బూర్వమున న్నుమ్ము లాగమములుగా నుహ్రస్వగానఁ రాఁగా న + న్ను + అమ్, న + మ్ము + శస్ అనురూపములు సిద్ధించు ననియు కాఁగా "సుపదాన్యవ్యయసు ప్లిజ్ క్త్వాతుమునా మనుకృత్తేస్తి వాక్యాంతు" అనుసూత్రనియమముచే అమ్ శస్ అనునవి లోపించు ననియుఁ దరువాత, ఏకవచనమున 'కూప్ఛేలనున యోర్భవే ద్వితీయాతు' అనుసూత్రముచే ద్వితీయావిభక్తి ప్రత్యయ మగు ను రాఁగా త్రిజధ్యేత్యాదిసూత్రముచే ద్రుతాంతత్వము సిద్ధించును— కాఁగా, ఏకవచనమున నన్ను నను అనురూపము సిద్ధించును. బహువచనమున "లుజసోలశసోలాన్తాత్" అనుసూత్రముచే ల సిద్ధించు చుండఁగా "భూయ ఉభయార్థవాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః తస్య జసో ము శసోలః" అను సూత్రముచే శస్సునకు, తిరిగి "ల" అను ప్రత్యయము విధించుట వ్యర్థమయి యీశబ్దమునకు 'ల' అనుప్రత్యయము రా దని తెలుపు చున్నది. అక్కతమున శస్నకేమియు నాదేశము రామింజేసి "సుపదా న్యవ్యయ" అను సూత్రనియమము ననుసరించి శస్సునకుఁ దెనుఁగునఁ బ్రవేశము లేమిచే లోపించు ననియుఁ దరువాత "త్రిజధ్యే" త్యాదిసూత్రముచే ద్రుతాంతము కాఁగా మమ్మును అనురూపము సిద్ధించు ననియు వీరియాశయము. భారతమున నన్నయభాగమున మమ్మును అనురూపములకే ప్రయోగము గాని మమ్ములను అనురూపములకుఁ బ్రయోగము లేమి వాస్తవము. ఉభయపక్షములువా రంగీకరించినవిషయముకాన జ్ఞాపనసిద్ధానితవిషయము, కాని, ఇందు న్ను, మ్ము, లాగమములు, అని బ్రహ్మశ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రి గారు చిన్తామణి పరిశోధనమున వ్రాసియున్నారు. ఆదేశము లని ప్రాచీనులయాశయము. ఇం దెయ్యది రమ్యమును వైయాకరణసమ్మతమును, చిన్తామణియభిప్రాయమో తెలుపుటయే యీ నావ్యాసాభిప్రాయము.

ఈ రెండుపక్షములలోను నాగమము లనువారు- అమి, శసి, అని విభక్తిభేద ముండుటయే యాదేశములు కా వనుటకు ముఖ్యాధారము. "తస్మి న్నితి నిర్దిష్టే పూర్వస్య" అనుసూత్రము వీరివాదమును దృఢపఱుచుచున్నది.

ద్రుతాగమము ప్రత్యయమునకుఁ గాని ప్రకృతికి లేదు గదా! కాన "న్ను" అనునది ప్రత్యయ మనవలయును. కాఁగా నాదేశము కాదన్న "న్ను" అను దానికిఁ బ్రత్యయత్వము లేదు. చూపుఁడు-ఆగమమాత్రక మైన నకారమునకు నన్నును, నాచేతను, చదువుచున్నాను, చదువుదును.

కాఁగా "న్ను" ప్రత్యయము (ఆదేశము) అనకతప్పదు. ఇంతియకాక, నన్నునడిగె, మొదలగు నాగమపక్షసాధ్యబాధకములకుఁ బ్రయోగము లేమియుఁ బైయంశమునే నిరూపించుచున్నవి.

ఆదేశపక్షము విభక్తిభేదముచే, చిన్తామణియు నన్యవ్యాకరణములు నన్వయము నంగీకరించుటఁ జేసియు, చిన్తామణిప్రణాలి సమకూల మగుటఁ జేసియుఁ దెనుఁగువైయాకరణసమ్మత మగుటఁ జేసియు గ్రాహ్యమైన దనియుఁ బ్రయోగవిరుద్ధ మగుటఁ జేసియుఁ గ్లిష్టకల్పనయగుటఁ జేసియు, లాఘవము లేమిఁ జేసియుఁ దెనుఁగువైయాకరణులకు విరుద్ధ మగుటఁ జేసియు నాగమపక్ష మయుక్తమనియు నాయాశయము.

గుణగణగ్రాహు లగుపాఠకులు తప్పులున్న సైరించి నా కేరీతినైనఁ దెలియఁబఱుప వేఁడికోలు.

---

# అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రము.

ఓకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ., ఎల్. టి., రాజమహేంద్రవరము.

అల్లసాని పెద్దనార్యునిగుఱించి యు నాతనిసుప్రసిద్ధగ్రంథ మగుమనుచరిత్రను గుఱించి యుఁ జాలమంది విద్యాధికులును పండితులును విమర్శించి యే యున్నారు. గ్రంథవిమర్శనమునకు నాధునికపద్ధతులలోఁ బ్రారంభించినది లగాయితు పెద్దనమనుచరిత్రయు దానికిఁ బోటీగా రామరాజభూషణునివసుచరిత్రయు గ్రంథవిమర్శకులదృష్టిని నాకర్షించియే యున్నవి. శ్రీ వెన్నేటి రామచంద్రరావు B. A., B. L., గారు "మనువసుచరిత్ర రచనావిమర్శనము"ను నొక మేలైన విమర్శనమును 1899 సం॥రములోఁ బ్రకటించియున్నారు. విమర్శకాగ్రేసరులగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులుగారు 'మనువసుప్రకాశిక' యనునొకచక్కనివిమర్శనము నుపోద్ఘాతముగ 1902 సం॥లో రచించి దానినే తిరిగియాంధ్రపరిషత్పత్రికలో ఆ 1922 సం॥లో "అల్లసానిపెద్దనార్యకవిత్వతత్త్వము"నొకవ్యాసరూపమునఁ గ్రోడీకరించి సంపూర్ణముగను సంక్షేపముగను మనుచరిత్రమునుగుఱించి వారియభిప్రాయములను జెప్పిరి.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మనుచరిత్రకుఁ జక్కని పీఠిక వ్రాసియున్నారు ఇంక వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, కేతవరపు వేంకటశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు మున్నగువారు తమగ్రంథములలో మనుచరిత్రను గుఱించి యానుషంగికముగ రచించిరి. ఇట్లీ కవివరునికావ్యవిషయ మాంధ్రలోకమునఁ జిరపరిచితమై యున్నది.

పైనఁ జేర్కొనిన విద్వాంసుల విమర్శనములను గొంతవఱకుఁ జదివితిని. శ్రీ॥ వె॥ రామచంద్రరావుగారు మనుచరిత్రను జక్కగా విమర్శించుచు వసుచరిత్రమునందలి కించిల్లోపముల నతిమాత్రముగ నుగ్గడించినకతన శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు పైవిమర్శనకుఁ బ్రతివిమర్శనముగ మనుచరిత్రములోని దోషలేశముల విస్తరించి వ్రాసిరి. వీరిద్దఱొకవిధముగ విమర్శనద్వంద్వయుద్ధముఁ జేసిరని చెప్పవచ్చును. కాని రామచంద్రరావుగారెచ్చటను కోపావేశమున మృదుత్వము తప్పి పరసోక్తుల దూషింపలేదు. బ్రహ్మయ్యశాస్త్రిగారన్ననో

విమర్శకున కుండవలసిన శాంతచిత్తతయు, నిష్పక్షపాతబుద్ధియు నిడనాడి కేవలము పురోభాగి దృష్టిని రంధ్రాన్వేషణమే ముఖ్యకర్తవ్యముగ నెంచిరో యనుసంశయము పొడమునట్లు నిజమైన స్వల్పలోపములఁ బెంచియు, ననేకములగు నపోహములు, నపార్థములు, నపవాదములుఁ గల్పించియుఁ దమవిమర్శనాచాతుర్యమున నొక్క విపరీతవిమర్శనము గావించికొనిరి. వీరి వ్యాసమును సావధానముగఁ జూడఁగ నాకు నెన్నఁడో వినిన యొకచిన్నిచరిత్రకథ జ్ఞప్తికి వచ్చినది.

'అరిస్టైడీసు' అను గ్రీకుమహాపురుషుఁ డతిన్యాయశీలుఁ డగుటచే న్యాయమూర్తి యని పిలువఁబడుచుండెడివాఁడఁట (Aristides the just) కొండొకకాలమున కీన్యాయమూర్తిని దేశమునుండి వెడలఁగొట్టుట కాతనిశత్రువులు ప్రయత్నించి, యతనిపై నొకయభియోగముఁ దెచ్చి ప్రజానుమోదముఁ బడయుటకై యెన్నికలు గావించిరి. అపు డొకచదువురాని పౌరుఁడు తన 'యెన్నికచీటి' (vote) మీఁదఁ బేరువ్రాయలేక తనదగ్గఱఁ గూర్చుండియున్న పురుషునిఁ జూచి "అయ్యా! దీనిపై నారిస్టైడీసు పేరువ్రాయుఁడ"ని కోరెను. అంత నాపురుషుఁడు "ఏమయ్యా! అరిస్టైడీసును బహిష్కరింపుచున్నావు. అతఁడునీ కేమి యొగ్గొనరించెను?" అన నాపౌరుఁడు "అయ్యా! ఆతఁడు నాకేమియు నపకారముఁ జేసి యుండలేదు. కాని సమస్తజనులు నాతని 'న్యాయమూర్తి' యని పిలుచుచుండుటచే నాకొకవిధమైన విసుగును, నసూయయుఁ గలిగినవి. అందుచే నాతని బహిష్కరింపఁదలఁచితి" ననియెను. ఆపురుషుఁడే 'అరిస్టైడీసు' అని యాపౌరునికిఁ దెలియదు. అప్పుడు అరిస్టైడీసు చీటినిఁ దీసికొని తన పేరు దానిపై వ్రాసి పౌరున కిచ్చివేసెను.

బ్రహ్మయ్యశాస్త్రిగారివిమర్శన మీమాదిరిగా నుండనోపును! 'ఆంధ్రప్రపంచమంతయు ననేకవిధములఁ బెద్దనార్యుని మహత్తరకావ్యము నుగ్గడింప, వీరికి విసుపు గలిగి యొకవిలక్షణమైన విమర్శనవ్యాసమును వ్రాయనెంచిరా యనుసందేహము గలుగుచున్నది. లేనియెడల విమర్శకాగ్రేసర బిరుదాంకితులు, సునిశితమేధావంతులు, నాంధ్రగీర్వాణభాషాకోవిదులు, సూక్ష్మగ్రహణపారీణులు నగుశ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారిట్టిజుగుప్సాకర మగుకార్యముఁ జేయుట కెట్లు గడఁగిరో తెలియకున్నది.

ఇప్పటివఱకు నితరులు వ్రాసిన విమర్శనలం బరామర్శించి వారివాదములను సిద్ధాంతములను ప్రత్యేకముగం బ్రతిఘటించి వారివిమర్శనములకుం బ్రతివిమర్శనములను రచియించి ద్వంద్వయుద్ధము సేయు నభ్యాసముం గలవాఁడను గాను. మఱందైన నట్టిసేవ్య కలిగింపకొనుట కుద్దేశము గూడ లేదు. అట్లైనచో బ్రహ్మయ్యశాస్త్రిగారివిమర్శనముం బ్రత్యేకముగాం బరిశీలించి తప్పొప్పులను విమర్శించుట కవసరమే మున్న? నేను పైనసూచించినట్లు శ్రీశాస్త్రిగారు వారియపారశేముషీవైభవమును బెద్దనార్యునియందు లోపములను గనిపెట్టుటకును గల్పించుటకును వినియోగించి, గోరంతలు కొండంతలు చేసియు నపార్థములం గల్పించియు, నపవాదబాహుళ్యమున రోఁత గలుగునటులు ప్రేరేపించియు ననేకవిధముల నిష్పాక్షికబుద్ధివిడనాడి యన్యాయమగువిమర్శనముం గావించిరి. కావున నేతత్ప్రతివిమర్శనకార్యమున నేను బూనుకొనవలసి వచ్చినది. సుహృదయులు మన్నింతురుగాక!

శ్రీశాస్త్రిగారి విమర్శనము నాల్గుశీర్షికల క్రింద విభజింపవచ్చును.

i. కథాసంవిధానము, ii. రసము, నీతి. iii. పాత్రపోషణము. iv. శైలి.

i. కథాసంవిధానము:—మనుచరిత్రమునందలి కథాసంవిధానము గుఱించి శ్రీశాస్త్రిగారు వ్రాసినవిషయములు. "స్వారోచిషమనుసంభవము రససమంచితకథల నొప్పునది గానఁ దనరచన కనుకూలమఁట. 'సహజముగ రససమంచితత్వము గలకథ లేవో యెంచికొని వానిని దనరచనలోఁ బెట్టి రసము పుట్టించు సామర్థ్యము తనలో నంతగ లేదు." ఈవిధముగాఁ బెద్దనార్యునికథాసంవిధానముంగూర్చి శ్రీశాస్త్రిగారు వ్రాసిరి. మనుచరిత్రకథ నెంచికొనుటలోఁ బెద్దనార్యుని కెంతమాత్రము నధికారము లేదనియు, నాపనిని శ్రీకృష్ణదేవరాయలవారే చేసి పెద్దన్నను బ్రబంధము రచియింపుఁడని యాజ్ఞాపించిరనియు మనుచరిత్రము జాగ్రత్తగాఁ జదివినవారికి స్పష్టమగును. అది యట్లుండ నీవాదమెంత నీరసముగా, నెంత విపరీతముగా నున్నదో యోజింపుఁడు. మహాకవులు రసవంతమైన కథల వెదకికొని కావ్యములు రచియించుటకుఁ గారణము వారు రసహీనము లగుకథలను రసవంతములుగఁ జేయ లేక పోవుటయే యని శ్రీశాస్త్రిగారి మతము. కాళిదాసు, భవభూతి, షేక్సుపియరు, మిల్టను మున్నగుమహాకవులు శ్రీశాస్త్రిగారిమాటలు వినినచోఁ దలలు వంచుకొని సిగ్గుపడవలసినదే! ఏలయన నీమహాకవులందఱు రసవత్తరమైన కథలనే వెదకి వానిని నాటకము

లుగాఁ గాని ప్రబంధములుగాఁ గాని వ్రాసినవారే. వీరిపనివంటిపనిని శ్రీ శాస్త్రులుగారు నిరసించుట చాల నాశ్చర్యముగ నున్నది. ప్రపంచములో ధనికులును దరిద్రులును జక్కనిపిల్లలను వెదకి వివాహములు చేసికొందురు. శ్రీ శాస్త్రిగారు చెప్పినకారణ మే మనఁగా వారు కురూపులగు పిల్లలకు నగలు నాణెములు పెట్టి దృష్టి కింపుగాఁ జేయలేరు గాన సహజసౌందర్యముగల పిల్లలనే వెదకి పెండ్లియాడుచున్నా రని. ఈవాదము గుఱించి యింతకంటె నెక్కువగ వ్రాయనక్కఱ లేదు. కేవలము జ్ఞానశూన్యుఁడు గాని యేమనుజుఁ డైనను శ్రీ శాస్త్రిగారివాదము నంగీకరింపఁ డని నొక్కి వక్కాణింపవచ్చును.

ఇఁకఁ బెద్దనార్యుఁడు చేతగానివాఁడై రససముచితకథలతో నొప్పారు స్వారోచిషమనుసంభవ మనుకథను గ్రహించి ప్రబంధము రచింపఁబూనెను. కాని "మూలమునందున్న కథనైనను సందర్భశుద్ధిగఁ జెప్పలేక పోయినాఁడు." ఇది శాస్త్రిగారి యభిప్రాయము. దీనికి వారిచ్చిన హేతువులు.

కుతపకాలము - మధ్యాహ్నము. ప్రవరునియింటఁ గుతపకాలమున-అనఁగా, పదునొకొండు-పండ్రెండుగంటలమధ్యను- ఒకయోగసిద్ధుఁడు వచ్చి యాతిథ్యము నొందె నని కాన్పించుచున్నది. భోజనానంతరమునఁ గొంతసేపు ప్రసంగములు జరిపి, సిద్ధునిచేఁ బాదలేపముఁ బొంది ప్రవరుఁడు హిమగిరికిఁ బోయి, యచ్చటఁ జోద్యములు చూచి మధ్యాహ్న మైనట్లు కనిపెట్టినాఁ డని గ్రంథమందున్నది. కుతపకాలమునకు మధ్యాహ్నమునకు నడుమ నిన్నిపనులు జరుగునా? కావునఁ బెద్దన్న కాలనిర్ణయములోఁ బొరపడె నని కొందఱును, లే దని కొందఱును, వాదోపవాదములు జరుపుచున్నారు. శ్రీ శాస్త్రిగా రెదిరివాదముల నన్నింటిని ఖండించి పెద్దన్న యసందర్భము చేసె నని స్థాపించిరి. ఈవాదప్రతివాదముల బుద్ధిచాతుర్యముతో నాకుఁ బని లేదు. ఈకుతపకాలవిషయము పెద్దన్నగ్రంథ మం దొకకళంకముగాఁ జెప్పనంతటి గొప్ప విషయమా! ఇది యీమహాప్రబంధమునం దొక తృణలేశముకన్న నల్పతరమైన యంశము గాదా? దీనినిగూర్చి మనుచరిత్రవిమర్శకు లందఱు మహాబుద్ధిశాలు లెంతెంత ప్రయాసములఁ బొందిరో చూడఁజూడఁ జోద్యముగ నున్నది. ఇది యొక ప్రమాదము. అంతగాఁ బ్రజ్ఞాలోపముఁ దెల్పునది గాద"ని చెప్పి శ్రీ శాస్త్రిగారే యౌదార్యముఁ గనుపఱిచిరి.

11 కలి యనుగంధర్వునికథ:—ఈకథను మనుచరిత్రమునఁ బెద్దన్న

సరిగా నతుక లేదని శ్రీ శాస్త్రిగారి యభిప్రాయము. "ఏగంధర్వుఁడు తద్విలాసముల మున్నీక్షించి తా నెంతయుఁ రాగాంధుం డయి" అని యీగంధర్వుని గూర్చిహఠాత్తుగ నెత్తికొనినాఁడఁట. కాని యతని పేరు, నాతనిపూర్వవృత్తాంతము, వరూథినికిని నతనికిని నడివఱలో జరిగిన మోహాతిరస్కార మిత్యాదివిషయములు కథారూపముగఁ జెప్పఁబడ లేదఁట! ఇది యొకయసందర్భ మఁట!

వరూథినీ ప్రవర సంవాదము సంపూర్ణముగ వర్ణించి, ప్రవరుఁడు వరూథినియొక్క కాముకప్రయత్నముల నన్నింటి నుల్లంఘించి యామెను వీడి పోయె నని చెప్పి తమపరి కథను సాగించుటలో ముఖ్యముగ మఱియొకఁడు ప్రవర వేషము దాల్చి వచ్చి వరూథినిదృష్టి నాకర్షించెననియు, నామె యాతఁడు ప్రవరుఁడే యని భ్రమపడి యాతనితో భోగించె ననియుఁ దత్కారణమున స్వరోచిపుట్టె ననియుఁ జెప్పుటయె ముఖ్యవిషయ మగును. కాని యామాయాప్రవరుని పూర్వవృత్తాంత మంత యుఁ జెప్పుట యంత ముఖ్యము గాదు. పూర్వోత్తరసందర్భములనుఁ గథాప్రణాళికకొలఁదిఁ గొంచెము సూచించినఁజాలును, మాయాప్రవరుఁడు కేవలము క్రొత్తపురుషుఁడు కాఁడని యుఁ బూర్వము వరూథినిని వరించిన యొకగంధర్వుఁ డనియుఁ గవి యొకపద్యములోఁ జెప్పవలసిన దంతయుఁ గ్లుప్తముగఁ జెప్పినాఁడు. అంతఃకథను బెంచి ముఖ్యకథకంతరాయము గలుగఁజేయకుండుట కథాసంవిధానమున నొక గుణవిశేష మైయుండనోపు!

'కలి'యనుగంధర్వుని పేరెత్తకపోవుట యేల యని శ్రీశాస్త్రిగారు ప్రశ్నించిరి. దాని కొకకారణము నాకు స్ఫురించుచున్నది. సహృదయు లరయుదురుగాక! 'కలి' యను పే రంతమనోహర మైనది కాదు. ఈనామము సమస్తదుర్గుణసమూహసూచకము. ఈపేరిటివాఁడు స్వరోచికిఁదండ్రి యయ్యె నని చెప్పిన నగౌరవముగ నుండ నోపు నని తలఁచి కవి పే రిడ మానెనేమో! మఱియొకచిన్నసూచన, ప్రారంభములో నీస్వారోచిషమనుసంభవకథను ప్రబంధముగ రచియింపవలయు నని శ్రీకృష్ణదేవరాయలు కోరినప్పు డాచక్రవర్తి చెప్పిన ట్లీమాటలు వ్రాయఁబడినవి.

"మనువులలో •స్వారోచిషమనుసంభవము . . . వినవింపుకలిధ్వంసకము-" కలి ధ్వంసక మగుకథలో 'కలి' యనుపురుషుఁడు స్వరోచికిఁదండ్రి యగుట యెట్లు పొసఁగును ? ఇది స్వవచనవ్యాఘాతముగ నెంచఁబడవచ్చును. ఈ

సూక్ష్మాంశమును గుఱించి సహృదయు లాలోచింతురుగాక !

iii. ఈగంధర్వుఁడు ప్రథమమునఁ బలికినపలుకు లసందర్భములుగ నున్న వని శ్రీశాస్త్రిగా రాక్షేపించిరి.

"ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమిఁజేయుదు రొక్కవేళఁ బె, న్నక్కఱవ గార వింతురు క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ ... ... ...సుఖింపఁగాఁదగున్"

ఈమాటలు పూర్వకరాజితుఁ డగు గంధర్వుఁడు చెప్పవలసిన మాటలు గాని తనరూపమునుమార్చుకొని మఱియొకరూపము దాల్చినవాఁడు చెప్ప వలసినమాటలు గావని వారి యాక్షేపణము. ఈయాక్షేపణము సమంజసముగా నేయున్నది. ఈమాటలు సందర్భమునకుఁ దగియున్నట్లు కాన్పింపవు.

ఇంక మఱికొన్ని స్వల్పాంశములకు గూడ నసందర్భములుగ సూచించిరి. అచ్చరల "అస్వేదత" యొకచోట, "స్వేదత" మఱొకచోట-ప్రవరుఁడు, అప్రతిగ్రహీత యని యొకచోట, కాసుపీసములు దొరకకపోవుటచేఁ గలిగినదారిద్ర్యప్రశంస యొకచోట-ఇత్యాది స్వల్పాంశములను మాత్రము సూచించి కథాసంవిధానమును బెద్దన్న సందర్భశుద్ధిగ వ్రాయలే దనియుఁ గథను బాడు చేసె ననియు నిర్విశిష్ట నిరసోక్తులఁ దెగనాడిరి. పై నుదహరించిన యంశములన్నియుఁ గొంచె మెచ్చుతగ్గుగాఁ దృణలేశములు నెరసులు ఇవి కథకు నే విధమైన బాధఁ గాని యనౌచిత్యదోషము గాని యంతరాయము గాని కలుఁగ జేసినవి కావు. ఈ స్వల్పస్ఖాలిత్యములవల్లఁ గథయందు సందర్భశుద్ధి యేమి తగ్గినది ! ఇటువంటి నలుసులు ప్రతిమహాగ్రంథమందును గొంచె మైన నుండక తప్పవు. "బళిబళి మంచిమాటయె ప్రజ ధమునా జలరాశి దానిలోపల నెర సుల్ గణింతురె యపారము లౌమణు లెల్లనుండఁగన్" అని కమసాలిరుద్రయ్య చెప్పినటు లీ నలుసులను బట్టి యొక యుద్గ్రంథమునంతయుఁ దెగనాడుట విమర్శనౌదార్యమును గాని పరిమాణపరిజ్ఞానమును గాని సూచింపవు.

iv. రసము-నీతి. మనుచరిత్రము నందలి రసవిమర్శనమందును నీతివిచారణమందును శ్రీశాస్త్రిగారు చాలపటుకుఁ బొరపడినారు. వారుచేసిన తప్పిదములు బడిపిల్లలు చేయఁదగినవి కాని యనుభవశాలులును విమర్శవిశారదులు నగు శ్రీశాస్త్రిగారు చేయఁదగినవిగావు.

వీరు చేసినపొరపాట్లు సామాన్యదృష్టిని రెండు విధములుగా విభజింపవచ్చును.

1. దేశకాలపాత్రముల నాలోచింపకుండుట 2. కథాపాత్రములు వారి వారి యవస్థలతోఁ జెప్పిన మాటలను గేవలము కవిహృదయ మనియే దురభిప్రాయపడుట.

ఈ రెండు విధములగు పొరపాట్ల మూలకముగ వా రీకావ్యము నీతిబాహ్య మనియుఁ దుచ్ఛశృంగార రసభరిత మనియు స్థిరపఱిచిరి. వీరి యభిప్రాయములను బ్రతిఘటించుట కాంధ్రగీర్వాణ వాణీవిషయమై కొంత ప్రస్తావనగాఁ జెప్పవలసియున్నది.

ప్రపంచములో నే వాఙ్మయమును జూచినను శృంగారరసమే ప్రధాన రసముగ నున్నది. ఆశృంగారరస మనేకవిధములఁ బ్రదర్శిత మగుచున్నది. దేశభేదమును బట్టి శృంగారరసవర్ణనా భేదము చూపట్టుచున్నది. పాశ్చాత్య దేశములలో శృంగారరసవర్ణనము ప్రాచ్యదేశములందలి శృంగారరసవర్ణనమును బోలదు. మన హిందూదేశములోఁ బ్రాచీనకాలము నుండియు శృంగారరస వర్ణనమునకు నాయికానాయకుల బాహ్యావయవవర్ణనము ముఖ్యవిశేషముగా నిర్ణయమైనది పురుషులలో నవయవసౌందర్యము స్త్రీలలోఁ గచకుచాది వర్ణనములు శృంగారరసమున కుద్దీపనములై యుపాంగములైనవి. ఈయాచారము సంప్రదాయసిద్ధమైనది. మహాకవు లందఱు నెంత నీతిప్రబోధకులైనను గచకుచాదివర్ణన నెంతమాత్రము దుర్నీతిప్రేరక మని యెంచియుండలేదు. ఈ సంప్రదాయము తొలుదొల్త సంస్కృతవాఙ్మయమునందుఁ బుట్టినది. సంస్కృతము మాతృక కాన దేశ్యవాఙ్మయపుత్రికలందుఁ గూడ నీవాడుకయే ప్రసరించినది కావునఁ గచకుచాదివర్ణన మీకాలము వఱకుఁ గవులలో ననివార్యమైన కావ్యరీతిగఁ బరిగణింపఁబడినది. ఇప్పుడిప్పు డాంగ్లేయసంసర్గమునఁ గొంతవఱకీ సంప్రదాయము మాఱుచున్నది, గాని, మనదేశమందలి ప్రాచీనవాఙ్మయముఁ బరిశీలించుచున్నపు డీనాఁటి రసప్రమాణముల నుపయోగపఱచుట యన్యాయము.

మఱియు వాఙ్మయాభిరుచి ప్రమాణములు ప్రతిదేశమందును గాలభేదమునుబట్టియు భేదించుచుండును. వాఙ్మయాభిరుచి కాలానుసరణమై యనేక కారణములచే మాఱుచుండును. ఈభేదములఁ గూడ వాఙ్మయవిమర్శకులు గుర్తించుచుండవలెను. మన యాంధ్రదేశములోఁ బండ్రెండవశతాబ్దమునకును బదునాఱవశతాబ్దమునకు సారస్వతమున విభిన్నత విస్పష్టముగాఁ గాన్పించును

న్నది పదునాఱవశతాబ్దినుండి యీయిరువదవశతాబ్దికినంతకంటె నెక్కువైన భేదము కాన్పించుచున్నది.

ఈ మనుచరిత్రము పదునాఱవ శతాబ్ది నాఁటి గ్రంథము. ఆ కాలమున రాజులు శృంగారరసప్రియు లగుటచేఁ దదాశ్రితు లగు కవీశ్వరులును శృంగారరసలాలసులు కావలసివచ్చినది. శృంగారరసమునకు లేని స్థలములయందు సైత మేదో యొక విధముగా శృంగారరసము చొప్పింపవలసియుండెను. శృంగారరసము వర్ణింపలేనికవి కవిగాఁ డను నభిప్రాయము వ్యాప్తమైనట్లు కాన్పించుచున్నది. పెద్దనవలెనే యతని సమకాలీనులగు ముక్కు తిమ్మన్న ధూర్జటి వారి వెనుక సమీపకాలములో వెలసిన రామరాజభూషణుఁడు పింగళి సూరన్న యిత్యాదిమహాకవు లందఱు శృంగారరసభూయిష్ఠంబులగు గ్రంథములను రచించిరి. కావున, పెద్దన్న శృంగారరసము చిత్రించుటలోఁ దనకాలమునఁ బ్రకటితమగు రుచిప్రమాణముల మించెనో లేక వ్యక్తివ్యత్యయముల నతిక్రమింపక మానవజాతికి నిత్యసుభగ మగు రీతినిఁ బెంపొందించెనో నిర్ణయింపవలసియున్నది.

ఇంకఁ బాత్రముల గుఱించి కొంత యోజించెదము. ప్రతిదేశమునందును కథాపాత్రము లనేకరకములుగా నుండును. గుణదోషములు కేవలము వ్యక్తిగతములే గాక జాతిలక్షణములుగాను జూపట్టును. ఈ పాత్రగుణనిర్ణయసంప్రదాయ మన్నిదేశములయందును నన్నివాఙ్మయములయందుఁ గాన్పించుచున్నది. ఆయావివరణము లన్నిటినిఁ జెప్పుట ప్రస్తుత మనవసరము.

మన దేశవాఙ్మయములో గీర్వాణవాఙ్మయ సంప్రదాయమునుబట్టి మనుష్యజాతి నాయికానాయకులే గాక దివ్యజాతిస్త్రీపురుషులు కూడఁ దఱచుగాఁ గథాపాత్రములుగాఁ బ్రవేశపెట్టఁబడుచుందురు. దివ్యజాతుల చరిత్రములు పౌరాణికప్రసిద్ధములు, దేవతలు గంధర్వులు కిన్నరులు కింపురుషులు రాక్షసు లిత్యాదులను మన మెవ్వరము మన జీవితములోఁ జూడకపోయినను పౌరాణికసంప్రదాయ ప్రసిద్ధులు గాన వారివారికి నిర్ణీతములైన గుణదోషములను మనము ప్రామాణికముగా నొప్పుకొనవలసియున్నది. ప్రస్తుతము మన మనుచరిత్రములో నప్సరసలు గంధర్వులు నాయికానాయకులుగ నున్నారు. వారివర్తనములు మానవజాతివర్తనములలోఁ జేరఁదగినవి గావు ప్రత్యేకముగా మానవజాతికిఁ జెందినవాఁ డొక్క ప్రవరుఁడు మాత్రమే కాఁబట్టి యప్సరోగంధర్వులవిహారవ్యవహారములు మనుష్యులమగు మన కాదర్శములు కావు,

గంధర్వులు నప్సరసలును దమజీవితప్రవృత్తులలో ముఖ్యముగఁ గామ
కక్రీడాపరాయణులు. భూలోకమున భోగమువా రెట్టివారో దేవలోకములో
వీర లట్టివారు. బ్రహ్మయొక్క జఘనమునుండి పుట్టినవారై యెల్లప్పుడును నృత్త
గీతాదికళాభ్యాసకులును గామక్రీడాప్రియులునై నిలింపసభలలో మేళతాళ
ముల మెలఁగుచుందురు. వారిజీవితవ్యాసంగములనుగుఱించి పెద్దన్న యేయిట్లు
చెప్పినాఁడు.

"చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని ... పూఁతవసిండివంటివలపుల్ వచరించు
కులంబు" కాఁబట్టి దేవలోకసామాన్య యగునంగన నాయిక యగుటచే నామె
పలుకులుఁ జేఁతలు మానవజాతికి సంబంధించినవి కావు. అట్లేమాయాప్రవరుఁ
డగుగంధర్వప్రవరుఁడును. వీ రిద్దఱ పాత్రములును మన యనుభవప్రపంచము
లోఁ జేరవు.

కాని దివ్యపురుషుల విహారవర్తనములను మనము చదివి మనోగతము
చేసికొనుచున్నాము. కాన వారియందలిగుణదోషములు మనడెందముల భావో
ద్రేకము పుట్టింపకపోవునా యని యాక్షేపణ చేయవచ్చును. కాన దేవతలనై
నను మనుష్యజీవితవృత్తులలో నున్నలక్షణములతోఁ జిత్రించుట చాల మేలే
యగును. ఇది నిజమే కాని యిట్లు చేయుటచే వారియందు దేవతాగుణములను
దప్పించి మానవగుణముల నారోపించినవార మగుదుము. కావున నట్టిపాత్ర
పోషణము పౌరాణికసంప్రదాయమునకుఁ గేవలము విరుద్ధమై విలక్షణమైన
దగును. ఇట్టి దేశకాలపాత్రములగుఱించి ముందు గాఁబరిశీలించి నిర్ణయించుకొ
నినఁ గాని పెద్దనార్యుని కవితాశిల్పము గాని మఱి యేప్రాచీనకవియొక్కయుఁ
బౌరాణికప్రబంధముల కవనశిల్పము గాని మనము యథార్థముగా నిరూపింప
లేము. ఆకాలపుదేశస్థితులు, నానాఁటికవితాసంప్రదాయములు, నప్పటిప్రజ
లయొక్కయు రాజులయొక్కయు మనోవృత్తులు మున్నగునవి సాకల్యముగ
గుర్తించినఁ గాని పెద్దనార్యునికవితాకన్యయొక్క యాకృతిక్రియాలక్షణము
లయందలి యుత్కృష్టతానికృష్టతలను నింద్యానింద్యస్థితిగతులను నిర్ణయింపన
వకాశ ముండదు.

ఈయుపన్యాసమంతయు శ్రీ శాస్త్రిగారికి నవసరము లేదని నాకుఁ దె
లియును గాని చదువరులలోఁ గొంతమందికైనను ముఖ్యముగా గ్రంథవిమ
ర్శనకు నూతనముగాఁ గడంగుపండితకిశోరములకైన నవసరమై యుండవచ్చు

వని ప్రత్యేకముగ వ్రాసితిని. పైనసూచించిన విషయము లన్నియు శ్రీశాస్త్రి గారెఱింగియున్నను పెద్దనార్యుని దోషములకై వెదకులాడెడు దృష్టితీవ్రతచే సమరస మైన విమర్శవిచారము చేయక దోషములను దోషారోపితముల నన్నింటిని కలగాయపులుసుగాఁ గలిపి పెద్దనార్యునితలపై రుద్దిరి.

ఇంక రెండవవిషయము:—

పాత్రోచితవాక్యములను గవియభిప్రాయములుగఁ బొరంబడుట నూతనముగా గ్రంథవిమర్శనమునకు నుద్యోగించెడు యువకుఁ డిట్టిపొరపాటు చేసినను గొంతవఱకు క్షమింపవచ్చును గాని యాంధ్రవిమర్శన ప్రపంచములో స్థిరకీర్తులయి విమర్శకాగ్రేసరబిరుదము వహించిన శ్రీశాస్త్రిగా రిట్టికించిజ్ఞతాజన్య మైన పొరపాటు గావించుట నాకుఁ జాల నాశ్చర్యకరముగా నున్నది. 'ప్రమాదో ధీమతా మపి' యను న్యాయముచే నిట్లు జరిగిన నిప్పుడైనను వారియభిప్రాయముల నుపసంహరించుకొని పెద్దనార్యుని యాత్మకు సంతుష్టి గావింతురుగాక.

ఇంతవఱకుఁ గావ్యవిమర్శనక్రమమును నిరూపించితిని. ఈతరువాత శాస్త్రిగారు చూపించిన దోషములగుఱించి క్లుప్తముగ వ్రాసెదను. ఈగ్రంథమందలి శృంగారరసవర్ణనమును గుఱించి శ్రీశాస్త్రిగారు చాలవఱకువిమర్శించిరి. వారివిమర్శనమును సాంతముగాఁజూచినయెడల వారియభిప్రాయ మిదమిత్థమని చెప్పుట కవకాశము గలుగుట లేదు. ఒకచోట 'కచకుచాదివర్ణనము చేసినంతమాత్రమున దుష్టగ్రంథ మగునా? యందు లేని యట్లగు నని నేను బలికియుండ లేదు. నవనాగరకాగ్రగణ్యులు పలికి యాంధ్రసారస్వతముపై దాడి వెడలిరి.' 'పెద్దన్నగ్రంథమందు నెచ్చటఁజూచినను మోహోద్రేకముపుట్టించు కుచాదివర్ణనమే కాన్పించుచున్న దనియు' "స్త్రీల కుచముల వర్ణించుటయే గాక వనాములకుఁ గూడఁ గుచములు పెట్టి వర్ణించినాఁ డనియు" నిత్యాది పరస్పరవిరుద్ధవాక్యములను బెక్కులు పలికియున్నారు.

మఱియుఁ గచకుచ సంభోగవర్ణనముల నొక్క పెద్దనార్యుఁడే చేయ లేదు. సంస్కృతమహాకావ్యములలో నీవర్ణనము లమితములుగఁ గలవు. వాల్మీకి కాళిదాసు మున్నగు మహాకవులు గావించి యుండిరి. ఇంగ్లీషులో షేక్సుపియరు మున్నగుమహాకవులు నట్లే కావించియుండిరి. అందులకై యితనినిఁ బ్రత్యేకముగా నిందింపఁ బనిలేదు.—అని వేఱొకచోటఁ జెప్పిరి. ఈప్రకారము "కుడిచేతితోఁ గూడుపెట్టి యెడమచేతితో నెగురఁగొట్టినట్లు" స్వవ

చనవ్యాఘాతములతో నిండినయభిప్రాయములను బహుచమత్కారముగా వాదనసరళియందు నెఱపి పెద్దనార్యుని కావ్యమున శృంగారరసము తుచ్ఛ మనియు నీతిబాహ్య మనియుఁ దుట్టతుదకు సిద్ధాంతముఁ జేసిరి.

వీరివాదనయందు సుపక్షులకు నిర్దుష్టముగా నిర్దేశించుటయు లేదు, నిర్దిష్టము లయిన యుపపత్తులచేఁ బట్టి స్థిరపఱుపఁదగిన సిద్ధాంతములను న్యాయముగా నెలకొల్పుటయు లేదు. కాని యెంతవఱకుఁ జూచినను మిథ్యావాదనయుక్తినైపుణ్యము ప్రచరింపుచు బుద్ధిని వ్యామోహపఱుపునట్లు న్యాయాన్యాయములకు సమ్మిశ్రము చేయుచుఁ, జెప్పినవానినే పలుమాఱు చెప్పుచు నొకచో నిర్దోషము లని విడిచిపెట్టినవానిని మఱియొకచోట దోషములుగా నిరూపించుచు స్వోక్తన్యాయసమర్థనము గావించిరి.

కచకుచాదివర్ణనవిషయములలో వీరు పెద్దనార్యుని నిందింపను లేదు, అభినందింపను లేదని పైన వారివాక్యముల సహాయముననే చూపితినిగదా! ఇంక మఱియొకవిషయమును జూడుఁడు! "జారత్వము సర్వవిధముల నుచితమే యని సాధించుటకై పెద్దనార్యుఁడు ప్రయత్నించినాఁడు. ఇది పెద్దనార్యుని పెద్దతప్పు." అని చెప్పి శాస్త్రిగారీ క్రిందిపద్యము నుదాహరణముగఁ జూపిరి.

"సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి, దాశకన్యాకేళితప్పఁజేసి
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...బందాలుగారె."

ఇంతకంటె నన్యాయ మగువాద ముండునా? ఇచ్చట శ్రీశాస్త్రిగారు చేసిన తప్పు ప్రమాదవశమునఁ గావించిరో లేక కుటిలబుద్ధినిఁ గావించిరో మనము నిశ్చయింపలేముగాని శాస్త్రిగారు తమతప్పును తెలిసికొనినతరువాతనైనను బశ్చాత్తప్తు లయ్యెదరుగాక!

ఈపద్యమందలి యభిప్రాయములు పెద్దనార్యునివా? లేక వేశ్యనాయిక యగువరూథినివా? కథాపాత్రముల ముఖోద్గతము లగునభిప్రాయము లన్నియుఁ గవియభిప్రాయములే యని శ్రీశాస్త్రిగారొకవిపరీతవాదమును గల్పించి చెప్పినచో నిఁకఁ బ్రతికవీశ్వరుఁడును దుర్మార్గుఁడు, తుంటరి, స్త్రీలంపటుఁడు, త్రాగుఁబోతు, జూదరి, యింకఁ బ్రపంచములో నున్నదుర్గుణము లన్నిఁటికి నాలవాలమై యుండవలసివచ్చును. శూద్రకుఁడు, శకారునివలెఁ ద్రాగుఁబోతును, జారశిఖామణియు నై శర్విలకునివలెఁ జోరాగ్రేసరుఁడై యుండవలెను. షేక్స్పియరు ఫాల్స్టాఫ్వలె రండలకు మిండఁడై మాక్బెత్తుసతివలెఁ దాను గన్న

చిన్నకూనను గూడఁ దల పగులఁగొట్టెడు క్రూరహంతకుఁడై యుండవలెను. ఇట్టివిపరీతవాదముఁ గావించువారిది వఱలో నెవ్వరును లేరని ఘంటాపథముగాఁ జెప్పఁగలను. వేశ్యానాయిక తనవలపులలో నేకపత్నీవ్రతుఁ డగు నాయకునాయికబ్రాహ్మణుని వేసికొనుటకుఁ జెప్పినమృషావాదమును బెద్దన్నగారియభిప్రాయ మనియే చెప్పి శ్రీశాస్త్రిగారు పెద్దన్నయందుఁ బెద్దతప్పు నారోపించిరి. ఇది పెద్దనార్యుని పెద్దతప్పు కాదు గాని శ్రీశాస్త్రిగారి విమర్శనాపాటవమునందుఁ బెద్దకళంకము.

ఇట్లు చెప్పుటచేఁ బెద్దనార్యునిశృంగారరసవర్ణన మంతయుఁ బ్రశంసనీయ మనియు నీత్యుద్బోధక మనియు నాయభిప్రాయము కాదు. ఆకవీశ్వరుని గుణదోషములను దేశకాలపాత్రములను బట్టి న్యాయపరిశీలనముఁ గావించి సప్రమాణముగ నిరూపించి దాక్షిణ్యబుద్ధినిఁ దీర్మానముఁ గావింపవలసిన దనియే నా వేఁడుకోలు—

మఱియొకవిషయము:—వరూథిని విరహావస్థయందుండఁగా సూర్యాస్తమయవర్ణనమునఁ బెద్దనార్యుఁ డాయవస్థ నిట్లు త్ప్రేక్షించెను.

"చ. తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా

భరవివశాంగి... ... ... ... ... ... ... ... ...దీధితిన్."

ఈపద్యమునందలి భావము జారత్వబోధక మని శ్రీశాస్త్రిగా రాక్షేపించిరి. ఇది న్యాయమైనయాక్షేపణయే. పెద్దనార్యుఁ డిచట నిక్కముగఁ బెద్దతప్పుఁ జేసినాఁడు. ఇది కవియభిప్రాయమునే సూచించుచున్నది, గాని, పాత్రోచితవాక్యము కాదు. పెద్దనార్యుని శృంగారరస మిచటఁ బొంగిపొరలినది. శ్రీశాస్త్రిగారిచీవాట్లకుఁ బెద్దన్న యిచ్చటఁ దప్పక యర్హుఁడే ఇట్లు దోషముల దోషములుగాను గుణముల గుణములుగాను నిర్ణయించుటయే విమర్శకునివిధి గాని గుణములను దోషములుగాను దోషములను గుణములుగాను దాఱుమాఱుచేయుట యతనిపనిగాదు.

ఈవిషయ మింతటితో దిగవిడిచి పెట్టిదము. ఇంకొకఘట్టమునకుఁబోవుదము, అదియేదన మనోరమవృత్తాంతము. ఈ మెనుగూర్చి శ్రీశాస్త్రిగా రిట్లు నుడివిరి.

"మఱియు మనకవిగారికి సురతమే భోగముగాఁ గాన్పించినది గాని తక్కిన వేమియు భోగములుగాఁ గన్పింపలేదు. ఇది మనోరమగాథలోఁ దేలినది.

# వేణీసంహారే భీమ ఏవ నాయకః.

యం. సూర్యనారాయణమూర్తిగారు—బొల్లపాడు.

---

కావ్యములు దృశ్యకావ్యములు శ్రవ్యకావ్యములు నని రెండు తెఱంగుల నలరారుచున్నవి. అందు దృశ్యకావ్యములు పదివిధంబులుగ నున్నవి. నాటకము, ప్రకరణము, భాణము, డిమము, మొదలగునవి. వానిలో నీవేణీసంహారమును నాటకముగఁ జెప్పవచ్చును ఈవేణీసంహారమును భట్టనారాయణుఁడు రచించెను.

ప్రతినాటకమునందు నాయకుఁ డుండును. ఈనాటకమునందు నాయకుఁ డెవరైనది నిర్ణయించుటకు వివాదగ్రస్తమై యున్నది. కొందఱు భీముఁ డనియుఁ, గొందఱు ధర్మరాజనియుఁ జెప్పెదరు. ఈవిషయమై కొంచెము యోజించుట యవసరము. అందు మొదట వేణీసంహార మనఁగా నేమిటో యోజించుట యవసరము.

వేణ్యాః ద్రౌపదీదేవ్యాః వేణ్యాః, సంహారః సంయమనః, అని పండితులువిగ్రహముఁ జెప్పుచున్నారు. ద్రౌపదియొక్క కేశములను బంధించుట యని యర్థము. "నయతి అస్యాః ఫల మితి నాయకః"అనిపండితు లుగ్గడించుచున్నారు. ఈనాటకమునందు వేణీసంహారమే ఫలము. ఈవేణీసంహారమొనర్చినది భీముఁడు. ఫల మొనర్చినవాఁడే నాయకుఁడు గాని తదితరుఁడు నాయకుఁడగుటకువీలు లేదు. వేణీసంహార మొనర్చినది భీముఁడు. అతఁడే నాయకుఁడగును గాని ధర్మరాజు నాయకుఁ డెట్లగును? ధర్మరాజు నాయకుఁ డగుటకు వీలు లేదు.

ఇఁక ధర్మరాజే నాయకుఁ డనువారు, భీముఁడు నాయకుఁ డన్నచో నాటకలక్షణము కుదురదు. నాటకములో ధీరోదాత్తుఁడే నాయకుఁడుగా నుండవలెను. వీరరసముగాని శృంగారరసముగాని ప్రధానముగ నుండవలెను. ధర్మరాజు ధీరోదాత్తుఁడు. కనుక యాతనియం దుండురసము వీరము. భీముఁడు ధీరోద్ధతుఁడు. అతనియం దుండురసము రౌద్రము. కనుక భీముఁడు నాయకుఁడుగ నున్నచో నాటకలక్షణమునకు విరుద్ధము; ధర్మరాజు నాయకుఁడన్నచో నాయకలక్షణమునకు విరుద్ధముగ నుండదు—"ప్రత్యక్షనేతృచరితో బిందు వ్యక్తిపురఃసరః" అనులక్షణమునకు వారొకవిధముగా సమాధానముం జెప్పిరి. ధర్మరాజు సచివాయత్తసిద్ధి గలనాయకుఁడు. సచివాయత్తసిద్ధి గలవాని కన్ని యంకములందుఁ బ్రవేశ మున్నను లేకపోయినను నాయకత్వమునకు భంగము

దనియు ధర్మరాజు సచివాయత్తసిద్ధి గలనాయకుఁ డని చెప్పినచో నాటక మంతయు సరిపోయినది, గనుక ధర్మరాజే నాయకుఁ డనినచో నెట్టిబాధ యాటంకము లేదని కొంద ఱుగ్గడించుచున్నారు.

వారు చెప్పినట్లు సరిపోయినచో ధర్మరాజు నాయకుఁడని యొప్పుకొన భీముఁడు ధర్మరాజున కనుకూలముగ నున్నచో ధర్మరాజు సచివా గలవాఁ డగును. భీముఁడు మొదటినుండియు ధర్మరాజునకు వ్యతిరేక నే యుండెను. "అద్యైకం దివసం మమాపి న గురు ర్నాహం విధేయ మొదటినుండియు భీముఁడు చెప్పుచునే యుండెను. కనుక ధర్మ సచివాయత్తసిద్ధి గలవాఁ డని చెప్పుటకు వీలుపడదు. రత్నావళిలో వత్స సచివాయత్తసిద్ధి గలనాయకుఁడు. ధర్మరాజునకు భీముఁడు వ్యతిరేక నున్నట్లు వత్సరాజునకు యౌగంధరాయణుఁడెచ్చటను బ్రవర్తింప లేదు. రాయణుఁడు గూడ వత్సరాజునకు వ్యతిరేకముగఁ బ్రవర్తించిన వత్స సచివాయత్తసిద్ధిగలనాయకుఁ డనుటకు వీలుండునది కాదు.

లక్షణగ్రంథములు లక్ష్యగ్రంథముల ననుసరించియే వ్రాయఁబడినవి. గ్రంథకవి యప్పటి కున్నలక్ష్యగ్రంథములలో బహుళముగా ధీరోదా నాయకుఁడుగను వీరరసము గాని శృంగారరసము గాని ప్రాధాన్యముగ డుటచే నిట్లే యుండవలయు నని వ్రాసినాఁడు. కాని నాటకములో ధీరో నాయకుఁడుగా నుండఁగూడ దని చెప్పలేదు. అథవా- చెప్పినను- గ్రంథములతరువాతి లక్ష్యగ్రంథముల కానియమము చెల్లును. కాని ర్వగ్రంథముల కానియమ మెట్లు చెల్లును. ఈ వేణీసంహారము లక్షణ మైన దశరూపకముకంటెఁ బూర్వగ్రంథము. కాన దశరూపకమునందలి వేణీసంహారమునఁ జెల్లుటకు వీలు లేదు. అదియును గాక "నిరం శాః కవయః" అనునార్యోక్తినిబట్టి కవులు వారిచ్చవచ్చినట్లెట్లు వ్రాసినను రినేమియు ననుటకు వీలు లేదు. రౌద్రరసము ప్రధానము, ధీరోద్ధతుఁడు నా కుఁడు, గనుక యిది నాటకము కా దనుటకు వీలు లేదు. కవియే మొదటఁ స్తావనలో "తదిదం కవే ర్మృగరాజలక్ష్మణో వేణీసంహారం నామ నాటకం యోక్తు ముద్యతా వయ మితి" కవియే నాటక మని చెప్పినాఁడు, గనుక కా దనుటకు వీలు లేదు. ఎన్నివిధముల నాలోచించినను నిందులో నాయకుఁ డని కొంద ఱుపపాదించుచున్నారు. నాయభిప్రాయము [illegible] పాఠకులు మన్నింతురుగాక.

# ఆంధ్రభాషాస్వరూపవిచారము.

పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు — ముంగండ.

---

శ్లో. నత్వా గురూన్ భారతీంచ నానాభాషాస్వరూపిణీమ్
ఆన్ధ్రభాషాస్వరూపంతు సంక్షేపేణ విచార్యతే.
కర్త్యేన పుల్యకుల్యేన మునిఖండనివాసినా
ఉమామహేశ్వరే చాన్ధ్రసాహిత్యపరిషన్ముదే

శ్రీభాషారమాతపస్సులచే భారత మనుసార్థకనామము నొంది యన్ని
దేశములకన్న మిన్నయై వన్నెకెక్కి శ్రీమద్వేదశాస్త్రపురాణాగమాదిరూ
ణియు, సకలభాషాయోషామణీమాతృభూతయు నగుసంస్కృతభాషామత
కకు విహారభూమియై సకలవైదికస్మార్తకర్మఫలభూమియై తనరారు భారతభూశ
మామణికి భాసురమాళిభూషణంబై యలరారుచున్న మనయాంధ్రదేశరత్న
మునఁ జిరకాలమునుండి యాంధ్రభాషాభివృద్ధికై నిరంతరముగఁ బాటుపఁ
చున్న యాంధ్రసాహిత్యపరిషద్యమహాశయులును దత్పరిషదధ్యక్షమహాశ
యులు నగు మీకుఁ గొలుత వందనసహస్రంబుల నర్పింపకుండ నాలేఖిని ము
దున కెట్లు నడచును. లోకమునఁ బ్రతిప్రాణికిని జననానన్తరమున స్వశరీరా
మానమునకుఁ బిమ్మట స్వబంధ్వభిమానముతోపాటు స్వజాతిస్వమతస్వధ
స్వస్థానస్వదేశస్వభాషాభిమానము లుదయించి యుండుట యెట్లు సహజమో
యట్లే వివేకోదయానన్తరమున వానిం గాపాడుకొనుటకును వాని నభివృద్ధి
దెచ్చుటకును యత్నించుటయును సహజమే - కాని వానిరక్షణాభివర్ధనములఁ
యత్నించువ్యక్తుల బుద్ధిభేదముల ననుసరించి మార్గములు మాత్రము భి
భిన్నములుగా నుండును - ఐనను గమ్యస్థాన మొకటియే యగుటచే విమర్శ
లాభిన్నభిన్నమార్గముల నన్నిటిని విమర్శించి గుణగ్రహణలాలసు లగుటచే హ
సలవలె విషతుల్యము లగుదోషములఁ బరిహరించి పయస్తుల్యము లగుగు
ములను సేకరించి వాని నేకీభవింపఁజేసి నిష్కంటక మగునొక ఘంటాపథ
నేర్పఱిచి యందు లోకులఁ జరింపఁజేయుదురు - దోషైకదృష్టులకు మా
మవివేకగుహానిలీనత్వ మేర్పడి తుద కాగుహాయే శరణ్య మగునుగాని వివేకస
ర్యప్రభాభాసిత మగుఘంటాపథము దృష్టిగోచరముకూడఁ గానేరదు. ప్ర
తము మనయాంధ్రదేశమునఁ గొంతకాలమునుండి నైసర్గిక మగు స్వభావ

మూనముచే నాంధ్రభాష నభివృద్ధి నొందించుటకుఁ జాలసంస్థ లేర్పడి గాఢముగ
యత్నించుచుండుట యాంధ్రులకెల్లరకును విశదమే. కాని వీని కన్నిటికిని ఫలిత
మింతవఱ కేమి చేకూరినది యని విమర్శించినచోఁ గొన్ని యముద్రితాంధ్రగ్రంథ
ములను ముద్రించి ప్రకాశింపఁజేయుటయు బృహదాంధ్రనిఘంటువు నొకదా
నిని నిర్మింపఁజేయుచుండుటయు నవీనకవులచే నవీనగ్రంథములఁ గొన్నిటిని రచి
యింపఁజేసి ప్రకాశింపఁజేయుటయు మున్నగు కొన్నికొన్ని గొప్పసంస్థలచేఁ
జేకూర్పఁబడుచున్నవి యని చెప్పకతప్పదు. ఇయ్యది యభివర్ధనముగునా కాదా
యని ముందు విమర్శింతము. ఇవి యిట్లు పనిచేయుచుండ మఱికొన్నిసంస్థలు
ప్రాచీనపద్ధతుల నిరసించుచుఁ బాశ్చాత్యపద్ధతుల ననుసరించిన విమర్శనము
లతో మతరాజకీయధర్మములందువలె భాషయందుఁగూడ సంస్కార మవసర మని
భావించి నవలలు నాటకములు మున్నగువానిని బ్రాచీననియమముల నన్నిటి
నుల్లంఘింపఁజేసి దేనిని సర్వాత్మనా ప్రాచీనలాక్షణికులు నిరసించి నిషేధించిరో
యట్టిగ్రామ్యముననే రచియింపఁజేయుచుఁ దువకు, యెంకిపాటలు, తందానపద
ములు మున్నగువానిచేఁ బత్త్రికలను గ్రంథములను బూరింపఁజేసి దేశమున
వెదచల్లుచున్నారు. ఇట్టిస్థితిలో నిపు డాంధ్రభాషాయోషారత్నమునకు రక్ష
ణముకూడ నవసరమై యున్నదని విజ్ఞులగు మీకు విశదీకరింపనవసరము లేదు.
భాషకు రక్షణ మన నేమి వర్ధన మన నేమి యని తొలుత విచారింపకతప్పదు.
అనాదికాలమునుండియు శిష్టలోకముచే న్యాయరీతిగనే వ్యవహరింపఁబడుచున్న
శబ్దజాలము నపభ్రంశములతో సంకీర్ణము కాకుండ భాషణనిబంధనములలో దేశీ
యులచేనట్లే వ్యవహరింపఁజేయుట రక్షణమనియుఁ బ్రాచీనశిష్టప్రబంధములంబోలి
సలక్షణమై సహృదయహృదయాహ్లాదకరములగు నూత్నకల్పనలతో విరా
జిల్లుచు సత్పదశోభితమై స్వతంత్రముగ విలక్షణానందజనక మగువిలాసపరం
పరతో నొప్పారు భావగర్భితవిశుద్ధనూతనగ్రంథసముదాయము నుభయభాషా
విద్వత్కవులచే నిర్మింపఁజేసి దేశమునఁ బ్రచారమునకుఁ దెచ్చుటయే వర్ధన మని
యు నాయభిప్రాయము. అముద్రితాంధ్రగ్రంథముద్రణాదికమును నిఘంటుని
ర్మాపణాదికమును వర్ధనాంగము లని నాయాశయము- ఏభాషయొక్కనైన
నిట్టిరక్షణవర్ధనములకుఁ గడంగునట్టి యేసంస్థయైన నాభాషాస్వరూపముం దెలి
సికొని యేయేయంగముల కేయేకారణములవలన శైథిల్యము ప్రాప్తించినదో
గమనించి యాశైథిల్యహారణసాధనముల నరసి యాసాధనములతో నాశైథిల్య

మును హరింపఁజేసి యాయంగముల బాగుచేసినపిమ్మట వర్ధనోపాయములచే వృద్ధినొందించుట, కర్తవ్యము కాన, వెనుక నిరూపించిన కారణములచే మన యాంధ్రభాష కట్టిరక్షణవర్ధనము లావశ్యకము లగుటచే దానిస్వరూపమును సంగ్రహముగ నుందు నిరూపించుచున్నాఁడను భాషయన "భాష్యత ఇతి భాషా" ఉచ్చరింపఁబడునది యేదియో యదియని చెప్పవలెను. ఉచ్చారణ మన, తాల్వోష్ఠాదివర్ణోత్పత్తిస్థానములయందలి వాయ్వాఘాతరూపము. అట్టి వాయ్వాఘాతవశంబున నాయాస్థానములయం దాయావర్ణము లుద్భవించును. అట్టివర్ణములును వాని సముదాయములును శబ్దము లనంబడును. అట్లుత్పన్నములగువర్ణముల యానుపూర్వీభేదములచేత శబ్దములు భిన్నభిన్నము లై యనంతములైనవి. భిన్నభిన్నానుపూర్వీకము లగువర్ణముల యుత్పత్తికిఁ గారణ మాత్మబుద్ధితోఁ గలసి మనస్సును బ్రేరణ చేయుటయే యగును.

"ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుంక్తే వివక్షయా మనః కాయాగ్నిమాహన్తి స ప్రేరయతి మారుతమ్, మారుత స్తూరసి చర న్మన్ద్రం జనయతి స్వరమ్, సోదీర్ణో మూర్ధ్న్యభిహతో వక్త్ర మాపద్య మారుతః వర్ణాన్ జనయతే"

ఇత్యాది గ్రంథముచే శ్రీ పాణిన్యాచార్యులవారు చెప్పుచున్నారు అట్లు భిన్నభిన్నానుపూర్వీకవర్ణములు కలశబ్దముల సముదాయమునే భాషయని వ్యవహరింపుచున్నారు. ఉచ్చారణము వర్ణములకును, అర్థమును బోధించు వర్ణసముదాయమునకును వర్ణములకు నున్నను వానిని శబ్దము లనియే వ్యవహరించుచున్నారు, కాని, భాష లని వ్యవహరించుట లేదు భాషకు శబ్దాధికరణత్వమే వ్యవహారసిద్ధము. భాష శబ్దములకన్న భిన్నము కాక పోయినను సాగరతరంగన్యాయము ననుసరించి భిన్నముగా వ్యవహరింపఁబడుచున్నది. శబ్దములు సకలవ్యవహారసాధనములుగా నేర్పడినవి. లౌకికాలౌకిక భేదమున వ్యవహారము ద్వివిధము. ఏ దేశమున నేజాతీయులచే నేశబ్దజాలము స్వీయవ్యవహారసాధనముగాఁ బరిగ్రహింపఁబడినదో యాదేశభేదము నాజాతిభేదము ననుసరించి యాయాభాషలు భిన్నభిన్నము లైనవి. సాధారణముగ దేశీయ జాతీయభాష లన్నియు లౌకికవ్యవహారమాత్రసాధనములు కాని యలౌకిక వ్యవహారసాధనములు కావని యార్షసిద్ధాంతము. లౌకికాలౌకికవ్యవహార సాధనమును సకలలోకవ్యాపినియు నగు భాష యొక సంస్కృతభాషయే యని

ప్రాచీనసిద్ధాంతము. కనుకనే యిది యొకదేశభాషగాఁ గాని యొకజాతీయ భాషగాఁ గాని వ్యవహరింపఁబడుటలేదు కనుకనే సకలభాషలు నీభాషనుండియే పుట్టిన వని భాషాతత్త్వవేత్తలు సిద్ధాంతీకరించిరి దానింబట్టియే యీ భాషకు మాతృభాష యనువ్యవహార మన్వర్థ మగుచున్నది. కావుననే యలౌకికములగు శ్రౌతస్మార్తపౌరాణికాదియావత్తర్కకలాపమున నిప్పటివఱకీభాషయే యార్యులచే భారతదేశమునం దంతట నఖలదేశీయులచేతను వ్యవహరింపఁబడుచున్నది. శేషధర్మాదిగ్రంథములలో వ్యాసాదులచే దేశభాషాకావ్యనిర్మాణపఠనశ్రవణాదులు కూడ నిషేధింపఁబడినను వానివిషయమున బాలసరస్వతీయాదులలోఁ గొన్నిసమాధానము లీయఁబడియున్నవి. కాని యీవిషయమున మతభేదముల కాస్పద మున్నను నన్నయభట్టారకాది మహాజనపరిగ్రహమున నంగీకరించినను శ్రౌతస్మార్తాద్యపూర్వజనకకర్మకాండమున నార్యులకు దేశభాషాపరిగ్రహము నాస్తికు లంగీకరింపరు. ఏదియెట్లున్నను బ్రస్తుత మగు మనయాంధ్రభాష దేశభాషలలోఁ జేరినదియై వికృతిరూపిణి కాని ప్రకృతిరూపిణి కాదని "ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయోర్భవేద్వికృతిః" అనువచనముచే శ్రీనన్నయభట్టారకులే నిరూపించియున్నారు. సంస్కృతప్రాకృతభాషల నుండియీభాష యేర్పడినదని చెప్పిరి. ఇయ్యది "తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి" అనువచనముచే సంస్కృతప్రాకృతజన్యము, సంస్కృతప్రాకృతసమము, దేశ్యము, గ్రామ్యము ననునాలుగుభేదములతో నొప్పారుచున్నది, యని వారే నిర్వచించిరి. కనుక మనయాంధ్రభాష తజ్జాద్యవయవచతుష్టయముతో నేర్పడిన దని తేలినది. ఇందు గ్రామ్యావయవము వ్యక్తీకరణానర్హ మగుటచే శేషించినయవయవములే వ్యక్తీకరణార్హము లగుచున్నయవి. "నమ్లేచ్ఛితవై, నాభాషితవై, మ్లేచ్ఛో హవా ఏష యదపశబ్దః" అను మహాభాష్యస్థవచనానుసార మపశబ్దోచ్చారణము పాపావహ మని సిద్ధించుచున్నది. గ్రామ్యం హి యత్త్వపభ్రంశః" అనువచనానుసార మపభ్రంశమే గ్రామ్య మని సిద్ధించుచున్నది. కనుక నది యప్రయోజ్య మని తేలినది. ఇఁకఁ దక్కుంగల యవయవములలో సంస్కృతసమముల కెక్కువ వాడుక కల దని యు వాని నెక్కువ వాడనిచో నెట్టిలక్షణానందముం గోరి వికృతము ననుసరించుచుంటిమో యది చేకూర దనియు నంద తెలిసినదే. శేషించినశబ్దములనైనను వానిస్వరూపము దెలిసికొని ప్రయోగించినఁ గాని సాధుశబ్దప్రయోగజన్యాపూర్వవిశేష ముద

యుండ దనియు నట్లు శబ్దస్వరూపమును బాగుగాఁ దెలిసికొని ప్రకృతిప్రత్యయ విభాగజ్ఞానముతో శాస్త్రప్రక్రియాస్మరణపూర్వకముగఁ బ్రయోగించిన ప్రయోక్తకు స్వర్గరూపాపూర్వ ముదయించు ననియు, శ్రు॥ ఏకశ్శబ్దః సమ్యక్ జ్ఞాతస్సుష్ఠుప్రయుక్త శ్శాస్త్రాన్విత స్స్వర్గే లోకే కామధుగ్భవతి” అనుమహాభాష్యాదిస్థ శ్రుతివలన లభించుచున్నది. దేశభాషలలోఁ గూడ నీశ్రుతి ననుసరించియే “జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః” ఇత్యాదివచనములచే శ్రీనన్నయభట్టారకాదులు తెలిసికొని ప్రయోగింపఁబడినశబ్దము వైదికశబ్దతుల్యము గును. అనఁగా వైదికశబ్ద మెట్లు పుణ్యజనకముగునో యట్లే యిదియు నగు ననిరి. కనుకనే వారివ్యాకరణాన్వాఖ్యానము కూడ సార్థక మగుచున్నది. శాస్త్రకారులు సాధుత్వాసాధుత్వములను నిర్ణయించుటలో శిష్టలోకవ్యవహారము నే యాధారముగాఁ గైకొనినట్లు “సిద్ధే లోకాద్వ్యవస్థా” ఇత్యాదికముచే వెల్లడించిరి. ఈవిషయమును శ్రీపాణిన్యాచార్యులువారుకూడ “పృషోదరాదీని యథోపదిష్టమ్” ఇత్యాదిసూత్రములచే సూచించిరి. కావున భాషాస్వరూపపరిజ్ఞాన మత్యవసర మనియు నందులకు వ్యాకరణజ్ఞాన మత్యంతావశ్యక మనియు దీనివలన లభించినది. అది లేనపుడు నియమము చెడి యిప్పటివలె గ్రామ్యకావ్యనిర్మాణమే చేకూరి భాషాస్వరూపవినాశనమే తటస్థించు నని “అనియమో గ్రామ్యం హి” అను సూత్రముచేఁ జెప్పిరి. కనుక నాంధ్రభాషాస్వరూపముం దెలిసికొనుటలో తజ్జాసమదేశ్యవిభాగజ్ఞానముతో నాయాశబ్దములస్వరూపజ్ఞాన మవసరము. ఇందుఁ దజ్జదేశ్యముల నాంధ్రవ్యాకరణకోశప్రబన్ధాదులవలనఁ దెలిసికొనినను దత్సమములఁ దెలిసికొనుట కాసంస్కృతప్రాకృతభాషాజ్ఞాన మత్యవసరము. ఇయ్యవియే యాంధ్రవ్యాకరణజ్ఞానముతో నాంధ్రవిభక్తులఁ బ్రాతిపదికలకుఁ జేర్చి స్వతంత్రముగఁ బ్రయోగింప ననువగు శబ్దములు. తజ్జదేశ్యములు ప్రాచీనప్రయోగపరతంత్రములు. అందునను సంస్కృతసమములకే ప్రయోగప్రాచుర్యము నానందజనకత్వమును గలుగుచున్నవి యని వెనుకఁ జెప్పియుంటిని. కేవలతజ్జములతోఁగాని కేవలదేశ్యములతోఁగాని తజ్జదేశ్యములతోనే గాని కూర్పఁబడిన వాక్య మెట్టియానందము నుదయింపఁజేయునో తత్సమములతోఁ గూడిన దెట్టియానందము నుదయింపఁజేయునో విజ్ఞులకుఁ దేటతెల్లమే. చూడుఁడు- “మందారమకరంద మాధుర్యమునఁ దేలుఁ మధుపంబు వోవునే మదనములకు” ఇత్యాదివాక్యములలోఁ దత్సమము లెన్ని

కలవో యితరము లెన్నికలవో గమనింపుఁడు. తత్సమములతోఁ గూడియున్న వాక్యము మణిస్థగితహేమభూషణతుల్యమై తనరారు నని నాయాశయము. సంస్కృతప్రాకృతములలోఁ గూడ సంస్కృతమునం దెట్టి రామణీయకము కలదో ప్రాకృతమునం దెట్టి రామణీయకము కలదో విజ్ఞులకు వేద్యమే. ఇంతయేల ప్రాచీనప్రబంధకారులను గాని నవీనులలోఁ గొందఱను గాని మన మత్యధికముగ గౌరవించుటలోఁ గేవలాంధ్రభాషాపరిశ్రమమే కారణ మగుచున్నదో లేక సంస్కృతభాషా పరిశ్రమాధిక్యముతోఁ గూడిన యాంధ్రభాషాపరిశ్రమమే కారణ మగుచున్నదో గమనింపుఁడు. భాషయందలి స్వతంత్రశక్తివిశేషము కదా గౌరవహేతు వగును అట్టిస్వతంత్రశక్తి ప్రకృతిభాషాపరిశ్రమము లేనిదే దానికృతిభాషయం దెట్లు కలుగును. సంబంధాతిశయము కలసంస్కృతభాషయందలి ప్రాతిపదికస్వరూపపరిజ్ఞానము లేని వ్యక్తికిఁ దత్సమప్రయోగమున స్వాతంత్ర్య మెట్లు చేకూరును. అట్లే తద్భవజ్ఞాన మెట్లు సిద్ధించును. ఈవిషయమును బ్రాచీను లగు నథర్వణాచార్యులు నన్నయభట్టారకులు మున్నగు విద్వద్వతంసుల సంస్కృతభాషామయాంధ్రవ్యాకరణాది గ్రంథరచనలవలననే మనము సులభముగా గ్రహింపఁగలుగుదుము. అట్లే వారివ్యాకరణములలో సంజ్ఞలఁ గొన్నిటిని మార్చినను మొత్తముమీఁద సంస్కృతవ్యాకరణమునే వా రనుకరించుట యుఁ బలుచోట్ల దానినే యనుసరించుట యుఁ గానవచ్చుచున్నయవి. సంస్కృతవ్యాకరణజ్ఞానహీనుఁ డెట్లు వారివ్యాకరణములను విశుద్ధముగ గ్రహింపఁగలుగునో యోజింపుఁడు. కావున దీనివలనఁ గూడ నాంధ్రభాషకు సంస్కృతభాషాసంబంధ మత్యధికముగాఁ గల దని ధ్రువపడుచున్నది. విస్తరింపనేల. సంస్కృతభాషాజ్ఞానము లేని యాంధ్రవిద్వన్మాని విలుప్తరేఫశాస్త్రిశబ్దవాచ్యుఁ డనవచ్చును. కనుక మనకుఁ బ్రకృతివికృతు లగు సంస్కృతాంధ్రోభయభాషలలోను బరిశ్రమ మత్యవసర మని ఫలించినది. ఇపుడు రెండుభాషలలోఁ బరిశ్రమ చేయుట యధికాయాసమును జనింపఁజేయు నా. అట్టి యాయాసము కలుగు ననియే కదా యాధునికులు తేలికగా నుండు ననునాశయముతో నాంధ్రభాష నే స్వీకరించి సంస్కృతభాషను వీడిరి, యని కొందఱు ప్రశ్నింతు రని నే నెఱుంగుదుము. ఈయలసతయే మనయాంధ్రభాష నిట్టి దశకుఁ గొనివచ్చినదన్ననదియే సమాధానము. కారణ మట్టివారికి నాంధ్రభాషాస్వరూపపరిజ్ఞానమే లే దనవచ్చును. మనయాంధ్రభాషాయోషామణికి సంస్కృ

తసమ ముత్తమాంగము ప్రాకృతసమము కంఠము. దేశ్య ముదరము. సంస్కృతప్రాకృతభవములు రెండును రెండుపాదములుగా నున్నయవి. ఏనాఁడు సంస్కృతమును వీడిరో యానాఁడే యాపెయుత్తమాంగమును వీడియుండెను. తక్కుంగల యవయవములను మనగ్రామ్యకవులు వీడఁజేసిరి. కనుక నుభయభాషాపరిశ్రమమున కలసు లగువారు సంస్కృతభాషాపరిశ్రమముం జేయుటయే లాఘవము, కాని, సంస్కృతభాషను వీడి యాంధ్రభాషను స్వీకరించుటలో నాపెయుత్తమాంగశిథిలీకరణమునకే కారకు లగుదురు. ఏభాషయందైన నేశబ్దమునకైన శక్తిని దెలిసికొనుటలోఁ బ్రధానసాధనము వ్యాకరణ మనియుఁ దరువాతఁ గోశాదు లనియు "శక్తిగ్రహం వ్యాకరణోపమానకోశాప్తవాక్యాద్వ్యవహారతశ్చ। వాక్యస్య శేషాద్వివృతే ర్వదన్తి సాన్నిధ్యత స్సిద్ధపదస్య వృద్ధాః" అనువచనముచేఁ బెద్దలు చెప్పుచున్నారు. ఇట్టిస్థితిలో నాసంస్కృతభాషాజ్ఞానమున కాశబ్దస్వరూపజ్ఞానము నందుల కావ్యాకరణజ్ఞానము నవసరము లగును. కనుక నుభయభాషావ్యాకరణజ్ఞానముచే నుభయభాషాశబ్దస్వరూపములం దెలిసికొనినఁ గాని వెనుకఁ జెప్పిన రక్షణవర్ధనము లెన్నఁటికిని గలుగనేరవు. ఆంధ్రభాషాభిమాని యగు ప్రతివ్యక్తియు బాగుగ విమర్శించుకొనినచో సకలలోకైకపూజ్య యై విశ్వవ్యాపినియై సకలభాషలకును జనని యై సర్వాంగసుందరి యై సకలలౌకికాలౌకికవ్యవహారసాధిక యై కల్పవల్లివలె సకలాభీష్టార్థముల నొసంగుచు విలసిల్లు స్వప్రకృతిభాష యగుసంస్కృతభాషను వీడి యందలి రామణీయకమున కానందించి తృప్తిఁ జెందక దానికిని మఱియొకదానికిని వికృతిగా నున్న స్వదేశభాష నాదరించుటలో ముఖ్యకారణము తనకు శైశవము మొదలు లౌకికవ్యవహారమున కనుక్షణము నతివిస్తృతకాలమునఁ దనకు నిరంతరముగ నుపకరించుచుండుటచే నత్యధికోపకార్యోపకారకభావసంబంధవిశేషమున దానియందు జనించిన మమతావిశేషమూలకప్రేమవిశేషమే యని తేటతెల్లముకదా.

సంస్కృతభాష యిప్పటివఱకుఁ బ్రతినిత్యమును శ్రౌతస్మార్తపౌరాణికాదికర్మాచరణకాలమున ఆస్తికుఁడగువాని నాశ్రయించియే యున్నది. తనకుఁ గలయాస్తికత్వము ననుసరించి యాకాలమునందు న్యూనాధికభావము లేర్పడుచున్నవి. నాస్తికుఁ డగువానికి లేశమైనను లేకపోవచ్చును. సంస్కృతభాషాపండితులకు విశేషకాల ముండవచ్చును. ఇదిగాక సంస్కృతభాషాదరణము

కాలవశంబునఁ గ్రమక్రమముగఁ దగ్గుటయు వికృతభాషాదరణము హెచ్చుటయు నన్నయాదులకాలమునకుఁ బూర్వమే కలిగినదనియు నందులకుఁ గారణము రసలోలుపత్వమే యనియు నన్నయభట్టారకుని "స్వస్థానవేషభాషాభిమతాః" ఇత్యాది వాక్యముచే లభించుచున్నయది. కావున, "స్వదేశభాషయందాదరము కలుగుటకు దానియందొక విలక్షణానందాతిశయజనకతాశక్తి కలదని చెప్పవలసియున్నదికదా. అట్టివిలక్షణానందాతిశయము ననుభవింపఁగోరిన వ్యక్తి యట్టిపరిశ్రమమున కోర్వనిచో నది యెట్లు చేకూరునో గమనింపుఁడు. కనుక విలక్షణరసాస్వాదలోలుపు లగువారు ప్రాచీనులవలె వారిసంప్రదాయముల ననుసరించి యుభయభాషాపరిశ్రమ చేయకతప్పదు. ఇపుడు విశ్వవిద్యాలయములవా రుభయభాషాప్రవీణుల నత్యధికసంఖ్యాకులఁ దయారుచేయించుచుండ నీయకాండతాండవ మేల యందురేమో, వాస్తవమే. వా రట్లు తయారుచేయుచున్నారు. కాని యాప్రవీణులప్రావీణ్యము ననంతరమునఁ బరిశీలించినచో నెట్టిఫలితము చేకూరుచున్నదో విజ్ఞులకు విన్నవింపనక్కఱలేదు. విద్యావిధానమునందలి లోపముననో యధ్యయనాధ్యాపనములయందలి లోపముననో పరీక్షాపద్ధతులయందలి లోపముననో సముద్దిష్టఫలితము మాత్రము చేకూరుటలేదని చెప్పసాహసించినందులకు క్షమింపుఁడు. ఈయంశమున నాయాశయములను వ్యాసాంతరమున వెల్లడింతును. ప్రాచ్యసంప్రదాయపరిత్యాగమే ముఖ్యకారణ మని మాత్రము విన్నవించుచున్నాఁడను. ఇట్టిస్థితిలో నధునాతనులలోఁ జాలవఱకు విద్వాంసులు సంస్కృతభాషాపరిశ్రమను వీడి యత్యలసులై పాశ్చాత్యవాసనావిశేషంబున నాభాషను మృతభాషనుగాఁ జేర్చొనుచు నాంధ్రభాషయందైనఁ బ్రాచ్యప్రబంధములఁ బ్రాచ్యసంప్రదాయముతోఁ జదువక శక్తిగ్రాహకవ్యాకరణాదులవీడి విలాసమాత్రముగా నేనవలలనో నాటకములనో చూచుచు శబ్దస్వరూపజ్ఞానశూన్యులై తమచే విలాసముగఁ జూడఁబడినవానిలోని శబ్దముల ననుకరించుచు నర్థవ్యత్యాసముం గానక స్వాభీష్టార్థబోధకము లనుభ్రాన్తితో నర్థాంతరములయందు స్వైరముగఁ బ్రాచ్యనియమముల నన్నిటి నుల్లంఘించి ప్రయోగించుచు నాంధ్రభాషాతత్త్వవేత్తల మని విఱ్ఱవీఁగుచుండుట కడుంగడు శోచనీయము. పూర్వము "నాటకాన్తం కవిత్వమ్" అని యుండ నిపుడు "నాటకాది కవిత్వమ్" అని గ్రహించుచున్నారు. ఇఁక నేవత్రికందిలకించిన నేగ్రంథమునవలోకించిన నాధునికభాషాతత్త్వవిమర్శకమ్మన్యుల

విమర్శపరంపర కంత మగపడుట లేదు. ఇయ్యవి సాధారణముగాఁ బాశ్చాత్యవిమర్శనానుకారులై ప్రాచీనసత్కారమునకు మాత్రమే తోడుపడుచు భాషాస్వరూపవినాశనమునకే సంపూర్ణముగఁ బని చేయుచున్నయవి. ఇందులకుఁ దోడుగా వీరికన్నఘను లగునత్యులనవిలాసివిద్వద్వతంసు లన్నిటను బాశ్చాత్యతాదాత్మ్యమునే యభిలషించుచు స్వప్నమునందైన గ్రాంథికభాషావాసన లేక స్వదోషాచ్ఛాదనమునకై భాషాసంస్కారమున కుపక్రమించి తుదకు యెంకిపాటలు తందానపదములు మున్నగువానిచే భావకవిత్వ మనుపేరితోను గ్రామ్యకవిత్వ మనుపేరితోను గ్రంథములను బత్రికలలో వ్యాసములను బూరించి దేశీయులఁగూడ గ్రామ్యరతులఁ గావించుచున్నారు. ఏగ్రామ్యము సకలభాషావాగనుశాసకులును నిషేధించి వాగనుశాసనముం జేసిరో యట్టిగ్రామ్యమునే తాముపరిగ్రహించి దేశీయు లందఱచేఁ బరిగ్రహింపఁజేయఁ జూచుచున్నారో యట్టియత్యులను లఘుచ్ఛృంఖలుల కనంతనమోవాకముల నర్పించుటయే యీకాలము ననుసరించి మాదృశులకుఁ గర్తవ్యము కాని వేఱొండు లేదు. అట్టివా రట్టిపాటలతోడను బదములతోడనే యానందింతురుగాక. మా యీవ్యాసము వారికై యుద్దేశింపఁబడ లేదు. కాని పాశ్చాత్యవాసనావిశేషము స్వజాతిమతధర్మముల నెట్టిదశకుఁ గొనివచ్చినదో యట్లే స్వభాషను గూడఁ దీసికొనివచ్చుచున్నందులకు శోకింపని కోవిదుఁ డుండఁడు గావున నౌదాసీన్యమునకు మాత్ర మిపుడు సమయము కాదని కోవిదులకు విన్నవించుచుంటిని. ఇపుడు దేశమున నాంధ్రకవిపుంగవులకుఁ గొఱఁత లేదు. వారి యభినవబహుగ్రంథనిర్మాణమున కంతకన్నఁ గొఱఁత లేదు. కాని యొకగ్రంథమైనఁ బ్రాచీనకవిగ్రంథములఁ బోలియున్నదిమాత్రము సాధారణముగ మృగ్య మగుచున్నది. ఇందులకు ముఖ్యకారణములు ప్రాచీనసంప్రదాయపూర్వకముగఁ బ్రకృతిభాషాపరిశ్రమము పూర్ణానుస్వార మగుటయు స్వదేశభాషాపరిశ్రమ మంతకన్న వికృతి నొందుటయు ననియే నాయాశయము. దీనిచే దేశమున నిపుడు ప్రాచ్యానుకారు లగునుత్తమభాషాపండితు లనలే లేరని నాయాశయమునుగా గ్రహింపకుఁడు. అట్టివృద్ధులు కొలఁదిగా నుండిరి కనుకనే దీప మున్నపుడే గృహమును సరుదుకొనవలె నన్నట్లిపుడు కర్తవ్యప్రవృత్తిబోధనములు సఫలములగును. చేయి గాలినపిమ్మట నాకులం బట్టిన నేమిలాభము. కావున మనయాంధ్రభాషను రక్షణవర్ధనములతోఁ బూర్వస్థితికిం దేఁదలఁచి పాటుపడుచున్నవారి

షద్యమహాశయులు ప్రాచీనసంప్రదాయానుసార ముభయభాషావ్యాకరణముల తో నుభయభాషాకోశలక్షణగ్రంథాదులతో నుభయభాషాప్రాచీనప్రబన్ధముల నధ్యాపింపఁ జేసి కవితాపరికరములను సమగ్రముగ నార్జింపఁజేసి శ్రీభగవద్భ క్తిస్వధర్మనిరతులు కలవారినిఁగా నూతనవిద్యార్థులం దయారుచేయించి లబ్ధవా ణీప్రసాదు లగునట్టి యట్టియుభయభాషాకోవిదులద్వారముగ నూతనగ్రంథ నిర్మాణాదులఁ జేయించినఁగాని మనయాన్ధ్రభాష యభివృద్ధినొందనేరదనియు రక్షింపఁబడ దనియు నానిశ్చితాభిప్రాయము.

---

# గ్రంథస్వీకారము.

(1.) వేదకాలపు స్త్రీలు:—కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠాధ్యక్షులు బ్ర॥ జటావల్లభుల పురుషోత్తము బి. ఏ. గారు రచించినది. నామమాత్రముచేతనే గ్రంథమునందలి విషయము స్త్రీలు వేదకాలమునం దెట్లుండిరో దానిం దెలుపుటయే దీనియుద్దేశమని తోఁపకమానదు. సందర్భానుసారముగ వేదఋక్కులను దెలుఁగు తాత్పర్యముతో నందం దిచ్చియున్నారు. చతుర్దశాధ్యాయములోని సారాంశములను జదివితిమేని హేతుపూర్వకముగ నిందుఁ బ్రతిపాదింప బడిన సిద్ధాంతముల సంగ్రహము తెలియుఁగలదు. సారాంశములు 89 క్రిందను విభజించి చూపినారు వానిం దిలకింప నేవో కొన్ని తప్ప నిప్పటికిని సంప్రదాయముగల కుటుంబములలోనున్న స్త్రీలు నలుపుచున్న సదాచారములే కలవు. స్త్రీలయెడల సజ్జను లిప్పుడును గమనించుచున్న విధ్యుక్తధర్మములు, గౌరవము, నభిమానము తేటతెల్లముగా నగపడుచున్నది.

10, వివాహ మగుచుండఁగనే పిల్ల నత్తవారింటికి బంపెడువారు. 20, సహగమనముకూడ నుండెను. అను నంశము లిప్పటికాలమునఁ గ్రొత్తగాఁ గాన్పించును. తక్కినవిఁ గ్రొత్తగా నుండ వని మేము తలంతుము. 21, సూత్రము "సంతతి లేనివితంతువు మఱఁదివలన సంతానముఁబడయుట యుండెను." అను నది మహారాష్ట్ర దేశములో నిపుడును గల దందురు. కులస్త్రీలకుఁ బనికివచ్చు ననేకమార్గము లిందు వేదకాలమునాఁటివి చాలఁ జూపఁబడినవి.

అక్కడక్కడి కొన్నివాక్యములు మచ్చుచూడఁదగును. "భర్తకంటె నితరుఁడగు పురుషునితో సంచరించుట మహాపాప మనియు నవివాహిత యగు స్త్రీకి పురుషసంయోగము నిషిద్ధమనియు పైవాక్యములవలన తెలియుచున్నది. పాతివ్రత్యమును కాపాడుకొనుట కాత్మహత్య యొక్కొక్కప్పుడు సాధన మని కూడ నిందువలన తెలియుచున్నది. అట్లైన నావిధముగ నాత్మహత్య చేసికొనిన స్త్రీకి పాపము వచ్చునని యిట నేల చెప్పఁబడినదనగా యింద్రియనిగ్రహము లేకుండుటయే యిచటి పాపహేతువుగాని యాత్మహత్యమాత్రము పాపహేతువు కాదని చెప్ప వలసియున్నది. ఇంద్రియనిగ్రహము లేక పశువాంఛకులోనైన స్త్రీకంటె నింద్రియనిగ్రహము లేనపు డాత్మహత్య గావించిన స్త్రీ చాల మేలు" పుట 187.

"ఇంటిలో గృహపత్ని వై యున్నపుడే యామెకు బాధ్యత యుండు,

ఇంటి కాడుపడుచుగ నుండినపుడుగాని బాలికగ నుండినపుడుగాని యామెకు బాధ్యత లేదు. గృహాయజమానియొక్క కూతురు గోవులకు పాలు పితుకుట యను కృత్యమును నెరవేర్చుచుండెనని చెప్పుటకు కొంత యాధారమున్నది. ఎట్లన దుహితయను పదము "దుహ్" ధాతువునుండి వచ్చుచున్నది పితుకుట యని దీనియర్థము. కావున దుహిత (కూతురు) అనగా పాలు పితుకునదియని తెలుచున్నది. ఈగ్రంథముయొక్క ప్రథమాధ్యాయములో దుహిత యనగా దూరమందు సంబంధము చేయదగినదను నర్థము తెలుపఁబడినది. ఆయర్థమును పాలుపితుకునది యనునర్థమును గూడ నీశబ్దమునకు చెప్పుటకు వీలున్నది."
పుట 66. దీని వెల రు 0—10—0 లు. క్రౌనుసైజు 190 పుటలు.

అనుబంధముగాఁ జివర, రు. 12000 లకు డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తా వేజు, అను బ్ర॥ వల్లూరి సూర్యనారాయణరావుగారు ఆంధ్రగీర్వాణ విద్యా పీఠమునకు వ్రాసియిచ్చిన దాని ప్రతి గలదు.

(2.) A descriptive catalogue of the Telugu Manuscripts in the Tanjore Maharaja Serfoji's Saraswati Mahal Library. తెనుఁగు వ్రాఁతపుస్తకముల పట్టిక-తంజావూరుకోటలోనున్న బహుభాషాగ్రంథములలోని యాంధ్రగ్రంథముల పట్టిక. దీనికై యాంధ్రు లనేకు లనేక యత్నములు పుష్ప హస్తములతోఁ జేసిరి. కాని నెఱవేఱలేదు. మాటలతో, నుపన్యాసములతో సాధ్యపడునది కాదని తెల్పుటకై ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు విశేషవ్యయ మునకు శ్రమకునోర్చి యిన్నాళ్లకుదీనిని వెలువరించియాంధ్రులకోరికం దీర్చిరి.

తంజావూరు లైబ్రరిలో తెనుఁగుగ్రంథములు విశేషముగ లేవు. 816 మాత్రమే. వెనుకఁ గొందఱు వెళ్లి చూచినపుడు వ్రాఁతపట్టికలో 700 చిల్లర గ్రంథములు కనఁబడినవి ఒక్కొక్కసంపుటములోఁ బేరు లేకుండ నున్నవియు, నాంధ్రలిపినుండియు నితరభాషలలోఁ జేరినవియు, నాంధ్రగ్రంథము లయ్యు నితరలిపిలో నున్నవియుఁ గొన్ని యిటీవల దొరికినవి ఇందు దాక్షిణాత్యులు వ్రాసిన యక్షగానములు మెండు ఒక్కగ్రంథమునకే యనేకప్రతులు గలవు. అట్టివిచేర్చినచే 816 అయినవి. ఈపుస్తకభాండాగారమునుండియే కం వీరేశ లింగముపంతులుఁగారు దశకుమారచరిత్రము, ఉత్తరహరివంశము వ్రాయించి తెప్పించి ప్రకటించిరి. శ్రీ పోలవరము జమీందారుగారు హరవిలాసము, కేయూ రబాహుచరిత్రము, బహులాశ్వచరిత్రము, మున్నగు వానిని బ్రకటించిరి. వ్రా॥ మానవల్లిరామకృష్ణకవిగారు కుమారసంభవము నిందుండియె తెప్పించి

ప్రకటించిరి. మాకు వీరిచ్చిన సాంబోపాఖ్యానము ప్రతియు నిందుండి గ్రహింపఁబడినదే. ప్రతి మాకుం బూర్ణముగా లభించినది గాని తంజావూరిలో నిపుడు మాతృక యేకారణముననో యసమగ్రముగా నున్నది. ఇంకను నముద్రితములగు జక్కరాజు వేంకటకవి కామందకనీతిశాస్త్రము, సింగనామాత్యుని భాగవతద్విపద, తిమ్మయ మహాభారతము, ఆదిపర్వము, ఉద్యోగము, భీష్మపర్వము, ద్రోణపర్వము, మఱియు నితరకవులద్విపదకావ్యములు చాలఁగలవు. తిమ్మయ విరాటపర్వమొక్కటియె యచ్చుపడినది. వరదరాజకవి రామాయణ ద్విపద ప్రశస్తమైనది కలదు, ప్రబంధసారశిరోమణి, ప్రబంధరత్నాకరము మున్నగునవి గలవు తంజావూరు ప్రభువులు ఎకోజీ, శహజీ, శివాజీమహారాజులు రచించిన గ్రంథములు చాలఁగలవు.

దీనినిగూడ సంస్కృతగ్రంథపట్టిక సిద్ధముచేయించిన విద్యాసాగర ప్రొఫెసరు పి. పి శాస్త్రిగారే వ్రాయించిరి. ఇందు, అకారాదిగా గ్రంథముల, కవుల, వ్రాయసకాండ్ర పట్టిక లీయఁబడినవి. కొన్నికొన్ని గ్రంథము లెంతకాలము క్రిందట వ్రాయఁబడినవో తెల్పఁబడినవి. గ్రంథము, తుల, అర్థు, పత్రముల సంఖ్య, పుటలోనిపంక్తులు, గ్రంథపరిమాణము, తెల్పియున్నారు. గ్రంథాలయ మెంతకాలముక్రిందట నెవరిచేఁ బ్రారంభింపఁబడినది, యెట్లు వృద్ధియైనది మొదలగు విషయములతో విపులాంగ్లపీఠికగలదు. నలచరిత్ర ద్విపద, రామాయణ పద్యకావ్యమును, రఘునాథరాయలు రచించినవి యీప్రాంతములలో నున్నవి. అక్కడఁబుట్టి యిక్కడఁ బ్రచారములో నున్న యవి గ్రంథాలయపట్టికలో లేకుండుట వింతగానున్నది. ఈమహోపకారకగ్రంథము వెల రు. 2-లు వాల్తేరులో నాంధ్రవిశ్వకళాపరిషత్తులో దొరకును.

(3.) కవిత్వతత్త్వవిచారము :—ఇదియును నాంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచేఁ బ్రకటింపఁబడినదియే. మ॥ కట్టమంచి రామలింగరెడ్డి ఎం. ఏ. గారు రచియించినది.

"ఈకవిత్వతత్త్వవిచార మాంధ్రలోకమునకుఁ జిరపరిచితము గాని క్రొత్తది కాదు. ఆంగ్లవాఙ్మయకోవిదులును సుప్రసిద్ధులునగు శ్రీయుత కట్టమంచి రామలింగరెడ్డిగారి యాంధ్రసాహిత్యసారజ్ఞతకు ఫలముగా, క్రీ. 1899 లో వికసించి ప్రకాశించిన యీకళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్న విమర్శనమందలి విషయ మింతకుమున్నే భాషాభిమానులు చక్కఁగా నెఱిఁగియున్నను శ్రీరెడ్డిగా రుపాధ్యక్షులుగా నున్న తఱి దీని నాంధ్రవిశ్వకళాపరిషత్తునకు సమర్పించి

యుండుటచే.........వ్రాయకవలసివచ్చినదిగాని నిజముగా నిద్ధి సిద్ధకథనమే” అని పీఠికలో బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు లిఖియించినదానినే మేమును లిఖించుచున్నాము వెనుకటిదానికిది రెండవకూర్పు. వెలరు 1-

(4) శ్రీలక్ష్మీశారదాసుభాషితము:- రచయిత్రులు, శ్రీమతులు లక్ష్మీశారదలు. లక్ష్మీశారదానిలయము నూజవీడు- శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారును శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబగారును రచియించినది.

లక్ష్మీశారదలు చెలియొక్కొక్క పద్యముతోను, లోకములోఁగల నీతులను సుభాషితములక్రిందఁ వివరించిరి. ఇందన్నియుఁ గ్రొత్తవి గావు, అన్నియుఁ బ్రాఁతవియుఁ గావు. కొన్ని పూర్వకవులు గ్రంథములలో వాడినయవియే. కొన్నిశ్లోకములకుఁదెనుఁగుపద్యములు చేసిరి. ఇక్కాలపు గరితలలో నిట్టికవిత్వమునలవఱచుకొన్నవారు చాలఁ గొఱఁతగనున్నారు వీరికవనము సంస్కృతాంధ్రపదతుల్యత రాణించుచున్నది. మచ్చు-

ఉ. బంధురధీరతాశిఖరివల్లభుఁజూచుట కోర్వలేక, గ
ర్వాంధులు నిందసేసిన, తిరంబగునాతనివన్నె తగ్గునే
గంధగజేంద్రమేగ శునకంబులు పెక్కుమొఱింగినంతఁ, ద
ద్గంధగజప్రభావమునఁ గల్గునె లోపమొకింత శారదా. 58

శా. న్యాయంబొప్పఁ జరించుధీవరుల కన్యాయాపకృత్యంబులన్
జేయంగానమకట్టునట్టిజనుఁ డాసేతల్ తనేబొందుఁజూ
ఆయింద్రున్ బుజుమార్గవర్తిఁ గని యన్యాయంబుగా బాధలన్
జేయంబూనినదానవుల్ మడియరే శ్రీలక్ష్మి! కాంతామణీ. 127

చ. అవసర మెంచి యెల్లపుడు నల్లనఁ జల్పెడు స్వార్థకృత్యముల్
భువి పరసేవకౌనె? నిజభుక్తికిగాక పరార్థమెట్లగున్;
సవినయభక్తిఁజూపుచుఁ బ్రసాదముకై గుడిపంచఁజేరు భూ
దివిజులనైన భక్తులనఁ దీరునె ధీరవిచారశారదా. 134

ఇప్పద్యములో “సవినయభక్తిఁజూపుచుఁ బ్రసాదముకై గుడిపంచఁజేరువారు” భక్తులేలకారో తెలియదు. మఱి యెట్టివారు భక్తులో? ఇది వీరిక్రొత్తకల్పన కావచ్చును.

దీనివెల రు. 0-8-0 నూజవీడులో దొరకును.

---

# అహదనకరశాసనము.

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ., కాకినాడ.

---

ప్రాచీనాంధ్రశాసనములలో నీశాసన మొక్కటియే పండితులకు దురవగాహమై యున్నది. ఈశాసనమున కర్థమును వ్రాయుటకు మొదటఁ గృషిసల్పినవారు కీర్తిశేషులైన శ్రీ కొ. లక్ష్మణరావుగారు. వారు కృతకృత్యు లగుటకు మునుపె, యకాలమృత్యువు వాతను బడిరి. తరువాతను బసవపురాణ, క్రీడాభిరామాది గ్రంథసంపాదకులగు బ్ర॥ ప్రభాకరశాస్త్రులవారు విశేషశ్రమ కోర్చి శాసనపాఠమును జదివి, ప్రతిపదార్థతాత్పర్యవివరణాదులతో భారతిలో నీ శాసనమును బ్రకటించిరి. వారిచ్చినపాఠము సరియైనది కాదని శ్రీసోమశేఖరశర్మగారును, శ్రీ వేంకటరమణయ్యగారును భారతిలోనె విమర్శనములు గావించి, వారి తప్పొప్పుల నాంధ్రపండితలోకమున కెఱింగించియుండిరి. ఆంధ్రదేశములోఁ బ్రాచీనశాసనములను జదువువారిలో, శ్రీ జయంతి రామయ్య పంతులుగారును, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారును, నగ్రగణ్యులు. వారలతరువాత నాకుఁ దెలిసినంతవఱకు శర్మగారొక్కరె యీవిధానమున నేర్పరులు. శర్మగారిచ్చినపాఠమె యెక్కువ సమంజసముగ నున్నదని నామనవి. ప్రభాకరశాస్త్రులవారు శాసనమును బ్రకటించినతర్వాత, నద్దానిలో వారిచ్చిన పాఠభేదము లటుండనిచ్చి, ప్రతిపదార్థవివరణముతో సహిత మేకీభవింపనికారణము లుండుటచే, నీశాసనమును మఱలఁ బ్రకటించుచున్నాఁడను. కీర్తిశేషులైనలక్ష్మణరావుగారీశాసనమును, ఆంధ్రపరిషత్పత్రికలోఁ బ్రకటింప నిచ్ఛగలవారై, వారియభీష్టము నెఱవేర్చుకొనలేకపోయిరి. ఇప్పుడు నాపరిశోధన ఫలితమును దత్పత్రికలోఁ బ్రకటించుచున్నాఁడను. శ్రీలక్ష్మణరావుగారె సజీవులైయుండినచో, నీశాసనమునకు సరియైన పాఠమును దీర్చి, ప్రతిపదార్థమును సహేతుకముగాఁ బ్రకటించియుందురు. ఆంధ్రలోక మాభాగ్యమును నోఁచుకొనలేదు.

ఇందు వ్రాసిన ప్రతిపదార్థవివరణములు సరియయిన యాధారములతో నిరూపించియున్నాఁడను. ప్రభాకరశాస్త్రులవారు పడినశ్రమ వ్యర్థమని కాని వారిచ్చినయర్థము తప్పనికాని, నేను జెప్పను. ప్రమాదము పురుషలక్షణము, ప్రాజ్ఞు లున్నారుగదా. ఈశాసన మింకను బరిశోధింపవలసియున్నది.

## శాసనము—ఆంధ్రభాగము.

### మూలము.

### మూఁడవ రేకు—మొదటిప్రక్క.

17 స్వస్త ప్రిధివిశల్లవపట్టణబున ఊరి
18 వారు కరిగళ్ళవడవరికి ఊరిస్వాముల్ ఇచ్చినస్థితి రెణ్డువండలపట్టనాప్రరకు
19 అరియుడగు తెఱయుసిద్ధాయంబుదణ్డువసవరాథంబునుసర్వబాధపరి
20 యారువు ఊరుదాయసెసి ఇచ్చి దినికి వక్రంబులైను వచ్చినవారు గళరెని ఊరిస్థితి
21 దప్పినవారు దినికి వక్రంబు వచ్చినగచ్చురు రెణ్డువడల ఎలెమువరు లెముల చె
22 సినదియు చన్ను పిరివయి నాపువరు గల్గిన ఎళెముల చేసిన సెయుడు సను.

1. స్వస్త=స్వస్తి, శాసనారంభములో 'స్వస్తిశ్రీ' యనియున్నది. తెలుఁగు భాగము ప్రారంభించినపుడు డీయుంగళవాచకమె శాసనలేఖకుఁడు ప్రయోగించెను.

2. ప్రిధివిపల్లవపట్టణబున=పృథివీకల్లవపట్టణమున, ప్రాచీనాంధ్రశాసనములలోఁ బ్రథమావిభక్తిప్రత్యయము 'బు' గానె యున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనములో 'నెగిదీర్చెమఠంబు,' "అశ్వమేధంబునఫలంబు" అని ప్రయోగము లున్నవి. తరువాత నీరూపములె 'మఠము' 'ఫలము' అయినవి. ప్రిధివి=పృథివి, ఋకారమునకు, ఇకారసహిత రేఫమె ప్రాచీనశాసనములలోఁ గలదు. ఇది యుచ్చారణలాఘవము ననుసరించి, శాసనలేఖకుఁడు వ్రాసియుండును.

శాసనపద్యమంజరి. శాసనము 2, 10, 41.

3. ఊరివారు కరిగళ్ళవడవరికి=గ్రామమున వెలసిన కరిగళ్ళవడవరు, కరిగళ్ళస్వామి యని దేవునినామము. శాస్త్రులవా రీపద మీశ్వరునకె చెల్లుననిరి. అటులే కరిగళ్ల, కఱగంఠ కావలయును. ప్రాచీనశాసనములలో దేవునిపే రీవిధముననె గలదు.

"శ్రీపురుషోత్తమపట్ట[నము]చోడవిణ్ణగరాడ్వారికి" అని దేవునిపేరుగలదు.
South Indian Inscriptions Vol. V. No. 8, 15, 16, 17.

4. ఊరిస్వాముల్=గ్రామపాలకులు, ప్రాచీనాంధ్రశాసనములలో బహువచనప్రత్యయము 'ల్' గానె యున్నది. 'ఊరిస్వాములు' అనుటకు 'ఊరి

స్వాముల్' అనుటయె ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయము.

సంవత్సరంబుల్ }
రాజుల్ } South Indian Inscriptions Vol VI. No. 584.

5 ఇచ్చినస్తితి=ఇచ్చినట్టిస్థితి, అనఁగా వృత్తి. ఈస్థితి యనుపదము యుద్ధమల్లుని బెజవాడ శాసనములో రెండుపర్యాయములు వచ్చినది.

శాసనపద్యమంజరి. శాసనము ౪.

6. రెణ్డువాడలపట్టనావ్రరకు=రెండువాడలపట్టణానివాసులకు.

7. అరియు=పన్ను లేక కప్పము. యు సముచ్చయము.

తే సఖ్యసంబంధములఁ జేసి చక్రధరుఁడు
ద్రుపదుఁడును దక్కఁదక్కిన నృపతులెల్ల
నరియుఁబెట్టువారు కే రఖిలజలధి
వలయితక్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి సభా. ద్వి. ఆ. ప. 106.

"అరి యనఁ గప్పం బనఁగాఁ గరమునకుంబేళ్లు—ఆంధ్రనామశేషము.

నన్నయభట్టు పైయర్థమునందే యీపదమును బ్రయోగించెను.

8. డగు=ఇదియు నొకకరవిశేషము. తఱుగు, తగ్గు.

తఱుగు=Brokerage. South Indian Inscriptions Vol. I. Pages 155 & 110.

9. తెఱియు=ఇందు 'యు' సముచ్చయము. తెఱ కర్ణాటకభాషలో 'పన్ను' అని యర్థము.

తెఱ=Tribute or Tax. (Kittel's Dictionary).

10. సిద్ధాయంబు=సిద్ధాయము. ఇది యొకతీరుపన్ను. ప్రాచీనశాసనములందుఁ జేర్పఁబడినది

"The said assembly shall not levy any tax other than 'Siddaya', 'Dandaya' etc."

Epigraphical Report 1918. No. 362 of 1917.

11. దణ్డు=దండము లేక దండాయము. ఇదియు నొక విధమైనపన్ను. 'సిద్ధాయంబు' అనుపదమున కర్థమును జూచునది.

'Dandam'—An Imp st.

Madras Epigraphical Report 1912. No. 255 of 1911.

12. దసవరాధంబున్=దశాపరాధమును. ఇది యొకపన్ను. అపరాధము =

Fine or Penalty అని Kittel's Dictionary లోఁ గలదు పన్నులు చె ల్లింపనియెడల విధించు 'జుల్మానా' లేక 'పెచ్చుపన్ను' అయియుండును.

13. సవ్వఁ బాదపరియారవు=సర్వబాధాపరిహారముగ. ఏమి పన్ను చెల్లింప నక్కఱలేకయే యని యర్థము. ప్రాచీనశాసనములలో 'సర్వకరపరిహార ముగ' 'సర్వబాధాపరిహారముగ' నను నీరెండు పదములును బర్యాయపద ములుగ నుపయోగింపఁబడినవి.

సర్వకరపరిహారము—South Indian Inscriptions Vol. V. No. 90 91. Vol. VI. No. 114, 561, 568, 624.
సర్వపాదపరిహారం—Vol. VI. No. 561.
సర్వబాధాపరిహార(ం)—Vol VI. No. 558. (ఇదికన్నడశాసనము)
Vol. VI. No. 624. (ఇది తెలుఁగుశాసనము.)

కర్ణాటశాసనసంపాదకు లైన రైసు (Rice) దొరగారీపదమునకు 'Free of all imposts' అని యర్థమును వ్రాసిరి. చూడుఁడు.

Epigraphia Carnatica.—Vol. VI. K.P. No. 38, 39, 40 and 141.
ఆశాసనము లేడు, ఎనిమిది, తొమ్మిదవశతాబ్దముల నాఁటివి. మనశాస నమాకాలమునాఁటిదే.

14. ఊరుదాయసేసిఇచ్చి=గ్రామమును బంచి యిచ్చిరి. ఇచ్చట 'ఇచ్చి' సమా పకక్రియఁగా నెంతును. అసమాపకక్రియఁగా శాస్త్రులవారు పరిగణిం చిరి. దాయపదమునకుఁ బంచుట యని యర్థము.

దాయ=పంచుకొనఁదగిన—Brown's Dictionary.

దాయ=Partition, Gift లేక ఈవి. Kittel's Dictionary.

15. దినికి వక్రంబు లెదు=దీనికి వక్రము లేదు. వక్రమునఁగా అస్థ, ఆటంకము, విచ్ఛేదము, అనియర్థము. ఈపదము ప్రాచీనశాసనములలో బహుళముగఁ బ్రయోగింపఁబడినది.

వక్రమైరేని—South Indian Inscriptions Vol. IV. No. 1314.

16. వచ్చినవారు=వక్రమువచ్చినవారు. ఆటంకకలిగించిడివారు.

17. గళరెని=కలగేని, ఉన్నయెడల.

18. ఊరిస్తితి=గ్రామవృత్తిని. పైనొనంగఁబడినస్థితి.

19. ధప్పినవారు=పోఁగొట్టుకొన్నవారు.

20. ధినికి=దీనికి.

21. వక్రంబువచ్చిన=అడ్డువచ్చిన, ఆటంకపఱిచిన.

22. గచ్చురు=ఈపదము 'గచ్చుకొను' అనుదానియం దుత్పన్నమైనది. ఒక పక్షమునవలంబించి యుండువారు, లేక, ఎదిరిపక్షమువారు అని యర్థము చెప్పవలెను.

గచ్చుకొను=To adhere, Cleave, Stick.—Brown's Dictionary.

23. రెణ్డుపడల=రెండు వాడల నుండవి

24. ఎలెమువరు=ఈపదమున కర్థము వ్రాయుటలో శాస్త్రులవారు పొరపడినారని నా నిశ్చితాభిప్రాయము. దీని కర్థము 'గ్రామాధికారులు' అని వారు చెప్పిరి. ఏలె + మువరు అని పదవిభాగము నొనర్చిరి. ముందు పదమునందలి 'లె' (లెకుల) తప్పుగాఁ బడిన దని సెల విచ్చిరి. ఈశాసనమును జెక్కుటలో రెండుమూఁడుచోట్ల నక్షరములను జెక్కుట మఱచినస్థలములు గలవు వానిని ముందు సూచింతును. ఎల యనఁగా సాక్షి యని యర్థము. ఎలమువరు=సాక్షులు అని యర్థము చెప్పుకొన్న నెక్కుడ సమంజసముగ నుండును. శర్మగారు 'ము' అనునక్షరము 'వు' గాఁ జదివిరి. అది 'ము' కాని, 'వు' గాదు ప్రాచీనశాసనములను జదివినచో, దానవిక్రయాదివిశేషములు పంచప్రధానులసముక్షముననో, కొందఱు సాక్షులసముక్షముననో జరిగి దానశాసనములు వ్రాయఁబడినట్లు తెలియును. అట్లె యీశాసనముననుగూడ.

ఎల=సాక్షి-Brown's Dictionary.

25. లెములు=[ఎ] లెముల=సాక్ష్యముల.

26 చెసినదియు=ఏమియొనర్చినను సరియె.

27. చన్ను=చెల్లుబడి యగును. ప్రాచీనాంధ్ర శాసనములలో నీయర్థమునను ప్రయోగము గలదు.

ఆంధ్ర సాహిత్యపరిషత్తువారు ప్రకటించిన యుద్ధమల్లుని బెజవాడ శాసనమును జూడుఁడు.

"దీనిం జెక్రొలు యేలెను (వా) రతిరం బేలు (వా) రొణ్డుసోటిగొరగ (లం)ను బెట్టు వేరుగనుజ(ను)

ఈ 'చన్ను' రూపము నన్నయాదులభాషలో లే దని శాస్త్రులవారి యభిప్రాయము. ఈప్రయోగ మీయర్థమునను నన్నయభట్టు భారతములోనఁగలదు.

చం. కడుఁజనువాఁడునై పురుషకారియుఁ దక్షుఁడునై నమంత్రి, వెం
బడరఁగ రాజపుత్త్రుల మహాధనవంతులఁ జేసి వారితో
నొడఁబడి పక్షమేర్పడఁగ నుండఁడు గా ధన మెట్టివారికిం
గడుకొని చేయకుండు నిజగన్నుతగర్వము సర్వమోహముల్. సభా 1-31

ఇందు 'చనువాఁడునై' అన్నపదమునకు 'జెల్లుబడికలవాఁడై', అని యె యర్థము.

28 విరిపయినాడువరు=వీరినమక్షమున నె క్షవసంగతులు దెలిసికొనఁ దలఁచిన వారు. నాడు అనుపదమునకు 'వెతుకుట' 'విచారించుట' 'కోరుట' అని కన్నడభాషలోను, అఱవభాషలోను గూడ నర్థమున్నది.

నాడు:-To seek, inquire, desire greatly (Kittel's Dictionary)

29. గల్గిన=కల్గినచో, ఉన్నచో.

30. ఎళెముల=సాక్ష్యముల.

31 చెసిన= చేసినట్టివారు. (సాక్షుల నామములు దీని తరువాతిభాగమునఁ గలవు.)

32. *సెయుడుసను=చేయుట చెల్లుబడియగును. చన్ను, చను, సను సమానార్థకములె

ఇప్పటి కొకభాగము ముగిసినది. ఈభాగ మంతక్లిష్టముగ లేకున్నను, గొంత సుగమముగానే యున్నది. దీనితర్వాతిభాగ మింతకన్న కష్టతరముగా నున్నది. అర్థవివరణమును జూడనగును

రెండవభాగము.

మూఁడవరేకు-రెండవప్రక్క.

23. మహానబియుల్ నరాళొక మహాసత్త్వర్ల్ విరాపరమహావబియుల్ గజ్జంబుసె

24. ల్లినమపుల్ శమ సభువన శ్రియకనడిరజు బద్ద పెరయ ఊరివనిసవ్వసివర

25. వర్మ్యెటిమహనబిల్ వర్మ్యెటి మహాబిల్ వనికొళు చెనెరకవజ్ఞ్వసన్సి

26 పర్మ్యెటిమహనబియుల్ సకల కొన్దుకళ్ సవ్వలొకక్ర యామహాన్తవల్

* సెయుఁడు. ఈ ప్రయోగము నన్నెచోడుని కుమారసంభవములోనున్నది.

కం. వేదాంతభారతపురా, ణాదులు సేయుఁడొకపేర్మియనుచుం బొగడం
గా దెద్ద నజుఁడు నోపని, వేదము లేర్పిరిచె ననిన వేదవ్యాసుఁ. ఆ. ౧. ప. ౧౫.

ఇట్లె 'సెప్పుడు'—

పగదం బుద్ధిసెప్పుడిది దప్పెవరానన వీకుఁజూడఁగాఁ. ఆ ౭. ప ౧౬౪.

27. పెర్గణ్ నెరవద్యమహాసత్త్రణవళ్ వసిణ్డిముఙ్లు వెటన్దలచరువ మ్యు విష్ణు వర్ధనను

28. హాసత్తవళ్ వసుశైవ్రల కొన్తుకళ్ అచ్చువబ్బవనియు కొన్తుకళ్ గజంబు సెర్గల

29. నజపుల్ ప్రిథిమిమహాసత్త్రణకళ్ పెటన్గళ్ పొనికన్రిఅను కొళనవు విష్ణువర్ధన

నాల్గవ రేకు — మొదటిప్రక్క.

30. మహాసత్తవల కొన్తుకలు నిరవద్యప్రిధికడిరజుల్ గుణవనమహానవియుళ్

31. ముద్దకఙ్చికొళ్ రబిష్వరా ప్రిథిమహాసత్త్రణవళ అవయుజనువకొలకొణ్ణు కళ్ కొరిన్తికొళ్.

32. కరివలప్రిధివిమహాసత్తవలకొన్తుకళ్ సన్దిమహానవిలనమపు శ్రీమహా

33. సత్తవళ సకలొకశ్రయ్య ప్రిథిమహాసత్త్రణవల దివకరయ్యవజ్ఞు

34. కొళ్ శ్రీజష్టి పెన్దట్టఙ్గన్తాన్తు.

శ్రీశాస్త్రులవారు పడిన శ్రమ యుంతయు నీభాగమున కర్థము వ్రాయుటలోఁ గననగును. శాసనము పూర్తి కాలేదని వారియభిప్రాయము. శాసనమును బరిసమాప్తిని గావించి, శాసనాంతమున లేఖకుఁడు తననామములను వ్రాసి యానెనని నామనవి.

అర్థవివరణము.

1. మహానబియుళ్ = మహానభియుక్తుఁడైన. 'ళ్' బహువచన ప్రత్యయము. గౌరవార్థకమున నేకవచనముననే ప్రయోగము. ఈపదమున కింగ్లీషులో 'Councillor' అని యర్థము గుదురును. మహానాడు అనఁగా 'A Council held by Headmen' అని Brown దొరవారి నిఘంటువులోవలెఁ గలదు. మహానబియుళ్, మహాబిళ్, మొదలయిన పదములు ముందటివాక్యములో వచ్చును. ఈపదములకర్థ మొక్కటియె యైయుండును. పల్లవపట్టన మహానాటి సభ్యులలో నొకరు లేక వారిలో శ్రేష్ఠుఁడు లేక నాయకుఁడు, గొప్పవాడు, అనియర్థము.

2. నరాళోక =నరాలోక, ప్రాచీనశాసనములలో 'ల' కు మాఱుగ 'ళ' మొయుపయోగింపఁబడినది. ఆకాలమునాఁటి యుచ్చారణము ననుసరించి,వ్రాఁతయు నట్లె యుండెను.

3. మహాసత్త్వరుళ్ =మహాసత్త్వులు.
4. విరాపరమహానబియుళ్ =వీరపరమమహానభియుజ్జులు.
5. గజ్జంబుసెల్లినడుపుళ్ =ఇక్కడ శాస్త్రిలవారు 'గజ్జంబు' అను పదము నకు 'గంజము' అనుగ్రామ మర్థమనిరి ఈపదము 'గజంబు' అని యె తర్వాతివాక్యములో వచ్చినది-అచ్చట 'గంజబు' అని వ్రాయఁబడలేదు. ఇచ్చట 'గజ్జంబుసెల్లినడుపుళ్' అను పదమునకు 'గజయూథములపై నధికారము గలవారు' అని యర్థమును జేసికొందును. 'Officers in Charge of Elephants.'
6. శమస్త =సమస్త.
7. భువనశ్రియ =భువనాశ్రయ, బిరుదవాచకము.
8. కన్నడిరజ =కన్నడిరాజు, కన్నడరాజు.
9. బగ్రపెరయ =భద్రపేరయ- ఇదియొకనిపేరు. పైపదములన్నియు, నీపు రుషుని బిరుదావళి కాఁగలదు. ఇప్పటికొక్క వాక్యము ముగిసెను.
10. ఊరిపనిన =గ్రామకార్యమును, పనియనఁగా నియోగము, వ్యాపారము, వ్యవసాయము.
11. వ్రసివర=కష్టపడి, శ్రమపడి.
12. వయ్యొటి=ఈపదమున కర్థము 'నిర్వహింతురు' అని-గ్రామకార్యముల ను శ్రమపడి నిర్వహింతురు, లేక సాగింతురు. ఒయి, ఒయ్యు, వయా, వయ్యు,= To Conduct, To Convey. Kittel's Dictionary.
13. మహానబిళ్=మహానబియుళ్ అనుపదమును జూచునది.
14. వయ్యొటి=నిర్వహించువారు కొనసాగించువారు.
15. మహాబిళ్ =మహానబియుళ్, మహానబిళ్ అనుపదములను జూచునది.
16. పనికొళుచెనెరక=నియోగమును నిర్వర్తింపలేనియెడల-కొళు లేక కొళ్ళు అను పదమునకు To accept, to obtain, to meet with success buy or to undertake అని యర్థము.
17. పఱ్చిన=విభాగించిన. ఇచ్చినస్థితి. మఱలఁబంచినచో ఊరుబాయుచేసి,అను చోట 'పంచుట' యనియే యర్థమును జెప్పుకొంటిమి, కావున, 'పంచిన' యనునర్థమునుగూడ నాయర్థమునందె గ్రహింపవలెను.
18. వసి=కష్టపడి, శ్రమపడి. పదునొకండవ పదమును జూచునది.

19. పయ్యోటి=నిర్వర్తింపఁగలవారు- మొదట పంచినస్థితి సరిగా నిర్వర్తింప లేనియెడల దానినే మఱల పంచి, మహానభిజ్ఞులు ఆస్థితిని కష్టపడి నిర్వర్తింపఁగలవారు, కొనసాగింపఁగలవారు.

20. మహానబియుళ్=మహానభిజ్ఞులు.

21. సకల=సమస్త; 'సకల' అనుపదమును శాస్త్రులవారు 'మరల' అని చదివిరి. ఈపదము 'సకల'యనిస్పష్టము. 'మరల' పాఠము సరియయినది కాదని శ్రీ వేంకటరమణయ్యగారియాక్షేపణలు సమంజసమైనవి. ప్రభాకరశాస్త్రులవారీయక్షరములఁ జదువుటలోఁ బొరపడిరని నామనవి.

22. కొన్రుకళ్=కొన్రు+కళ్, కొన్రుకళ్-ఈపదమునకుఁ బుత్రవాచకపరమైన యర్థమును శాస్త్రులవారు చెప్పిరి. "కొణ్ణు" అనుపదమునకు యువ, చిన్న, చిఱుత, అనియర్థము. అఱవమున 'కుఱందై' కన్నడమున 'కోడ' తెలుఁగున 'కోడె,' 'కొండె,' 'కొంటె' పదములు దీనినుండియే పుట్టినయవి. కొణ్ణు+కళ్-కలసి, కొణ్ణుకళ్ అయ్యెను. ఇదియే శిథిలద్విత్వముచే 'కొడుకళ్' 'కొడుక' 'కొడుకు' రూపములను బడసినది." అని ప్రభాకరశాస్త్రిగారు ఉత్పత్తి వికాసములను సూచించిరి. నాయభిప్రాయము 'కొన్రుకళ్' అనుపదము నాయకుఁడు, ముఖ్యుఁడు అని యర్థమిచ్చునని- ఈపదము కొన్నిమళయాళశాసనములలో నాయకపరముగా నుపయోగింపఁబడెనని యాశాసనని వేదికలవల్లఁ దెలియుచున్నది. ఈకొన్రుపదమే 'కొండు' అయినది, కొండాన్-కొండన్ అనుపదముల కఱవమున నాయకుఁడనియర్థము. మళయాళశాసనములలో 'కుమారన్' 'కున్రన్' అనుపదములు నాయకులకు విశేషణములుగ నుపయోగింపఁబడినవి. 'కుమారన్ ఇయక్కన్' "కున్రన్ రామన్' వీరిరువురు నాయకులని యాపదములు గలశాసనముల వలనఁ దెలియుచున్నది. ఈ "కొన్రు" పదమె "కున్రన్" Travancur Archaeological Series. Vol.II. Page 147, 164, 154. అనుపదముతో సరిపోవుచున్నది. కావున ఈకొన్రుకళ్ అనుపదమునకు' 'నాయకులు' 'శ్రేష్ఠులు' అనునర్థమును జెప్పుకొనినచో సందర్భముగా నుండును. "కొన్రు=చంపు. దానినుండి 'కొట్రన్' అనుపద మగుననియుఁ జెప్పి, ఈపదమునకు 'చంపువాఁడు' వీరభటుఁడు=Warrior or Hero అటులనే అర్థవిస్తరముచేత నాయకుఁడు శ్రేష్ఠుఁడు కావచ్చునని శ్రీ. కె. నరసింగరావుగారు క్రిష్టియన్ కాలేజీ కన్నడభాషాపండితులు సెలవిచ్చిరి.

23. సవ్వలోక శ్రయ=సర్వలోకాశ్రయ. 24. మహాసత్థవళ్=మహాసత్త్వులు.
25. పెర్డగళ్=పెద్దలు. 26. నెరవద్య=సిరవద్య, నెరవాది, నేర్పరి.
27. మహాసత్థగవళ్=మహాసత్త్వులు.
28. పసిణ్డిముడ్డు= పసిండి=బంగారము, ముడ్డు అనఁగా అధికారి 'ముడియర్' అనఁగా 'Supervisor' అని యర్థము. కోశాగారాధిపతి యని యీపద మున కర్థము. ఈ'ముడి'పద మీయర్థమునందె కొన్ని మళయాళశాసన ములను జూడనగును.
29. వెటన్దలచరువయ్య=వెటందల చరువయ్య. ఇది యొకని పేరు. ఇప్పటికి మఱియొకని నామము ముగిసెను. పైపదము లన్నియు నితని బిరుదావళిగా గ్రహింపవలెను. 30. విష్ణువర్ద్ధనమహాసత్థవళ్=విష్ణువర్ధనమహాసత్త్వులు.
31 పసుత్తేవ్రుల=పశుక్షేత్రపుల, 32. కొన్డుకళ్=నాయకులు, అధికారులు.
33. అచ్చ్యుకుడ్డువనియు=అచ్చ్యుకుడ్డవనియు, 'వని'పదమునకు తోఁట యని య ర్థము. ఈపదము సహితము 'పశుక్షేత్రపుల' పదమువంటిదె యగును. ఇం కను బరిశోధించుచున్నాను
34. కొన్డుకళ్=ఈపదమున కిదివఱకే యర్థము సూచింపఁబడినది.
35. గజంబుసెర్ద్లలనడుపుళ్=శాసనములో 'గజంబు' అనియె స్పష్టముగా నున్నది. కావున నీపదమునకు గ్రామపరమైన యర్థమునుగాక, మృగవాచ కముగా నర్థమును జెప్పవలసియుండు నని తలఁచుచున్నాను.
36. ప్రిథివి=పృథివీ. 37. మహాసత్థవళ్=ఈపదమిదివఱకు చాలసార్లువచ్చినది.
38. వెటన్దళ్=వెటందల.
39. పొనిక=పొనికయనువాఁడు, వెటందల పొనికయనువాఁడు. ఇప్పటికి మఱి యొకవాక్యము ముగిసెను. ముగ్గురపేరు లింతవఱకు దాహృతములైనవి.
40. న్ణిఅముకొళనడుపు=ఇదియొక ఉద్యోగవిశేషము. వెటన్దళ్ అను పదా నంతరము సాక్షినామమును జెక్క మఱచినాఁ డేమో యని యొకసందే హము గలుగుచున్నది. అట్లయినచో 'పొనికన్ణిఅముకొళనడుపు' వేఱపదమై యుండి, 'గజంబుసెర్థల నడుపుళ్' వలె, నొక యుద్యోగవిశేషమై యుం డును. ఇంకను బరిశోధించుచున్నాను.
41. విష్ణువర్ద్ధనవ=విష్ణువర్ధన. 42. మహాసత్థవలి=మహాసత్త్వులయొక్క.
43. కొన్డుకళ్=నాయకులు, ముఖ్యులు.

44. నిరవద్య=నెరవద్య, నెరవాది, నేర్పరి.
45. ప్రిథివికనదిరజుల్=పృథివీకన్నడరాజులు.
46. గునవనమహానవియుళ్ = గునవనమహానభిజ్ఞులు.
47. ముద్దకఞ్చికాళ్=ముద్దకంచి యనువాఁడు. ఇచ్చట మఱియొకని నామము ముగిసెను. 'కఞ్చి' యిట్టి సంయుక్తాక్షరములో రెండవయక్షర మేవర్గమునకుఁ జెందినదో, యావర్గాంతానునాసికమె మొదటివర్ణముగ వ్రాయుట ప్రాచీనశాసనలిపిసంకేతము. ఈశాసనములో 'రెణ్డు' 'దణ్డి' 'పసిణ్డి' 'కఞ్చి' 'వెటన్దల్' అనుపదములు రెండు, దండు, పసిండి, కంచి, వెటందల, అని యెడిపదములకుఁ బూర్వరూపములు.
48. రమేస్వరా=రమేశ్వరా, [ప]రమేశ్వరా. చాళుక్యబిరుదావళిలో 'పరమేశ్వర' యనునది యొకటి; శాసనలేఖకుఁడు 'ప' యనునక్షరమును వదలివేసెను.
49. ప్రిథివిమహాసత్థ్వళ=పృథివీమహాసత్త్వల.
50. అపయజనువకాల= ఈపదమున కర్థము గుదురుటలేదు. శాస్త్రులవారీపదమును రెంటిగా విభజించి, వానిని మనుష్యుల పేర్లనిరి. ఇది యొక్కటియే పదము. ముందువచ్చు 'కొణ్డుకళ్' అనుపదమునకు విశేషణమైయుండును.
51. కొణ్డుకళ్=కొన్డుకళ్, కొణ్డుకళ్ సమానార్థకములైన పదములు. ఈపదమునకు 'కొణ్డుక' 'కొడుక' అని పదవిభాగమును జెప్పి, తుదకు పుత్త్రుఁడని యర్థమును జెప్పుటకన్న, కొన్డు, కొణ్డు, కొండు, కొండొక అని నాయకపరమైన యర్థమె యిక్కడ సమంజసమని నామనవి.
52. కొరిన్థికాళ్=కొరిన్థికులనువారు, వీరెవరో తెలియదు. పరిశోధించుచున్నాఁడను. 53. కరిగల=కరిగళ్ల. 54. ప్రిథి=పృథివీ 55. మహాసత్థ్వల=మహాసత్త్వల. 56. కొన్డుకళ్=అర్థమిదివఱకె వివరింపఁబడినది.
57. నన్దిమహావిలనదుప్రు=నందిమహావిలనదుప్రు, ఇదియు నొక యుద్యోగవిశేషము. 58 శ్రీమహాసత్థవళ=శ్రీమహాసత్త్వలు.
59. సకలోక=సకలలోక, ఇచ్చట 'ల' అను నక్షరమును వదలివేసినాఁడు.
60. ప్రిధివి=పృథివీ. 61. మహాసత్థ్వల=మహాసత్త్వలు.
62. దివకరయు=దివకరయ్య అనుపేరుగలవాఁడొకఁడు. ఇప్పటికొక్కవాక్యము ముగిసెను. వీనితో నైదుగురు సాక్షులైనారు. ఈయయిదుగురు కరిగళ్ళవాడనాయకులేమో? కొన్ని ప్రాచీనశాసనములలో గ్రామనాయకులను జెప్పుటయుఁ గలదు.

నకరపు నాడనాయకులు South Indian Inscriptions Vol. V. No. 103.

63. కణ్పాకొళ్ =అయినుగురు దివకరయ్యతో నైదుగురైనారు. లేదా, ఊరు 'దాయచేసి యిచ్చుట' ఊరి స్థితినిపంచియిచ్చి తత్కార్యమును, నిర్వహించుట కొడంబడినవారు.

64. శ్రీజట్టి పెన్దట్ట గ్గస్తాన్= శ్రీజట్టి పెందటడ్డ గండఁడు, వీఁడె, శాసన లేఖకుఁడు. ఈగండఁడెవఁడో సార్థక నాముఁ డని తలఁచెదను. పండితలోక గండఁడై, భాషకే యర్థము కుదురక దోర్లాడునపుడు లేఖన బాధలు గూడ సమకూర్చిన మిండఁడు. వీనిని గొండాడఁదగును. వీఁడప్రమత్తుఁడని ప్రభాకరశాస్త్రులవారిచ్చిన యోగ్యతాపత్రము సరియైన దని నాయభిప్రాయము. వీని యజాగ్రత్తను గనిపెట్టిన శాస్త్రులవారభివందనీయులు.

ఈశాసనమును జదువుటలోను, అర్థవివరణములొసంగుటలోను, శ్రీప్రభాకరశాస్త్రిలవారు పడినశ్రమ యింతయని చెప్పనలవికాదు. శ్రీసోమశేఖర శర్మగారును వేంకటరమణయ్యగారు వ్రాసిన విమర్శనములకుఁ బ్రత్యుత్తర మిచ్చుటలో శాసనపరిశోధనమునకన్న నెక్కువశ్రమను గాంచిరి. నాకుఁ దెలిసినయర్థము నిచ్చితిని. శాస్త్రులవారిచ్చిన యర్థమునకును, దీనికిని, వ్యత్యాసముగలదు. ఏది యొప్పొ, యేది తప్పో, నిర్ణయించుటకుఁ దగిన పండితులు, విమర్శకులున్నారుగదా! శాసనమాంధభాష కెంతోముఖ్యమైనది. దీనినిజదివి సరియైనయర్థమును దీయువట కాంధ్రపండితులు నిదురపోవకుందురుగాక! నేనును బరిశోధనమును విడువనొల్లను.

---

(1) వరొయ్యుతి - ఈ పదమునందలి 'ఱ' కారము అడ్డుగీతలేనియక్షరము.

(2) మహామహోపాధ్యాయ, ప్రాక్తన విమర్శవిచక్షణ, కర్ణాటప్రాచ్యవిద్యావైభవ, రావు బహదర్ శ్రీమాన్ నరసింహాచార్యులవారు, 'కొస్తు' 'సెడి' పదముల కీయర్థమును దెలవిచ్చిరి. వారికి నేను సర్వదా కృతజ్ఞుఁడను.

"'కొస్తు' అనుపదము ప్రాచీనకన్నడభాషలోలేదు. కాని 'కొస్తు' అనునది అఱవభాషలో 'కొళ్' అను పదమునం దుత్పన్నమై 'చంపఁగా' అని యర్థమిచ్చును 'కొస్తు' అనఁగా కొండయని యర్థము. 'కొస్తన్' అనుపదమునకుఁ గొండనాయకుఁ డని యర్థమును జేసికొనవచ్చును. అఱవభాషలో 'కొట్టన్' కొంకన్, కొళుకన్ అనుపదములు ఈసందర్భములో సరిపోల్పనగును."

సెడి = ఈ పదమున కఱవభాషలో 'గొప్ప' యనియర్థము."

సెడ్డనడుపుళ్ = గొప్పయుద్యోగస్థులు అను నర్థము చెప్పుకొనవచ్చును.

నిహతుం జేసి, తదీయవిక్రమములన్ విం చెంతో శ్లాఘించి; తీ
మహియందుం గుణమే గ్రహించెదవు, రామా! యాత్రరతూమణీ. 88

మ. తలిదండ్రుల్ గలబిడ్డలుంబలెను భక్తవ్రాతమే భారమా
దల లేశంబును లేక లోకమున సీతామాత నీవిర్వురన్
గల రన్నమ్మిక నోలలాడుచు మహానందాబ్ధి, జీవించుఁ జు
మ్మలజ ళ్లన్న వెలుంగ కెల్లపుడు; రామా! యాత్రరతూమణీ. 89

మ. అమరజ్యేష్ఠముఖార్థితా! దశరథజ్యాభర్తసత్పుత్ర! సం
యమియాగారిసుబాహుజీవహ! యహల్యాశాపహరాఘఘ్న! శ
ర్వమహేష్వాసనభంజనా! జనకజాప్రాణేశ్వరా! జామద
గ్న్యమనోగర్వహశౌర్యధుర్య! రఘురామా! యాత్రరతూమణీ. 90

శా. నీచారిత్రము క్షీరనీరధి; యటన్ నీసద్గుణంబుల్ మణుల్;
నీచుల్ రాక్షసు లందులో మకరముల్, నీవే మహావిష్ణువం;
దాచంద్రాననసీత తత్తనయ; నే నానక్తిమైఁ దద్రసం
బాచాంతిం బొనరించుచుం దనియ; రామా! యాత్రరతూమణీ. 91

మ. మును కల్పించితి నందనందనశతంబున్ "భక్తచింతామణీ"!
యని పాడించితి వెన్నఁ; గష్టమునఁ "గృష్ణా! యాపదుద్ధారకా"
యని నుడ్వించితి పిమ్మటన్; ముదిమి సర్వాఘాపహం బోట, న
న్ననిపిం తీభవదాఖ్యతారకము; రామా! యాత్రరతూమణీ. 92

మ. ముదిమిన్ వెండియుఁ దోఁచునైశవగుణంబుల్ దేహి, కన్నాట, ద
ప్పదు; చిన్నప్పుడు నీదుమ్రోలఁ జిఱుతల్ వాయించుకొం చింపుగాఁ
బదముల్ వాడుచు నల్పితిన్ భజనమున్; వార్ధక్యమం దీగతిం
బదముల్ నీవి భజింతు మత్తవితి; రామా! యాత్రరతూమణీ. 93

మ. నరలోకప్రభుకొల్వునల్పి బలిమిం మత్ప్రియపున్నాళ్లఁ, ద
ద్వరలాభంబును బొందుచుం ముదిమిఁ దత్పాదంబులం గొల్చదం
బరలోకప్రభు వోట నీకొలువునం బాటిల్లినం మొక్కొ, నే
మరలం గొల్చుట గల్గ దీప్రభువు; రామా! యాత్రరతూమణీ! 94

మ. చరమావస్థను గాశిఁ బ్రాణికుడిపార్శ్వం బెత్తుఁ దైకందు ర
క్కరణిం దారకనామ! వృద్ధదశ రాఁగా గౌతమీతీరస
త్పురమా రాజమహేంద్రమందు హృదయంపుందమ్మి నీవకంకము
మరలేం; సంస్మరింతువుం మనుము; రామా! యాత్రరతూమణీ. 95

మ. వయసున్ హాయిగ భోగభాగ్యవిభవైశ్వర్యాదులం బుచ్చువాఁ
డయినన్, శోకులకష్టనష్టముల నెట్లాతం డెఱుంగంగలాఁ
డు? యువత్వంబుననుండి యిక్కటులు గోడుల్ గన్నరా వేల్పు! సం
శయ మొందన్ గుఱిపెట్ట నీకడను; రామా! యార్తరక్షామణీ. 96

మ. హృదయజ్ఞుం డగునీదుసమ్ముఖమునం దేనేల వాక్రువ్వఁగాఁ?
బదముల్ దిన్నగఁ దెల్పలేని దెసకుం బాలయ్యె భావంబు; త్వ
త్పదముల్ గొల్చుట చిత్తశాంతికొఱకున్ భద్రాప్తికిం గాదె? శ
ర్మద! తల్లాభము సంఘటింపఁగదె; రామా! యార్తరక్షామణీ 97

మ. ఒకయా లోక్కులుఁ గొక్కవ ల్లినుప్రశంసోక్తిం గనంజాలునే
లికవేల్పెవ్వఁడు నీవె కాక? బొమకల్లిం, గాకిరాకాసి, వా
లికిఁ దప్పుం డిట సాకిరుల్; భవము దూలింపన్ నినున్ ముక్తినా
యకు భక్తిం గొలుతున్; దృతీయ మిడు; రామా! యార్తరక్షామణీ. 98

శా. పాపాల్ గొన్నిటి బుద్ధిపూర్వకముగాఁ బైప్రేరణం గొన్ని, లా
క్యాపత్తుల్ మరలింపఁ గొన్నిటి నిటుల్ నైకప్రకారంబులన్
మూపున్ రే పొనరించి, నేఁడు మయిపై మైలం దొలంగించుకో
నాపంబుంబలెఁ, గంటి నీపదము; రామా! యార్తరక్షామణీ. 99

శా. కైకేయీగుణదూషణోక్తులు, భవత్కార్యప్రశంసోక్తు లీ
వాకర్ణింపను నీను లీమిఁ బరనిందాత్మస్తుతుల్ సహ్యముల్
నీకుం గామి యెఱింగియుం జరిత, ని న్నెత్తున్ సనుందూఱుకొం
చాకృత్యంబు క్షమింపు దీనుఁ డని; రామా! యార్తరక్షామణీ. 100

మ. ప్రతియాగంబును గాచుటో, భవధనుర్భంగంబు గావించుటో,
పితృవాక్యప్రతిపాలనార్థ మడవిం బెక్కేండ్లు వర్తించుటో
సతికై సంద్రముగట్టి శాత్రవుతలల్ చక్కాడుటో, కూర్తతు
ల్యత భక్తప్రజఁ బ్రోచు టేభరము? రామా! యార్తరక్షామణీ. 101

మ. గుడులుం గోపురమండపంబులును నీకున్ సత్రముల్ సావడుల్
దొడవుల్ లోనుగ నెన్నియో పరమభక్తుం డౌచుఁ గల్పించు న
క్ష్ముడు వెచ్చించుటఁ బాదుషాహిధనమున్ గోల్కొండలోనం జెఱం
బడు నీదాసుని గాసి మానుపవె; రామా! యార్తరక్షామణీ. 102

మ. ధనమున్ రక్షణసాధనంబనియె కాదా, లక్ష్మిఁ జెండ్లాడి ప్రో
తనపాయస్థితి, యిష్టపత్రయుకుటుంబా! శక్తిఁ దే నిర్వహిం

ఏను సంసార మకించనుండు దినమేఁ? భక్తాళి సప్పచ్ఛరం
బను ఘోరాపద కంటఁ బెట్టకుము; రామా! యార్తరక్షామణీ. 103

మ. హలసంబంధము నీకు, నీయనుఁగుటిల్లాలైన యాదేహకిం,
గల దంచుం గినవచ్చినందునను, నేఁ గాంచెదం డెందపుం
బొలముం నాయది నీయధీన; ముచితంబొప్పం దోహదం బిచ్చి, ని
ర్మల! పండింపవె ముక్తిపంట; రఘురామా! యార్తరక్షామణీ. 104

శా. దైతేయారివి మర్త్యుఁ డౌతి వని నిం ధ్యానింపుచుం గూర్క క్రేఁ
గై తోఁచెం క్షణ మస్మదీయ మగుకాయం బర్ధరాత్రంబు; న
చ్ఛైతోబ్జంబునఁ జొచ్చి తీ వనుచు నేఁ బాలించి, నాలోన వే
లాతీతం బగుహర్ష మొందితిని; రామా! యార్తరక్షామణీ. 105

మ. భవదీయామలనామవర్ణములు నేఁ బత్రంబుపై వ్రాసి రెం
డవనీలంబులు యుష్మదద్భుతమనోజ్ఞాకారభావంబుతో
సవిశేషం బగుభక్తిఁ గాంచుతఱి బాష్పం బస్మదానందసం
భవ మయ్యెం బ్రతిబంధకం బకట; రామా! యార్తరక్షామణీ. 106

మ. *స్వరముల్ హల్లులు నోష్ఠ్యముల్ విడి, హరిశ్చంద్రేత్యచరిత్రం నినుం
ద్దారంగావించి రచించి కొంత, యది యొందో నష్టమైపో, భవ
చ్చరితం గూర్చినకుందమాల యనుదృశ్యంబుం దెలింగించి నే
మరలం బ్రబలితిఁ దృప్తినొందక యిది; రామా! యార్తరక్షామణీ. 107

శా. నీనామంబు గలంతకాలము నిలం దీపింపుమీ నీకృతిం;
భానుండుం, సితభానుఁడున్, భగణముల్, పంచోరుభూతంబులుం,
గానన్ రాని మహాలయంబుతఱిఁ, దద్గాఢాంధకారంబునం
దైనం నామము నీది పొన్పడదు; రామా! యార్తరక్షామణీ. 108

శా. నీతోపించినరీతిఁ బ్రబలితిని బున్నెంబబ్బఁ బాపంబువో,
నోతండ్రీ! తొలుకబ్బముం జదివి, యార్యుల్ వల్ల నాలించియుం

---

పాఠాంతరము.

మ. * చరితం బాదిమచక్రవర్తిది నిరోష్ఠ్యమ్ముంగ మున్నే నినుం
ద్దారఁగావించి రచించి కొంచె, మది యెందో నష్టమైపోఁ, ద్వదు
త్తరవృత్తోత్తమకుందమాల రసవంతంబుం దెలింగించి, బా
మల భక్తిం శతకం బిదల్లితిని; రామా! యార్తరక్షామణీ.

జేతోహ్లాదులు త్వచ్చరిత్రలుఁ; కృపం జేకో మదీయుం గృతిన్,
ఖ్యాతంబుల్ గలవే, యిదే లనక; రామా! యార్తరక్షామణీ. 109

మ. జననీ! క్ష్మాసుత! మంగళంబు; భరతా! శత్రుఘ్నుఁడా! లక్ష్మణా!
హనుమా! యంగద! జాంబవంత! రవిపుత్రా! నీలుఁడా! మంగళం;
బనఘస్వాంతవిభీషణా! దనుజరాజా! మంగళం; బార్తులన్
మనుపంబుట్టినశ్రీశ! మంగళము; రామా! యార్తరక్షామణీ. 110

మ. వరవర్ణాదిమహాస్వరూబ్ధివిధు సుబ్బారాయవాణీసుధా
ఝురసమ్మిశ్రభవత్పవిత్రచరిత స్వాదిష్టసిద్ధౌషధ
పురసంబున్ భవహంబుఁ ద్రోలెడుజనంబుల్ నిత్యజీవంబునం
బరమానందముఁ బొంద నీ వరము; రామా! యార్తరక్షామణీ. 111

మ. శకవర్షంబుల వేదభూతవసుభూసంఖ్యన్ దదాంగీరసన్,
మకరంపున్నెలఁ గృష్ణపక్షదశమిన్ మందాఖ్యవారంబునం
దొకపద్యంబు రచించి, మానమునకున్ యుష్మత్కృపాలబ్ధి నీ
యకలంకార్థకృతిన్ ముగించితిని; రామా! యార్తరక్షామణీ. 112

మ. పరమప్రీతిని మాత సీత, తన గ్రీవం బెట్టుముక్తామణీ
సరమున్, మున్ మరుదాత్మజుం డరసి మెచ్చుండయ్యె నం చందు; రీ
సరి, నూటుం బదుమూఁడుపద్యమణులన్ సంస్తుత్యతమున్ జూచెనా,
హరివర్యుం డతఁ డేమిచేసెడునొ? రామా! యార్తరక్షామణీ. 113

గద్యము. ఇది శ్రీపరమేశ్వరప్రసాదసమాసాదితసరసకవితాధురంధర, పండిత ప్రకాండపరిషద్బహూకృత, "కవిశేఖర" "సూక్తిసుధానిధి" బిరుదాంకిత, వఝ్ఝాదిసాధువంశక్షీరనీరాకరరాకాసుధాకర రాచ్ఛనామాత్యపౌత్ర హారితస గోత్ర, పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజ ప్రధాన తనూభవ, విబుధవిధేయ సుబ్బరాయనామధేయప్రణీత మార్తరక్షామణి సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.

ఆంగీరస సం. మాఘ బ ౧౦ ఆదివారము.

క్రీ శ. ౧౯33 సం. ఫిబ్రవరి నెల ౧౯ తేది, ఆదివారము.

—:అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారు, కొవ్వూరు.:—

శా. శ్రీకల్లూరికులాబ్ధిశీతకరు నిస్సీమానుభావార్జిత
శ్లోకుం గొల్చెద రాజమహేంద్రనగరాస్తోకాంగ్లవిద్యాలయా
నేకచ్ఛాత్రగురుప్రసిద్ధపదు నిర్ణిద్రాంధ్రగీర్వాణశి
ష్టాకూలంకషపాండితీమహితు వేంకట్రామశాస్త్ర్యాహ్వయున్.

చ. వరగుణమండనుండు జనవంద్యపవిత్రచరిత్రుఁ డంబికా
వరచరణారవిందనిరవద్యనిరంతరభక్తిభావసం
భరితుఁడు శబ్దశాస్త్రబలవంతుఁడు వేంకటరామశాస్త్రి నా
పరమగురుండు తచ్చరణపంకజయుగ్మము నాత్మఁ గొల్చెదన్.

సీ. తన మహాశబ్దశాస్త్ర జ్ఞానమహిమంబు, తనజ్యోతిషజ్ఞానధారణంబు
తనదు వేదాంత విద్యాపటిష్ఠత్వంబు, తనకున్న స్వతంత్రవిత్వప్రసక్తి
తనయాంధ్రభాషావిదాంవరధర్మంబు, తనయనేకగ్రంథ దర్శనంబు
తనమహోపాధ్యాయ ఘనతరబిరుదంబు, తనయజయ్యత్వనిర్ధారణంబు
సకలదిశలను బ్రకటింపఁజాలె నౌర, ఘనత మీరు గుప్తార్థప్రకాశికా మ
హోత్తమగ్రంథనిర్మాణ మొనరఁజేసి, ప్రథిత కల్లూరి వేంకటరామశాస్త్రి.

మ. ఒకశాస్త్రంబునఁ బాండితీమహిమఁ బేరొందంగఁ బెక్కబ్దముల్
సకలాయాసములోర్చి సద్గురులనిచ్చల్ గొల్చినన్ గాని వ
న్నెకురాఁజాలరు సర్వవిద్యల గడించెం బూర్వపుణ్యంబుమే
రకు శ్రీ వేంకటరామశాస్త్రివరుఁ డౌరా ! యెట్టిపుణ్యాత్ముఁడో !

చం. తనయులు సర్వసద్గుణవతంసులు రాజకళావిశారదుల్
తనసతి సత్పతివ్రత సుతాతిలకంబునసూయ యల్లుఁడున్
గొనములప్రోవు శిష్యులలఘుల్ సఖులుత్తము లిట్టిభాగ్యవ
ర్ధనునికి సంఘటిల్లె నమరత్వము వేంకటరామశాస్త్రికిన్.

గీ. ప్రథిత కల్లూరి వేంకటరామశాస్త్రి
ముఖ్యశిష్యులు దక్షిణామూర్తిశాస్త్రి
సత్తములు నేఁబ్రశిష్యుఁడ సకలజనులు
నన్ననని పెద్ది శ్రీజగన్నాథుఁడండ్రు.

---

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము. ౨౨ { శ్రీముఖ నామ సంవత్సరము. మాఘఫాల్గున మాసములు } సంచిక ౬.






కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-0-0.

విడిసంచిక రు. ౦-౮-౦.

1934.

# విషయసూచిక.

ఆంధ్రసాహిత్య
పరిషత్పత్రిక
కాకినాడ.
రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౨. { శ్రీముఖనామసంవత్సరము మాఘఫాల్గునమాసములు } సంచిక ౬.



# ఆంధ్రి, తద్విశిష్టత.

కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు.

—ఆంధ్రవ్యాకరణములు—

ఇఁక నాంధ్రవ్యాకరణరచన మార్యసంప్రదాయబద్ధముగ నుండు నని యెఱింగితిమికదా; వ్యాకరణకర్తల నామములను వారిసూత్రములను నివరించుకొంట తగును.

శ్లో. బార్హస్పత్యాని సర్వాణి కాణ్వం వ్యాకరణం విదన్
కరోమ్యాథర్వణం శాబ్దం సర్వలక్షణలక్షితమ్. త్రిలింగశబ్దానుశాసనమ్

శ్లో. వాక్పతిం పుష్పదంతంచ కాణ్వం సోమ మథర్వణమ్
హేమచంద్రం నమస్కృత్య వక్ష్యేధోక్షజపఙ్క్తికామ్. అధోక్షజపఙ్క్తిక

శ్లో. ఆథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్
కౌముదీ మాంధ్రశబ్దానామ్ సూత్రాణిచ కరోమ్యహమ్. ఆంధ్రకౌముది

కొందఱు వ్యాకరణకర్త లాంధ్రవ్యాకరణకర్తలు ప్రాచీను లండి రని వ్రాయుచుండఁ గొందఱు మే మెఱుఁగ మనియు ననుచున్నారు. కల్పితములే యని నిశ్చయించుచున్నారు.

క. మున్ను తెనుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
ద్వన్నికరము మదిమెచ్చఁగ, నన్నయభట్టాదికవి జనంబులకరుణన్.

ఆంధ్రభాషాభూషణము—

ఎవ్వరును జెప్పలేదని చేమెత్తి కేతన చెప్పుచున్నాఁడు. అయిననుగొన్నిపూర్వసూత్రము లని ఫక్కికలలో నుదాహృతము లయినవి గలవు.

—అథౌపశాబ్దిక్యాది ప్రసంగః—

కారణ్వః సర్వపదవ్యాపిన్యాః ఔపశాబ్దిక్యావృత్తేః, కిం వా లక్షణమ్, కింతు సంసృష్టిశబ్దార్థస్య కేవలాంధ్రే "తిరుగు" ఇతి తద్ధర్మక్రియాయా శ్శిలావాచక "కలు" శబ్దే పరేసతి "తిరుగుకలి" ఇతి స్థితే, తత్ర కవర్ణలోపాత్ తిరుగలీతి కేనసూత్రేణ జాతమ్.

—ఏతల్లక్షణం జ్ఞేయమ్ "తత్ర"—

హేమచంద్రః:—ట స్యౌపశాబ్దిక్యాం ద్విత్వ మాదేః.

వృత్తిః. ఔపశాబ్దిక్యాం వృత్తిః, శబ్దాద్యక్షరాత్ టస్య ద్విత్వం భవతి, యథా, పట్టపగలు, నట్టనడుము, చిట్టచిగురు, ఇత్యాది—

సూత్రం. ప్రతిషేధా ద్గిః

వృత్తిః. నిషేధార్థేగివర్ణాదేశః రాముఁడు, గీముఁడు, విభీషణుఁడు, గిభీషణుఁడు, ఇత్యాది.

సూ. తుచ్ఛార్థే డజః లు గామంత్రణే.

వృత్తిః తుచ్ఛార్థే విద్యమానే గాఁడు శబ్దఁడువర్ణకస్య ఆమంత్రణే సంబుద్ధౌ లుక్ స్యాత్.

ఉ. ఓరి శేషిగా, ఓరి కుప్పిగా, ఓరి ఉపాధ్యాయిగా.

ఇ త్యథోక్షజవిరచితాయాం ఫక్కికాయాం, ఔపశాబ్దిక్యాదిప్రసంగో నామ షష్ఠః.

ఇత్యాది సూత్రము లెన్నియో యసమగ్రముగ నున్నవి. "తిరుగు" నకుఁ దద్ధర్మకాలత్వవ్యపదేశము చేయుట విమర్శ్యము. తద్ధర్మకాల మనుసంప్రదాయము పూర్వకవు లెఱుఁగరు. గ్రంథములు వ్యాకరణవిషయమున లేకున్నను బదసంప్రదాయ మైన నెఱింగియుండరా ? ఇది విమర్శ్యము. అసమగ్రముగ నల్పాల్పముగను వ్యాకరణగ్రంథము లుండెనేమో కాని భారతరచనాకాలమునఁ గలవ్యాకరణ మాంధ్రశబ్దచింతామణి యనుకొన్నను నది యప్పకవిదాఁక నణఁగి యవతరించినది. కావునఁ గావ్యములకు వాఙ్మయమునకు నెల్లనాదియగు నాంధ్రభారతమే యాదివ్యాకరణలక్ష్యగ్రంథముగ గ్రహించుట సుఖము—

భారతము:—లాక్షణికులకు సర్వలక్షణంబైనయట్లు వ్యాసునిచే భారతము రచియింపఁబడి యుండె నని యున్న నన్నయభట్టు తనభారతమునుమాత్ర మాంధ్రలక్షణోపలక్షకముగ రచియించి యుండఁడా? లక్ష్యనిధి యనియు లక్షణనిధి యనియుఁ బేర్కొన్న భారతాంగ మాంధ్రమునమాత్రము నిర్వహింపఁబడియుండదా? భారతమునే తీసికొనవేల? ఆంధ్రశబ్దచింతామణిని నాదివ్యాకరణగ్రంథముగఁ దీసికొనరాదా యని యందురేమో? ఆంధ్రశబ్దచింతామణి కర్త నన్నయయే కానిండు, కాని, యది యధ్యస్తము గాక యనాదృతమయ్యెను. బాలసరస్వతినుండియే దానిరూప మెఱుఁగుదురు. అప్పటినుండి దాని గ్రహించుట మంచిదికదా; అథర్వణుఁడు శేషగ్రంథముగ వ్రాసిన కారికావళియు నట్లేయయ్యెను త్రిలింగశబ్దానుశాసనము నట్లేయయ్యెను. అథర్వణుని కాలము తిక్కన్నకుఁ బూర్వ మని పండితులు నిర్ణయించుచున్నారు. అట్టి యథర్వణునిచే రచియింపఁబడిన కారికలవాఁటికి నాంధ్రశబ్దచింతామణియుండె ననవలయుఁగదా? కేతన మొదలుఁగ నన్న నిఁకగ్రంథములు లేవని యనరాదు కదా?

ఇఁక నాంధ్రశబ్దచింతామణినే యాదివ్యాకరణముగ గ్రహింపుఁ డనియు ననలేము. వివాదస్థమై యున్నది ఆవివాదము కొంచెము సంగ్రహింతము.

సూ. నమ్ చోతః వాల్యథర్వణాచార్యమతాత్॥ ఈసూత్రమున నథర్వణుని ప్రసంగ మున్నది నన్నయకుఁ దరువాత నున్నయథర్వణుఁ డిందుదాహరింపఁబడుటచే నాంధ్రశబ్దచింతామణి నన్నయకృతము గా దని శ్రీవీరేశలింగముపంతులుగారి వాదము.

ఈపాఠము సమంజసముగ లే దని యహోబలపతి త్రోచివైచెను. బాలసరస్వతి యు నప్పకవీతరులు ను నప్పకవిపాఠమును గ్రహియింపరు శ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారును బైపాఠమును గ్రహింపకయే వాదించిరి. అప్పకవిపాఠమువంటి పాఠము గలప్రతు లెందేని నున్నవో యెఱుంగను. కాని యీపాఠమున కభావము నిర్ణయించుకారణములు మాత్ర మంత బలవంతములు గా వని తలంతును "అథర్వణకారికలయందుఁ గాని త్రిలింగశబ్దానుశాసనమునందుఁ గాని హల్మాత్రము పరముగునప్పుడు నుమ్ము వచ్చు నని చెప్పఁబడి యుండ లేదు" అని శాస్త్రిగారు వ్రాసిరి. కారిక లున్నవని యెఱుంగుదురేమో, కాని, యహోబలపతియే కారికారూపమును నరసినవాఁ డగుట నాభ

ల్లతమును బహిష్కరింపఁ డని యెట్లనఁగలము? త్రిలింగశబ్దానుశాసనమునఁ బ్రసక్తియే లేదు కావున హల్లతము లేదు. ఇంతమాత్రమునఁ గొట్టివేయరాదు. ఆంధ్రవాఙ్మయమున హల్లతేచ్ఛక ప్రయోగములు లేవని ఋజువగునంతకును నప్పకవిపాఠము నన్నుతింపవలసినదియే. మఱియు నీప్రసక్తి కారికలలో నెచ్చోఁ గల్గెనో యరయుఁడు. "ప్రయోగశ్శరణం కవేః" అని యుండుటచే నీనుమాగమకార్యవైవిధ్యము చెప్పియుండవచ్చు ననియు "గరువపుష్మరువు" మున్నగు ప్రయోగములకు సూత్రించి యుండవచ్చు నని సందేహింపవచ్చును అప్పకవి పాఠము కల్పించి యుండఁడు గదా; బాలసరస్వతి తరువాత విపులముగ వ్యాఖ్యానము చేసిన యతఁ డప్పకవియే యగుటఁ దా ననేకపాఠములఁ జూచియుండవచ్చును. "అద్యః క్రియాసు భూతార్థ" మిత్యాది సూత్రమును నహోబలపతి కొట్టివైచెను. కాని తరువాతివా రనేకు లాసూత్రము కలిమికి సందేహింపరు. మఱియు నప్పకవీయసూత్రక్రమ మొకవిధముగ ను నితరచింతామణిసూత్రక్రమ మొకవిధముగ ను నుంట పాఠాంతరముల యవకాశము గల దగుటను గరువపుష్మరువు నిలుచుటచే రేశలింగముపంతులుగారి వాదము పునర్విమర్శ్య మగుచున్నది.

సర్వత్రాజ్వత్ కార్యం ... అద్యః క్రియాసు భూతార్థే, త్యాదిసూత్రముల యన్వయము నాయాంధ్రవ్యాకరణపాఠరహస్యవ్యాసములలో వ్రాసియున్నాను. అరయుఁడు.

అడుగుచున్నాఁడు, అడుగఁగలఁడు, అడుగుదురు, అనునవి వర్తమాన భావితద్ధర్మక్రియ లని చింతామణిలో నున్నది. చింతామణ్యాథర్వణకారికావళుల యుదయమునకుఁ బూర్వమునఁ గల యెల్లలక్షణగ్రంథములలోఁ దద్విరుద్ధముగ నున్నది. వేయేల? బాలసరస్వతిపూర్వులు తద్ధర్మ మవలంబింపమి యద్భుతము గదా? పదమర్యాదయే నెఱుంగరా? నన్నయభట్టు తనచింతామణిలోని మర్యాదలో నెన్నియవపాలైన నేరికిఁ దెలుపకయుండెనా? అవునని యన్నచోఁ బేళ్లులేని గ్రంథము లెల్ల నెట్లో ముడివెట్టవచ్చును.

శ్రీపంతులుగారివాద మన్నివిధముల నిలుచునది యగును. శ్రీవఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి ప్రత్యుత్తరము తృప్తికరము గాదు. కాన భారతమునే యాదివ్యాకరణస్థానమునఁ దీసికొనుట లగ్గు. తిక్కనాదులు నట్లే చేసిరి.

## ఆంధ్రభారతము—వ్యాకరణము.

సంస్కర్తల సాహససంస్కారబలమున స్వరూప మెల్ల విరూపముగాఁ జేసి

కొన్న నన్నయభారతము ప్రమాణముగఁ దీసికొనుట లాభమా? నన్నయ స్వలిఖిత గ్రంథము దక్కఁ బెఱయవి యెల్లఁ దాత్కాలిక సంస్కార సంపర్కము లయి నవియే కదా? ఇఁక మూల గ్రంథము లభించు టెట్లు? శాసన భాషారూపమును గ్రంథ భాషారూపమును సద్దిసేసికొని యుజ్జన గొనుట మేలిమి దన, నందును సంశయములు గలవు ఈ సందేహము లీ సమయమున నవశ్యమును బ్రకటింప వలయుట నయ్యది వ్యాకరణరచనామార్గమునకుఁ దోడగునని తలంచుట నిం దుదాహరింతును.

శాసనములఁ జెక్కువారు మహాపండితు లని ప్రమాణము లేదు. శాసనాక్షర లేఖనము సాధారణముగ సామాన్యుల పనియే యయి యుండవచ్చును. మఱియు నిందాఁకఁ బ్రకటితములయిన శాసనములలో నెన్నియో తప్పు లున్నట్లందఱును నెఱుఁగుదురు. వాని నెల్ల నిందుఁ జూప నక్కఱ లేదు. శ్రీనాథమహాకవి క్రీ శ 1416 వ సం. జనేవరి తే 14 దిని స్వయముగ రచించి వ్రాసి, సంతకము చేసి......రాతిమీఁద చెక్కించిన శాసనములోని భాష "శిలాక్షరములుగా" నేఁటికిన్ని ఉన్నది. దానిలో "అరిరాయబసువశంకరుండు" అని రాజు బిరుదు పేర్కొన్నాఁడు. అందులో ఉన్న "బసువ" శబ్దము తప్పని "బసవ" అని చదువఁదగు అని పరిష్కర్తలు అనుశాసించినారు" ఇట్లు రాజరాజనరేంద్రసంచికలో రావుసాహేబు శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు వ్రాసిరి. శ్రీనాథుఁ డెన్ని చేసినను సిద్ధాబత్తేని చేయునో? లేఖకుఁడు ప్రమాదము పడి యుండరాదా? శ్రీనాథుని సంతక మున్నంతమాత్రఁ బదములరూపమున కతఁడు బాధ్యుఁడా? శ్రీనాథుని చేవ్రాలు గల తాళపత్రమును జూచికొని యా లేఖకుఁడు చెక్కి యుండరాదా? శ్రీనాథుఁడు "బసవ" అని వ్రాసినను లేఖకుఁడు "బసువ" అని వ్రాసెనేమో? అట్లు వ్రాయు నాచారము లేఖకసామాన్యము గాదా? "ఇద్దఱు" అని వేలనాటులు దిద్దినను నొకప్రాంతమువారు "ఇద్దురు" అనియే వ్రాయుదురు. ఒక తెలుఁగుపండితుఁడు "తిద్దు" అని భ్రాంతితో వ్రాయఁగా నయ్యది తిద్దు కాదది "దిద్దు" అని చెప్పితిని సవరించుకొనియు సంభాషణమునఁ దిరిగి "తిద్దే" పలుకఁబడుచుండుట నా స్వానుభవమున వింటిని. వినుచున్నాను. అభ్యస్తప్రమాదము లప్రయత్నవిపాతము లగును బసవ యనునది సర్వత్ర శిష్టముగ నుచ్చరిత మగుటను వ్రాఁతలలోఁ గొన్నిఁట నుండుటను బసవశబ్దమే ప్రయుక్తమని నిర్ణయింపరాదా? ఇంతకు నాయుపపాదించునదే మనఁగ శాస

నములభాష తప్పుగ నుండవచ్చు ననుటయే యనుభవసిద్ధమే గదా? శాసనము లేవిషయమునఁ బరమ ప్రమాణములు? చరిత్రవిషయమున, నక్షరాకృతివిషయమున, మున్నగు సామాన్యవిషయని కాన చరిత్రకే ప్రమాణములు గాని భాషావిషయమున నంత ప్రమాణములు గావు, కాని, సాజాత్యమున్న నుపకారకము లగును లిఖితములఁ గొంచె మశ్రద్ధ యొక దురాచారముగ నాంధ్రదేశ మెల్ల వ్యాపించెను. ఇతరత్ర వ్యాపించియు నుండెనో. "తథా లిఖిత పాఠకః" అని శిక్షోక్తమును నయ్యెను. పొల్లు నకారముగ నుండవలసినచోట నుత్వవిశిష్టముగ వ్రాయుదురు. పొల్లని యూహింతురు కాక హిందీలోనున్నట్లు "రామ" వ్రాసి "రామ్" అని చదువు నాచార మున్న దందురా? ఇదియే సంప్రదాయ మనియు నందురా? గన్న- గనుక, రవ్వా- రవానా- ఇత్యాదులు శబ్దరూప మెఱింగిన శాస్త్రజ్ఞులును వ్రాయుచున్నారు. శాసనప్రామాణ్యము భాషావిషయమునం దదేకాధారముగ నిల్వదు. గీర్వాణవైయాకరణులు ప్రయోగములఁ జూపునప్పుడు శాసనప్రయోగముల నేల చూపరో? అది యట్లుండనిండు.

వ్రాఁతప్రతులును నట్లే యప్రమాణములుగ నున్నవి. శ్రీ వఝల చిన సీతారామస్వామిశాస్త్రిగా రిట్లు వ్రాసిరి. "కాఁకరపర్తి, కృష్ణకవి" స్వయముగ వ్రాసిన ప్రతి నాకులభించియున్నది...... "లీలా నాప్తిచాతను, కుశలప్రులు గలుగుటచాతను, కుశలము గలుచు (గు) టచేతనున్ను సరిగానున్నది. గన్ను తగు వొప్పుచుంన రామచంద్రుడు, శుభశ్రీలిచ్చు మాకెప్పుడూనూ, నిఖిలలోకానందనియ్యనైన... ఇట్లని చప్పంగానే, కృష్ణయామాత్యుఁడు వ్రాశెను."

"పండితకవి యగు కృష్ణకవి యయిరీతిని వ్రాయుటనుబట్టి యాలోచింపఁగాఁ బూర్వకాలమున నట్లు వ్రాయుచుండుటయే నిజమయిన సంప్రదాయ మని విశదమగుచున్నది" ఇత్యాదిగ శ్రీ శాస్త్రిగారు హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికలో వ్రాసిరి. దీనిఁబట్టి పండితుల లేఖనక్రమమును దుష్టముగ నుండు నని తెలియుదుము కదా! చేఁత, చాత, చున్న, చప్పంగ, ఆంమాత్యుఁడు, వ్రాశెను, మున్నగునవియే శబ్దరూపము లని సాధింతురా? వచనముల నట్లున్న దందురా? పద్యవాక్యములలో నానందనియ్యమును గలదు. ఇది సంప్రదాయ మగుఁగాక యవలంబనీయమా? ఇట్టివిషయములఁ బూర్వపండితులు చేసిన ప్రమాదము లవశ్యము గర్హ్యములు, సంస్కరింతురు, పండితక్రమముగ వచ్చి యున్నను నేఁటిభారతమును. ఆదియే వ్రాయవలసివచ్చెను. కావున నేఁటివారి

సంస్కారమెల్ల సూటి యని నాయభిప్రాయము గాదు. అనేకవిధములఁ బరిశీలింపఁదగు ననుటయే నాయభ్యర్థనము.

(1) తనయాజ్ఞ వెలిఁగించును. వెలిఁగించుట యనఁగాఁ బ్రకాశింపఁజేయుట యనియర్థము ఇట్టి యన్వయము నన నవంతరకవులు ప్రమరముగ వాడరు.

(2) అనినన్ —అన్నన్, అని రూపము గలదు. దీనిఁబట్టి న్వాంతధాతువులకెల్ల నిట్టిరూపము సాధింపవచ్చును

(3) పురాణములు వింటి ననేకములు అనేకములు పురాణములు వింటి ననుటకు మాఱుగ నట్లున్నది. విశేషణవిశేష్యములకు నాతిదూరవ్యవధానమున్న శిష్టమే కదా ? కాని సముచ్చితవస్తువులు క్రియాపదముచే వ్యవధాపితములు గావని యాంధ్రభాషాభూషణము చెప్పుచున్నది.

క. అనిన విని రోమహర్షణ, తనయుం డమ్మునుల కతిముదంబున వినయా
వనతుఁడయి గురులఁ దనహృ, ద్వనజంబున నిలిపి కొలిచి వాగ్గణపతులన్.
భార. ఆది 75

ఇందు వేర్పడి యున్నది. 'గురులను వాగ్గణపతులనుఁ దనహృద్వనజమున నిలిపి కొలిచి, యనుటకు మాఱుగ నున్నది. హృద్వనజంబున 'నిలిపి' యనునసమాపక్రియ(అవ్యయము)గురుల ననుదానితో నన్వయించి "కొలిచి" యనునది వాగ్గణపతుల ననుదానితో నన్వయించి సమాధానము చేసికొన్నఁ గొందుగాక. సముచ్చితము గా దనవలసివచ్చును గదా !

(4) ఏను—అయిఁ దని యర్థము. ఏను + పది=ఏఁబది యగును. ఏను + పర్వము = ఏన్పర్వము లగును గాని గసడదవాదేశము, సరళాదేశము, రాదు. అచ్చుప్రతులలోను నాదగ్గఱనున్న వ్రాఁతప్రతులలోను గూడ నేన్పర్వంబు లనియేయున్నది. ఆదిపర్వమునఁ బ్రథమాశ్వాసమున నలుబదియేనవ పద్యమును మాత్ర మిరువది పొత్తములఁ జూచితిని. ఎల్లెడ నేన్పర్వంబు లనియే యున్నది. ఏఁదుపదు లనియు పాఠక మైయున్నది. శ్రీ గిడుగు సీతాపతిరావు పంతులుగారును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారును జెప్పుచుండు "మావిచారణలో ప్రాచీనగ్రంథములందు గసడదవాదేశము రావలసినచోట్ల నిత్యమైనట్టే కనబడినది. ప్రథమమీఁదను సంఖ్యార్థకశబ్దములమీఁదను తప్పక రావలసినట్లే తోఁచినది." అను నన్నయవిషయవిమర్శనములోనివాక్య మారయుఁడు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారివాదము నిదే యని వింటిని. వీరినిర్ణయము సరియైన

దియా? సంఖ్యావాచకములను వికల్పముగ నున్నట్లు గాంతుము. ఒంటికన్ను, ఇరుతిగ, ఐఁదుపదిచేయు, ఒంటిపాటు, ఇరుప్రక్క, ఇరుప్పొద్దు, ఇరుచక్కి, ముక్కంటి, ముత్తుము, ఇద్దుము, ఏడ్డుము, నీమొదలగు నైఘంటుకపదములయు వ్యవహారపదములయు రూపములం ద్వైరూప్యమున్నది. కావున నిందు ద్వైవిధ్యమే యని యనవలసివచ్చును, మఱియు, నీవిధానము నేనును జెప్పియుండలేదు నన్నియకాలమున నట్టి నిత్యత్వ మందురా? ఆధారమేమి? నన్నయనుండి యెఱ్ఱన వఱకు నట్లుండి పెద్దనాదులకు మాఱెనా? పదిగోటులు, ఒంటిపోటు, ఇరుదెఱఁగులు, వేవణములు, అంతగాలము, పెద్దగాలము, ఎటువోయె, ఎందువోయె, వేసేతులు, ఇంతసలము, కొంతపడవు, ఇంతపట్టు, మున్నగు నుదాహరణముల ప్రామాణ్యము సమ్యఙ్నిర్ధారితము లగునంతకును నిత్యత్వమునకు భంగమే. అనుద్దేశముగను గొన్నిశబ్దములు గసడదవాద్యములుగఁ బండితపామరులలో నుచ్చరితము లగుట సామాన్యము, కావునఁ, గేవలశాసనమాత్రాధారమునను లేఖకమాత్రాధారమునను నిర్ణయింపలేము. సర్వత్ర ప్రయుక్తసామాన్యసంప్రదాయ మున్నచోఁ దెలియుదముగాక.

—అనుద్దిష్టగసడదవలు—

చలుపు—సలుపు, చాఁగు—సాఁగు, చొక్కు—సొక్కు, చూ—సూ, చుమా—సుమా, కిట్టు—గిట్టు, కుంట—గుంట, చోడు—సోడు, ఇత్యాదులు పండితపామరసామాన్యముగను వాడుకలోనున్నవి. చివ్వంగి—సివంగి, చిఱి—సిరి, చాఱ—సార, చామలు—సామలు, కంత—గంత, కడచు—గడచు, కడప—గడప, కదుము—గదుము, కనుక—గనుక, కా—గా, కొంకు—గొంకు, చంక—సంక, చద్ది—సద్ది, ఇత్యాదులు వ్యవహారమునను గలదు. కావున శాసనమాత్రమున నిర్ణయింప ననువుగాదు. ఇంకను నిట్టిద్వైరూప్యముల సంప్రదాయ మబ్రముగఁ గలదు. ఇఁకఁ బరిశోధకు లూరకుండవలసినదియా? సమన్వయపఱిచి యొకశాసనమును జేయవచ్చు ననుటకే యింతవట్టు వ్రాసితిని. ఇఁక నీగసడదవాదేశమర్యాదఁ దెలిసికొందము.

—గసడదవాదేశము—

క. పొసఁగంబల్కెడుచోఁ బ్రా,ల్పెసఁగిన ప్రథమాంతములపయిం గదిసి కడుం
బసనగు కచటతపలమును, గసడదవ ల్దోఁచి నిల్చుఁ గవిజనమిత్రా—61
ఆంధ్రభాషాభూ—

ఉ. సుతుఁడు గడు వేగమున, సుతుఁడు సనియె, సుతుఁడు దక్కరితోడ, సుతుండు దండ్రికి, సుతుఁడు పుట్టె.

పైయుదాహరణములఁ బట్టియు లక్షణముఁ బట్టియుఁ బ్రథమావిభక్తి కంటెఁ బరమయిన కచటతపలకు 'గసడదవ' లగునని తెలియుచున్నది. అయినను దత్సమపదములకుఁ బరములయిన యాచ్ఛికములగు కచటతపలకే యీవిధానమేమో యనుతలఁ పుదాహరణములవలనఁ బుట్టుచున్నది. కాని, వాఙ్మయమునఁ దద్విరుద్ధముగ నున్నది శ్రీవాలింపఁగ, పీరులఁ జూచి, ఇట్లు దపంబు, ఎట్టు సూచి, ఎంచుపోయెదు, ఇందు ప్రత్యక్షమై, మున్నగు ప్రాచీన ప్రయోగములు లున్నవి. ఈప్రయోగములు లపశబ్దములని భావించి బ్ర॥ శ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు దిద్దఁబూనిరి. అశ్రద్ధముగ నన్నింటిని దనమక్కువసూటిగ దిద్దఁదలఁచిన వేని నెట్లు సేయరాదు? పాఠపరిశీలనమేనియు లక్షణాంతరమేనియుఁ బ్రమాణముగఁ గైకొనక సంస్కారక్రియలలోఁ బ్రవేశించుట పరమసాహసము. వారియెల్లవిమర్శనము హేయము (త్యాజ్యము) నాఁదగును.

ఇఁక నేఁటివిమర్శకులవాక్యము లరయుదమన్నఁ బూర్వమెందును గసడదవాదేశము నిత్యముగ నున్నట్లు తెలియఁబడుచున్నదని యనుటఁ జాతుము. లక్షణాంతరము లేవైనఁ జెప్పినా యని ప్రశ్నించుకొందము.

క. రుచిరముగఁ బలుకు(బిలుచు)చోటను
ప్రచురంబుగఁ బ్రథమపొంతఁ బడియుండెడువ
*క్క చటతపంబులపట్లను
బచరించుం గసడదవలు పరిపాటిమెయిన్ — కావ్యాలంకారచూడామణి.

ఉ. విశ్వవిభుండు గడిఁది, నీరుండు సతురుండు, చతురుండు దక్షు, చొక్కులాఁడు దత్త్వవిదుఁడు, తత్త్వవిదుఁడు వరవిదారణశీలుండు.

లక్షణాంతరముం బట్టియుఁ బ్రథమకంటెఁ బరమైన కచటతప లెట్టివైనను గసడదవ లగు ననునియతవిధిఁ గాంతుము. దీనికిఁ దోడుగ వాఙ్మయమునను సుదృఢప్రయోగము లున్నవి. శ్రీవాలింపఁగ, దేవణములు, మున్నగునవి. దేవణము లనుప్రయోగము సాధింప 'దే' శబ్దమునఁ బ్రథమాత్వమును గల్పింపవలయును. ఈచిక్కు నెఱింగియే కాకుసంబోధనావ్యయమర్థధారయముల వచ్చు నని ముద్దరాజు రామన్న చెప్పవలసివచ్చెను. కాని నిత్యము

* వ్రాఁతపుస్తకమున నున్నట్లు వ్రాసితిని.

గా దని కూచిమంచి తిమ్మకవి నిరూపించెను చేసఱచి యని నన్నయప్రయోగము గలదు. కావ్యాలంకార చూడామణి ప్రయోగము తత్సమమునకుఁ దత్సమము పరముగాఁగ "శ్రీవాలింపఁగ" నన్నట్లు గసడదవాదేశమును జూపి యున్నాఁడు. ఇట్టియంతఃపరిశీలనమున నే యహోబలపతి వివిధమతములఁ దన వ్యాఖ్యానమునఁ జూపెను.

—। మతభేదములు ।—

(1) ప్రథమావిభక్తికంటెఁ బరమైనకచటతప లవెట్టివైనను గసడదవలగును. (ప్రాచీన మతమని యందఱును సమ్మతించిరి. ప్రాచీనమతము గాదనుటకు (ఆంధ్రశబ్దచింతామణ్యథర్వణాదులుతప్ప) లక్షణములును లేవు) నేను, తాను లును లేవు) (2) వికృతిశబ్దముకంటెఁ బరములయిన సాంస్కృతికకచటతపలకు గసడదవలు గావు. (3) గసడదవాస్స్యుః ప్రథమామాత్రాదాత్మాన్యదోఽన్వే నై తే- వ్యా॥ ప్రథమామాత్రాదిత్యత్రయథాకథంచిత్ప్రథమాతుల్యానామపిగ్రహణమ్. మాత్రశబ్దః కార్త్స్న్యార్థకః, ... అత్రయథాకథంచిత్, ప్రథమాతుల్యత్వే డుజంతత్వం, ప్రథమాసామానాధికరణ్యంచ, ప్రయోజకమ్. అప్పుడు సనియోఁ, ఇప్పుడు దావచ్చెఁ, ఇత్యాదీనా మధికరణార్థత్వేఽపి, సర్వస్య స్త్రీసమస్య సులోపః, ఇతి సులోపే ప్రథమాసమత్వ మక్షతం, అవ్యయా దాప్సుపః (పాణినీయమ్) ఇతిసూత్రం సర్వత్రోత్సర్గతస్సః ప్రవర్తతే ఇతిసిద్ధాంతం చానుసృత్య సర్వస్య స్త్రీసమస్య చ సులోపః ఇత్యసూత్రి॥ అహోబలపతి.

(4) మాత్రశబ్దము కేవలార్థము ఆచ్ఛికశబ్దములకంటె (ప్రథమ) పదము లగునాచ్ఛికపరుపములకే గసడదవ లాదేశము లగును. మొదలుగ, వాసిగ, ఇత్యాను లుదాహరణములు. బ్ర. శ్రీ పా. రామశాస్త్రిగారు.

(5) నవికృతిశబ్దాత్పరతః సాంస్కృతికానాం భవంతి గసడదవాః- వ్యా॥ వికృతిశబ్దాత్, సంస్కృతసమవ్యతిరిక్తశబ్దాత్ పరతః సాంస్కృతికానాం సంస్కృతశబ్దాదిగతానాం, పరుషాణాం, గసడదవా న స్యుః, దొరకరుణించె, సిరిచంచలము, ... ఇత్యాద్యుదాహరణమ్. సంస్కృతసమాత్ పర(త)స్సాంస్కృతికానాంతు భవంత్యేవ. రాముఁడు—గరుణించెఁ, ఇత్యాది సంస్కృతసమాత్పరస్య శుద్ధాంధ్రస్య తు తత్ప్రాప్తిః నిర్వివాదఏవ. సత్యమువల్లె—ఇత్యాది, అహోబలపతి. (6) పరుషావా స్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః । కాకా సంబోధనే చాపి హ్యవ్యయే కర్మధారయే । అచేతనార్థకే శబ్దే ఇతి శృంగారభూ

షణః.(దీనివ్యాఖ్యానము (సీతారామకవి కృతము) సరిగలేదు.) అహోబలపం డితీయమునఁనిట్లుగలదు. సంస్కృతాసంస్కృతవాధాంశత్వేన అర్థవిశేషే వికల్పః, ఉక్తః ఉ. కొనియాడనప్పు నతాపసముం దార, కొనియాడనప్పుడు దాపసమం దార, రామా కొనియాడెద, రామా గొనియాడెద, రామ తమాలనీల, రామ దమాలనీల, రామ చిరంతన, రామ సిరంతన, భీతుండనైన కర్తరుని—భీతుం డనైన గర్తరుని, పదభక్తిపటుప్ప, పదభక్తిపటుప్ప—

(7) కేచిదాద్యస్య పో వ స్యాత్=పకారమునకువకార మగును.

(8) నచప్రాసే=ప్రాసమునఁగాదు.

(9) యతౌతువా=యతియందు వికల్పము.

(10) కేచిద్ద్వయో ర్వికల్పత్వమ్=రెంటవికల్పము.

(11) యతౌ సర్వత్ర కేచన=యతియం దెల్లయెడ నగును. యతియందే వచ్చునవియు, నంతటవచ్చునని యు నందురు

(12) వికృతాః పరుపాశ్చ స్యుః స్యుః తే ఆద్యపదాదిగాః
నహోగసదడాః సేఒపి ఖరుషాః ప్రథమాహితాత్.

(13) స్యుర్భిన్నా ఏవ తస్మాత్ తే వినాద్వంద్వం హాశేర్మతే- అథర్వ—

(14) కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గడవలు గానంబడియెడి—(ప్రాసంబుల నని యర్థము.) నిర్ణీపించిన—ఉ. హరి వం ర ఆశ్వా. ఇట్లుదపంపు, నిర్వ గి ఆ. వేవణములా విజ్ఞా ప్రా. కాం.

(15) కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతపలకు సదవలు గానంబడప్ప ఉ. అందచందములు, అని గి ఆ అప్పాచెల్లెండ్రు- నిర్వ ౩ ఆ. కండతుండెములు, రామా, ౧. రాకపోకలు, ౧౦ స్గం (ప్రౌఢవ్యాకరణము)

(బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణముల విషయము చింతామణ్యాథర్వణ ములవిషయమే యైనను సప్రయోగముగ లక్షణములఁ జూపిన క్రొత్తఁదనము ప్రౌఢవ్యాకరణమున నూట గ్రహించితిమి. ఇఁక మిగిలినవ్యాకరణము లన్నియు వెనుకతాళము వైచునవియుఁ గుటుంబభరవహనక్షమము లగునవియు నగుట విడిచితిని. కాని "ఆంధ్రభాషానుశాసన మను సూర్యనారాయణీయవ్యాకరణ ము తనస్వత్వముతో నున్నది. నూత్నగ్రంథ మగుటను సమకాలీన మైన దగు టను భిన్నాభిప్రాయపరంపరాధిక్షిప్త మగుచున్నను దదభిప్రాయములు విమర్శ నాపాత్రము లనువిషయమున నేరను బ్రతికూలురుగారు దీనిపై వజ్రాయుధవి

మర్శనము జెగటుగను సద్విమర్శకీ షహ్యముగను నున్న దని పండితలోకము ఱింగియే యున్నది. ఈవిషయమును విడిచి ప్రకృతమునకు వత్తును)

(16) ప్రథమమీఁద ఆచ్ఛికశబ్దములకుఁ గసడదవలు బహుళముగా నగును. ఉ రాముఁడుగదలె—రాముఁడుకదలె, ఇత్యాదులు. బహుళమను టచేఁ గళ లయిన కొన్నిక్రియాపదముల మీఁదను అవ్యయముల మీఁదను ఉన్నయాచ్ఛికశబ్దములకుఁ గూడ నీకార్యము వైకల్పికముగ నగు నని తెలియునది. ఉ వత్తుగువోదుము, వత్తురుపోదురు, లేదుదలఁక, లేదుతలఁప, ఆహా పుట్టింపదె, ఆహా పుట్టింపదె; ఇత్యాదులు—

(17) ప్రథమమీఁది తత్సమశబ్దములకు గసడదవలు రావు.

(18) ఏవార్థకక్త్వార్థకసంబోధనాంతాదులమీఁది యేశబ్దములకును గసడదవలు రావు.

ఉ. తానకడంకన్, ఎక్కికడున్, చొచ్చితగన్, తల్లీకృతచేసి, దాఁచ నేలాకనకాంగి, రమ్మాచూతము, అదిగో కానఁబడియె, నిత్యాది బహుప్రయోగములందు ప్రాసస్థానముల నీయాదేశము కనఁబడదు. (బ్ర. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.)

బ్ర. శ్రీ వావిలికొలను సుబ్బారావుపంతులుగారును నీసందర్భమునఁ బరిశ్రమముసేసి యొకపథకమును జూపిరి. ఉక్తప్రాయ మగుట విడిచితిని. ఇన్నిమతభేదము లున్నవి, చేస్తే చేయ్, మానితే మానే యనుసుకరమత మవలంబింతమా; కాక యొకఁడు ప్రమాణ మని కైకొందమా; పైమతములలో నుపాదేయమేది, అరయుదము.

(1) ప్రాచీనమత మది కాదన లేము. కాని సంఖ్యావాచకములపైఁ గూడ నాదేశనిత్యత్వమును సమ్మతింప లేము వాఙ్మయమునఁ బ్రాసస్థానమున వచ్చిన ప్రయోగములు లభింపకున్నను గొన్నివ్యవహారపదములఁ బట్టియుఁ బ్రాచీనశత్రుసమవలోకనముఁ బట్టియు సంఖ్యావాచకవాదము నిల్వదేమొ; 'చౌపద, మని ఛందశ్శాస్త్రమున నభ్యస్తమగు నీపదమున (భీమకవికాలము నకు) నాదేశము లేదు. ఉండుచో "చౌవద''మగును. ఒండుగడ, ఒంటిసనుట, ఎంతగుమతులు, మొదలగునవి కర్మధారయసమాసమున కుదాహరణముగఁ దిమ్మకవి చూపియున్నాఁడు. కాని యది యు నిత్యము గాదు. ఇట్టియాదేశము లుండుచో వ్యవహారమునను గానవచ్చెడిని. నిత్యముగ నున్నటు గానము.

బ్ర శ్రీ సీతాపతిరామబ్రహ్మంతులుగారు చూపిన యుదాహరణములలోను వైవిధ్యములున్నను సమానపదములఁ జూపియుంటఁ గర్మధారయావికల్పత్వాదికమునఁ జేయవని చెప్పఁదగును. అయినను దక్షిణయావిపులవిమర్శనము ననంతరము సమాలోచించుట లెస్స.

(2) వీరల్లోపించిన, ఇట్లు దశంబు, మున్నగు ప్రయోగములును, లక్షణాంతరములును, చొక్కులాంకుదక్షిణపుఁడనుప్రయోగమును, శాసనభాషా సంప్రదాయమును, సాంస్కృతికముల కాదేశమును జెప్పుచున్నవి.

(3) చాలమంది సమ్మతించిరి. కానిపూర్వాపరముల నాచ్ఛికము లుండఁదగునని కొందఱుమతము.

(4) వ్యాఖ్యానవిషయమునఁ గొంతభాగము గ్రంథనిజాభిప్రాయమై యున్నది. (5) పెంపువరీక్షింపను. పేవనములు, బాధకములే యగుచున్నవి.

(6) ముద్దరాజు రామన్న మున్నగువా రంగీకరించిరి. సమాసాంతర్గతకార్యములఁ బేర్కొనుచుఁ గొంతపరిశోధనమును దెల్పుచున్నారు. అహోబలపతి, అథర్వణుఁడు, మున్నగులాక్షణికులు సమ్మతించిరి. ఎంతగుమతులు, ఒందుగడ, ఇత్యాదు లుదాహరణములు.

(7) నుండి (11), ఈమతములు కాకదంతపరీక్షలోనివి. యతియందు వచ్చునని యేసంప్రదాయముఁ బట్టిచెప్పిరి; ఇట్లు చెప్పుచో ముక్తకోకశాస్త్రము పుట్టును. ఇకుదంతప్రథమలపై వచ్చినకచతలకు గసడదలగును. అనియుఁ జెప్పవచ్చును. (12-14) ఉక్తప్రాయములే యగును. (15) వివాదము లేదు. (16) ఆచ్ఛికత్వము విశేషము. (17) (2) అధిక్షిప్తప్రాయ మగుచున్నది

(18) చింతామణిమయూఖములో బండితులు వాదించిరి. ఏనవిదవ, అని పరిచేసికొనిరి. ఈమతమును గొందఱు నిందించిరి. లక్షణాంతరములను నహోబలపతియుఁ గావ్యాలంకారచూడామణియు (పాఠాంతరపక్షమున) సంబోధనమున నాదేశమును సమ్మతింప నిషేధించువా రెవరును లేరు.

మతభేదము లెన్నియైన ననుసరణీయవిషయమున నందఱకును సంశయముగనే యున్నది. కావున సమాధానమునకై యత్నింతము.

—సమాధానము—

పూర్వమునుండియు గసడదవల యాచార మెట్లున్నది; శాసనములె

ట్లున్నవి; వీనిఁ దడవి వినిర్ణయమునకు వత్తముగాక. చింతామణ్యాధర్వణ కారిక
లను దటస్థముగనుంచి విమర్శింతును.

ప్రథమా విభక్తికంటెఁ బరములయిన కచటతపలు గసడదవ లగునను
సూత్రమర్యాదయే యాంధ్ర భాషాభూషణమునను గావ్యాలంకారచూడామ
ణిని మున్నగువానను దృష్ట మగుచున్నది. నిత్యమా వికల్పమా యని నిర్ణయ
ముగఁ జెప్ప లేదు ఆచ్ఛికములా యితరములా యని సందేహించుటయు లేదు
ఉదాహరణములలోనొక సంప్రదాయము సిద్ధమగుచున్నది "చేసెఁ జిడికొంచు"నని
నన్నయప్రయోగమును "సిల్లిదపు"లను తిక్కనప్రయోగమును "వేవణము"లను
కేతనప్రయోగమును 'నిందప్రవత్యక్షమయి, రాజాశ్రీయుణ్ణిద్రిభువన, పాపం
బుదమకు, ఒండుపోటు,' మున్నగు యుద్ధమల్లకవిప్రయోగములును- వీరల్గో
పించిన, పెంపువరీక్షింపమె, మున్నగు నన్నెకొడుపూర్వప్రయోగములును నర
యఁగఁ బ్రథమావిభక్తికంటెఁ బరములయిన కచటతప లవెట్టివయినను గసడ
దవ లగునను సూత్రమే బలపడుచున్నది కాని నిత్యమా యను సందేహము
తీఱదు. లక్షణములలో నిత్య మని కాని వికల్ప మని కాని చెప్ప లేదు నేనుఁ
దాను ననుశబ్దములను వేఱుసేయ లేను. ఏమిదపడిగియెడ నని తిక్కన్నగారి
ప్రయోగము గలదు. 'ఏం' యనపలయు నని యనునది నిరాకరము పాఠాం
తరములఁ జూడక దిద్దుట కొంత గహనమే. ఇట్లు దపంబు, ఇట్టు దబంబు, అని
చింతామణివ్యాఖ్యలో బ్రహ్మశ్రీ వేంకటరాయశాస్త్రిగారు దిద్దిరి.
ఇప్పుడు కవిరాజుగారు భక్తిదపంబనుచున్నవారు. అక్రమభాషాసంప్రదాయా
వలోకన మనర్థకము గాదా; ప్రయోగవైవిధ్య మున్నను నాంధ్రశబ్దచింతా
మణి యిట్లు సూత్రింపనేల; అందే సమాధానము గలదా?

సూ. గసడదవా స్స్యుః ప్రథమాయా స్త్రా దాత్మస్థదో ర్వైన వైకే-
ఈసూత్రము వచ్చినసందర్భము నిత్యవిధానములోనిది కాదు మఱియు నిత్య
మని చెప్పఁదలంచుచో నిత్యపదము ప్రయోగించుట యాచార మయ్యెను.
గసడదవాదేశము నిత్య మని చెప్పఁడు. పాఠక్రమమును భిన్నముగ నున్నది.
బాలసరస్వత్యహోబలపతినృసింహుల పాఠ మొక తెఱంగును నన్నయభట్టపాఠము
వేఱొక తెఱంగును నై యున్నది. అయినను తత్సంధిప్రకరణమున నియ్యది
వికల్పస్థానమున నున్నది. వికల్ప మనియుఁ జెప్ప లేదు.

# అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రము.

టేకుమళ్ల అచ్యుతరావుగారు, ఎం. ఏ., రాజమహేంద్రవరము.

---

మనోరమకథను మనుచరిత్రకథాసంవిధానమునఁ జక్కఁగా నిముడ్పలేదనియు, మాతృకయం దున్నదానినిఁ గొంత మార్చి నీతిబాహ్యముగఁ బెద్దన చేసినాఁ డనియు శ్రీశాస్త్రిగారి యభిప్రాయము.

మాతృకయందు మనోరమ తననెచ్చెలులను రోగవిముక్తలఁగఁ జేతుమని స్వరోచిని వివాహమునకు ముందుగానే తండ్రిసమక్షమున నడిగినది. పెద్దనార్యునిగ్రంథమం దామె పాణిగ్రహణానంతరమునఁ బతితో నేకాంతముగా నున్నసమయమునఁ దననాథుని వేఁడుకొనినట్లున్నది. వివాహమునకుఁ బూర్వమున నున్నదానిని వివాహానంతరమున గర్భాధానపుగదియొద్దకు మార్చుట కేవల మనౌచిత్యమనియు నీతిబాహ్యమనియు నింకేమేమొ వచింపరానంత దూష్యముగ శ్రీశాస్త్రిగారు భావించినారు. తం. వెనుకూళ్ళయ్యగా రీమార్పు సరసముగాను, నుచితముగాను నున్నదని యభిప్రాయపడినారు. కావున విమర్శనవిశారదు లగు నిర్వురుమహాపండితు లీవిషయమున భిన్నాభిప్రాయులై యున్నారు. ఔచిత్యానౌచిత్యనిర్ణయములలో ముఖ్యముగా "లోకో భిన్నరుచిః" యను న్యాయము ప్రాయశః అంగీకరింపవలసియున్నది. మనోరమ తనవివాహమునకుఁ బూర్వము తండ్రిసమక్షమున నొకవరముగా నడుగుట యుచితమా? లేక వివాహానంతరము సతీపతు లేకశయ్యాగతులయి యున్నప్పు డేకాంతముగా వేఁడుకొనుట యుచితమా? ఇది దాంపత్యధర్మసూక్ష్మసమస్య. వివాహమునకుఁ బూర్వ మామె కన్య. వివాహానంతర మామె నవోఢ యగును. కన్యాదశలో నుండఁగాఁ గాఁగలభర్తను వరముగాఁ గాని వేఁడుకోలుగాఁ గాని యాచించుట న్యాయమా? నవోఢాదశయం దుండి యగ్నిసాక్షికముగఁ బాణిగ్రహణము చేసికొనిన భర్తను బతిమాలుట న్యాయమా? చెలికత్తెల దుర్దశ తొలఁగించుట వివాహమున కొకవరముగ నిర్ణయించి కన్య వరుని బరిణయము చేసికొనుట యుచితమా? లేక వివాహము పూర్ణమైనతరువాత నెయ్యమున భర్తను దద్వరముఁ గోరుట యుచితమా? ఏది ముఖ్యముగా భీరుత్వమును గన్యాసౌశీల్యము నెక్కువగఁ బ్రతిపాదించుచున్నది? ఈప్రశ్నలను సుకుమారవిషయములను శ్రీశాస్త్రిగారు రసికత యోచింపక నైయాయికునివలెఁ గర్కశ

కవణభాషణముల విమర్శించిరి. నూతనదంపతు లిరువురు నేకాంతశయ్యను సమావిష్టులైనపుడు పత్ని భర్తతో సంభాషింపఁగూడదనియు నట్లు ముచ్చటించుట వెలయాలివర్తన మనియు శ్రీశాస్త్రిగారి మతము. గర్భాధానకాలమున మనోరమ తన చెలికత్తెలవిషయమై లోఁగుందుచున్న దుఃఖమును నాథునికిఁ దెల్పి దుఃఖమును నివారింపనియెడలఁ దనకు సౌఖ్య మెట్లుండు నని స్వరోచి కడఁ దలపోసికొనెను. ఇట్లు చెప్పుట ఆంకులాఁడితనమును సూచించుచున్న దని శ్రీశాస్త్రిగారు నిందించిరి. మనోరమ చెప్పినమాటలలో "నాకెక్కడి సౌఖ్యము" అని యున్నది ఇక్కడ "సౌఖ్యము" అనుమాటకు "సురతసౌఖ్యము" అని యొకవిపరీతార్థమును జేసికొని శ్రీశాస్త్రిగారు భ్రమపడినా రని తోఁచుచున్నది. మనోరమ స్వరుచిని వివాహము చేసికొనుట కేవలము మదనకేళిసౌఖ్యముకొఱకేనా ? ఇంకేమయిన నితరసౌఖ్యములు కొఱకా ? ప్రపంచములో స్త్రీలును బురుషులును బరస్పరము వివాహమాడుట "గ్రామ్యేంద్రియసుఖము కొఱకేనా ?" (ఇది శ్రీశాస్త్రిగారి వాక్యమే !) శ్రీశాస్త్రిగారి వ్రాఁతలఁబట్టి వారి యభిప్రాయ మదియే యని నిర్ణయింపవలసివచ్చినది. గృహస్థధర్మముల గుఱించి యిట్లశ్లీలముగ నాలోచించుట శ్రీశాస్త్రిగారి కెంతమాత్రముఁ దగినదికాదు.

ఇంతవఱకు శ్రీశాస్త్రిగారి గ్రంథమందలి రసమును గుఱించియు నీతిని గుఱించియు వ్రాసిన విమర్శనమును యథార్థముగను సహేతుకముగను ఖండనమండనరూపముగఁ బ్రత్యుత్తర మొసఁగితిని. ఇంక సామాన్యజ్ఞానము గల యస్మదాదులకు మనుచరిత్రమునందలి రసవిశేషముల గుఱించియు, నీతిప్రాభవమును గుఱించియు నెట్టియభిప్రాయము లున్నవో యెంచిచూతము. సామాన్యముగ నాంధ్రుఁడు యువకుఁడైనను వృద్ధుఁడైనను మనుచరిత్రమును జదువుట కేల యభిలషించును ?

ఆగ్రంథమం దేవిషయ మాతని మనోదృష్టి నాకర్షించును ? నే నెఱింగిన యంతమట్టుకు మనుచరిత్రను జదివినవా రందఱు సామాన్యముగ వరూథినీ ప్రవరాఖ్యుల యుపాఖ్యానమును గుఱించియే యెక్కువ యభిమానముఁ గనఁబఱచుచుండిరి. మొదటిమూఁడాశ్వాసములు ముగిసినతరువాత పైకథనంతను గ్వాచిత్తముగఁ జూచినవారే మెండు. ఇట్లేకదేశముగాఁ జదువుటకుఁ గారణ మేమి ? నిజమో యబద్ధమో గాని సామాన్యజనుల నమ్మకము, ఈకథయందలి

సార మంతయు వరూథినీప్రవరుల యుపాఖ్యానమునందే యున్నదనియుఁ దక్కిన భాగ మంతయు, రసోత్సేకము గలుగఁజేయుటకై వల్లీబంధ మనియుఁ బెద్దనార్యుఁడు తనలోకోత్తరకావ్యప్రజ్ఞ నంతయు నీయుపాఖ్యానమునందే చూపించె ననియు వారినమ్మకము. కావునఁ బెద్దనార్యుని కావ్యప్రతిష్ఠ యీయుపాఖ్యానమున నిలిచియున్నది. ఈభాగము రసమునందును నీతియందును జెడినదైనచోఁ బెద్దనార్యుఁడు తలయెత్తుటకు వేఱె యవకాశముండదు.

ఈయుపాఖ్యానమునందు ముఖ్యముగ శృంగారరసము ప్రకటితము. నీతియుఁ దత్సంబంధికమె. ఈకథను రెండుదృశ్యములుగా వేఱుపఱుపవచ్చును; మొదటిది వరూథినీప్రవరులదృశ్యము; రెండవది వరూథినీమాయాప్రవరుల దృశ్యము. రెండుదృశ్యములునొకసూత్రమునను నేయఁబడినవైనను, పైకి భిన్నప్రకృతుల గోచరింపుచున్నను, నిజముగా మొదటిదృశ్యముయొక్క ఫలితమే రెండవది యని నిశ్చయింపవచ్చును.

మొదటిదృశ్యమునఁ బ్రవరుఁడు శ్రోత్రియబ్రాహ్మణుఁడు, కొండొకకారణవశమున వరూథిని యనునప్సరసకంటఁ బడెను. ఆదివ్యవేశ్యాంగన యాయందమైన బ్రాహ్మణకుమారునిఁ జూచి మోహించి తనతోఁ గ్రీడాసక్తుఁడు గానుండుమని పరిపరివిధములఁ బ్రార్థించెను ఏకపత్నీవ్రతుండగు నాబ్రాహ్మణుఁ డందుల కియ్యకొనక తుదకు నగ్నిదేవుని సాహాయ్యమున నామెనుండి తప్పించుకొని యింటికిఁ జేరెను.

రెండవదృశ్యమున నీకామాంధురాలగువరూథినిని నామెచేఁ బూర్వము నిరాకరింపఁబడిన యొకగంధర్వుఁడు ప్రవరవేషమునఁ జేరి యామెకోరికఁ దీర్చి తానును సంతృప్తుఁడయ్యెను.

కాఁబట్టి యీకథయందు శృంగారరసప్రవాహమును నీతిప్రతీరము నవినాభావసంబంధమున నన్యోన్యము ననుసంధించియే యున్నవి. ఇచ్చట శృంగారరసము నీత్యుద్బోధకమా లేక దుర్నీతిబోధకమా ? అనుప్రశ్నకు నిజప్రవరునికథను మాయాప్రవరునికథను మనము తారతమ్యముగఁ బరీక్షించినఁ దెల్లమగును. నిజప్రవరునికథ నీత్యుద్బోధక మని, యొక్క బ్రహ్మయ్యశాస్త్రిగారు తప్పఁ బ్రపంచ మంతయు నంగీకరించియే యున్నది. మాయాప్రవరునిచరిత్ర మెంతవఱకు నీతిబోధకమో నిర్ణయింపవలసియున్నది. మఱియును బెద్ద

నార్యుఁ డీరెండుదృశ్యములలో దేనియందుఁ దనయభిమానము నెక్కువగఁజూపించెనో యదియు గుఱితింపఁదగినదే !

వరూథినీనిజప్రవరులకథను సుమారు రెండున్నరయాశ్వాసములకుఁ బెంచి సుమారు నూటయిరువదిగద్యపద్యములకు విస్తరించెను. వరూథినీమాయాప్రవరులచరిత్రను సుమా రేఁబదిపద్యములలో సంక్షేపముగ ముగించెను. గ్రంథవిస్తర మొకయభిమానసూచక మైన యెడలఁ బెద్దనార్యుఁడు నిజప్రవరుని వృత్తాంతమందే తనయప్రతిమానవిజృంభణశక్తియు నిరతిశయశీలప్రతిష్ఠాపకరక్తియుఁ జూపింపఁదలఁచె నని యూహింపవచ్చును

దివ్యవారాంగన యాసుందరగాత్రుఁ డగుశ్రోత్రియునిఁ జూచిన వెంటనే మదనార్తయై కొంచెము సేపు భావగర్భితముగా భాషించి యాతనివంకఁ బ్రత్యనురక్తిపొడచూపమిఁ దనమనోభావ మంతయు వెడలఁగ్రక్కెను. "నిక్కము దాపనేల......" అయిన నాశిష్టాచారసంపన్నుఁ డనేకవిధముల నామెబుద్ధి మరల్ప బోధించెను గాని యంతకంతకు నామెయందు మదనానల ముగ్గలమై కామోద్రేకమున నామె యాతనిం బైకొననుంకించి బలాత్కారముగఁ గౌఁగిలించెను. అప్పు డాభూసురుఁ డోరమో మిడి కరాంగుళాగ్రమాత్రమున నామె భుజముల నంటి యామెను ద్రోసివేసెను అప్పైననామె యించుకైనను జంకక దీనస్వరమున నేడ్చుచుఁ గారుణ్యముఁ జూపు మని యనేకవిధముల బతిమాలెను. తుద కామెయున్మత్తప్రలాపచేష్టల సహింపనేరక హవ్యవాహుని వేఁడి యాదేవునిసహాయమునఁ బ్రవరుఁ డిల్లుచేరెను. ఈదృశ్య మంతయు బహురసవంతముగ వర్ణింపఁబడినది. ప్రవరుఁడు తొలుతఁ జెప్పినమాటలు నిలుపుకొనెను. "బ్రాహ్మణుఁ డింద్రియవశగతి జిహ్మాచరణైకనిపుణచిత్తజనిశితాజిహ్మగములపాలై చెడు బ్రహ్మానందాదిరాజ్యపదపరిచ్యుతుఁడై" కావునఁ బ్రవరుఁడు తనబ్రహ్మాధిపత్యము నిర్వక్ర వైదికకర్మపరాక్రమమున నిలుపుకొనఁగలిగెను.

వరూథినిమాత్రము చెఱకుఁబిలుకానికటుకుటమ్ములఁ దూలి విరహార్తయై యున్మాదినివోలె దుఃఖాబ్ధిలోఁ బొరలుచుండెను. బ్రహ్మానందభరితుఁ డగుప్రవరుఁడు శాంతచిత్తుఁడై స్వగృహమున వఱలుచుండెను. ఇంక నాకాముకురాలి యవస్థ నెట్లు పాపవలసియున్నది. ఆమె ప్రవరునికొఱకే యేడ్చుచుఁ జావవలసినదేనా ? ప్రవరుఁ డామెతోడ సంగతియొనగూర్చుట యసంభావ్యముగదా ! ముల్లోకములు కల్లోలమున మునిఁగినను నానిగ్రహుఁ డగుబ్రాహ్మణుఁ డియ్యకొ

నఁడు. కావున నాయికహీంకి యగు వరూథినికి గత్యంతరముఁ జూపవలసియున్నది. ఆమెయైంద్రియకభోగయుత కాముకత్వమున కనుగుణసాఫల్యము కలుగఁజేయ వలెను. అట్టిసాఫల్యము మాయాప్రవరునిమూలమునఁ జేకూరినది. ఇంద్రియ భోగపరాయణురాలికి నింద్రియైకసుఖచ్యాపారపారగుండే తగినవాఁడు. ఇదియే కావ్యన్యాయము (Poetic Justice) కాఁబట్టి వరూథినీప్రవరులకథ నీత్యు ద్బోధకము, వరూథినీమాయాప్రవరులకథ యవినీతివిరోధకము. నీతిప్రబోధము నవినీతివిరోధము నీ రెండును గావ్యేందిరయొక్క ధర్మైకచరణమునందలి యాకృతిద్వయమే !

కథాఫలితము నీతిదాయకము కావచ్చును. గాని యందలిసంభోగాదివర్ణనలు నీతిదాయకములా? యని ప్రశ్నింపవచ్చును. రత్యుపరతివర్ణనలు యువకులమనములలో సురతేచ్ఛను గలుగఁజేయవచ్చునను నంశము న్యాయమైనదే, గాని, యీదుర్గతి యొక్క పెద్దనార్యునకే పట్టలేదు. ఆకాలపు పెద్ద కవీశ్వరులందఱు కొద్దిగనో గొప్పగనో యీదుష్టవర్ణనలు చేసినవారే? కృష్ణదేవరాయలు రామరాజభూషణుఁడు సూరనార్యుఁడు ధూర్జటి కుమారధూర్జటి మున్నగువారు సంభోగవర్ణనము చేసినవారే. వీరిగ్రంథములను బహిష్కరించినయెడల నాంధ్రవాఙ్మయములోని మేలైనరత్నముల నిరసించి గులకరాళ్లను దాఁచుకొనినట్లగు. ఆనాఁటికవులే కాదు, తత్పూర్వపువారును గూడఁ గొంతమంది సంభోగవర్ణనము చేయుటకు జంకలేదు. పంద్రెండవశతాబ్దపు కవిగ్రామణి యగు నన్నెచోడుఁడు తన "కుమారసంభవములో" పార్వతీపరమేశ్వర సంభోగము వర్ణించినాఁడు. ఇంతకంటె నెక్కువ నిదర్శనము కావలెనా ? కాఁబట్టి గీర్వాణకావ్యసంప్రదాయములంబట్టి యీదృగ్విధములగువర్ణనలుకవిసమయములుగాఁ బరిగణింపఁబడినవి. ఇట్టిసందర్భములోఁ బెద్దనార్యు నొక్కనినే దూఱుట న్యాయమా ? అతనిగ్రంథము త్యజించుట లాభకరమా ? ఈనాఁటి కావ్యరుచిని బట్టి మఱొకయుపాయము నాలోచింపవలెను. ఆంగ్లేయవాఙ్మయములో షేక్స్పియరువంటి మహాకవియు నీచశృంగారవర్ణనలకుఁ బాలుపడినాఁడు. అతనిసమకాలీనులసంగతి చెప్పనే యవసరములేదు. వారు బొత్తిగాఁ బచ్చిశృంగారమే వర్ణించిరి. కాని యానాఁటికవులందఱు నాంగ్లవాఙ్మయచరిత్రములో సారస్వతకిరీటధారులు. వారి గ్రంథములయందు తప్ప నితరత్ర యాంగ్లేయకవితారసమున కింపైనరుచి లేదు. ఆకారణమున నిటీవల నాంగ్లేయపండితులు నీచశృం

గారరసవర్ణనాదికభాగములను విలోపింపఁజేసి మిగిలిన రసభాగములనే సామాన్యజనావళికిఁ బఠనీయగ్రంథములుగా ముద్రింపించుచున్నారు. ఈవిధముగ ముద్రితములైన గ్రంథములను (Bowdlerised editions) "బౌడ్లరైజకసంపాదకీయము"లని పేరు. అవిధముగ మనయాంధ్రప్రబంధములను గూడఁ బరిశోధించి యువతీయువకపఠనార్హములుగఁ జేయవలసియున్నది. ఈపనిని బ్రహ్మశ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు మున్నగువారు పూనుకొనిన నాంధ్రలోకమునకు శాశ్వతముగ మేలొనర్చినవారగుదురు.

iii పాత్రపోషణము.

నీతిరసవిచారణమం దెట్టివిమర్శనదోషములు శ్రీశాస్త్రులువారు చేసిరో పాత్రౌచిత్యవిచారణమందు నట్టిదోషములే వారు కావించిరి. అందులకుఁ గారణము కూడ వెనుక సూచించినదే! అనఁగాఁ బాత్రోచితవాక్యములను గవియభిప్రాయములుగఁ బరిగణించుట. ఈదోషము విమర్శిగారివ్యాసమునఁ బలుతావులఁ గాన్పించుచున్నది.

ఈకావ్యమందలి ప్రథమనాయకుఁ డగుప్రవరునిఁగూర్చి విమర్శిగారు వ్రాసినవిషయములను గమనింపుఁడు. "వరూథినిసఖులమాటలలోఁ బెట్టి ప్రవరుండు గోల యని కవి యీక్రిందరీతినిఁ దెల్పినాఁడు. "విప్రవరుండు గోలయగుబాలుఁడుఁ గాన నప్పటికిఁ బైఁబడఁ గొంకెను" అని వ్రాసెను. "అధముఁడు జేలయుఁ గావుననే ప్రవరుఁ డనన్యకాంతయుఁ దరుణియు నగువరూథినితో భోగింపక వెడలిపోయినాఁడని పెద్దన తేల్చినాఁడు" ఈవాక్యము లన్నియు శ్రీశాస్త్రిగారి విమర్శనమునుండి యెత్తివ్రాయఁబడినవే. ఈమాటలనుబట్టి శ్రీశాస్త్రిగారికిఁ బ్రవరునియొక్క శీలమునుగుఱించియు, జ్ఞానమునుగుఱించియు, వైరాగ్యమును గుఱించియు, నెట్టివిపరీతాభిప్రాయములు కలిగినవో తెల్లమగుచున్నవి.

వరూథినిచెలికత్తెలు ప్రవరుని గుఱించి యాడినమాటలు ప్రవరునిగుఱించి కవికిఁ గలిగిన యభిప్రాయము లనియే వీరు నమ్మినారు. వరూథిని విరహాకలవిషణ్ణయై యున్నప్పు డామెచెలికత్తె లామె నోదార్చుటకుఁ జెప్పిన "బాలుఁడు గోల" యను మాటలను బట్టి ప్రవరుఁడు బాలుఁడనియు గోల యనియు శ్రీశాస్త్రిగా రూహించి పెద్దన్న యట్టిజేలను నాయకునిగఁ జేసె నని యాక్షేపించిరి. ఈమాట లాడినస్త్రీలు భోగస్త్రీలు, ఆభోగస్త్రీలు తమచెలి యగు వరూథినిని దిరస్కరించి కొంచెమైనను లక్ష్యముచేయక వెడలిపోయిన బ్రాహ్మ

నోత్తమునిఁ జూచి యాడినమాటలు, నిరసనపూర్వకములును నిందాగర్భితము
లును గోపసూచకములు నయియుండుఁగదా! అప్పుడు వారు మృ
దువుగ బాలుఁడు గోల యని చెప్పి యుండిరి గాని లేక మృదుత్వముతప్పి పేడి
యనియు నపుంసకుఁడనియు ద్విభావమునఁ దెగవాసినచో నామాటలను
శ్రీశాస్త్రిగారు వ్యక్తీకరించి పెద్ద నపుంసకుని గాయకునిగాఁ జేసినాఁడని
ఖండితముగఁ జెప్పఁజాలరు గాని యామాటలెక్కడి సందర్భములో నెవరిచేతఁ
బలుకఁబడినవో యాస్థలమో నెవరిచేతను నిజముగ దోషమని పూర్వాపరములు
విచారణచేసి యుండవలెఁగదా!

ప్రవరునిశీల మెట్టిదియో మనుచరిత్రయందు స్పష్టముగా నిరూపింపఁ
బడినది. ప్రవరుఁడు పిన్న వయస్సువాఁడగు బ్రాహ్మణోత్తముఁడు, నిత్యవైదికసం
పత్తి కలవాఁడు, ఏకపత్నీవ్రతుఁడు, ఎంతయు యవ్వనమునందే సపత్నీకముగా యజ్ఞ
యాగములను జేసి సోమయాజి యను పేరు గాంచినవాఁడు. నిత్యము నరు
ణోదయకాలమునఁ దాను శిష్యులతో గంగకుఁ బోయి స్నానముచేసి సంధ్యా
వందనాదికృత్యములు దీర్చికొని సూర్యనమస్కారములు చేసి సమిత్కుశమాదు
లను సేకరించి యగ్నిహోత్రముల ననవరతముఁ జేయుచుండెను. ఆతనిశీలము
కులము, శమము, దమము మొదలగునవి చూచి యానందించి యేరాజైన
నేమియొసఁగినను బుచ్చుకొనెడువాఁడు కాఁడు. తనమాన్యక్షేత్రములమీఁ
లముగ జీవించుచుండెను. తలిదండ్రులు సజీవులై పుత్రునివలన నిత్యసేవాస
న్మానములు బొందుచుండిరి. ఇంటి కెంతమంది యతిథ్యభ్యాగతులు వచ్చినను
బ్రవరునిభార్య విసుగు విరామములు లేక రేయింబవళ్లు వంటలుచేసి మృష్టా
న్నబహుభక్ష్యములతో నన్నపూర్ణవలె వారినిఁ దృప్తిపఱుచుచుండెను. ఇట్టి
రీతిగా దైనందినజీవితమార్గమును నడుపుచు బంధుమిత్రరాజపోషకులచే మన్న
నలను బొందిన ప్రవరుఁడు చేలయా గోలయా బాలుఁడా లేక లోకవ్యవహార
ములను యోగ్యతాయోగ్యతలను గుణావగుణములను బుణ్యపాపములను గుర్తె
ఱుంగినవాఁడా? ఇట్టిమహాపురుషుఁడు తనయూరిలో జీవయాత్రగడపుచుండఁగా
నాయూరిజారకామినులతనిచక్కఁదనముఁ జూచి మోహించినను నాతనివై
రాగ్యమున నిష్ఫలమనోరథలై మధుకరాంగనలకుఁ బూచినసంపెంగపోలు
పెల్లుండునో యట్టే మనోవ్యథ పొందుచుండిరంట. కాఁబట్టి ప్రవరునివృత్తాం
తమంతయు మనము సాకల్యముగఁ జూచినయెడల నామహాపురుషుఁడు లేఁత

వయస్సువాఁడైనను, మిక్కిలి చక్కనివాఁడైనను, మహాజ్ఞాని యనియు నవవ
రత వైదికకర్మానుష్ఠానపరుఁ డనియు, నేకపత్నీవ్రతుఁ డనియు, సంపన్నగృహ
స్థనియు శారీరకమానసికనైతిక [illegible] శిఖుని యనియుఁ దెలియవచ్చుచున్నది.
ఇట్టి తేజోవిరాజిని శ్రీశాస్త్రిగారు గోల యని యు బేల యని యు బాలుఁ
డనియుఁ గవియే చెప్పిన ట్లెట్లు వ్రాసిరో వారికే తెలియఁదగినది !

ఈప్రవరునిగుఱించియే శ్రీశాస్త్రిగా రాక్షేపించినమఱియొకవిషయము
నాలోచింతము. "కవి ప్రవరుని విరాగి యని చెప్పెఁగాని వానివేషవర్ణనమాత్ర
ము మరల శృంగారపురుషునిగా నొనరించె. శ్రోత్రియునకుండు లలాటమందలి
మృత్తిక, ధవళధవళము లగుజన్నిదములు, నిర్వాపింజె కొంచెము చెప్పి
యాపై నిట్లు శృంగారవేషమును నిరిగా వర్ణించెఁ గనుఁడు చెవు
లందు మణికుండలములు, అరుణాంశుకోత్తరీయంబు, [illegible]
కట్టు, ఆనితంబవిలంబఘనకచగ్రంథి యిత్యాదు లున్నట్లు వర్ణించెను. ఈ
వేషమంతయు, శాంతచిత్తుఁడును విరాగియు నగుప్రవరుని కనవసర మనియు,
శృంగారపురుషునికే తగియున్న దనియు శ్రీశాస్త్రిగా రభిప్రాయపడి ప్రవరుని
వేషము వైష్ణవస్వాముల వేషముగా నభివర్ణింపఁబడిన దని, వ్రాసిరి. ఇందలి
యథార్థము నించుక గమనింతము. ఆకాలమునాఁటి వైదికబ్రాహ్మణయువకుల
వేష మెట్లుండెనో మఱియొకకవి వర్ణించినసందర్భమును జూచిన మన కది
తెలియఁగలదు. శ్రీనాథుని 'శివరాత్రిమాహాత్మ్యము'లోఁ గథానాయకుఁ డగు
బ్రాహ్మణకుమారు నాకారవర్ణనను జూడుఁడు.

"సరిగొన్న వెలిపట్టుజన్నిదములతోడ గళాన్నలతారహారముధరించి"

ఇందలి వేషవర్ణనకుఁ బెద్దన్నయు దలిర్ణనకుఁ గొంచెమైనను భేదము
గాన్పింపదు. శ్రీనాథుఁడు వర్ణించిన బ్రాహ్మణకుమారుఁడు స్మార్త మతము
లోనివాఁడు కాని వైష్ణవమతములోనివాఁడు కాఁడు. అందుచే నాకాలపు
వైదికకులాచారవర్తు లగుబ్రాహ్మణకుమారు లెవ్వరైన నట్టివేషము నే యను
కరించి రని చెప్పవచ్చును. ఇంతయేల, మొన్నమొన్నటి వఱకు సంపన్నగృ
హస్థులు పొడుగైనజుట్టుంచుకొని మొలకు బంగారపుగోవ్రాడు వేసికొని
తిరుగుచుండినవారే కదా ! ఇట్టివేషములలో శృంగారప్రియత్వ మున్నది గాన
నది విరాగి యగుప్రవరుని కెట్లుసరిపోవు నని విమర్శిగారి యాక్షేపణ. విరా
గి యనఁగా శ్రీశాస్త్రిగా రిచ్చినవిపరీతార్థమే మొా భ్రాంతి దగును. విరాగి

యనఁగా రాగములేని వాఁడనియు సర్వసమైక్యభావముఁ గలవాఁడనియు నర్థము. మనప్రవరుఁ డట్టి విరాగి యగునో కాదో యాలోచింపఁదగును. ఈతఁడు శ్రీశంకరులవలె బాలబ్రహ్మచారి కాఁడు. శ్రీరామానుజులవలె గృహస్థాశ్రమము విడనాడి కాషాయవస్త్రమును కమండలువులు ధరియించినవాఁడు కాఁడు. గృహస్థాశ్రమమునందుండి తల్లిదండ్రులకు సేవసేయుచుఁ దాను పాణిగ్రహణము చేసికొనిన భార్యయందు నిశ్చలానురాగుఁడై యేకపత్నీవ్రతమును బూని మడిమాన్యములు చూచుకొనుచు సుఖముగా జీవయాత్ర గడపుచుండినవిరాగి. ఈయన వైరాగ్యము పరస్త్రీపరధనాపేక్షాదులు లేకుండ నుండుటమాత్రమే. తనభార్యతోఁ దాను సుఖభోగము లనుభవించుట లేదా? అట్లు గానిచోఁ దనభార్య తనకొఱకెంతబెంగ పెట్టుకొనుచుండునో యని దురపిల్లుట యేలకలిగెను? తల్లిదండ్రులకు లోఁబడి గృహస్థమార్గము నవలంబించి భార్యతో సుఖజీవనము చేయుచు వైదికమార్గ మనవరతము పాలించుచు నిత్యనైమిత్తికకర్మనిష్ఠాతుఁడై మెలఁగినవాఁడు. ఈతని జీవితచరిత్రము భవభూతి యుత్తరరామచరిత్రములో శ్రీరాములవారు తనబాల్యమును గుఱించి చెప్పికొనిన విషయమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. "జీవత్సు తాతపాదేషు నూతనే దారసంగ్రహే మాతృభి శ్చింత్యమానానాం తే హి నో దివసాగతాః" చిన్నతనములో నేకపత్నీవ్రతుఁడగు శ్రీరాములవా రెట్లుండిరో యట్లే భూసురోత్తముఁడగు ప్రవరుఁడు గూడ నుండె నని మనకుఁ గాన్పించుచున్నది. ఇటువంటి మహాసుందరమూర్తియు, మహాబుద్ధిశాలియు, మహాగుణశీలియు, నగు నీప్రవరుఁ, డాంధ్రవాఙ్మయగగనమందు ధ్రువనక్షత్రమువలె విరాజిల్లుచుండ నాతనిపాత్ర మెంతనీచముగాను, నెంతయధమముగాను, నెంతపరిహాసనీయముగాను శ్రీశాస్త్రిగారు విమర్శించిరో యాంధ్రలోకము చూడఁదగినది. ఇంతటితోఁ బ్రవరునివిషయమును గట్టిపెట్టి స్వరోచిపాత్రము వీరెట్లు విమర్శించిరో చూతము. స్వరోచిపాత్రమును గుఱించి శ్రీశాస్త్రిగా రిట్లువ్రాసిరి. "పాంథవచనములు విని యాస్వరోచి భార్యాసహాయుండుగ వనంబునకుఁ జని ఘోరతపం బొనరించి నిష్కల్మషత్వంబు నొంది యమరలోకంబున కరిగె. ఈకథనే పెద్దన తీసివేసెను. అతనిరుచికిఁ దపస్సు లోఁగునది పడదు. కవి శృంగారజృంభణము కలుగునను భ్రమచే నీతికి భంగముఁ దెచ్చినాఁడు." ఈవిమర్శగారికీగ్రంథమం దెక్కడఁజూచినను బచ్చిశృంగారరసము, పశుకామమే కాన్పిం

చుచున్నవి. వీ రిట్లు తలంచుటకు గ్రంథమందు నిశ్చితమైన యాధారము లున్నవా ? లేక వీరు కేవలము భ్రమమూలకముగ నిట్లూహించినారా ? అను విషయము నిర్ణయింపవలెను. వసుకామము, అనఁగా [illegible]వివాహములు లేనియు, శాస్త్రదూష్య మైనదియు నగు శృంగారరస[illegible], అనఁగా గురుదారాభిగమనమును, మునిపత్నీవాంఛితము[illegible]ను, వేశ్యాంగనాసంక్రీడనము, బలాద్వశీకృతకన్యాసమాగమము, నిత్యా[illegible] నగు కామ మనియు నికృష్టశృంగార మనియుఁ దలఁచవచ్చును. అట్టి [illegible] నీగ్రంథమున నున్న వేమో చూతముఁగాక. [illegible] వరూధినీప్రవరవృత్తాంతములో నుత్కృష్టమగు నేకపత్నీవ్రతమును దాంపత్యపవిత్రతయు [illegible] గఁ గనఁబఱిచినాఁడు గదా! వరూధిని మాయాప్రవరునితో [illegible] నది మానవలోకమున కతీతమై దేవాస్వర్గలోక[illegible] ప్రయోగసాధ్యములు కావని యిది [illegible] జేసియున్నాఁడను. అయినను నీయితివృత్తముకూడ నవినీతివిరోధముగ నెంచఁదగిన దని పైనఁ జూపితిని. అటుతరువాత శృంగారకథావ్య[illegible] మనోరమాస్వరోచులది కదా ? మనోరమ శీలము ననుచితముగా నెట్లు నిందించినారో చూసిన హేతువులుగఁ దెల్పితిని. ఇంక స్వరోచివిషయమును జూతము. స్వరోచి గ్రంథమందు చెప్పటనైనను దన్ను మనఃపూర్వకముగా వరించి వివాహముచేసికొనిన భార్యలతోనే రమించినాఁడు, గాని, పైనసుదహరించిన యశాస్త్రీయములైన-య[illegible]లములైన- శృంగారసంబంధముల నెంతమాత్రముఁ గలిగించుకొనలేదు. తాను శాస్త్రోక్తముగా వివాహముచేసికొనిన స్త్రీలతో సుఖలీలల భోగించుటయే శాస్త్రమునకు నేమతమునకు విరుద్ధము? మొట్టమొదటనే ప్రాచ్యదేశశృంగారమునకుఁ బాశ్చాత్యదేశశృంగారమునకు మూలసూత్రములలోనే భేదము కాన్పించుచున్న దని చెప్పితిని. పాశ్చాత్యదేశమందు నాచరణలో నెట్టిశృంఖలస్వేచ్ఛారతి యున్నను, శాస్త్రీయముగా నేకపత్నీస్వీకరణమే యంగీకృతమైనది. కాఁబట్టి క్రైస్తవదేశవాఙ్మయములలో నొకనాయకునకే యిద్దఱు ముగ్గురు నాయిక లేకకాలమున నుండుట తటస్థింపదు. ప్రాచ్యదేశములలో నట్లుగాదు. హిందూమతములోఁ గాని మహమ్మదీయమతములోఁ గాని యేకకాలమున నొకనాయకున కిద్దఱు ముగ్గురు భార్యలు శాస్త్రోక్తముగా వివాహితలయి భోగయోగ్యము లగుచున్నారు. వారితోఁ బ్రకామముగాఁ

క్రీడించుట యెంతమాత్రమును శాస్త్రదూష్యము కాదు సంఘదూష్యము కాదు ప్రాచ్యశృంగారరసమందలి యీపరిణయవిధానపు మూలసూత్రమును శ్రీ శాస్త్రిగారు ముఖ్యముగా గమనింపవలసియున్నది. స్వరోచి యొనరించిన దియు ననుభవించినదియు నిట్టిశృంగారమే. అతఁడేకన్యను గాని స్త్రీనిఁ గాని బలాత్కరింప లేదు. వారాంగనాలంపటుఁడై వ్యభిచరింపలేదు. కారణవశమునఁ దన్నువరించినకన్యలను మాతాపితల యనుజ్ఞను బొంది వైవాహికకర్మ యుక్తముగఁ బరిణయమాడి వారితో సుఖియించెను. ఇట్టిస్థితిలోఁ బఱుకాము మెచ్చట నున్నదో శ్రీ శాస్త్రిగారు నిర్ణయించి చెప్పవలసియున్నది. మార్కండేయపురాణములో స్వరోచిని గుఱించి మార్కండేయు లిట్లు చెప్పిరి "కింతు ధర్మావిరోధేన కుర్వన్ ధర్మాశ్రితాః క్రియాః భుంక్తే స్వరోచి స్సహ యోషాభి రుదారధీః"

అనఁగా, "ధర్మమునకు విరోధము లేకుండ, ధర్మము నాశ్రయించిన కార్యములను జేయుచుఁ దనభార్యలతో స్వరోచి విషయసుఖము లనుభవించెను." కాఁబట్టి స్వరోచిశీల మనింద్యము.

స్వరోచి యావజ్జీవము శృంగారప్రియుఁడే గాని యాతను భోగేచ్ఛ వదలి తప మొనరించుటకుఁ బోయినట్లు మూలములో నున్నను దానిని బెద్దన్న విడిచిపుచ్చె నని యందుచేఁ బెద్దన్నదృష్టియందుఁ బఱుకామమే మానవ జీవితాదర్శముగ నున్నదని శ్రీశాస్త్రిగారు తమవిమర్శములో ననేకపర్యాయములు త్రిప్పిత్రిప్పి యీవిషయమును మనచెవులలో గ్రుచ్చిగ్రుచ్చి వాక్రుచ్చిరి. మూలగ్రంథములో స్వరోచి హంసవచనములు వినినతరువాత భార్యలను విడిచి తపం బొనరించుటకు నరణ్యమునకుఁ బోయె నని యున్నమాట నిజమే. మనగ్రంథములో స్వరోచియొక్క యంత్యనిర్గమన మెంతమాత్రము స్పృశింపబడలేదు. పెద్దన్నగారు, ఆవిషయమున స్పృశింపకపోవుటకుఁ దపముచేయుటయే యాయన యయోగ్యమని తలఁచి విడిచిపెట్టి రని శ్రీశాస్త్రిగారి వాదము. తపశ్చరణము, దైవభక్తియు, నైష్ఠికకర్మానురక్తియు మున్నగు సౌశీల్యధర్మము లెంతమాత్రము రుచింపనియెడలఁ బ్రవరుని వరూథినితోఁ బొత్తుఁగలుపక వంచివేయుట యెట్లు పొసఁగినది? తుదకు స్వారోచిషమను వ్రద్భవించి బాల్యమునసే శ్రీభగవన్నారాయణభక్తుఁడై మహావిష్ణువును సాక్షాత్కరింపఁ జేసికొనె నని యెట్లు వర్ణింపఁ గలిగిరి? ఇవి యన్నియు శ్రీశాస్త్రిగారి వాదమునకుఁ

గేవలము విరుద్ధములే. కావున స్వరోచి తపమునకుఁ బోవు విషయమును గ్రంథములో సూచింపకుండుటకు వేఱె కారణ ముండవలయును. అది సహృదయులు జాగ్రత్తగా యోజించుకొనినఁ దెలియఁగలదు మూలగ్రంథ, మనఁగా మార్కండేయపురాణము. పురాణగ్రంథము. ప్రస్తుతవిమర్శితగ్రంథము, అనఁగా, మనుచరిత్రము-ప్రబంధగ్రంథము. పురాణములకుఁ బ్రబంధములకుఁ గావ్యశిల్పములోఁ జాల భేదము లున్నవి. పురాణములలో ననేకేతివృత్తములు పరస్పరమిళితములై వచ్చుచుండును. ఒకకథ సాఁగుచునుండఁగా మధ్యమధ్యను జిన్నచిన్నయుపాఖ్యానము లెన్నియో వచ్చుచున్నను నవి యన్నియు సమగ్రముగా నడపింపఁబడి మూలకథ కెంతమాత్రము విరోధకములు గా నుండవు మూలకథ యథావిధిగా సమగ్రము నొందింపఁబడును. కాఁబట్టి పురాణములలో వస్త్వైక్యముకన్న వస్తువిభిన్నతయే కాన్పించును. ప్రబంధములలో నట్లుగాక వస్త్వైక్యమే ప్రధానముగా నుండును, గావున, నొక యితివృత్తము కథారూపమున విసరింపఁబడుచున్నపుడు మధ్యమధ్యను జిన్నచిన్న యితిహాసములును నంతరకథలును వచ్చుచున్నను నవి మూలకథ కెంతవఱ కుపకరించునో యంతమాత్రమే గ్రహింపఁబడును. కథాప్రణాళికకంతరాయములు గలుగఁజేయు భాగము లన్నియు విసర్జింపఁబడును. ఇట్లు సంధాననియమమును బాటించుటచేఁ గథయందు వస్త్వైక్య మేర్పడుచున్నది. సామాన్యమున నేప్రబంధముఁ జూచినను గథాకథన మీవిధముగనే యుండును గాని యన్యథా యుండదు. ప్రకృతమున మన మనుచరిత్రయందలి విషయముఁ జూడుఁడు. ఈవిషయమందుఁ బెద్దన్నగారు చెప్పఁదలఁచుకొనినది స్వారోచిషమనుసంభవము. అనఁగా స్వరోచికి మనువుపుట్టుట. ఈకథను జెప్పఁదలఁచుకొని యాకథ కనుకూలమైన ప్రణాళికను నిర్ణయించుకొనెను. ప్రప్రథమమునఁ బ్రవరుఁడు హిమవద్గిరికిఁ బోవుట- అచ్చట వరూథినిని జూచుట- వారిరువురకు జరిగినసంవాదము- తదనంతరము ప్రవరుఁ డింటికేగుట-తదుపరి మాయాప్రవరుఁడు వరూథినితో సంభోగించుట- వరూథిని గర్భవతియగుట- మాయాప్రవరుఁడు కథనుండి తొలఁగిపోవుట- స్వరోచిజననము, వర్ధమానము- స్వరోచి మనోరమను కళావతిని విభావసిని వివాహముచేసికొనుట- వారికిఁ బుత్రులు గలుగుట- ఆ పుత్రులకు రాజ్యము నొసంగుట- అటుపైని వనదేవత మృగరూపమున స్వరోచినిఁ బొందఁగోరుట- స్వరోచి యామెను బరిగ్రహించుట- తద్వారణమున

స్వారోచిషమనువు జన్మించుట- స్వారోచిషమనువు బాల్యముననే భగవద్భక్తి పరాయణుఁడై తపం బొనరించుట- ఇదియే ముఖ్యకథాసూత్రము. ఇందులో నాయాయవసరములకొఱకు వచ్చినకథాపాత్రముల యవసరము తీరినవెంటనే కథారంగమునుండి తొలఁగిపోయిరి. ఇంటి కేగినప్రవరుఁ డే మయ్యెనో తెలియదు. వరూథినియొద్ద సెలవుఁగైకొని వెళ్ళినమాయాప్రవరుని తరువాతివిషయ మేమో తెలియదు- స్వరోచిషిఁ గన్నతరువాత వరూథినియొక్కవిషయము నట్లే యదృశ్య మైనది. ఈపాత్రలంఱయు వారివారిపనులను నెఱవేర్చి తక్షణమే తొలఁగిపోయిరి. అలాగుననే స్వరోచియును, స్వారోచిషమనువు పుట్టిన వెంటనే తనపని నెఱవేఱునుగానఁ దొలఁగిపోవలసివచ్చెను. కాఁబట్టి తనజీవితాంతము నెట్లుపొందెనో దానిని మనకవి ప్రసాదింపనవసరము లేకపోయెను. మఱియొకసంగతి- వనదేవత మృగీరూపమున వచ్చి స్వరోచిషిఁ దన్నాలింగనముఁ జేసికొమ్మని కోరఁగా నతఁ డట్లుచేసిన తరువాత నామె స్త్రీయై యిట్లనియెను. "సమస్తదేవతలు వేఁడికొనఁగా నేనిటకు వచ్చితిని. నీవలన నేనుమనువును గనవలసియున్నది అట్లు నాయందుఁ బుత్రునిఁ గనుటవలన నీకుఁ బుణ్యలోక సంప్రాప్తి కలుగును." స్వరోచి పుత్రుఁ డగుమనువును గనినవెంటనే దేవతల వరముచొప్పున పుణ్యలోకమునకుఁ బోయెను. వేఱె తపస్సెందుకు ?

ఈప్రబంధము స్వరోచిచరిత్రము కాదు. స్వారోచిషమను చరిత్రము కాదు. స్వారోచిషమనుసంభవమే. కాఁబట్టి యాయితివృత్తమునకు నిబ్బరముగా నడపించెడు కథాభాగములను, కథాపాత్రములనే యెత్తికొని కథాప్రణాళికను సాగించి యాయితివృత్తముతోనే ప్రబంధముఁ బూర్తిఁజేసెను. కనుక స్వరోచి తపంబునకుఁ బోయెనో లేదో తెలిసికొనుట కెవను కలుగుట లేదు. గ్రంథమందు లేదు గానఁ దపంబునకుఁ బంపుటకుఁ గవి కిష్టములేకుండెనని చెప్పుట యన్యాయమును, నసమంజసమును.

పెద్దన్న స్వారోచిషమనువుయొక్క చరిత్ర మెంతమాత్రముఁ జెప్ప లేదనియుఁ గాఁబట్టి యిది మనుచరిత్ర మనిపించుకొన దనియు మనశాస్త్రిగా రాక్షేపించిరి. వా రిట్లాక్షేపించుట కెంతమాత్రము నవకాశము లేదు. ఈప్రబంధమునకు స్వారోచిషమనుసంభవ మని కవి పే రిడినట్లు గ్రంథమందే యున్నది. మనుచరిత్ర మని సంక్షిప్తనామమునఁబగఁగుటసామాన్యవ్యావహారికసౌలభ్యముకొఱకే. ఈనామము సంజ్ఞామాత్రమే ! ఇట్లు సంక్షిప్తనామములచే

గ్రంథములు వాఙ్మయములందు సాధారణముగ వ్యాప్తములగుట పండితులకుఁ దెలిసినవిషయమే. అభిజ్ఞానశాకుంతలమును, శాకుంతల మని పిలుచుచున్నాము ఉపరిచరవసుచరిత్రమును వసుచరిత్ర మనుచున్నాము వీనికంటె విలక్షణమైన పేర్లెన్ని యున్నవో చూడుఁడు. వేణీసంహార మనఁగా జుట్టుముడి వేయుట. ఆపేరువలన నెట్లు ద్రౌపదిమానభంగచరిత్ర తెలుపఁబడుచున్నదో యోజింపుఁడు. మృచ్ఛకటికము – అనఁగాఁ జిన్నమట్టిబండి. ఈమాటవలన నానాటకమందలి కథావిషయ మెట్లు నిరూపింపఁబడుచున్నదో యరయుఁడు! ఈలాగుననే యనేకగ్రంథములపేళ్లు కేవలము సంకేతన సౌలభ్యము కొఱకై కవులచే నుంపఁబడిన సంజ్ఞామాత్రము లనియే చెప్పవచ్చును. వీనికి లోకవ్యవహారప్రసిద్ధిచే నేకవస్తుసూచకత్వము స్థిరమయినది. ఈగ్రంథములపేళ్ళవలెనే మనుచరిత్ర మనుపేరుఁగూడ లోకవ్యవహారమున రూఢిపొందినది.

ఈలాగున శ్రీ శాస్త్రిగారు తమవిమర్శనమందుఁ జూపించినదోషము లన్నింటికినిఁ దగుసమాధానములను జెప్పవచ్చును. కాని, గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించితిని. వ్రాసినంతవఱకు సహృదయులు నిష్పక్షపాతముగఁ జూచినయెడల శ్రీ శాస్త్రిగారు కనఁబఱిచిన దోషాంశములలో నొకటిరెండు దక్కఁ దక్కిన వన్నియు భ్రాంతిమూలకములే గాని నిజమయిన దోషములు గావని తెలిసికొనఁగలరు. ఈవిమర్శనవిషయ మంతయు నాకు మిక్కిలి జుగుప్సాకరమైనను న్యాయమైనదియు నిష్పక్షపాతమైనదియు నగు నాంధ్రవాఙ్మయవిమర్శన నిరూపణకొఱకు శ్రమపడి వ్రాయవలసివచ్చిన దని మనవిచేయుచున్నాను. పండితలోకము క్షమించుఁగాక !

మనమహాకవులను నుదారహృదయముతోను బ్రసన్నబుద్ధితోను విమర్శింపవలసినదే గాని దోషైకదృష్టినిఁ బరీక్షించుటచే వారి కన్యాయముచేయుటయు మన మనాదరణపొందుటయుఁ దటస్థించును.

—

# ఆంధ్రకవుల భావచిత్రములు.

జి. జాషువా కవిగారు, వినుకొండ.

---

వాఙ్మయసరస్వతి తనమంజీరధ్వను లొలయు మురిపెములు మీఱ సంచరించు నేఁటిపరిషత్సభకు నే నాహ్వానింపఁబడి, కృతపుణ్యుఁడ నయితిని, నా యుపన్యాసమును బండితకోటి కరుణామయి పాలించి నన్నుఁ గృతార్థునిఁ జేయుఁగాత.

నా వ్యాసాంశము "ఆంధ్రకవుల భావచిత్రములు" ఆంధ్రశబ్దము చెవుల సోఁకినంత వివశుఁడ నయిపోవుచుందును. ఆంధ్రకవులు నాకు సేవనీయులు. ఇది నా దేశము. నా కులుకునది యాంధ్రము. Italian of the East అనుబిరుదము నురంబునఁ బూని "సంస్కృతంబు తల్లి సకలభాషలకును, బాసలలోఁ దెలుంగుబాస లెస్స" యనిపించుకొన్న భాషాశిరోమణి. మఱి నేనేల పొంగిపోవకుందును ?

సీ. బహుదేశములను బేర్వడసి మీసముదీటు భరతఖండంబు నా పాఠశాల
స్తనయుగంబున గానసాహిత్యములుపింపు భాషావధూటి నా పంతులమ్మ
సాందీపముని సమక్షమున విద్యగణించు వనమాలి నా సహపాఠకుండు
భక్తివైరాగ్యభావములఁ దావలమైన భాగవతంబు నా బాలశిక్ష
ఘంటము ధరించి మోహనాక్షరము లెనయఁ
బ్రతిఫలించెను నా మహోన్నతవిభూతి
వ్రాసికొందును దశదిశాఫలకపంక్తి
గడన కెక్కిన యాంధ్రపుత్రుఁడను నేను.

అని నేనాలపించుచు జీవయాత్ర గడపెదను. ఇంకఁ బ్రకృతమునకు వత్తము. ప్రప్రథమమున నెట్టిది ? కవిత. సృష్టికర్త యగుకవి యెట్టివాఁ డను రెండంశములను గూర్చి విచారింతము.

కవిత:—చరాచరాత్మక మైన ప్రకృతిని దన ప్రజ్ఞాబలంబున వడియఁగట్టి కవి స్వాధీనము చేసికొను నొకానొక యద్వితీయ సమ్మోహనవిద్య. దాని నతఁడు పరిశుద్ధభాషావాహినియందు స్నానమాడించి ఛందంబను చట్రమున బిగించి మనకుఁ జూపును. దానికి శ్రోతలును పఠితలును తన్మయు లగుదురు. అది నవరసస్యందియై భువనములను శాసించును. దాని సౌందర్యమునకుఁ బెదవి విఱువని

వాఁడును, జెమ్మగిల్లనివాఁడును ముల్లోకముల లేఁడు. భూమ్యాకాశములను బొమ్మలవలె నాడించుకాలమున కది లొంగదు. కాలము కవితకు దాస్యము చేసితీరును. అది యొకరసప్రపంచము. దానిలోని ప్రత్యణువు నమృతమయమును శాశ్వతికంబు. అందలి నదులు, పర్వతములు తిర్యగ్జంతువులు పాడనేర్చినవి. దానికధినాథుఁడు కవి. అతఁ డాకవితాప్రపంచమధ్యమున దివ్యసింహాసనము నధిష్ఠించి పరిపాలించును. వానికి శత్రుభీతి లేదు. అతని నైశ్వర్య మొకరిచే నపహృతము కాదు. అతఁడు మహాభోగి; తా ననుభవించు సుఖ మితరజనులకుఁ బంచిపెట్టును దాన నతఁడు దాతయు-

ఇట్టిగుణములు గలిగి రసాత్మకమైన యొకవాక్యమే కావ్య మని విశ్వనాథపండితుఁడు నుడువుచున్నాఁడు. ఈకవితకంగసౌష్ఠవమును గూర్పఁదలఁచి భామహోద్భటమమ్మటాదు లలంకారశాస్త్రములను నిర్మించిరి. కవితకుఁ బ్రధానాంగమును జీవము నయినది భావచిత్రము. పౌరకవియగుబృహస్పతిచే నుపలాలింపఁబడిన కవిత్వచరిత్ర మన కనూహ్యంబు, కాని, వాల్మీకిముని భావచిత్రరచనాదక్షుఁడై, దీనిని సర్వాంగశోభితను గావించినాఁడు.

కవి యెట్టివాఁడు—వానిమనస్తత్త్వమేమి ?

A poet is born but not made అని షేక్స్పియరుమహాకవి. కవి సామాన్యుఁడు మానవప్రకృతికి నతని కెట్టివ్యత్యాసమును లేదు. కాని స్వతస్సిద్ధమైనయొకశక్తి నీశ్వరుఁ డతనికిఁ బ్రసాదించియుండును.

శ్లో॥ యానేవ శబ్దాన్ వయమాలపామః । యానేవ చార్థాన్ వయ ముల్లిఖామః
తైరేవ విన్యాసవిశేషభవ్యైః । సమ్మోహయంతి కవయో జగంతి. అనునది.

కాని యాయాశబ్దార్థములను భవ్యస్థానములయందు న్యస్తము చేయుటకుఁ గవి యనుష్ఠించునది చింతనము; కాఁబట్టి యతనిలో సునిశితమై రమ్యతమపదార్థములలోని సృష్టిస్వభావము నెఱుంగఁజాలిన విజ్ఞానము పొంగులువాఱుచుండును. ఆతనియంగకములలో నుడుకునెత్తురు పిలిచినఁ బలుకుచుండును. కావుటంబట్టి కవి పరాధీనజీవనమును సహింపఁడు. సార్వజనీనమైన సత్యమును వచించుటకు వెనుదీయఁడు. తనహృదయతంత్రి కదలెనా యతఁడు గానము చేసితీరును. దాన నతనికి మరణమే ప్రాప్తించుఁగాక. వానినాల్క రహస్యగోపనము నెఱుంగదు.

వీరోత్సాహపూరితులై, రాజానుచరులను జించిచెండాడుచున్న త్రెం

చి దేశీయులలో నొకానొక శిల్పకారుని సంహరించి తనుపుఁ గోల్పోయిన యొకసుందరి నారసి యొక ఫ్రెంచికవి, She is greater than Brutus (ఆమె బ్రూటసుకన్న గొప్పది) అని కేకలిడి పద్యములు నల్లి వాని నాలపించి యసువులను బోఁగొట్టుకొన్న కథ కవి యెట్టివాఁడో స్పష్టపఱుచుచున్నది.

భావచిత్రములు:—భావచిత్రము లనఁగా భావము లను బొమ్మలు. చిత్రములను రచించువానికి రంగులు, కుంచె, కాగితము, పరికరములు. లక్ష్యముల నతఁడు వ్రాయును అది నేత్రానందము నిచ్చి ప్రేక్షకుల యాఁకటకు ఆపులకును, ఆహారావములకును గగుర్పాటులకును నగ్గముగును. చిత్రకారునకువలెఁ గవికిని సేకరింపవలసిన పరికరము లెన్నియో కలవు అవియే రీతులు, శయ్యలు, పాకములు, అలంకారములు. అలంకారము లనుటచేత ఛేకానుప్రాస లాటానుప్రాస యమకము లని నాయభిప్రాయము కాదు కాళిదాసవాల్మీక్యాదులు స్వీకరించిన యుపమా రూపకోత్ప్రేక్షాదులు. కవి వీనిని బురస్కరించుకొని తన దివ్యలేఖని నుండి బొమ్మలను వ్రాసి లోకమున కర్పించును. కవివ్రాయుచిత్రములు చిత్రకారునిబొమ్మలవలెఁగాక హావభావములతోఁ బ్రాఁతవడక చికిపోక వికలములుగాక వివర్ణతనందక మనమనో నేత్రముల సత్వరవపుర్విలాసభాసమానములై తాండవించుచుండును.

అగుచో నిది సాధ్యమగునా? నేఁడు మనము కవు లనువారలలో నెవఁడీ భావచిత్రములను రచింప దక్షుఁడయ్యె ననుమీమాంసకు నిలుచునది కొలఁదిమందిమాత్రమే యని ప్రతిసహృదయుఁడు నొప్పికొనితీరును. ఎవనికవితయందు వ్యర్థాలంకారరచనావ్యాప్తి గోచరించునో యతఁడలసుఁ డనంబడును. భావచిత్రరచనారహస్యజ్ఞుల కీయలంకృతు లొకవిధముగా నుపకరించినను వారు ప్రధానాంగముగా నిల్పునది భావము. అది లేనివాని వ్రాఁతలలోఁ గథాచిత్రమొక్కటియే గన్పట్టును. లేదా? అలంకారశిల్పము కవితనుగూర్చి పురాతన కవులకుఁ గలయభిప్రాయభేదము లసంఖ్యేయములు.

క. మదమున సత్కవికావ్యము, నదరఁగవిలుకానిపట్టినమ్మును బరహృ
  ద్భిదమై తలయూఁపింపని, యది కావ్యమె? మలరిపట్టినదియుం గరమే?

ఉ. పదబంధంబుల నగ్గలించి, బుధశబ్దభ్రాజియై, సద్గుణా
  స్పదమై, దుష్టవిహృత్సరోజవనముల్ భంజింపుచున్ భూరిస
  మ్మదలీలన్ విలసిల్లి, సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
  మదనాగంబును బోలెఁ గ్రాలవలదా? మా టెందు లేకున్నతిన్—నన్నెచో.

చ. ఘనతరగూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుఁదనంబును లేకయుండఁ జె
ప్పినయదె యొప్పు కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్. చాటువు.

ఉ. అల్లన నిచ్చు చెంగలువలందు రజంబను కప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచు సౌరభముల్ వెదచల్లు భావముల్
పల్లవహస్తచన్నుఁగవపయ్యెదజేబుకఁ దోఁచు భాతిగాఁ
బిల్లలమఱ్ఱి పీరన యభిజ్ఞుఁడు చెప్పఁగ నేర్చుఁ గబ్బముల్—పినవీరభద్రుఁడు.

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దములోన దారయు శబ్దములఁ గూర్చి——సూరన.

రమణీయార్థప్రతిపాదకః కావ్యమ్—పండితరాయలు.

కవిత యట్టిదని నిర్ధారించిన యిక్కవులయభిప్రాయము లన్నియు దాదాపుగా భావచిత్రములనే ఘోషించుచున్నవి.

భావము—దీనియర్థ మే మని చర్చించినచో, నేదో యొక భావము పద్యమున కుండవలెను. భావవిరహితముగాఁ గవిత కలదా ? యని కొందఱు వాదింతురు. ఆభావము సామాన్యులకు వశ మగునది గాక నవనవోన్మేషశిరీష కుసుమపేశలతయు ను గప్పురపుఁ బల్కులశైత్యమును జుంటితేనెల మాధుర్యమును, విలుకాని యమ్ముకొననున్న నిశితత్వమును గలిగి చదివినంతనే పాఠకునకు సర్వాంగీణ మైన యొకానొక తన్మయతను గొనివచ్చునదయి, యభినవంబైనదయి యుండవలయును. ఇట్టిభావములను బ్రకృతినుండి సేకరించుటయు వానిని దగురీతిని జిత్రించుటయును నుత్తమకవికి లక్షణము. ఆలంకారికులు కావ్యమునకు ధ్వని ప్రధాన మనియు, నలంకారము ప్రధాన మనియు, నోజస్సు ప్రధాన మనియును భిన్నరీతుల నుగ్గడించిరి. రాజశేఖరుని కావ్యమీమాంస సాహిత్యపురుషునకును గావ్యేందిరకును మఱొకవిధముగా శరీరసృష్టిఁ జేయుచున్నది. ఇమ్మహనీయులమతమునకు నావ్యాస మిసుమంత భేదించుచున్నను నానిశ్చితాభిప్రాయమును వెల్లడింపఁబూనిన నాసాహసమును బండితులు మన్నింతురుగాక.

—( పురాతనకవులు—భావచిత్రములు )—

భావచిత్రములు కుప్పలు తెప్పలుగా గోచరించుచుఁ బాఠకులహ్లాద

యములనొక చలనపటప్రదర్శనశాలయందుంచి విభ్రమాశ్చర్యములతో ముంపఁజేయఁజాలిన కావ్యసృష్టికర్తలలో నెన్నఁదగినవారు వాల్మీకి కాళిదాస ప్రభృతులు వాల్మీకి చూపిన మార్గము ననుసరించి, రసగ్రహణపారీణుఁడగు కాళిదాసలంకారరత్న మనందగిన యుపమానమునకే ప్రాముఖ్య మొసంగి కవిలోకపట్టభద్రుఁడైనాఁడు.

ఉపమానము లనుటచేత నలంకారముల కిక్కడ విశేషప్రసక్తి లేదు. భావచిత్రములను రచించుచు, వానికి మెఱుంగుపూఁతగా నలంకారములలో నుపమలను విశేషముగా స్వీకరించె నన్నమాట.

శ్లో. ...మందానిలోద్ధూతకమలాకరశోభినా
గురుం నేత్రసహస్రేణ చోదయామాస వాసవః॥

ఇందు దేవేంద్రుఁడు వేయికన్నులతో సైగచేయుట గమనింపఁదగినది. సమయమునకుఁ దగినట్లు బృహస్పతిని గను సైగ చేసె ననుటలోఁ గలగంభీరతయే భావము. దీనిని యుక్తమైన యుపమానమునఁ జికిలీచేసి, "నీవు చెప్పవయ్యా!" అను పేలవమైన యంశమును రసభరితము గావించినాఁడు. ఇట్టిచిత్రములు సంస్కృతకవులరచనలలో లెక్కకుమిక్కిలిగా నున్నవి.

తిక్కన—ఇంక నాంధ్రకవులవంకకు మరలి భావచిత్రములను వ్రాసిన కవిచక్రవర్తులను బేర్కొనవలసివచ్చినపుడు తొలుత, తిక్కనార్యుఁడు మన మన్ననకుఁ దగియున్నాఁడు. తిక్కన భావముల కిచ్చినంత ప్రాధాన్యము నలంకారమునకుఁ గాని, పాకమునకుఁ గాని కథకుఁ గాని యొసంగఁడు. కేవల మలంకారప్రియులైనవారికి తిక్కనకవిత తిక్కతిక్కగానే కనిపించును, గాని, కవిలోకచక్రవర్తి యితఁడే యని ప్రతిపద్యమును గేకలిడుచుండును.

చ. కడుఁ బసిబిడ్డ వీఁడొకటి గా దవు నా నెఱుఁగండు ముందరె
య్యెడ నొకపా టెఱుంగఁ డెదయెంతయుఁ గోమల మెప్పుడైన నే
గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గలయాఁకటిప్రా ద్దెఱుంగఁ డీ
కొడుకిటు వోకకున్ మనసు గుందెడి నిన్నని యూఱడిల్లెడిన్.

ఈపద్యమున నరణ్యముల వసింపఁబోవు పాండవులలోఁ గనిష్ఠుఁడగు సహదేవుని ద్రౌపదికిఁ జూపి కుంతి పలికినమాతృప్రేమ వెల్లివిరియుచున్నయది. వేయిమాటలేల యిక్కడఁ దిక్కనార్యుఁడొక నిస్సీమంబైన మాతృప్రేమవాహినిని జిత్రింపఁదలఁచి, కుంతీమానసమున నైక్య మంది వెలువరించిన

కరుణారసదిగ్ధంబైనశబ్దజాలము గాని యిది పద్యము గాదు. ఇది సహదే
వుని పసితనము, కుంతి కొడుకులఁ బెంచుకొన్నవిధము, తాను లేనిలోటు
దీర్చి, ద్రౌపది పతులను సంరక్షించుకొనుటయందలి యప్రమత్తత, ప్రత్యక్షర
మునను గోచరించుచుఁ దిక్కనార్యునికళాప్రతిభను సహస్రముఖములఁ జాటు
చున్నది. రెండవవాఁడు నాచనసోముఁడు——

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
దొరుఁగన్ బయ్యెదకొం గొకింత దొలఁగం దోర్దోశ్శరాసారమున్
దరహాసామృతసారమున్ గురియుచున్ దన్వంగి లీలాగతిన్

ఇందొకవంక సత్యభామ కినుక రెండవవంక కృష్ణునియం దనురాగ
మును బ్రదర్శించుటను గవి చిత్రించినాఁడు, శృంగారవీరము లనురెంటి నొక
చోట నాట్యమాడించుచున్న యీపద్య మెవ్వని ముగ్ధునిఁజేయలేదు ? ఇది
భావచిత్రము. మూఁడవవాఁడు కృష్ణదేవరాయలు——

మనవారు క్లిష్టకావ్య మని యనాదరించిన యితని యాముక్తమాల్యద
భావచిత్రములకు ఖని. అనన్యసామాన్యము లయినతన భావములను బరిపూర్ణ
ముగా వ్యక్తము చేయుటకును- ఆభారమును వహించుటకును- సరళమైనభా
ష యోరువలేకపోయినది. అందుచేతనే తా నట్టిభాష నుపయోగించె నని
నాయూహ.

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్దామదీ
ర్ఘసటాఝూటముఁ బెళ్ళగించుక్రియ నాంత్రశ్రేణిఁ గ్రన్నం బెఱం
జు సితక్రూరభవన్నఖావళులు ప్రోచున్ మర్త్యపంచాననా.

ఇందలిభావచిత్రము హృదయవిదారకమై హిరణ్యకశిపుని హృదయ
విదారణవ్యాపారమున భయంకరాకారుఁడైన నరసింహుని శాశ్వతకాలము
చిత్రించివేసినది. రంగులతోఁ జిత్రకారుఁ డీబొమ్మను వ్రాయలేఁడు. ఒకవేళ
వ్రాసినను నీభయానకదృశ్యము స్వాధీనము కాదు. తనప్రతిబింబమును నీట
నారసి కుందేటిచే మడిసిన పంచతంత్రమునఁ గల సింహపుకథ నాకు జ్ఞాపకము
నకు వచ్చుచున్నది. సింహస్వభావము నవగతముచేసికొన్న జంతుశాస్త్రవేత్త
లకుఁ గాక మఱొకని కీవర్ణన దురవగాహము.

మ. మునుమున్ దెల్పగు దూఱఁదూఱ మఱి కెంపుల్ పొందియుందూఱఁ గం
దనగాయం గల నల్పు దోఁప, నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁడుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీ తేజమున్
గొనులీలన్ విదళింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ!

ఇందు కవియొక్క శరీరశాస్త్రజ్ఞానము బహువీరవిరోధి వక్షఃపాటనపరిశ్రమంబును స్పష్టముగా నుల్లేఖింపఁబడినది. శరీరము గాయపడుచోఁ దొలుతఁ దెల్పు దోఁచుట సహజము. శరీరశాస్త్రజ్ఞులు దీనినే ప్రభాసిని యందురు. తదుపరి రక్త మూరి యెఱుపు దోఁచును కందనగాయ నల్లని దగుట ప్రసిద్ధము. ఈవర్ణత్రయమును మూర్తిత్రయీ తేజమునకు సంధించి హిరణ్యకశిపుని సంహారవ్యాపారమును ముగించిన యీమ్మహానీయు నేమనవచ్చును?

ఎక్కడి దానవేశ్వరుని దేహప్రకృతి? యెక్కడి మూర్తిత్రయీ తేజము? ఇట్టివర్ణన వీరాధివీరుఁడను గవియు నగుకృష్ణరాయనికిఁ గాక యొరులకు సాధ్యముగాదు. నాల్గవవాఁడు పెద్దన:—

"కులిశధారాహతిపొలుపునఁబయినుండియుడుగుమోవఁగ జేగురైనతటుల"

అనుపద్య మొక నిసర్గసిద్ధం బయిన కొండకోనను సృష్టించి, తనువులను హాయిహాయి యని జోకొట్టుచున్నది.

"క్రోధైకధురీణతన్ గఱచి యేపినసింగిశికోలరొమో యనన్"

"తతనితంబాభోగధవళాంశుకములోని యంగదట్టపుఁగావిరంగువలన"

మొదలగుపద్యములలోని భావములసాంద్రప్రతిమానము. అయిదవవాఁడు చేమకూర వేంకటకవి:—

మ. తనకున్ గాఁగిలి యీవొకప్పుడును నాథా! నీకరస్పర్శనం
బున గిల్గింతఁ గటంచుఁ బద్మిని కరాంభోజంబునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులఁ గన్పట్టంగ నవ్వేల్పురా
యని రారా! యని పిల్చె నాఁదగె, ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్.

సరోవరమునఁ బద్మిని మందమందనటద్వాయుచలద్దళాంగుళులతో రారా! యని సూర్యభగవానుని బిలుచుచున్నయది. కాని వ్యంగ్యముగాఁ బద్మినీజాతిస్త్రీలలజ్జావతిత్వమునకు లోపమో యని సందేహింతును. తెలుఁగుకవుల వ్రాఁతలలోని యనేకవర్ణనలలో నిదినమస్తఁధముల భేదించుచున్నది. విస్తరభీతి

చేత నేనొక్కొక్కకవిప్రాంతలనుండి యొకటి రెండు పద్యములను మాత్ర ముదాహరించినాఁడను.

—॥ ఒకానొక యాధునికకవి ॥—

"గీ. పూలబిడ్డల వలపుటుయ్యాలలూఁచు
కవనుఁడెఱుఁగఁడు తోడిమెలు వదలఁజనుచు"

ఈపద్యమును జూడుఁడు. పూఁబాపల నుయ్యాల లూఁచఁ బూని వాయుమాణవకుఁ డుద్యమించెనఁట, ఇతఁ డెవఁడు? ఈబిడ్డ లెవరు? అచేతనములయిన పదార్థముల కన్యోన్యప్రేమను గల్పించుట స్వభావ విరుద్ధముకదా? పాప మతఁ డూఁచును. కాని బిడ్డలు రాలిపోవుచున్నారు వాయుకుమారుఁడీకి లెఱుంగని యమాయికుఁడు; బిడ్డ లల్పజీవులు. ఈవిచిత్ర భావచిత్రరచనము వారసి సహృదయుఁడు కన్నీళ్లు నించుచున్నాఁడు. ఇందలికథావస్తువులు ప్రకృతినుండి గ్రహింపఁబడినను గర్భితమై యున్న కథ మానవునిది. ఇట్టి రచనాదక్షు లగుకవులనే (Original Poets) ఉపజ్ఞగల కవులందురు.

—॥ ఉపసంహారము ॥—

భావచిత్రములకు ధ్వని గాని, ధ్వనికర్థస్ఫురణము గాని దేని కెయ్యది సహాయ్య మొనర్చిన నొనరింపకున్నను మొత్తముమీఁదఁ బద్య మానందరససిద్ధికి మూలమై యుండకున్న నది కవిత కాఁజాల దని నాయాశయము.

శ్లో. కింకవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః-అనుట సార్థకము కావలె.

భావచిత్ర బాహుళ్యము కావ్యమున గోచరించినపుడే రసోత్పత్తి యగును. కావున రసమునకు భావము, భావమునకు రసముఁ బోషకము లై యుండును దానికిఁ బరిశీలనసుఁ డగును-ఇట్టిశక్తి పూర్వవాసనావశమునఁ గవికి లభ్య మగును. "సుకవితా య ద్యస్తి రాజ్యేన కిమ్" అను వాక్య మతని కన్వయించును.

ఉ. ఆరయ నీయజాండవలయంబు నొకానొక సల్లపూసగా
మాఱిచి నీవు గుచ్ఛమణిమాలికయం దిమిడించునేరు పె
వ్వారికిఁ గల్గురా! జగతి! స్వర్భువనంబులలోన నీచమ
త్కారమునం దపంగనిపదార్థము లేదుగదా కవీశ్వరా!

